# ఏం తినమన్నా వద్దు వద్దు అంటే ఎలా పెరుగుతాడు?



## తిండి సరిగ్గా తినకపోతే పెరుగుదల సరిగ్గా ఉండదు.

తిండి సరిగ్గా తినని పిల్లలకు, పోషణ కొరతను పూరించడం అవసరం. వారికి ఇవ్వండి కాంప్లాన్. ఎందుకంటే, కాంప్లాన్‌లో పాల ప్రొటీన్ (20%) మరియు వారి దేహానికి కావలసిన 22 ఇతర ముఖ్యమైన ఆహార పదార్థాలు కలవు.

కాంప్లాన్ 5 చవులూరించే రుచులలో దొరుకుతుంది.

**కాంప్లాన్®**

సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం




GX/27/172 TEL R1

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడె నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✱ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

------------------ కూపన్ ------------------

మార్చి చతుర నవల విముక్తి

సమీక్షకుని పేరు: ..............................

చిరునామా: ..............................

..............................

..............................

..............................

# చతుర కథలు

## మర్యాదస్థుడు

"టక్ టక్"

తలుపు తట్టిన చప్పుడవడంతో ముందు గదిలోకి వెళ్లి తలుపు తీసింది వసంత. ఎవరో అపరిచిత వ్యక్తి గుమ్మంలో నిలబడి ఉండడంతో అతనివంక ప్రశ్నార్థకంగా చూసిందామె.

"మన్నించండి మిమ్మల్ని డిస్టర్బ్ చేసినట్లున్నాను..." అపాలజిటిక్‌గా అంటున్న అతన్ని మధ్యలోనే ఆపి, "ఫర్వాలేదు... రండి లోపలికి" అంటూ మర్యాదపూర్వకంగా లోనికి ఆహ్వానించి కుర్చీ చూపించింది వసంత.

ఆ మాత్రపు మర్యాదకే తెగ ఇదయిపోతూ, "మీకు చాలా శ్రమయిస్తున్నాను" అంటూ కుర్చీలో కూర్చున్నాడతను.

కుర్చీలో ఇబ్బందిగా కదులుతూ అతనే సంభాషణ ప్రారంభించాడు.

"మీకు సావిత్రిగారు తెలుసనుకుంటాను...?"

"ఎవరూ? మన వీధి చివరి డాబాలో ఉండే టీచర్‌గారేగదా?"

"అవునవును... ఆమెగారే..."

"పరిచయం పెద్దగా లేదుగానీ ఆవిడ చాలా మంచిమనిషని అనేకమంది చెప్పగా విన్నాను. మేము ఈ ఊరికి ట్రాన్స్‌ఫరై వచ్చిన కొత్తలో కాబోలు ఒకటిరెండుసార్లు మార్కెట్ దగ్గర కన్పించి పలకరించారు" గుర్తు తెచ్చుకుంటూ చెప్పింది వసంత.

"అవునవును ఆ సావిత్రిగారికే ఇప్పుడు అన్యాయం జరిగిపోతోంది" అతని స్వరంలో బాధ.

"అదేం?" ఆశ్చర్యంగా అడిగింది వసంత.

"టీచర్స్ స్ట్రైక్‌కారణంగా రెండు నెలలుగా వాళ్లకి జీతాలు లేవు. దాంతో రెండు నెలల అద్దె బకాయిపడింది. అద్దెకట్టకపోతే తక్షణం ఇల్లు ఖాళీ చేయాల్సిందేనని ఓనర్ గొడవ చేస్తున్నాడు..."

"అయ్యో పాపం" బాధపడింది వసంత.

అతనే తిరిగి అన్నాడు, "... సావిత్రిగారు ఆత్మాభిమానంగల మనిషి. తన బాధని ఎవరితో చెప్పుకోదు. ఎవర్నీ చేయిచాచి సాయం అడగదు. అందుకని నేనే బయలుదేరాను. ఆవిడని అభిమానించే వాళ్లందర్నీ కల్సి పరిస్థితి వివరించి, తలో పాతికా పరకా కలెక్టుచేసి అద్దె కట్టేద్దామని..."

"అబ్బే అందరికీ అలా చెబితే ఏం బావుంటుందండీ? నలుగురిలో ఆమె పరువు పోదూ? అంతగా కావాలంటే ఆ రెండు నెలల అద్దె నేనిచ్చేస్తాను" వెంటనే తడుముకోకుండా చెప్పింది వసంత.

ఆమె ఔదార్యానికి ఆ వ్యక్తి కళ్లు చెమ్మగిల్లేయి.

"నిజంగా మీరెంత పుణ్యాత్ములండీ? మీ ధర్మమా అని సావిత్రిగారు ఇల్లు ఖాళీ చేయాల్సిన ప్రమాదం తప్పింది. మీలాంటి ఉత్తమ ఇల్లాళ్ళు ఉండబట్టే ఇంకా ఈ దేశంలో ఈ మాత్రమన్నా వానలు పడ్తున్నాయి, పంటలు పండుతున్నాయి..." అతని పొగడ్తలకు సిగ్గుపడిపోయింది వసంత.

"చాలు... ఇక ఊర్కోండి. ఇందులో నా ఒక్కదాని గొప్పతనం ఏముంది? మీరూ మంచివారు కాబట్టే ఆవిడ ఇంటిని నిలబెట్టడానికి ఇంతగా తిరుగుతూ హైరాన పడుతున్నారు. ఇంతకీ మీరు...?" అర్ధోక్తిగా ఆపి అతని వంక చూసింది వసంత.

"నేనేం బయటివాణ్ణి కాదులెండి... సావిత్రిగారి ఇంటిఓనర్నే..."

"????"

---

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: వి. సత్యమూర్తి





## చిక్కని బురదలో

హాయిగా స్వచ్ఛమైన కొలనులో కేరింతలు కొడుతూ ఈదులాడవల్సిన రమణీమణులు బురదలో ఒకరిపై ఒకరు పడి కొట్టుకోవడం చూసేవారికి వింతగానే ఉంటుంది. కాని ఇది నిజంగా కొట్టుకోవడం అనుకుంటే మీరు పప్పులో కాలేసినట్టే! లాస్ఏంజిల్స్‌లోని 'చిప్పండేల్ నైట్ క్లబ్'లో ప్రేక్షకులకు ఉత్తేజాన్ని కల్గించే ఏకైక వినోద ప్రదర్శన- ఈ 'పంకిలంలో పంకజాక్షుల కుస్తీపోటీ'.

గోదాలోకి దిగిన ఆడమల్లులు మొదట ప్రేక్షకులలో ఒక వ్యక్తిని రిఫరీగా ఎంచుకుంటారు. అతను సిగ్నల్ ఇవ్వగానే బురదతో నిండి ఉన్న ఒక పెద్ద ప్లాస్టిక్ తొట్టిలో వారందరూ

# సచిత్ర విచిత్రం



## చక్కని చుక్కల కుస్తీ

కలిసి కుస్తీ పట్టడం ప్రారంభిస్తారు. ఈ పోటీ కూడా ప్రత్యేకంగా ఇద్దరేసి అతివల మధ్య విడివిడిగా సాగదు. ఒకేసారి అంతా కలిసి ఆ తొట్టిలో దిగి ఒకళ్ల నొకళ్లు నెట్టుకుంటూ, తొక్కుకుంటూ, తోసుకుంటూ, కింద పడుతూ, మీదపడుతూ చూసేవారికి బహు పసందుగా కుస్తీ పట్టుంటారు.

చివరి బెల్ మ్రోగిన వెంటనే ఎవరైతే బురదలో ఎక్కువగా పొర్లుతూ కుస్తీపట్టారో, వారినే గెలిచినట్లు ప్రకటిస్తాడు రిఫరీ.

విజయగర్వంతో ఆ లలనామణి పన్నీట జలకమాడి, నిర్వాహకులు అందించిన మొత్తాన్ని బహుమతిగా అందుకుంటుంది.

1 ఆరునూరైనాసరే విజయం సాధించాల్సిందే! అప్పటిదాకా విశ్రమించేది లేదు

2 నాకెక్కువ బురద అంటిందో లేదో మీరే చెప్పాలి... ఇంక నావల్ల కాదు బాబూ!

3 గెలుపెవ్వరిదో ఇప్పుడే తేలిపోవాలి... ఎక్కువ బురదనువ్వంటించుకోవడం అసాధ్యం

4 హమ్మయ్య! గెలిచాను. బహుమతి కూడా బురద డ్రెస్సుతోనే తీసుకోమనలేదు రక్షించారు



# చతుర కతలు

## సెన్సార్డ్ బిట్స్!

"ఏం బాస్... వెంకట్రమణాలో పిక్చర్‌కి వెళ్లావా? అదిరిపోయిందనుకో... బ్లూ ఫిల్ము దానిముందు ఎందుకూ పనికిరాదంటే నమ్ము..." మన్మధరావు చెవిలో గుసగుసలాడాడు శివానందం.

ఆ మర్నాడే ఆఫీసుకి సెలవు పెట్టి నూన్ షోకిపోయాడు మన్మధరావు. కానీ పిక్చర్ మొత్తం డ్రైగా ఉంది. శివానందం చెప్పిందెక్కడా మచ్చుక్కూడా కన్పించలేదు. తెల్లారి ఏడుపు ముఖంతో ఆ విషయాన్నే శివానందానికి చెప్పి కుమిలిపోయాడతను.

శివానందం ఆశ్చర్యానికి అంతేలేకుండాపోయింది.

ఆ తర్వాత అలాంటి సంఘటనలే నాలుగైదుసార్లు జరిగాయి మన్మధరావు విషయంలో. అతని దురదృష్టం ఏమిటోగాని అతను వెళ్లిన రోజునే సిన్మాలో ఆయా దృశ్యాలుండడం లేదు.

అదే దిగులుతో చిక్కి సగమైపోయాడు మన్మధరావు. అతనీ ఊరుకు ట్రాన్సఫరై రాక ముందు సిటీలో అలాంటి సిన్మాలు బాగా చూసి ఆనందించడం అలవాటు చేసుకున్నాడు. కానీ ఈ ఊళ్లోనే కుదిరి చావడంలేదు. పోనీ అవి వెయ్యడంలేదా అంటే అదీ నిజంకాదు. సెన్సార్ చేసిన దృశ్యాలు కూడా యధేచ్ఛగా ప్రదర్శిస్తూనే ఉన్నారు. అందరూ చూసి ఆనందిస్తున్నారు. కాని తాను వెళ్లిన రోజే తనకి పట్టిన శని ఏమిటోగాని ఒక్క బిట్టూ ఉండి చావడంలేదు.

మిత్రుడి దిగుల్ని అర్థం చేసుకున్నవాడు ఒక్క శివానందం మాత్రమే.

మన్మధరావు సిన్మాకి వెళ్లిన రోజే ఎందుకు దుర్దినమౌతోంది?

పరిశోధన మొదలు పెట్టాడు శివానందం. ఏమీ లాభం లేకపోవడంతో నరాసరి థియేటర్ ఓనర్‌నే కలిశాడతను. అతని క్షోభంతా విన్నాక-

"మేం అన్ని రోజుల్లోనూ సెన్సార్ కట్ బిట్లు వేయంసార్. కాస్త వెనకాముందూ చూసుకోకపోతే మా పీకకు చుట్టుకుంటుంది. అదీగాక ఈమధ్య జిల్లా కలెక్టర్ మఫ్టీలో తిరుగుతున్నాడని మా బావమర్ది చెప్పాడు. ఆడెన్ని వేషాలు వేసినా మేం కనిపెట్టేస్తామండి. అందుకే ఆడొచ్చిన రోజున సిన్మాలో ఆ బిట్లుండవ్. బహుశా మీ ఫ్రెండు కూడా ఆడొచ్చిన రోజే వచ్చి డిజప్పాయింట్ అయ్యుంటాడండి..." అన్నాడు థియేటర్ ఓనర్.

"కలెక్టరా? ఆయన్ని మీరెలా కనిపెట్టారు సార్? నిజంగా మీ బుర్ర పాదరసం సార్..."



"అదుగోనయ్యా ఈడి బండబడ ఇవ్వాళా వచ్చాడు చచ్చినోడు! అక్కడ వాల్‌పోస్టర్ల దగ్గర నుంచుని చూస్తున్నాడు సంగనాచిలా.... అయితే ఆ సీన్లు తీసేయమని ఆపరేటర్‌తో చెప్పాలి" అంటూ కాబిన్‌లోకి పరుగెత్తాడు ఓనర్.

తక్కున అటు తిరిగి చూశాడు శివానందం, వాల్ పోస్టర్ల దగ్గర ఒకే ఒక్క వ్యక్తి నిలబడి ఉన్నాడు. అతన్ని చూడ్డంతోనే షాక్ తిన్నాడు శివానందం. కారణం అతను మన్మధరావు.

అతన్ని చూసే థియేటర్ ఓనర్ కలెక్టర్ అనుకుంటున్నాడన్న మాట!

-ప్రతాపచంద్ర

# మంత్రిగారి కోరిక

"ఇదిగో సెక్రటరీ... 'గిన్నిస్ బుక్కాఫ్ వరల్డ్ రికార్డ్స్' అనే పేరు పదే పదే పేపర్లలో చూస్తున్నాను. చాలామంది అంటుండగా వింటున్నాను. ఇంతకూ ఏందయ్యా ఆ గిన్నిస్ బుక్కాఫ్ వరల్డ్ రికార్డ్స్ అంటే?" రెండు కాళ్ళూ సోఫాలో తీరుబడిగా చాపుకొని అడిగారు మంత్రి గురునాథరావుగారు తన పి.యస్.ని.

"అది ఇంగ్లాండులో పబ్లిష్ అయ్యే ఓ పుస్తకం సార్. ఎవరైనా ఏదైనా ఘనకార్యం చేస్తే వాళ్ళ పేరునీ, వాళ్ళు సాధించిన రికార్డ్‌నీ ఆ బుక్‌లో నోట్ చేస్తారు. ప్రపంచంలోని ప్రజలంతా ఎంతో మక్కువతో చదివి గుర్తుంచుకొనే పుస్తకం సార్ అది" చెప్పాడు పి.యస్.



"అయితే ఆ గిన్నిస్ బుక్‌లోకి ఎక్కితే కోటి రూపాయిల కుంభకోణం చేసినంత మహదానందంగా వుంటుందన్నమాట" తనదైన ధోరణిలో అన్నారు మంత్రిగారు.

"అవును సార్... గిన్నిస్ బుక్‌లోకి ఎక్కితే ఆ వ్యక్తితోపాటూ అతని దేశానికి కూడా ప్రపంచ వ్యాప్తంగా పేరుప్రతిష్టలు వస్తాయి సార్"

"ఆ పేరు మనమెందుకు సంపాదించకూడదంటాను" గురునాథరావు నోటివెంట దూసుకువచ్చిన మాటకి ఉలిక్కిపడ్డాడు పి.యస్.

"క్షణం క్రితంవరకూ గిన్నిస్ బుక్ అంటే ఏమిటో కూడా తెలియనివాడికి ఆ గిన్నిస్ బుక్‌లోకి ఎక్కాలనే కోరికా? ఈ దేశాన్ని ఆ భగవంతుడుకూడా బాగుచేయలేడు"

పి.యస్. మనసు మౌనంగా ఆక్రోశించింది.

"ఏందయ్యా ఆలోచిస్తున్నావ్?" అడిగాడు మంత్రిగారు.

"అ...హ... ఏంలేదు సార్..."

"అయితే మనపేరు గిన్నిస్ బుక్‌లోకి ఎక్కే ఏర్పాట్లు చేసెయ్" చాలా మామూలుగా అన్నారు మంత్రిగారు.

"సార్... అదేమైనా ప్రెస్ కాన్ఫరెన్స్ అనుకున్నారా? ఏర్పాట్లు చేయడానికి. గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లోకి ఎంతో ఘనత వుంటేనే గానీ ఎక్కడానికి వీలుపడదు" వస్తున్న నవ్వుని, కోపాన్ని అణుచుకుంటూ చెప్పాడు పి.యస్.

"ఇదిగో, నీకు బోలెడంత జీతం పోసి నా సెక్రటరీగా పెట్టుకున్నది ఇలాంటి కబుర్లు చెప్పడానికి కాదు. ముందు గిన్నిస్ బుక్‌లోకి నా పేరు పోయే మార్గం వెదుకు" ఆదేశించారు మంత్రిగారు.

పి.యస్. అగ్నిపరీక్ష ఎదురైనట్లే ఫీలయ్యాడు.

ఇంటికిపోయి దీక్షగా ఆలోచించాడు. చివరికి ఓ బ్రహ్మాండమైన ఐడియా దొరికింది. ఆఘమేఘాలమీద మంత్రిగారి ఇంటికి పోయాడు.

"సార్... దొరికింది... మీరు గిన్నిస్ బుక్‌లోకి పోయే మార్గం దొరికింది" అని అరిచాడు ఆయన్ని చూడగానే.

"దొరికిందా? సరే, చెప్పు" మంత్రిగారి ఆనందానికి అవధులు లేవు.

"గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్ కమిటీ సభ్యుల్ని మన ఖర్చుతో రప్పించి, వాళ్ళకు మాంఛి మందుపార్టీ ఇచ్చి మీరు పదవిలోకి వచ్చిన దగ్గరనుంచి చేసిన కుంభకోణాల్ని ఆధారాలతోసహా వాళ్ళముందు పెడదాం. అప్పుడు పదవిలోకి వచ్చిన అతి తక్కువ కాలంలో ఎక్కువ కుంభకోణాలు చేసిన ఘనుడిగా మీ పేరు గిన్నిస్ బుక్‌లోకి ఎందుకు ఎక్కదో చూద్దాం" అన్నాడు పి.యస్.

-కొల్లిమల్ల అప్పారావు

# చతుర

సంపుటి: 15 సంచిక: 2 మార్చి: 1992

సభ్యసమాజానికి దూరంగా దయనీయమైన పరిస్థితులలో బ్రతుకీడుస్తున్న ఆ జాతి చైతన్యాన్ని జాగృతంచేసి జ్ఞానజ్యోతులు వెలిగించాలనుకుందామె!

పంకంలో పద్మం ఉద్భవించినట్లుగా ఆ వర్గంలోనే జన్మించినా తమ జీవితపు చీకటికోణాల్ని ఏవగించుకుని తనవారిని వెలుగుతీరాలవైపు నడిపించాలని కంకణం కట్టుకున్నాడతను!!

ఇద్దరి ధ్యేయాలూ, ప్రయత్నాలూ, గమ్యాలూ ఒక్కటే. కానీ వారికి లభించిన ఆదరణ ఎటువంటిది? తమ మేలుకోసం అహర్నిశలు కృషిచేస్తున్న వీరిపట్ల ఆ దళితవర్గం వ్యవహరించిన తీరు ఎలాంటిది?

అటు భూస్వాముల స్వార్థపరత్వం ఇటు దళితుల అనుమానాలు వెనక్కి లాగుతున్నా తమ లక్ష్యసిద్ధికోసం దేనికీ వెరువక దూసుకుపోయిన ఆ యువతీ యువకుల కృషి ఎలాంటిది?

బడుగుజీవితాలకు విముక్తి కలగాలనీ, రామరాజ్యంలో సామ్యవాదం నెలకొనాలనీ ఆశించిన గాంధేయవాదపు సదాశయాలు ఆచరణలో ఎలా పరిణమించాయి?

మన తెలంగాణానుండి మహారాష్ట్రకు వలసవెళ్లి స్థిరపడిన ఒకజాతి జీవనగతిని హృదయాల్ని కదలించే వాస్తవ జీవనసత్యాల్ని, కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డుగ్రహీత, ప్రముఖ మరాఠీ రచయిత లక్ష్మణ్ గయక్వాడ్ ఆత్మకథ ఆధారంగా శ్రీమతి సి. వసంత రచించిన ఆసక్తికర యథార్థగాథ "విముక్తి" ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.

# విముక్తి

సి. వసంత



సిద్ధేశ్వర మందిరం దగ్గర జాతర జరుగుతోంది. గుడి బయటా, లోపలా జనం కిటకిటలాడుతున్నారు. గర్భగుడిలో శివలింగం ఉంది. పెద్దనది ఒడ్డున ఉన్న ఆ గుడి చాలా పురాతనమైంది. నల్లరాళ్ళతో కట్టబడింది. లోపల, వెనక వైపు ఆవులను, బర్రెలను కట్టడానికి కొంతస్థలం ఉంది. గోడల మీద శంకరుడు, పార్వతి, లక్ష్మీదేవిల చిత్రాలు పెయింట్ చేసి ఉన్నాయి. లోపలి గోడల మీద దాతల పేర్లున్నాయి. ఒకవైపు పూజారులు ఉండటానికి సదుపాయం ఉంది. ఈ పూజారులు గుడికి సంబంధించిన పనులను చూసుకుంటూ అక్కడే ఉంటారు. గుడిలోపల క్యూలో జనం ఒకళ్లనొకళ్లు తోసుకుంటున్నారు.

భారతి, సుమలతలు దేవుడికి పూజ చేయించి గుడిబయటకి వచ్చారు. అక్కడఉన్న దుకాణాల్ని దాటుకుంటూ నడవడం మొదలు పెట్టారు. ఇంతలో పెద్దగా ఓ పిల్లవాడి ఏడుపు వినిపించింది. అక్కడ గుంపుగా నలుగురైదుగురు నిల్చొని ఉన్నారు. ఒకాయన అరుస్తున్నాడు "వీడిని నా కారుడిక్కీలో పడేయండి పోలీసులకు అప్ప చెబుదాం. ఇప్పటి నుండే దొంగతనాలు చేయడం మొదలుపెట్టాడు... కొడుకు..." అంటూ పర్సును జేబులో వేసుకొన్నాడు.

"సాబ్... నన్ను వదిలేయండి... ఇంకెప్పుడూ దొంగతనం చేయను" అంటూ ఆ కుర్రాడు ఒక చేత్తో నోట్లో నుండి వస్తున్న రక్తాన్ని తుడుచుకుంటున్నాడు.

"మీ తాతల నాటినుండి మీ బతుకు ఇదేగా... ఎప్పటికప్పుడు ఇహ దొంగతనాలు చెయ్యం అంటూ కాళ్ళు పట్టుకుంటారు. నాలుగు రోజులు కాంగానే మళ్ళీ మొదలు...థూ... మీ బతుకులు తగలడ...." అంటూ వాడిని మరోరెండు చెంపదెబ్బలు కొట్టాడా ఆసామీ. ఆయన పేరు జగన్నాథరావు పాటిల్. కుర్రాడు నారియా పెద్దగా ఏడవడం మొదలు పెట్టాడు.

భారతి వాడి దగ్గరగా వెళ్ళి తన రుమాలు వాడికి ఇచ్చింది. వాడు రక్తం తుడుచుకోసాగాడు. దాంతో అక్కడి వాళ్ళందరూ ఆమెను వింతగా చూడనారంభించారు.

ఇంతలో మాధవరావు అనే ఆయన వెనక నుండి ఆ పిల్లవాడి వీపుమీద పిడికిలితో గుద్దాడు. నారియా మరోసారి బాధతో విలవిలలాడి పోయాడు.

"భారతీ! పద మనకెందుకొచ్చిన గొడవ" అంది సుమలత.

అదే సమయంలో పాటిల్ ఆ పిల్లవాడి జుట్టుపట్టిలాగాడు.

ఇంతలో ఒకవ్యక్తి అందరినీ తోసుకుంటూ వచ్చి నారియా చేయిపట్టుకున్నాడు.

"ఓహ్! విఠల్‌గాయక్వాడా! మీ జాతివాడిని రక్షించడానికి వచ్చావా!" అన్నాడు పాటిల్ వెకిలి నవ్వు నవ్వుతూ.

"ఒరేయ్! నారియా... నీకు ఎన్నిసార్లు చెప్పానురా... దొంగతనాలు చెయ్యవద్దని" అన్నాడు విఠల్‌గాయక్వాడ్.

"బాబా దొంగతనాలు చేయకుంటే కళ్ళల్లో కారం పోస్తానని భయపెట్టాడు" అన్నాడు నారియా ఏడుస్తూ.

"సాహెబ్... ఈసారి వీడిని వదిలేయండి" అన్నాడు విఠల్.

"మరొకసారి దొంగతనాలు చేశాడంటే వీడిని వదలం" అన్నాడు పాటిల్ కారు ఎక్కుతూ. అతను ఎక్కగానే మాధవరావు, దేశ్‌ముఖ్‌లు కూడ కారు ఎక్కారు.

"బాబూ ముందు రక్తం పూర్తిగా తుడుచుకో! వీడిని వెంటనే డాక్టరు దగ్గరికి తీసుకు వెళ్లండి" అంది భారతి విఠల్ వంక చూస్తూ.

ఇంతలో విఠల్‌ని ముగ్గురు వ్యక్తులు చుట్టుముట్టారు. వాళ్ళందరూ సంత ముచ్చులు. వీళ్లు సంతలలో దొంగతనాలు చేస్తూ ఉంటారు. లక్ష్మప్ప, హనుమా, కొండప్ప తమ మూటలు కిందపెట్టారు.

"అన్నా... నీకు బుద్ధిలేదు. ఎన్నిసార్లు చెప్పాను దొంగతనాలు మానేయమని..." అన్నాడు విఠల్ కోపంగా.

"మన జాతి వాళ్లు దొంగతనాలు చేయడానికేగా పుట్టింది. అసలు బాబాతో నిన్ను స్కూలుకి పంపించవద్దని మన జాతి వాళ్ళందరూ చెప్పారు. కాని వింటేగా... ఇప్పుడేమో మాకు నీతులు చెప్పేటంత వాడివి అయ్యావు..."




అన్నాడు లక్ష్మప్ప కోపంగా.

"అమ్మ ఎక్కడుంది?" అడిగాడు విఠల్.

"అదుగో... ఆరాళ్ళకుప్పల దగ్గర రాళ్లు కొడుతోంది" అన్నాడు నారియా అటువైపు చూపిస్తూ.

"భారతీ! మనంఇటు వెళ్లాలి" అంటూ సుమలత ముందుకు నడిచింది.

"లతా! మనంకూడా ఆరాళ్ల కుప్పల దాకా వెళ్దాం"

"ఎందుకే పనిలేక... లేనిపోని గొడవ మన కెందుకు?"

"ఆ రాళ్లకుప్పల దగ్గర కూర్చున్న ఆడవాళ్ల కి రవికలులేవు. వీళ్ళు వడ్డర్లుకదూ! అరె... అదుగో అటుచూడు ఆరోజు మనింట్లో పనిచేస్తా నంటూ ఒకామె వచ్చిందే, ఆమె అక్కడే ఉంది..."

"ఎవరు?"

"అదుగో అటుచూడు, పెద్దగా చేతులు తిప్పుతూ అరుస్తోందే, ఆమే! నీకు గుర్తు రావడం లేదూ? మనం ఆమెను పనిలోకి రమ్మనగానే మన ఇంటివాళ్ళు వీళ్ళందరూ దొంగలనీ వీళ్ళని ఇంటికి రానీయడానికి వీల్లే దనీ చెప్పారుగదా. ఆ రోజు ఆ వడ్డరామె పనిలో పెట్టుకోమని ఎంత బ్రతిమిలాడిందీ! నాకెంతో జాలివేసింది. కాని ఇంటి వాళ్లు మరీ అంత ఖచ్చితంగా రానీయవద్దని చెప్పడం వలన కదా మానేశాం"

విఠల్ నారియాని తల్లి దగ్గరకు తీసుకువ చ్చాడు. అక్కడ అతడి తండ్రి వామనప్ప కూడా ఉన్నాడు.

"మావా! ఎన్నిసార్లు చెప్పాను. దొంగతనా లు మానేయమని. నారియాని స్కూలుకి పంపించు"

"విఠలియా... వీడు ఇప్పటినుండే దొంగత నాలు చేయకపోతే ముందుముందు కడుపెట్లా నింపుకుంటాడు. నువ్వు చదువే... చదువే అని అంటున్నావు. మనం ఏమైనా ఉన్నత వంశీకు లమా బడికి వెళ్లడానికి... ఈ చదువులు మనకి కావు... మన జాతివాళ్లు దొంగతనాలు చేయడా నికే పుట్టారు. వీళ్లు చదువుకుంటే ఎల్లమ్మదేవి కి కోపం వస్తుంది. మనందరినోట మట్టిపడు తుంది..." అన్నాడు నారియా తండ్రి వామన ప్ప.

ఈ మాటలు భారతికి సుమలతకు ఆశ్చ ర్యాన్ని కలిగించాయి.

"వీడికి నోటినుండి ముక్కునుండి నెత్తురు కారుతోంది. ముందు డాక్టరు దగ్గరికి తీసుకు పో..."అన్నాడు విఠల్.

"డాక్టరు దగ్గరికా... నా దగ్గర డబ్బులు ఎక్కడున్నాయి. అయ్యయ్యో ఎంత రక్తం పోతోంది" అంటూ తన కొంగును చించి నారియా ముక్కు దగ్గర పెట్టింది అతడి తల్లి. అంతకుముందు భారతి ఇచ్చిన రుమాలు రక్తంతో పూర్తిగా తడిసిపోవడంతో నారియా దాన్ని అక్కడే పడేశాడు.

"నేను డబ్బులు ఇస్తాను... ముందు వీడిని డాక్టరు దగ్గరికి తీసుకుపో..." అంది భారతి పర్సుతెరిచి కొంత డబ్బు తీస్తూ...

తులసీబాయి తీసుకోవడానికి సంకోచప డ్డది.

"తీసుకో..." అంటూ భారతి ఆమె చేతిలో కొంత డబ్బు పెట్టింది.

విఠల్ ఆమెవంక కృతజ్ఞతగా చూశాడు. తన జేబులోంచి కొంత చిల్లర తీసి నారియా తల్లికి ఇచ్చాడు.

"మీరు... మీరు..." విఠల్‌కి ఏం మాట్లా డాలో తోచలేదు.

"మేం... ఇద్దరం ఇక్కడ కాలేజీలో లెక్చర ర్లుగా పనిచేస్తున్నాము. ఆమె మీకు బంధువా?... ఆమధ్య ఈమె పని చేస్తానంటూ మా ఇంటికి వచ్చింది. కాని మా ఇంటి ఓన రు..."

"వీళ్ళు దొంగతనాలు చేస్తారు. పనిలో పెట్టు కోవద్దు అని చెప్పిందా?" విఠల్ అడిగాడు.

"అవును ఆ మాటే అంది ఆవిడ. నాకు మీ జాతివాళ్ళ గురించి తెలుసుకోవాలని ఉంది. సాంఘికంగా, ఆర్థికంగా వీళ్లు బాగా వెనకబడి వున్నారుగదా, ఎందుకు చదువుకోరు?" అడి గింది భారతి.

"మా ఇళ్ళలో చదవనివ్వరు. నేను ఎలా గోలా తొమ్మిదో తరగతిదాకా చదివాను. ఇప్పుడు మాలో ఒకరిద్దరు చదువుకుంటున్నారు"

"ఇదిగో నా అడ్రస్సు, రేపు మా ఇంటికి రండి..." అంటూ భారతి తన డైరీలోంచి ఒక కాగితం చించి అడ్రస్సు రాసి విఠల్‌కి ఇచ్చింది.

"తప్పకుండా వస్తాను" అంటూ విఠల్ వెళ్ళిపోయాడు.

"భారతీ! ఎందుకే ఈ తక్కువ కులాలవాళ్ళని, అందులోనూ ఈ దొంగతనాలు చేసే వాళ్ళని మన ఇంటికి రమ్మనడం? అసలు మన కెందుకీ గొడవ"

"నాకు వాళ్ళ గురించి తెలుసుకోవాలనీ, వీలైతే వాళ్ళ జీవితాలు బాగు పడడానికి ఏదేనా సహాయం చేయాలనీ ఉందిలే"

"ఏమో... బాబూ నువ్వు చెబితే వినవు" అంది సుమలత కోపంగా. ఇద్దరూ రిక్షా ఎక్కారు.

★ ★ ★

మరునాడు విఠల్‌గాయక్‌వాడ్ భారతి ఇంటికి వచ్చాడు. భారతి అతడిని "రండి! కూర్చోండి..." అంటూ ఆహ్వానించి కుర్చీ చూపించింది.

"మీపేరు...?" అడిగింది భారతి.

"విఠల్ గాయక్‌వాడ్..."

"నాకు మీ జీవితాల గురించి తెలుసుకోవాలని ఉంది"

"నేను పాథ్‌రూట్ కులానికి చెందినవాణ్ణి. మమ్మల్ని వడ్డర్లు అనికూడా పిలుస్తారు. మేము దేశదిమ్మరులం. మా బతుకులు జంతువులకన్నా హీనం. మమ్మల్ని పట్టించుకునేవాళ్లెవరు? మాగురించి అడిగేవాళ్ళెవరు. మీరు అడుగుతున్నారు కాబట్టి తప్పకుండా చెబుతాను"



''ఊఁ... చెప్పండి...''

''ఇంగ్లీషు వాళ్లు మానొసటన 'మీరు దొంగలు' అన్న ముద్ర వేశారు. వాళ్ళు వేసిన ఆ ముద్ర ఈనాటివరకు చెరిగిపోలేదు. ఆనాడూ ఈనాడూ కూడా సమాజం మమ్మల్ని దొంగలు అన్న దృష్టితోనే చూస్తోంది. నిన్న కారులో ఉన్న ఆ వ్యక్తులను చూశారుగా. వాళ్ళందరు ధనవంతులు. పై కులాలవాళ్ళు...''

''అంటే నిన్న ఆ అబ్బాయిని కొట్టిన వాళ్ళేనా?''

''అవును ఈ ఊరికి వాళ్ళే పెద్ద మనుషులు. మా పాలిట మాత్రం రాక్షసులు. ఆ శివరావుపాటిల్ మా తాతలకాలం నుండి మమ్మల్ని దోస్తూనే ఉన్నాడు. ఆయనగారి కొడుకు జగన్నాథరావు. షుగర్ ఫ్యాక్టరీ ఛైర్మన్ మాధవరావు, దత్తాత్రేయ వీళ్ళు... వీళ్ళు... మమ్మల్ని బానిసలుగా తయారు చేశారు. గుంటనక్కలను, రాబందులను చూడని వాళ్లు వీళ్ళనిచూస్తే చాలు అవి ఎట్లా ఉంటాయో వాటి స్వభావం ఏమిటో తెలుస్తుంది. మా ఊరు నాగరిక మృగాలున్న అడవి అని చెప్పవచ్చు. అడవులలో బలం ఉన్న క్రూర జంతువులు బలహీన జంతువులను నిర్దాక్షిణ్యంగా చంపేస్తాయి. ఈ నాగరిక మృగాల అడవిలో కూడా మాలాంటి పావురాలని ఈ డేగలు, రాబందులు, పులులు, గుంటనక్కలు చంపుతూనే ఉంటాయి. ఈ మృగాల నోటిముందు ఎన్నో పావురాలు ఆహారంగా మారడం నేను



చూశాను. బతుకుతెరువుకు ఎటువంటి అవకాశం మాకు ఈ సమాజంకానీ రాజకీయ నాయకులు కానీ ఇయలేదు. మా జాతి వాళ్లకు ఏదారీ లేదు. అందుకే కాలేకాలే కడుపును నింపుకోవడానికి పిడికెడు మెతుకుల కోసం వీరు దొంగలుగా మారారు. నిజానికి ఈ సమాజమే మమ్మల్ని దొంగలుగా మార్చింది. మా జాతివాళ్లకు తలదాచుకోవడానికి ఒక పూరిపాక అయినా లేదు. ధనవంతులు, రాజకీయ నాయకులు రెండు చేతులా సమాజాన్ని దోచుకుంటూ లక్షలు కోట్లు పోగేసుకుంటున్నారు. అద్దాల మేడలలో నివసిస్తున్నారు. అయినా, వాళ్లు దొంగలుకారు. వాళ్ళకు సమాజంలో ఎంతో పేరు, ప్రతిష్ఠ. కాని... కాని... కాలుతున్న కడుపును చల్లార్చుకోవడానికి ఓ పది రూపాయలు దొంగతనం చేస్తే మాత్రం మేం దొంగలం అయిపోతాం. సమాజానికి చీడపురుగులు అని మమ్మల్ని ఈ సమాజం విదిలించి వడేస్తుంది. ప్చ్... మీకుతెలీదేమో! మేం తెలుగువాళ్ళం. మా మాతృభాష తెలుగు''

''తెలుగా...''

''అవును అయితే మా తాత ముత్తాల నాటినుండి ఇక్కడే ఉండటం వలన మావాళ్లు చాలామంది మరాఠీలోనే మాట్లాడతారుగానీ, ఇళ్ళల్లో మాత్రం తెలుగే మాట్లాడతారు. మమ్మల్ని సంతముచ్చర్లని పిలుస్తారు.''

''సంత ముచ్చర్లంటే...''

''సంత అంటే మీకు తెలుసుకదా. ముచ్చర్ అంటే దొంగతనం చేసేవాళ్ళు... అంటే ముచ్చులు''

''అంటే మీవాళ్ళు సంతలలో ఎక్కువగా దొంగతనాలు చేసేవాళ్ళా''

''మరాఠ్‌వాడాలో జరిగే సంతలకి జాతర్లకి మావాళ్లు వెళ్తూంటారు. అక్కడ మూటలు ముల్లెలు ఎత్తుకు పోతారు. జేబులు కత్తిరిస్తారు. మెడలలోని గొలుసులు తెంపేస్తారు. మా తాత దొంగతనాలు చేయడంలో చాలా తెలివికలవాడు''

''దొంగతనం తప్పుకదా''

''కడుపు కాలుతున్నప్పుడు తప్పొప్పుల గురించి ఎవరాలోచిస్తారు. మేం గొర్ల శాలలోని జంతువుల్లాంటి వాళ్ళం''

''మిమ్మల్ని మీరు అంత నీచంగా ఎందుకు చూసుకుంటారు? మీరూ మనుషులే. మనుషుల్లా జీవించే హక్కు మీకూఉంది''

''నేను మీకు కొన్ని నిజాలు చెబుతాను. మేంఊరు వదలి బయటకి పోవాలంటే పోలీసు పాటిల్ దగ్గరనుండి అనుమతి తీసుకోవాలి. మేం జంతువులకిందే లెక్క. పశువులను మరో ఊరికి తీసుకు పోవాలంటే కూడా దాఖలా పత్రం ఉండాలి. లేకపోతే ఆ పశువులను ఎవరూ కొనరు. పోలీసులు వాటిని జప్తుచేసి పట్టుకు పోతారు. మా చిన్న దొంగల ముఠాల గతి కూడా ఇంతే. దాఖలా తీసుకోకుండా మరో ఊరికి వెళ్తే పోలీసుపాటిల్‌కి దాన్ని చూపెట్టకపోతే 'వీళ్లు దొంగలు' అని మమ్మల్ని పట్టుకుంటారు''

''అయితే మీ జీవితాల్లో ఈ దాఖలా పత్రానికి ఎంతో ప్రాముఖ్యం ఉందన్న మాట''

''మాకు దాఖలా పత్రం దేవుడికన్నా ఎక్కువ. మీరుగడ్డం గీసుకునే బ్లేడు మాకు సాక్షాత్ లక్ష్మీదేవిలా అనిపిస్తుంది. దొంగతనాలకు బయలుదేరేటప్పుడు మావాళ్ళు బ్లేడుతో కోడిని కోస్తారు. ఆ రక్తాన్ని బ్లేడు మీద, దాఖలా పత్రం మీద చల్లి, ఓ దేవా... మాకు ఏ అడ్డంకి రానివ్వకు, పోలీసుల బారి నుండి రక్షించు అంటూ గుళ్లో దేవుడికి మొక్కుతున్నట్లుగా బ్లేడుకి మొక్కుకుంటారు''

''ఎంత ఆశ్చర్యకరమైన విషయం. మా నాగరిక సమాజానికి ఈ విషయాలేమీ తెలియవు''

''మమ్మల్ని అనేక రకాల పేర్లతో పిలుస్తారు. మేం దేశదిమ్మరులం. మహారాష్ట్రలోని వివిధ జిల్లాలలో మమ్మల్ని పాధ్‌రూట్, టకారీ, భామ్‌టా... ఉచెలె, గిల్‌నెవడార్, కామాటి, ఘంటీచోర్, వడ్డార్, వడ్డర్లు అని వివిధ పేర్లతో పిలుస్తారు. మా పాధ్‌రూట్‌లను గాయక్‌వాడ్ అని జాధవ్ అని పిలుస్తారు. మాలో ఇంకా కొన్ని శాఖలు ఉన్నాయి''

''అంటే గాయక్‌వాడ్, జాధవ్‌లలో కూడా శాఖలు ఉన్నాయా?''

''ఉన్నాయి... గాయక్‌వాడ్‌లలో ఉళనోర్,




బమినోర్, కాళపిట్‌నోర్ ఉన్నాయి. జాధవ్‌లలో కానకోనోర్, ఎప్పానోర్, ఇళకార్ మొదలగు శాఖలు ఉన్నాయి. గాయక్వాడ్ జాధవ్‌ల మధ్య పెళ్ళిళ్ళు జరుగుతాయి. కాని గాయక్వాడ్‌శాఖలోని వాళ్ళు వాళ్ళలో వాళ్లు పెళ్లిళ్ళు చేసుకోరు. అట్లానే జాధవ్‌లలో ఉన్న వివిధ శాఖల వాళ్ళు వాళ్లలో వాళ్ళు పెళ్ళిళ్ళు చేసుకోరు. నైజాం రాజ్యంలో మావాళ్ళు పడని కష్టంలేదు. బానిసల్లా బతికారు. మాతాత, అవ్వ తాము పడ్డ కష్టాల్ని గురించి మాకు చెబుతూ ఉండేవాళ్ళు.

"మీ అవ్వ కూడా దొంగతనం చేసేదా?..."

"ఆఁ చేసేది. కాని చివరిలో పోలీసులు పెట్టే బాధలకు తట్టుకోలేక మానేసింది. నైజాం సర్కార్ బంజేపల్లి అనే చోట పెద్ద చెరువు తవ్వించింది. అక్కడ పనులు చేయడానికని మావాళ్ళందరిని తీసుకువెళ్ళేవాళ్ళు. అక్కడ కూడా పోలీసులు రెండు పూటలా మా హాజరీ తీసుకునే వాళ్ళు"

"అంటే నైజాం సర్కార్ తమ పనులకు మిమ్మల్ని వాడుకునే వాళ్ళన్న మాట."

"కూలి డబ్బులు చాలా తక్కువ ఇచ్చేవాళ్ళు. మావాళ్ళు రోజుల తరబడి ఉపవాసాలు చేసేవాళ్ళు. దూరంగా ఉన్న పొలాలలోంచి రాత్రిపూట జొన్న పొత్తులు, వడ్లు దొంగతనం చేస్తూంటారు. మా టోలీలలోని మొగపిల్లలు, ఆడపిల్లలు కూడా దేనికీ భయపడరు. దొంగతనం చేస్తున్నప్పుడు పట్టుబడినా మిగతా వాళ్ళ ఆచూకీ నోరుజార కుండా ఉండేటట్లు ముందే శిక్షణ ఇస్తారు. పిల్లలను బూట్లతో, చెప్పులతో, కర్రలతో నిత్యం కొడుతూ ఉంటారు. వాళ్ళలో ఈ దెబ్బలు సహించేశక్తి వచ్చేదాకా అలా కొడతారు"

"ప్చ్... ఎంత ఘోరమైన పరిస్థితి"

"మా తాత వీరప్ప దొంగతనాలు చేయడంలో దిట్ట. అయినా అప్పుడప్పుడు పోలీసుల చేతులలో చిక్కేవాడు. పోలీసులు అతడి కళ్లల్లో కారం చల్లి తలకిందులుగా వేళ్ళాడేసే వాళ్ళు. కొంత కాలం అయ్యాక హింసలు భరించలేక మా సంతముచ్చుల టోలీ వాళ్ళందరి పేర్లు చెప్పేశాడు. మాటోలీ వాళ్ళకు తాతమీద చాలా కోపం వచ్చింది. ఒకరోజు మా నాయనమ్మ యాదవ్వ చూస్తూ ఉండగానే గొడ్డలితో తాతని నరికేశారు. మావాళ్ళ కట్టడి ప్రకారం ఇటువంటి విషయాలు పోలీసులకు చెప్పకూడదు. ఒకవేళ ఎవరైనా చెబితే వాళ్ళనీ, వాళ్ల పిల్లలనీ కులం నుండి వెలివేస్తారు. ఆ భయంతో అందరూ నోరు మూసుకుంటారు. తాతకి ఇద్దరు కొడుకులు. ఒకడు మా నాన్న తిమ్మప్ప. మరొకడు మా బాబాయి చలమప్ప. తాతని చంపిన దృశ్యం చూడటం వలన మా బాబాయి మనస్సు స్థిమితం తప్పింది. అతడు పిచ్చి వాడై ఇంట్లో నుండి పారిపోయాడు. మానాన్న తిమ్మప్ప దొంగతనాలు బాగా చేసేవాడు. మా అమ్మ ఇంట్లోనే ఉండేది. మా నాన్నకి మేం ముగ్గురం కొడుకులం. లక్ష్మప్ప పెద్దవాడు, పాండురంగ్ రెండోవాడు. నేను మూడోవాడిని. నాకు ఒక చెల్లెలు ఉండేది."

"అంటే ఆమె ఇప్పుడు లేదా?"

"ఊహు... లేదు. ఆమె గురించి తరువాత చెబుతాను. దొంగతనాలు చేయడం మాకులం వాళ్ళ వృత్తి. చిన్నప్పటినుండి నాకు దొంగతనాలు చేయడం తప్పు అనిపించేది. కాని మావాళ్ళని ఎదిరించే ధైర్యం నాకు లేదు. నేను మా నాన్న తిమ్మప్ప వాళ్ళతోపాటు సంతలకు వెళ్తూ ఉండేవాడిని కాని దొంగతనాలు చేసేవాడిని కాను. నేను ఎట్లా పెరిగిందీ, మావాళ్ల బ్రతుకులు ఎంత ఘోరంగా ఉంటాయో చెబుతా వినండి" అంటూ విఠల్ చెప్పడం మొదలుపెట్టాడు.

భారతి వింటూ కూర్చుంది.

★ ★ ★

తిమ్మప్ప ఆరోజు సంతకి వెళ్లివచ్చాడు. భార్య సైదమ్మఇంకా ఇంటికి రాలేదని తెలిసి గుడిసెలోపలికి బయటకి పచార్లు చేస్తున్నాడు.

చంటిపిల్ల ఏడుస్తోంది. తిమ్మప్ప తల్లి యాదవ్వ పిల్లను ఓదారుస్తోంది.

ఓ గంట గడిచాక తిమ్మప్ప భార్య సైదమ్మ వచ్చి నెత్తిమీద ఉన్న కట్టెల మోపును కింద పడేసింది.

తిమ్మప్ప ఆమె జుట్టు పట్టుకున్నాడు "ఇప్పటిదాకా ఎవడితో కులికి వచ్చావే... చెప్పు...చెప్పు..." అంటూ ఆమెను కొట్టడం మొదలుపెట్టాడు.

"ఏమిటా మాటలు? పుల్లలు ఏరుకు రావడానికని వెళ్లాను. కవతా నుండి ఎల్లవ్వ వచ్చింది. దానితోమాట్లాడుతూ కూర్చున్నాను అందుకే ఆలస్యం అయింది"

"అబద్ధాలు ఎందుకు చెబుతున్నావ్? అసలు ఆ పిల్లనాకు పుట్టిందేనా... ఇంకెవడికైనా..."

"నీకు పిచ్చి పట్టలేదుకదా?" కోపంగా అంది సైదమ్మ.

"ఇవాళ నీ రక్తం కళ్ల చూస్తాను" అంటూ ఆ చెంపన ఈ చెంపన కొట్టడం మొదలు పెట్టాడు.

"అరి దేవుడో... నేను చచ్చానురో..." సైదమ్మ ఏడవడం మొదలుపెట్టింది.

"సాలీ... చావు... చావు..."

సైదమ్మ గుండెలు బాదుకోవడం మొదలు పెట్టింది. "దాన్ని ఎందుకురా కొడుతున్నావ్?" అంటూ యాదవ్వ పెద్దగా అరిచింది.

"అమ్మా నువ్వు అడ్డురాకు" అంటూ తిమ్మప్ప సైదమ్మను కాలితో తన్నడం మొదలుపెట్టాడు.

యాదవ్వ సైదమ్మను విడిపించి గబగబా ఆమెను పక్కకు లాక్కుపోయింది. అప్పటికే కొట్టికొట్టి అలసిపోయిన తిమ్మప్ప కోపంగా బయటకి వెళ్లిపోయాడు.

సైదమ్మ వంటపని మొదలుపెట్టింది. రొట్టెలు పిట్లు (సెనగపిండితో పలచగా చేస్తారు) చేసింది. కొంచెం సేపయ్యాక తిమ్మప్పలోపలికి వచ్చాడు. అందరు కలిసి తిన్నారు.

తిమ్మప్ప గుడిసెలో దీపాన్ని ఆర్పేశాడు. ఆ గుడిసెలో కనీసం పూర్తిగా కాళ్లు జాపుకుని పడుకునేంత చోటుకూడా లేదు. యాదవ్వ కుక్కి మంచం చాలా చిన్నది. రోజూ మంచం మీద యాదవ్వ మంచం కింద ముగ్గురు పిల్లలు పడుకుంటారు. యాదవ్వ అప్పుడప్పుడు బయట పడుకుంటుంది. చలికి ముడుచుకుని ముడుచుకుని పడుకోవడంవలన వాళ్ళకు ఒక్కొక్కసారి కాళ్లు జాపడానికి కూడా కొంత ప్రయత్నం చేయాల్సి వస్తుంది. బయటనుండి కుక్క వచ్చి పిల్లల పక్కన పడుకుంది. పిల్లలు కింద ఓ బొంత పరచుకొని, మరో బొంత పైన కప్పుకుని పడుకున్నారు. ఆ బొంతలు చిరిగి గబ్బు కంపు కొడుతున్నాయి.

తిమ్మప్ప వచ్చి సైదమ్మ పక్కలోకి దూరాడు. ఆమె మీద చేయివేశాడు. పిల్లలలో ఒకడు మూత్రం విసర్జించాడు. బొంతలు తడిసిపోయాయి. అయినా ఎవరూ లేవలేదు. ఆ వెచ్చదనానికి వాళ్లు ఇంకా దగ్గరికి జరిగారు. తెల్లవారు ఝామున బొంతను మరొకడు తడిపాడు. అయినా వాళ్ల నిద్రకు భంగం కలగలేదు.

ప్రొద్దున్నే లేవంగానే బొంతలను గుడిసె మీద వేశారు. వాటిని వుతుకుదామన్నా నీళ్ళు ఉండవు. అందుకే వాళ్ళు నెలల తరబడి ఆ బొంతలను వుతకరు. ఎండకు ఆరేస్తారు. ఆ బొంతలనిండా వందల వేల సంఖ్యలో పేలూ, నల్లులూ ఉంటాయి. పిల్లలు వాటిని చంపుతూ ఉంటారు. ఇది వాళ్ళకు మామూలే. నెలకు ఒకసారైనా స్నానం చేయడానికి నీళ్ళు ఉండవు.

విఠల్ తల అట్టలుకట్టిపోయింది. పుళ్ళు అయ్యాయి. పురుగులు పడ్డాయి. వాటినుండి చీమూ, రక్తం కారసాగింది. సైదమ్మ పెద్దగా ఏడవడం మొదలుపెట్టింది. రెండునెలల నుండి తను మంగళవారాలు ఉపవాసం ఉండటంలేదు. అందుకే అమ్మవారికి కోపం వచ్చింది అనుకుంటూ ఏడవడం మొదలుపెట్టింది. తిరిగి మంగళవారాలు, శుక్రవారాలు నియమం తప్పకుండా చేస్తానని మేకను బలి ఇస్తానని మొక్కుకుని అమ్మవారికి దండం పెట్టుకుంది.

సైదమ్మ విఠల్ నెత్తిమీద పిడకల బూడిద పూసింది. లక్ష్మప్ప అతడి కాళ్ళు, చేతులు కట్టేశాడు. అతడు ఏడవడం మొదలుపెట్టాడు.

రామప్ప చిమటా పట్టుకువచ్చి, వాడి తల లోంచి పురుగులను తీసి పడేయడం మొదలుపెట్టాడు. విఠల్ అరుస్తున్నాడు. ఫినాయిల్‌ని వాడి తలకి పూశారు. విఠల్‌కి విపరీతమైన మంట పుట్టసాగింది. కాచు కొబ్బరినూనెలో కలిపి పుండ్లకి పట్టించారు. అతడు మంటకి ఓర్చుకోలేక చేతులు, కాళ్ళు విసిరికొట్టడం మొదలుపెట్టాడు- "అమ్మా... అమ్మా..." అంటూ అరవడం మొదలుపెట్టాడు. కొంచెం సె



పటికి మంట తగ్గిపోయింది.

సైదమ్మ తుల్జాపూర్ జాతరకి వెళ్ళినప్పుడు కాళ్ళు తోముకోవడానికని ఒక రాయి తెచ్చింది. ఆ మర్నాడే అమ్మవారు యాదవ్వ ఒంటిపైకి వచ్చింది అని వీళ్ళ నమ్మకం. "నే ఉత్తరాయిని కాను, తుల్‌జాపూర్ భవానీని"... అంటూ ఆమె ఊగసాగింది.

సైదమ్మ ఆమె కాళ్ళకు మొక్కనారంభించింది. నెమ్మది నెమ్మదిగా అందరూ గుడిసెలలోంచి బయటికి వచ్చి అక్కడ చేరసాగారు.

అందరూ ఆ రాయికి దండం పెట్టారు.

'ఓ తుల్‌జాపూర్ భవానీ... మా తప్పులను క్షమించు. మా సంత ముచ్చులను కాపాడు తల్లీ..." అంటూ మొక్కారు.

"ఒరేయ్... మనం ఆ తల్లికి గుడి కట్టించాలి. లేకపోతే ఈ సంవత్సరం మనకు సంపాదన ఉండదు. కాసులు దొరకవు" అన్నాడు రామప్ప.

"వీడు చెప్పింది నిజమే... మనం భవానీకి గుడి కట్టాలి" అన్నాడు తిమ్మప్ప.

అక్కడ చేరినవాళ్ళందరూ ఇదే నిర్ణయానికి రావటంతో ఆ రాయిని మైదానంలో పాతారు. పదిహేనురోజులు అందరూ కష్టపడ్డారు. తమ దగ్గర ఉన్న డబ్బు ఒకచోట పోగేసి ఇటుకలను కొనితెచ్చారు. ఇటుకలను పేర్చి మట్టిపూసి చిన్న గుడి కట్టారు. ప్రతీరోజూ ఆ రాయికి నూనె సింధూరం కలిపి పట్టించడం మొదలు పెట్టారు. ఆవిధంగా అరవై, అరవై అయిదు కిలోలదాకా దాని బరువు పెరిగింది. సైదమ్మ తన మొక్కును తీర్చుకుందాం అని అనుకుంది. మేకను తీసుకువచ్చారు. తురకవాడు వచ్చాడు. ఒక్క వేటున మేకను నరికాడు. భళభళా రక్తం కారసాగింది. తురకవాడు మేక కాళ్ళను నరికాడు. కాళ్ళు, తల అమ్మవారి ఎదురుగుండా పెట్టారు. సైదమ్మ తన ఇంట్లో నుండి పరిడీ తెచ్చింది. (వెదురుబద్దలతో తయారుచేయబడిన పళ్ళెం. గుండ్రంగా వుంటుంది. పరిడీని పట్టుకుని అడుక్కోవడానికి బయలుదేరుతారు. అందులో దేవతబొమ్మ పెడతారు. దేవత పేరున దానం చేస్తే పుణ్యం అని పరిడీలో అందరు గోధుమపిండి, బియ్యం వేస్తారు. ఈ పద్ధతిని జోగువా అంటారు. తులజాపూర్ వెళ్ళి అక్కడ పరిడీని తోసి అమ్మవారి ఒడి నింపి దీనికి పూజ చేస్తారు) పాటిల్ ఇంట్లోనుండి మరో పరిడీ వచ్చింది. పాటిల్‌ల పరిడీకి చాలా విలువ ఉంది. (పరిడీలను పట్టుకుని దేశదిమ్మరులు మాత్రమే జోగు అడుగుతారు. అగ్రవర్ణాలవాళ్ళు పరిడీలని ఇంట్లోనే ఉంచుకుని పూజ చేస్తారు) పరిడీలో మటన్ ముక్కలు తప్ప మరేమీ వేయవద్దు, పాథ్‌రూట్‌ల పిండి, ఉప్పు మాకు పనికిరావు అని పాటిల్ తన పరిడీ ఇచ్చేటప్పుడు చెప్పాడు. ఈ మాటలు విన్న విఠల్‌లో ఓ ప్రశ్న తలఎత్తింది. మేము వేసిన ఉప్పు, పిండి పనికిరానప్పుడు ముస్లింముక్కలు మాత్రం ఎట్లా పనికివస్తాయి? అని!

ఏడు పరిడీలు పెట్టారు. మధ్యలో సైదమ్మ కూర్చుంది. పాథ్‌రూట్‌లు అడుక్కునే పరిడీని మాత్రం కొంచెందూరంలో పెట్టారు. సైదమ్మ కొంచెం మటన్‌ని పరిడీలలో వేసింది. అడుక్కునే పరిడీలో ఉప్పు, పిండి వేసింది. కొబ్బరికాయ కొట్టింది. అగరొత్తులను వెలిగించింది. అమ్మవారికి మొక్కుకుంది.

రోజులు గడుస్తున్నాయి. ఒకరోజు ఓ ముద్ద దొరికితే రెండోరోజు పస్తులు ఉంటున్నారు వాళ్ళు.

★ ★ ★

కడుపుకి తిండి లేదు, శరీరానికి బట్ట లేదు. నేరస్థులు, దొంగలు అన్న ముద్ర పడిపోవడంవలన చేయడానికి పని ఎవరూ ఈయరు. ఇటువంటి పరిస్థితులలో కూడా తను చదువుకోవాలి అన్న కోరిక విఠల్‌కి బలంగా ఉండేది. తనని స్కూల్‌కి పంపించమని తండ్రిని ఎంతో బతిమిలాడగా చివరికి తండ్రి ఒప్పుకున్నాడు.

తిమ్మప్పకు అతడి జాతివాళ్ళు పిల్లవాడిని స్కూలుకు పంపవద్దని ఎన్నోవిధాలుగా చెప్పారు. "మనం బ్రాహ్మణులమా! బాగా డబ్బులు ఉన్నవాళ్ళమా, చెప్పు - మన పిల్లలని స్కూల్‌కి పంపిస్తే మనకు కూడు ఎట్లా? మన సంత ముచ్చులలో ఎవరైనా స్కూల్‌కి వెళ్ళారా? మన కులంలో చదువుకోవడం తప్పు. ఎల్లమ్మ దేవికి కోపం వస్తుంది. ఆ తల్లికి కోపం వస్తే మనం అందరం నాశనం అవుతాము" అంటూ దేశదిమ్మరులు పంచాయితీ పెట్టించారు. వాళ్ళ





ఆచారాలకు విరుద్ధంగా ఎవరైనాసరే ఏదైనా చేస్తే వాళ్ళని పంచాయితీ పెట్టి వెలివేస్తారు. ఆ వెలివేయబడ్డ వ్యక్తిని వాళ్ళ పెళ్ళిళ్ళకు కాని మరే సందర్భాలలో జరిగే కార్యక్రమాలకు కాని రానీయరు. బంధువులు వాళ్ళని ఇళ్ళకు రానీయ రు. వాళ్ళు ఆ వ్యక్తి ఇంటికి వెళ్ళరు, అతడిని ముట్టుకోరు. వెలివేయబడ్డ వ్యక్తికి అన్నం ఇనపబొచ్చెలో పెడతారు. నీళ్ళు ఓ ముంతలో లేకపోతే కొబ్బరిచిప్పలో పోస్తారు. అతడితో అన్ని సంబంధాలని తెంపుకుంటారు.

తిమ్మప్ప స్కూల్ మాస్టర్ అయిన కులకర్ణిని కలిశాడు. విఠల్ పేరును రిజిస్టర్‌నుండి తీసేయమని చెప్పాడు. ఓరోజు కులకర్ణి మాస్టారు దేశదిమ్మరులుండే గల్లీకి వచ్చాడు.

"తిమ్మప్పా! విఠల్‌ని స్కూలుకి పంపవద్దని ఎవరంటున్నారు. వాళ్ళని ఇక్కడికి తీసుకురా..." అన్నాడు మాస్టారు కులకర్ణి.

తిమ్మప్ప తమజాతివాళ్ళని పిలుచుకువచ్చాడు.

"ఈ కొండప్ప, రామప్పలు ససేమిరా ఒప్పుకోవడంలేదు మాస్టారూ" అని అన్నాడు తిమ్మప్ప.

"మీ పిల్లలని స్కూల్‌కి పంపించండి. వాళ్ళు చదువుకుంటే వాళ్లకు జ్ఞానం వస్తుంది. మంచి ఉద్యోగాలు చేసుకుని మంచి బతుకులు బతుకుతారు. మీలాగా వాళ్ళు దొంగలుగా మారరు. వాళ్ళ జీవితాలు బాగుపడతాయి" అన్నాడు కులకర్ణి మాస్టారు.

"మాస్టారూ... మా కులంలో చదువుకోవటం తప్పు. చదువులు మీ బ్రాహ్మలకు కాని మాకు కాదు. దొంగతనం చేసి బతకమని దేవుడు మా నుదుటిన రాశాడు. విఠల్ చదవడానికి వీల్లేదు" అన్నాడు కొండప్ప.

"వీడు స్కూల్‌కి వెళ్తున్నప్పటినుండి మా ఇళ్ళల్లో అందరికి జ్వరాలు, విరేచనాలు. ఎల్లమ్మదేవికి కోపం వచ్చింది" అన్నాడు రామప్ప.

"విరేచనాలు అందువలన రాలేదు. ఎక్కడో అశుభ్రమైన తిండి తినిఉంటారు. ఆ తిండివల్లనే అలా అవుతుంది. మరి మీలోకూడా కొందరికి అలా కాలేదుగా...?"

"ఏమో... ఆ విషయం మాకు తెలియదు. కాని వాడు స్కూల్‌కి పోవడానికి వీల్లేదు" అన్నాడు రామప్ప కోపంగా.

"నేను విరోచనాలు తగ్గే మాత్రలు ఇస్తాను. అవి వేసుకోండి" అంటూ కులకర్ణి వెళ్ళి మెడికల్‌షాపులో మాత్రలు కొనుక్కునివచ్చి వాళ్ళకి ఇచ్చాడు.

ఆ తరువాత నాలుగైదుసార్లు వచ్చి వాళ్ళకు నచ్చచెప్పాడు. చివరికి వాళ్ళు ఒప్పుకున్నారు.

★ ★ ★

విఠల్ స్కూల్‌కి సెలవలు ఇచ్చినప్పుడల్లా తన తండ్రి అన్నల వెంట వెళ్తూ ఉండేవాడు. ఆరోజు తిమ్మప్ప కొన్ని ఎలుకలను పట్టుకుని సంచిలో వేసుకున్నాడు. తిమ్మప్పతోపాటు కొండప్ప, విఠల్, పాండురంగ్ కూడా బయలు దేరారు. కొంతదూరం నడిచాక పొలాలు కనబడంగానే ఆగిపోయారు. పొలంలోపల శివరావు పాటిల్ కూర్చుని ఠీవిగా చుట్టతాగుతున్నాడు. తిమ్మప్ప కంచెదాకా వెళ్ళాడు.

"పాటిల్‌సాబ్... మీ పొలంలోని ఎలుకలని పట్టుకోమంటారా?"

"ఒరి తిమ్మప్పా... నువ్వా... ఏం ముచ్చులు చేయడం మానేశావా?"

"ఇప్పుడు సంతలకు వెళ్ళడంలేదు"

"పొలంలో కావలసినన్ని ఎలుకలు. అక్కడికి ఆమధ్య మందుపెట్టాం. వెళ్ళి పట్టుకోండి"

తిమ్మప్ప, కొండప్ప, విఠల్, పాండురంగ్ పొలంలోకి వెళ్ళారు. తిమ్మప్ప, కొండప్ప మూల మూలలకి వెళ్ళి తవ్వడం మొదలుపెట్టారు. ఎలుకలు పొలాలలో సొరంగాలు చేసి ధాన్యాన్ని వాటిలో చేరుస్తాయి. కొండప్ప, తిమ్మప్ప ఎవరికీ కనబడకూడదన్న ఉద్దేశ్యంతో అడ్డంగా నిల్చుని ఉన్నాడు. తిమ్మప్ప ధాన్యాన్ని తను తెచ్చుకున్న సంచీలో పోసుకున్నాడు. తన సంచీలోని కొన్ని ఎలుకలను వదిలివేశాడు.

ఇంతలో పాండురంగ్ పెద్దగా ఏడవడం మొదలుపెట్టాడు-

"జొన్నకంకులు కోస్తావుర్రా... దొంగతనం చేస్తావుర్రా..." అంటూ చెంపలమీద కొడుతున్నాడు శివరావుపాటిల్.

"నన్నువదిలేయండి... ఇంకెప్పుడూ దొంగ

తనం చేయను...'' అంటూ బతిమాల సాగాడు పాండురంగ్.

''వీడి రోగం ఇట్లా కుదరదు... వీడి చొక్కా, లాగూ విప్పెయ్యండిరా...'' అని పెద్దగా అరిచాడు పాటిల్.

పాండురంగ్ భయపడి ఉచ్చపోసుకున్నాడు. పాటిల్ మనుషులు వాడి చొక్కాను చింపేశారు. లాగూ దగ్గర చెయ్యి పడగానే వాడు ఒక్క ఉదుటున కాలెత్తి కొట్టాడు. వంగి లాగు విప్పదీస్తున్నవాడికి కాలు తగిలింది. వాడికి విపరీతమైన కోపం వచ్చింది. లాగూను బలంగా లాగాడు. పాండురంగ్‌ని విపరీతంగా కొట్టాడు. అతడి ఒళ్ళంతా గాయాలతో నిండిపోయింది.

''మన కళ్ళఎదురుగుండానే మన పొలంలో ఇట్లాంటి పనిచేయడానికి వీడికి ఎంత ధైర్యం. అరేయ్... బావిలోంచి రెండుమూడు బక్కెట్లు నీళ్ళు పట్టుకురండిరా...'' అంటూ ఆజ్ఞాపించాడు పాటిల్.

పాటిల్ మనుషులు ఆజ్ఞను శిరసావహించారు.

విఠల్ ఓమూల నక్కి ఈ దృశ్యాన్ని చూస్తున్నాడు. అతడి కళ్ళవెంట నీళ్ళు రాసాగాయి.

పాండురంగ్ చలికి ఒణకడం మొదలుపెట్టాడు. పాటిల్ తన ఎదురుగుండా ఉన్న పిల్లవాడి స్థితిని చూసి ఆనందిస్తున్నాడు. అహ్హహ్హ... ... అంటూ నవ్వుతున్నాడు.

పావురం రెక్కలు పీకేస్తున్నారు. పావురం విలవిలలాడుతోంది. రాబందులు నృత్యం చేస్తున్నాయి. ఇంతలో షావుకారు మాధవరావు వచ్చాడు.

''షావుకారుగారా... రండి... రండి...'' అంటూ ఆహ్వానించాడు పాటిల్.

''ఈ పొలాలని చూస్తుంటే ఈసారి మీకు బాగా లాభం వచ్చేటట్లు ఉంది'' అన్నాడు షావుకారు చుట్టూరా చూస్తూ. అతడి దృష్టి పాండురంగ్‌మీద పడ్డది. ''వీడెవడు?'' అడిగాడు జోసేకర్.

''వీడా... ముచ్చుముండాకొడుకు. పొలంలో దొంగతనం చేస్తుంటే పట్టుకుని తన్నాం... ఇహ వీడిని వదిలివేయండిరా... ఆఁ చెప్పండి షావుకారుగారూ...'' అన్నాడు పాటిల్ తన పాగా సరిచేసుకుంటూ.

''నిన్ననే కవతా నుండి ఎల్లవ్వ వచ్చింది. ఈసారి బోలెడు బంగారం అమ్మేసిపోయింది. పది తులాలదాకా అమ్మింది''

''పది తులాలే... ఆఁ... అయితే ఈ సంత ముచ్చులకు రాబడి బాగానే ఉందన్నమాట. అహ్హ... హ్హ...'' పెద్దగా నవ్వాడు పాటిల్.

''పది తులాలు వున్నా... ఆరు తులాలు మాత్రమే ఉందని చెప్పాను. ఆరు తులాలకు డబ్బు కట్టి ఇచ్చేశాను. ఇదుగో బంగారం'' అంటూ అతడి చేతిలో ఓ చిన్న మూటను పెట్టాడు షావుకారు. తన బంగారపు పన్నును ఓసారి తడిమి చూసుకున్నాడు.

ఈ మాటలు వింటున్న విఠల్‌కి పాటిల్ మీద జోసేకర్‌మీద విపరీతమైన కోపం వచ్చింది. ఓ రెండు జొన్న కంకులను కోసుకున్నందుకు పాండురంగ్‌ని ఇంతగా హింసించారే, ఇంత పెద్ద శిక్షవేశారే... మరి దొంగచాటుగా ఎల్లవ్వలాంటి అమాయకులను దోస్తున్న వీళ్ళకు ఏ శిక్ష వేయాలి? 'అతడి కళ్ళు చింతనిప్పులయ్యాయి. చిన్న వయస్సులోనే అతడిలో ధనికులఎడల ఓ అభిప్రాయం ఏర్పడిపోయింది.

తిమ్మప్ప తనదగ్గర ఉన్న ఎలుకలను పాటిల్‌కి చూపెట్టాడు.

''ఈ ముచ్చు ముండాకొడుకు ఎలుకలని భలేగా పట్టేశాడే... ఒరేయ్... వీటిని చంపేసెయ్. అప్పళంగా నా పొలంలో ధాన్యం తిని ఎంతగా బలిశాయ్...'' అన్నాడు పాటిల్.

బయటికి రాంగానే ''పాండురంగ్... నువ్వు ఇంటికి వెళ్ళు. ఇదిగో ధాన్యం అమ్మకి ఇవ్వు. మేం ఇప్పుడే వస్తాం'' అంటూ తిమ్మప్ప పాండురంగ్‌కి సంచి ఇచ్చాడు.

పాండురంగ్ చొక్కా చినిగిన లాగూ వేసుకుని, సంచీ తీసుకుని ఇంటివైపు బయలుదేరాడు. తిమ్మప్ప, కొండప్ప, విఠల్ మరోవైపు బయలుదేరారు.

''చూశావా తిమ్మప్పా... ఎల్లవ్వ ఎంత బంగారం అమ్మిందో...''

''నీ పెళ్ళాం చాలా హుషారయింది. బంగారం ఇట్టే లాగేస్తుంది'' అన్నాడు తిమ్మ




ప్ప పెద్దగా నవ్వుతూ.

ఒక చెట్టుమీద వాళ్ళకి బోలెడు ఉడతలు కనిపించాయి. ఈ దేశదిమ్మరులు ఉడతలను చంపి తింటారు. ఉడతలను పట్టుకోడానికి వీళ్ళు పిండి, ఉప్పు, ఉరు (గుర్రపు వెంట్రుకలు)లను ఉపయోగిస్తారు. కొండప్ప తన సంచీలోంచి పిండి ఉండలను బయటికి తీశాడు. ముగ్గురు కలిసి పిండి ఉండలను గుర్రపు వెంట్రుకలకు అంటించి చెట్టు మానుమీద పెట్టారు. ఒక్కొక్కటిగా ఉడతలు కిందికి రావడం మొదలుపెట్టాయి. పిండి తింటూ తింటూ వెంట్రుకల్లో చిక్కుకుపోయాయి.

''ఒరేయ్ తిమ్మప్పా! ఉడతలని పట్టుకో పారిపోతాయి'' అన్నాడు కొండప్ప ఉడతల మీద రాళ్ళు విసురుతూ.

తిమ్మప్ప రెండుమూడు ఉడతలను ఒక్కసారిగా పట్టుకుని వాటి గొంతులను నులిమివేశాడు. ఈవిధంగా బోలెడు ఉడతలను పట్టుకుని కొండప్ప సంచీలో వేసుకున్నాడు. వేటాడి ఇంకా బోలెడు జంతువులను తేవాలి అన్న ఆశతో మళ్ళీ బయలుదేరారు.

వీళ్ళు లేడిపిల్లలు, బాతులు, కొంగలు, పిల్లులు, పావురాళ్ళు, ఎలుకలు, ముంగిసలు, కుందేళ్ళు, పందులు, రొయ్యలు, చేపలు, కప్పలు, నెమళ్ళు, ఇట్లా రకరకాల జంతువులను పక్షులను చంపి తింటారు. పందిమాంసం వీళ్లకి బంగారంతో సమానం. పందులను పట్టుకోవటానికి బరిసెలను ఉపయోగిస్తారు. వాటి నాలుగు కాళ్ళు ఓ కట్టెకు వేలాడదీసి ఇంటికి మోసుకువస్తారు. తిమ్మప్ప, కొండప్ప, విఠల్ ముంగిసలు, తాబేళ్ళను, పందులను వేటాడి తీసుకువచ్చారు.

వేటాడిన జంతువులను తమ గుడిసెల దగ్గర ఉన్న మైదానంలో కాల్చడం మొదలుపెట్టారు. అందరూ వెళ్ళి చెత్తకుండీలోని చెత్త తెచ్చి కుప్పగా వేశారు. ఆ చెత్తకి నిప్పంటించి పందులను కాల్చడం మొదలుపెట్టారు. తిమ్మప్పకు హఠాత్తుగా పందులలో ప్రాణంవచ్చినట్లు అవి తమని పీకుతున్నట్లు అనిపించసాగింది. అతడికి తన చిన్ననాటి సంఘటన ఒకటి గుర్తుకు రాసాగింది.

తను, తన స్నేహితులు కలిసి డబ్బాలో నీళ్ళు పోసుకుని ఈ మైదానంలోకే వచ్చారు. అక్కడ పందులు బోలెడన్ని ఉన్నాయి. వాటిని దగ్గరకు రానీయకుండా వాటిమీద రాళ్ళని విసురుతూ కూర్చున్నారు. తమ ఆహారం అక్కడే దొరకడంవలన ఎంత కొట్టినా అవి దగ్గరికి రావటం మొదలుపెట్టాయి. ఇంతలో తన స్నేహితుడు పెద్దగా అరిచాడు. ఒక పంది అతని వెనకభాగాన్ని గట్టిగా కొరికింది. అతడు భయపడి పక్కకి జరగబోయాడు. పంది మళ్ళీ పీకింది. అతడు కిందపడిపోయాడు. పంది తన ఆహారాన్ని తినసాగింది. అందరు కలిసి అతడిని లేపి ఇంటికి మోసుకువెళ్ళారు. అతడు రెండురోజుల తరువాత చనిపోయాడు.

ఆ తరువాత తిమ్మప్ప తనవాళ్ళతో పోట్లాడాడు. అక్కడి పందులను చంపకపోవడం తమ తప్పని, అనవసరంగా ఓ మనిషి బలయ్యాడని అన్నాడు. పందులు బక్కచిక్కి వున్నాయి. ఇంకా బాగా బలపలేదు. అందుకే చంపలేదని దేశదిమ్మరులు అన్నారు.

తిమ్మప్పకు కళ్ళు తిరుగుతున్నట్లుగా అనిపించింది. కొంచెంసేపు అట్లాగే కూర్చున్నాడు. పదినిమిషాల తరువాత మళ్ళీ మామూలు మనిషి అయ్యాడు. మాంసానికి ఉప్పు, కారం పట్టించి తినడం మొదలుపెట్టారు. ఎన్నో నెలల తరువాత వాళ్ళకు విందుభోజనం దొరికింది.



ఆ రోజు తిమ్మప్ప, కొండప్ప, విఠల్ మళ్ళీ వేటకు బయలుదేరారు. ఊరిబయట కొండప్పకు ఓ పిల్లి కనిపించింది. దాని కాలికి గాయం తగిలి లేవలేకపోతోంది. కొండప్ప

దాన్ని పట్టుకో ప్రయత్నించాడు.

''ఒరేయ్ కొండప్పా... ఆ పిల్లిజోలికి పోకురా...'' అన్నాడు తిమ్మప్ప.

''ఇది అడవిపిల్లి. దీని మాంసం మంచి రుచిగా ఉంటుంది'' అంటూ కొండప్ప తిమ్మప్ప ఎంత చెప్పినా వినకుండా ఆ పిల్లిని చంపేశాడు.

''ఒరేయ్ విఠలియా! నాలుగు పుల్లలు ఏరుకురారా... ఉడతలని కాల్చి తిందాం'' అన్నాడు కొండప్ప ఒకచోట కూర్చుంటూ.

తిమ్మప్ప, విఠల్ పుల్లలని ఏరుకుని వచ్చారు. సంచిలోంచి చెకుముకిరాయిని తీసి అంటించారు. పుల్లలు అంటుకున్నాయి. కాసిని ఉడతలని కాల్చుకుతిన్నారు. ఇంటికి తిరుగుముఖం పట్టారు. మధ్యలో కొన్ని చేపలు పట్టుకున్నారు దారిలో.

కొండప్ప చేతిలోని పిల్లిని చూసి ఊరివాళ్ళు అసహ్యించుకోసాగారు. ''ఛీ... ఛీ... వీళ్ళు పిల్లులను కూడా చంపి తింటున్నారు'' అంటూ ముఖాలు పక్కకు తిప్పుకోసాగారు.

సంతముచ్చుల గుడిసెల దగ్గర బోలెడు గాడిదలు ఉన్నాయి. వీళ్ళు జాతరలు, సంతలు లేనప్పుడు రోళ్ళు, కలబత్తాలు, తిరగళ్ళు చేసి గాడిదలమీద వేసి ఊళ్ళు ఊళ్ళు తిరిగి అమ్ముతూఉంటారు. వీళ్ళందరు వెనక్కి తిరిగి రాంగానే ఆ ప్రదేశం అంతా గాడిదలతో, కుక్కలతో, మేకలతో నిండిపోతుంది. చీకటి పడటంవలన గుడిసెల్లో బుడ్డీలు, నూనెదీపాలు వెలుగుతున్నాయి. కొంతమంది ఒకచోట కూర్చుని తాగుతున్నారు. వాళ్ళల్లో హనుమా, ఎల్లవ్వ బాగా తాగిఉన్నారు. తిమ్మప్ప, కొండప్ప, విఠల్‌ని చూడగానే సంతముచ్చులు అందరు గుమిగూడారు.

''ఇవాళ బాగా వేటాడి వచ్చినట్లున్నారే. ఎన్ని చేపలు తెచ్చారు. ఏ జంతువులను తెచ్చారు'' హనుమా తూలుతూ వచ్చాడు.

''బాప్‌రే... మేకను కూడా తెచ్చారే...'' ఎల్లవ్వ సంతోషంతో గంతులు వేసింది.

''ఓ కొండప్పా... నాకు మేకను సగం కోసి ఇవ్వు. రేపు పైసలు ఇస్తాను'' అన్నాడు హనుమా.

''తిమ్మప్పా... ఆ చేపలు సగం అమ్మేసేయి. ఇప్పుడు కొంత డబ్బు ఇస్తాను. మిగతాది రేపు'' అంటూ బొడ్లోనుంచి పైసలు ఉన్న మూట తీసింది ఎల్లవ్వ. బాగా తాగి ఉండటంవలన ఆమె తూలింది. చేతిలోంచి మూట కిందపడ్డది.

''నాకూ కావాలి'' అంటూ కాసిని డబ్బులు తిమ్మప్ప చేతిలో పెట్టేశాడు రామప్ప.

తిమ్మప్ప తను తెచ్చినవన్నీ అమ్మేశాడు. గుడిసెలోపలినుండి సైదమ్మ వచ్చి- ''అన్నీ అమ్మేస్తే మనం ఏం తినాలి?'' అంటూ తిట్టడం మొదలుపెట్టింది.

కొండప్ప పిల్లిని కాల్చడం మొదలుపెట్టాడు. ఈ దృశ్యం చూడగానే రామప్పకి కోపం వచ్చింది.

''కొండప్పా! పిల్లిని ఎందుకు చంపావురా... నీకు ఒకసారి చెప్పానా... ఆ దినం పిల్లిని చంపినప్పుడు అందరు ఎట్లా చెప్పుకున్నారురా... అసలే మనలని ఎవరూ దగ్గరికి రానీయరు. మనలని ముట్టుకోరు. నీళ్ళు పట్టుకోనివ్వరు. దేవాలయాలకు రానీయరు. ఈ పిల్లులని చంపడం చూస్తే అందరు మనలని ఇఖా అసహ్యించుకుంటారు. ఛీ... కుక్కలకన్నా మన బతుకులు హీనం'' అంటూ నెత్తి కొట్టుకోసాగాడు.

''నేను చెప్పానుగా... ఈ వెధవకి పిల్లిని చంపవద్దని. వింటేగా'' అన్నాడు తిమ్మప్ప విసుగ్గా.

''ఇంక చంపను...'' అన్నాడు కొండప్ప.

మరునాడు సైదవ్వ రోళ్ళకు విసురురాళ్ళకు కక్కు పెట్టడానికి బయలుదేరింది. ఆమెవెంట విఠల్ కూడా బయలుదేరాడు. ఒక ఇల్లాలు వీళ్ళను పిలిచింది. విసురురాయిని బయట పెట్టి లోపలికి వెళ్ళింది.

''విఠలియా! దానికి అంటుకుని ఉన్న పిండిని గీకరా...'' అంది సైదవ్వ.

అసలే ఆకలిగా ఉన్న విఠల్ విసురురాయి మీది పిండిని గీకి తినేశాడు. విసురురాయికి కక్కు పెట్టడం పూర్తయింది. ఇంటావిడ డబ్బులు ఇచ్చింది.

''పిల్లవాడు ఆకలిగా ఉన్నాడు. రెండు రొట్టెలుంటే ఇవ్వండి అమ్మగారూ...'' అంది




సైదవ్వ.

ఇంటావిడ లోపలికి వెళ్ళి ఓ రొట్టె తెచ్చింది. విఠల్ సంచీలోంచి బొచ్చెను బయటికి తీశా డు. బొచ్చెలో ఎండిపోయిన రొట్టె పడ్డది. విఠల్ గబగబ తినేశాడు. వాళ్ళు బయలుదేరారు. కొంతదూరం వచ్చాక "అమ్మా... నా కాళ్ళు లాక్కుపోతున్నాయి. నేను రాను ఇంటికి పోతా..." అన్నాడు విఠల్.

సైదవ్వ సరేనంది. విఠల్‌కి ఆకలి తీరలేదు. దారిలో దిష్టితీసి పడేసిన కొబ్బరి చిప్పలు కనిపించాయి. కొన్ని నిమ్మకాయలు కని పించాయి. సామాన్యంగా దిష్టి తీసేసిన వస్తు వులను ఎవరూ ముట్టుకోరు. కాని విఠల్ కడు పుమంటకి ఆగలేకపోయాడు. వాటిని తీసు కుని తినేశాడు. మళ్ళీ కాళ్ళు ఈడ్చుకుంటూ నడక ప్రారంభించాడు. నైవేద్యంగా పెట్టబడిన అన్నం కొబ్బరి చిప్పలపై అతడి దృష్టి పడ్డది. ఇటువంటి వస్తువులను ముట్టుకోవడానికి కూడా చాలా మంది భయపడతారు. భూత ప్రేత బాధలనుండి తమని రక్షించుకోవడానికి కొందరు నైవేద్యం పెట్టి వీటిని బయటపడేస్తా రు. నైవేద్యం మీద పెనంకింద ఉండే నలుపు పూస్తారు. విఠల్ కడుపుమంట భూతప్రేతా లకు భయపడలేదు. నైవేద్యం తిన్నవారికి హానికలుతుందని భూతప్రేతాలు, తిన్నవారిని పీడిస్తాయని దేశదిమ్మరుల నమ్మకం కాని ఆకలి ఏ నమ్మకాల ఎదుట తలవంచదు... విఠల్ నలుపు ఉన్నంత మీద తీసిపడేసి తక్కినదంతా ఓ మూల కూర్చుని తినడం మొదలుపెట్టాడు.

గుడిసెకి వచ్చేసరికి తిమ్మప్ప, కొండప్ప, రామప్ప, ఎల్లవ్వ తాగుతున్నారు.

"ఒరేయ్! విఠలయా... నీకు జలుబుగా ఉంది. కాస్త తాగు పోతుంది" అన్నాడు కొండ ప్ప.

"ఊహు...నేను తాగను" అన్నాడు విఠల్.

"తాగితే మంచిదిరా... ఇవాళ మేం బాగా సంపాదించుకుని వచ్చాం. పండగ చేసు కుందాం" అంది ఎల్లవ్వ.

"మా మాస్టరు తాగకూడదని క్లాసులో చెప్పా డు"

"మీ మాస్టర్‌కి ఏం తెలుసురా... అందుకే తిమ్మప్పా వీడిని స్కూల్‌కి పంపవద్దని చెప్పా ను. ఆ మాస్టరు వీడిని పాడుచేస్తున్నాడు" అన్నాడు కొండప్ప.

వాళ్లందరు బలవంతం చేయడంవలన ఇష్టంలేకపోయినా విఠల్‌కి తాగవలసివ చ్చింది.

అక్కడున్న వాళ్లందరికి కాళ్ళు మొక్కాడు విఠల్. చిన్న పిల్లలు తాగేటప్పుడు పెద్దవాళ్ల కాళ్లకి మొక్కాలి. అది వాళ్ళ ఆచారం. అతడి గ్లాసులో అందరు తలా ఇంతా సారా పోశారు. అతడి కళ్లల్లో మాస్టరు కులకర్ణి మెదులుతు న్నాడు. విఠల్ భయంభయంగా గ్లాసులో ఉన్న సారా తాగేశాడు.

★ ★ ★

తుల్‌జాపూర్ జాతర మొదలయింది. ఆరోజు టోలీవాళ్ళు జాతరకు బయలుదేరారు. తిమ్మప్ప బృందం దొంగతనాలు చేయడానికి బయలుదేరారు. బయలుదేరేముందు కోడిని కోశారు. భారత్ బ్లేడుకి, దాఖలా పత్రానికి మొక్కుకున్నారు. రక్తాన్ని కొంచెం దేవుడిమీద చల్లారు. "ఈ జాతరలో మాకు 'సంపాదన బాగా ఉండాలి" అంటూ దేవుడికి దండం పెట్టుకున్నారు. పరిడీకి పూజచేశారు. సైదవ్వ అందరికి భాకరీ (ఎర్ర జొన్నల రొట్టెలు) చేసి ఇచ్చింది. ఎల్లవ్వ మిరపకాయల కారం నూ రింది. మూట ముల్లెలు తీసుకుని టోలీవాళ్ళు లాతూర్ స్టేషనుకు వచ్చారు. అక్కడ ఉన్న పోలీసులను చూడగానే అందరు పారిపోయి స్టేషన్‌లో దాక్కున్నారు. కొండప్ప పారిపోతూ ఉండగా పోలీసులు పట్టుకున్నారు.

"ఏం రా? ఎక్కడికి? తుల్‌జాపూర్ జా తరా?" కళ్ళెర్రచేస్తూ ఓ పోలీసు అడిగాడు.

"కాదు సాబ్... మా జాతివాళ్ళ పెళ్ళికి" అన్నాడు కొండప్ప.

"అబద్ధాలు చెబుతున్నావా? పద స్టేష నుకు" అంటూ పోలీస్ కానిస్టేబుల్ కొండప్ప మెడని పట్టుకుని తోశాడు.

"సాబ్... సాబ్..." అని అంటూ కొండప్ప కొంత డబ్బు పోలీసుకి ఇచ్చాడు. ఆ పోలీసు అటూ ఇటూ చూస్తూ ఆ డబ్బు అందుకుని వెంటనే జేబులో వేసుకున్నాడు.



"ఇక దొంగతనం చేయకండి. చేశారో జైల్లో పడేస్తాం" అంటూ పోలీసులు వెళ్ళి పోయారు. ఆ తరువాత కొండప్ప ఇచ్చిన డబ్బులు పోలీసులందరు పంచుకున్నారు.

కొండప్ప దాక్కున్న వాళ్ళని పిలిచాడు. వాళ్లందరు బయటకి వచ్చి రైలు ఎక్కారు.

తుల్‌జాపూర్‌లో జనం కిక్కిరిసి ఉన్నారు. టోలీ వాళ్లకి చాలా సంతోషం కలిగింది.

"తుల్‌జాపూర్ భవానీ! ఈ రోజు మాకు బాగా సంపాదన ఉండాలి. మూట ముల్లెలు, బంగారం బాగా దొరకాలి" అని వాళ్లందరూ దండం పెట్టుకున్నారు.

తిమ్మప్ప జాతరకి వచ్చినవాళ్ళ సామాన్ల మీద ఓ కన్నేసి ఉంచాడు. రామప్ప గుడి దగ్గరికి వెళ్ళి నాలుగైదు కొత్త చెప్పుల జతలు, రెండు బూట్ల జతలు దొంగిలించుకువచ్చాడు. తిమ్మప్ప ఇద్దరు ముగ్గురి జేబులు కత్తిరించాడు. కొండప్ప జేబులు కొట్టేసి బోలెడు సంపాదించాడు. ఎల్లవ్వ ఎంతో చాకచక్యంగా దొంగతనం చేయకలదు. ఆమె నోటితో మంగళ సూత్రాల తాడుని తెంపేస్తుంది. ఆరోజు ఆమె బోలెడు బంగారం సంపాదించింది.

గోముఖం దగ్గర స్నానం చేయడానికని అందరు బయలుదేరారు. అక్కడ చాలామంది ఆడవాళ్ళు ఉన్నారు. వాళ్ల మెడలలో బోలెడంత బంగారం ఉంది. ఆ ఆడవాళ్ళు తమ తమ ఆభరణాలను ఒక మూటలో కట్టారు. ఆ మూట ఒక బుట్టలో పెట్టారు. దానిమీద ఒక ముసలిదాన్ని కూర్చోపెట్టారు. టోలీ వాళ్లందరి కళ్ళు ఆ బుట్టమీద పడ్డాయి. ఆ ముసలి దాన్ని ఆ బుట్టమీద నుండి లేపాలి. ఆ ఆభరణాలు దొంగిలించాలి. అందరు ఉపాయంకోసం ఆలోచించసాగారు. రామప్పకి ఓ మంచి ఉపాయం దొరికింది. అతడు ఆ అవ్వకి దగ్గరగా అందరిని రమ్మన్నాడు. వెళ్ళి ఒక కిలో కోవాబిళ్లలు తీసుకువచ్చాడు. తన వాళ్లందరికి పంచడం మొదలుపెట్టాడు. అయినా ఆ అవ్వ లేవలేదు. అతడు మరో ఉపాయం ఆలోచించాడు.

అతడు వెళ్ళి వందరూపాయలనోటు మార్చి ఐదైదు రూపాయలనోట్లు పట్టుకువచ్చాడు.

అవ్వ ఎదురుగుండా ఒక్కొక్క నోటును జార విడిచాడు. ఆ పని కావాలని చేస్తున్నట్లుగా ఎంతమాత్రం అనిపించకుండా ప్రవర్తిస్తున్నాడు.

ఒక ఐదు నోటు ముసలమ్మకు దగ్గరగా పడ్డది.

మరో ఐదు... మరో ఐదు నోటు...

మరో ఐదు...

ఆ నోట్లను చూస్తున్న అవ్వ ఇక ఉండలేకపోయింది. ఆమె లేచి ముందుకు వచ్చి నోట్లు పట్టుకుంది అంతే... బుట్టలోని ఆభరణాల మూటను కొండప్ప ఒక్క ఉదుటున చాకచక్యంగా దొంగిలించాడు.

అవ్వ నోట్లను బొడ్లో దోపుకుని బుట్టమీద వచ్చి కూర్చుంది. ఆడవాళ్ళు స్నానం చేసివచ్చారు.

బుట్టలో చేయిపెట్టి ఆభరణాలను తీయబోతే ఏముంది లోపల ఖాళీ అంతే! వాళ్ళు పెద్దగా గుండెలు బాదుకుంటూ ఏడవడం మొదలుపెట్టారు.

ముచ్చులు పారిపోయి పరుగెత్తుకుంటూ చెట్లదగ్గరికి వచ్చారు. హనుమా తెల్లటి బట్టలు వేసుకుని తలమీద ఎర్రటి బట్టతో పాగా కట్టాడు. ఓ సంచి వేళ్ళాడేసుకున్నాడు. అందులో నిమ్మకాయలు, కుంకుమ, పసుపు పొట్లాలు సూదులు పెట్టుకున్నాడు. చూసినవాళ్ళు ఇతడెవడో మంత్రగాడు బాణామతి చేస్తాడు అని భయపడ్డారు. తిమ్మప్ప, రామప్ప, కొండప్ప తాము దొంగించిన వస్తువులను ఎల్లవ్వ లక్ష్మప్పలకు అప్పగించి హనుమా దగ్గరికి వచ్చారు. అతడి చుట్టూ చిడతలు పట్టుకుని భజన చేయసాగారు. జనం మూగారు. ముచ్చులు వాళ్ల జేబులు కత్తిరించారు.

టోలీవాళ్ళందరు గబగబ టిక్కెట్లు కొని రైలు ఎక్కారు. ఎవరికి ఎక్కడ చోటుదొరికితే వాళ్ళు అక్కడ కూర్చున్నారు. హనుమా పైకెక్కి కూర్చున్నాడు. కింద ఒక యువకుడు పడుకుని ఉన్నాడు. హనుమా కూనిరాగాలు తీస్తూ కళ్ళు మూసుకున్నాడు. రైలు చిన్నచిన్న స్టేషన్లలో ఆగుతూ ముందుకు నడుస్తోంది.

ఒక పెద్ద స్టేషన్‌లో రైలు ఆగింది. ప్లాట్‌ఫా




మ్మీద చాయ్...చాయ్...అంటు టీ అమ్మే వాళ్ళు అరుస్తున్నారు. యువకుడు టీ కుర్రావాడిని కేకవేసి ఒక కప్పు టీ, ఓ ప్లేటు బజ్జీలు తెమ్మన్నాడు. ఆ కుర్రాడు తెచ్చి ఇచ్చాడు. హనుమా కళ్ళు తెరిచాడు. ఆ యువకుడు టీ తాగాడు. డబ్బు తీయడానికని జేబులోంచి పరుసు తెరిచాడు. కుర్రాడికి డబ్బులిచ్చి కట్టలో ఎన్ని రూపాయలున్నాయో లెక్కపెట్టుకో సాగాడు. పైనుండి హనుమా ఇదంతా గమనిస్తున్నాడు. కొన్ని నంబర్లూ గుర్తుపెట్టుకున్నాడు.

కొంచెంసేపయ్యాక టికెట్ కలెక్టర్ వచ్చాడు. హనుమాని టికెట్ అడిగాడు. హనుమా టికెట్ చూపించాడు. తక్కిన వాళ్ళందరిదగ్గర టికెట్ చెక్‌చేసి టి.సి. దిగిపోయాడు.

“ఏయ్... నా డబ్బులు ఎందుకు దొంగతనం చేశావ్... ఇచ్చేయి'' అంటూ హనుమా ఆ యువకుడిని అడిగాడు.

ఆ యువకుడు బిత్తరపోయాడు. ఇంతలో నంతముచ్చులందరూ అక్కడికి చేరారు.

“వీడు నా డబ్బులు కాజేశాడు'' అని వాళ్లందరికి చెప్పాడు హనుమా.

“మర్యాదగా మాట్లాడు. నాకేం తెలియదు. నా దగ్గర ఉన్న డబ్బంతా నాదే...'' అన్నాడు యువకుడు ధైర్యంతెచ్చుకుని.

“మావాడు వాడివంటున్నాడుగా... ఇచ్చేసేయ్'' అన్నాడు రామప్ప.

“ఇచ్చేయ్...'' అన్నాడు కొండప్ప పెద్దగా అరుస్తూ.

యువకుడు భయపడిపోయాడు.

“ఆ నంబర్లు కూడా చెబుతాను. నా డబ్బు నాకిచ్చేయ్. నోట్లు బయటకి తీయ్ లేకపోతే చూడు'' అంటూ చెయ్యెత్తాడు హనుమా అతడు భయంతో కట్టబయటకి తీశాడు. ఇంతలో మరో ఇద్దరు ముగ్గురు పాసెంజర్లు అక్కడికి చేరారు. వాళ్ళు విషయం తెలుసుకున్నారు. హనుమా నంబర్లు చెప్పడం మొదలుపెట్టాడు. తక్కిన పాసెంజర్లు ఆ నంబర్లు కరెక్టే అని నిర్ధారణ చేశారు. యువకుడికి ఏం చేయాలో

తోచలేదు. అక్కడున్న వాళ్లందరు హనుమా చెప్పేదే నిజం అని అన్నారు.

''ఈ డబ్బు...నాది... నాది'' అన్నాడు యువకుడు.

''పోలీసుస్టేషన్‌కి పద...'' అన్నారు కొండప్ప, రామప్ప.

యువకుడు అసలే భయస్థుడు కావడంవలన వాళ్ళను ఎదిరించలేకపోయాడు. పైగా పోలీసు స్టేషన్‌కి వెళ్తే బోలెడు టైమ్ అవుతుంది. తను అర్జంటుగా తన ఊరు చేరుకోవాలి. లేకపోతే తన పని ఆగిపోతుంది. తన నిస్సహాయతకు తనమీద తనకే కోపం రాసాగింది. ఇక ఏం చేయలేక ఆ యువకుడు డబ్బంతా హనుమాకి ఇచ్చేశాడు. తరువాత స్టేషన్‌లో సంతముచ్చులందరు దిగిపోయారు.

★ ★ ★

సంతముచ్చులు ఇరుగు పొరుగు ఊళ్ళల్లో జరిగే పెళ్ళిళ్ళకి వెళ్తూ ఉంటారు. పెళ్ళి రోజున ఊళ్ళో వాళ్లందరికి, బీదా బిక్కీ, అందరికి భోజనాలు పెడతారు. భోజనాలప్పుడు పంక్తిలో ఎవరు కూర్చున్నా లేదనకుండా పెట్టడం వాళ్ల ఆచారం. సంతముచ్చులు ఒక్క రోజైనా కడుపునిండా తినవచ్చుకదా అని పెళ్ళిళ్లకి బయలు దేరుతారు. ఫలానా ఊళ్ళో ఊరి భోజనం ఉంది అని ముందు ఎవరికి తెలిస్తే వాళ్ళు తక్కిన వాళ్లందరికి ఈ విషయం చెబుతారు. అందరూ సంతోషంగా ఇంట్లో ఉన్న పళ్ళాలు, గిన్నెలు, గ్లాసులు తీసుకుని బయలుదేరుతారు. ఈ భోజనం కోసం ఎంత దూరం అయినా నడిచి అక్కడికి చేరుకుంటారు. కాళ్ళు వాచిపోయినా సరే వాళ్ళు ఒక పూట అయినా తిండితింటాం కదా అన్న ఆశకొద్దీ ఆ బాధను భరిస్తూ నడుస్తారు. పెద్ద వాళ్ళు, నీళ్ళు ఎక్కువగా తాగవద్దని, నీళ్ళు తాగితే ఎక్కువ అన్నం తినలేరని పిన్నలకు ముందే చెప్పిపెడతారు. ఎంత దాహం వేసినా పిల్లలు నీళ్ళు తాగరు.

ఆ రోజు జౌసాలో పెళ్ళి జరుగుతోంది. ఊరి భోజనం ఉంది అని టోలీ వాళ్లకు తెలిసింది. సంతముచ్చులు బొచ్చెలు, గ్లాసులు తీసుకుని బయలుదేరారు.

పంక్తిలో కూర్చున్నప్పుడు తీపి బూందిని, జిలేబీలను అడిగి మరీ మరీ వేయించుకున్నారు. ఎవరూ చూడకుండా తాము తెచ్చిన బొచ్చెలలో వాటిని వేసుకున్నారు. ఎవరికి కనిపించకుండా దూరంగా ఓ బక్కెట్టు పెట్టారు. పాండురంగ్ మొదటిసారి పంక్తిలో కూర్చుని భోజనం చేశాక బకెట్టుదగ్గర కాపలా కాయడం మొదలుపెట్టాడు. కొందరు తాము బొచ్చెలలో నింపుకున్న పదార్థాలను బక్కెట్టులో వేసి మళ్ళీ వచ్చారు. రెండోసారి పంక్తిలో కూర్చున్నారుగానీ విఠల్ పట్టుబడ్డాడు. వడ్డిస్తున్న ఒక వ్యక్తి ''సిగ్గు లేదురా... ఎన్నిసార్లు తినడానికని వస్తావు. నీది కడుపా... చెరువా... ఏ ఊరినుండి వచ్చావు? నీ తాత సొమ్మనుకుంటున్నావా... ఫో... వెధవా...'' అంటూ బయటకి తరిమేశాడు. విఠల్ ఏడుస్తూ బయటకి వచ్చేశాడు. ఆ వ్యక్తి విఠల్‌ని తిడుతున్నప్పుడు తక్కిన సంతముచ్చులందరు తెలివిగా తప్పించుకున్నారు.

గుడిసెకి వచ్చాక అందరూ విఠల్‌ని తిట్టడం మొదలుపెట్టారు. ''తెలివి తక్కువ చచ్చినాడా... పట్టుబడకుండా పని చేయాలని తెలియదురా... నువ్వు పట్టుబడ్డాక మమ్మల్ని ఎక్కడ పట్టుకుంటారో అని భయపడి చచ్చాం... అందుకే తిమ్మప్ప! వీడిని స్కూల్లో వేయవద్దన్నాం. నాలుగు ఊళ్ళు తిరగాలి ముచ్చులు చేయాలి. కడుపు నింపుకోవాలి. వీడు స్కూల్‌కి పోయి చెడిపోతున్నాడు. తెలివిగా ఏ పని చేయలేడు. అయినా మనం బ్రాహ్మలమా... కోమట్లమా... స్కూల్‌కి వెళ్లడానికి? చదువుకుంటే ఆ ఎల్లమ్మదేవికి కోపం వస్తుంది'' అన్నాడు రామప్ప.

''రేపటినుండి విఠల్‌ని స్కూల్‌కి పంపకు'' అన్నాడు కొండప్ప.

''నాన్నా... నేను స్కూల్‌కి పోతాను'' అంటూ ఏడ్చాడు విఠల్.

మరునాడు పండరీపూర్ జాతరకి టోలీవాళ్ళు బయలుదేరారు. ఆ జాతర చాలా పెద్దది. దేశం నలుమూలలనుండి ప్రజలు వస్తూ ఉంటారు. పోలీసులు టోలీ వాళ్లను పసికట్టారు. ముందే యాత్రికులకు హెచ్చరిక చేయడం మొదలుపెట్టారు.

''యాత్రికులారా! మీ సామానులు, ఆభర





ణాలు జాగ్రత్త చాలా మంది జేబుదొంగలు ఇక్కడ తిరుగుతున్నారు. ఎవరి సామానులు వాళ్ళు జాగ్రత్తగా కాపాడుకోండి'' అంటూ పోలీసులు మైక్‌లో చెప్పారు.

టోలీవాళ్లకు ఆ రోజు ఏ మాత్రం సంపాదన లేకుండా పోయింది. కడుపులో ఆకలిగా ఉంది. ఎవరి జేబుల్లోను ఒక్కపైసాలేదు. అందరు చంద్రభాగా నదిదగ్గరికి చేరారు.

అక్కడ ఒకావిడ కట్టెలపొయ్యి మీద వంట చేస్తోంది. గిన్నెలో అన్నం ఉడుకుతోంది. ఆమె పాలకూరకోసం లేచింది. కొంచెం దూరంలో ఉన్న కూరల బుట్టదగ్గరికి వచ్చి కూర్చుంది. తిమ్మప్ప, రామప్ప, కొండప్ప, ఎల్లవ్వ ఆవురావురుమంటు ఆ గిన్నె వంక చూస్తున్నారు. ఎట్లాగైనా సరే అన్నం గిన్నె ఎత్తుకు రావాలి.

''ఎవడైతే నిజంగా సంతముచ్చులలో పుట్టాడో... తల్లి పాలు తాగాడో వాడు ఎట్లాగయినా సరే అన్నంగిన్నెను ఎత్తుకు రావాలి. ఎవరు వెళ్తాడు?'' అని రామప్ప అడిగాడు.

''నేను వెళ్ళి ఆ అన్నం గిన్నెను ఎత్తుకువస్తాను. కాని నాకు కాస్త సహాయం చెయ్యాలి'' అంటూ కొండప్ప, రామప్ప చెవిలో ఏం చేయాలో చెప్పాడు.

రామప్ప ఆమె ఎదురుగుండా వెళ్లాడు. ధోవతి పైకెత్తాడు. మూత్ర విసర్జన చేయడం మొదలుపెట్టాడు. ఆమె సిగ్గుపడింది, కోపం వచ్చింది.

''సిగ్గులేదూ... ఆడదాని ఎదురుగుండా...'' అంటూ వెనక్కి తిరిగింది.

అంతే కొండప్ప బట్టతో అన్నం గిన్నెను ఒక్క ఉదుటున ఎత్తిపట్టుకుని పరుగెత్తాడు.

ఆమె వెనక్కి తిరిగింది. అన్నం గిన్నె ఎత్తుకు పోతున్న కొండప్ప కనిపించాడు.

''దొంగ...దొంగ... అన్నం గిన్నె ఎత్తుకుపోతున్నాడు'' అంటూ అరవడం మొదలుపెట్టింది.

పోలీసుల హెచ్చరిక విని జాతరకు వచ్చిన వాళ్లందరు తమ తమ సామానులను జాగ్రత్తగా చూసుకోసాగారు. షోలాపూర్, బార్షీ, కవ్‌ఠా, సల్‌గరా, భాడ్‌గాంవ్, జావళి, తలేగాంవ్, భీడ్ మొదలగుచోట్ల నుండి వచ్చిన ముచ్చులు ఒక చోట చేరారు. సంపాదించడం ఎట్లా అని ఆలోచించారు. ఉపాయంకోసం వెతికారు. ఎల్లవ్వకు ఒక ఉపాయం తట్టింది. రామప్పకు, కొండప్పకు చెప్పింది.

మీరజ్‌నుండి లాతూర్‌కి రైలు ఏ టైమ్‌లో ఉందో కనుక్కుని వచ్చాడు కొండప్ప. తక్కిన వాళ్లకి ఈ విషయం చెప్పాడు.

చంద్రభాగా నదిలో యాత్రికులు స్నానాలు చేస్తున్నారు. ముచ్చులందరు అక్కడ చేరారు.

''నది పొంగిందిరో...'' అంటూ పెద్దగా అరవసాగాడు రామప్ప.

''ఆ... నది పొంగిందా... పదండి...పదండి... చస్తాం'' అంటూ కొండప్ప పరిగెత్తసాగాడు.

ఒకరు... ఇద్దరు... ముగ్గురు... టోలీలోని వాళ్లందరు అరవడం మొదలుపెట్టారు.

యాత్రికులు ఈ అరుపులు విని గబగబా నది ఒడ్డుకు వచ్చారు. నది ఒడ్డున యాత్రికులు సంగతి గ్రహించి అరవడం మొదలుపెట్టారు. దాంతో అక్కడున్న జనం అంతా వెనక్కి తిరిగి సామాన్లదగ్గరకు పరుగెత్తడం మొదలుపెట్టారు. ఈలోగా ముచ్చులు చేతికి దొరికిన మూట ముల్లెలు పట్టుకుని పారిపోయారు. సరిగ్గా రైలు బయలుదేరే సమయానికి స్టేషనుకి వచ్చి గబగబా రైలెక్కేశారు.

★ ★ ★

కడుపు మాడుతున్నా జాతివాళ్లందరూ తిడుతున్నా విఠల్‌మాత్రం బడికివెళ్లడం మానలేదు. ఆ రోజు కులకర్ణి మాస్టరుగారు ''ఈరోజు ఎవరెవరు స్నానం చేయలేదో లేచి నిల్చోండిరా...'' అన్నారు. క్లాస్ మొత్తంలో విఠల్ ఒక్కడే లేచి నిల్చున్నాడు.

''విఠల్...ప్రతిరోజు స్నానం చేసిరమ్మనమని చెప్పానుగా... గుంజిళ్ళు తియ్యి'' అని అన్నారు మాస్టరుగారు.

విఠల్ గుంజిళ్ళు తీశాడు.

ఆ మర్నాటినుండి ప్రతిరోజు స్నానం చేసే బడికి వెళ్లడం మొదలుపెట్టాడు. స్నానం చేయడానికి నీళ్ళు దొరకకపోతే కనీసం ముఖం కాళ్ళు చేతులయినా కడుక్కునేవాడు. అప్పుడప్పుడు నది దగ్గరికి వెళ్ళి చినిగిన పాత బట్ట కట్టుకుని షర్టు ఉతుక్కునేవాడు. విఠల్ ఇంటి వాళ్ళు రామప్ప, కొండప్ప, ఎల్లవ్వలు అతడిని

తిట్టడం మొదలుపెట్టారు, ''రోజా మనకి స్నానం ఎందుకు? వీడు చదివి చెడిపోతున్నాడు'' అని.

ఒక రోజు విఠల్ మాస్టరుగారు పుస్తకాలు, పెన్ తెచ్చుకోమన్నారని తండ్రికి చెప్పాడు. తిమ్మప్ప అవి కొనిచ్చాడు. అక్కడి దేశదిమ్మరులందరు ఈ వస్తువులను వింతగా చూడటం మొదలుపెట్టారు. ఓ పదిరోజులయ్యాక తిమ్మప్ప పుస్తకాలు, పెన్, చూసి విఠల్‌ని తన్నడం మొదలుపెట్టాడు. విఠల్‌కి తండ్రి తనను ఎందుకు కొడుతున్నాడో అర్థంకాలేదు.

''బాబూ! నన్నెందుకు కొడుతున్నావు? నేనేం తప్పు చేయలేదే'' అన్నాడు విఠల్ ఏడుస్తూ.

''దీన్ని ఇంత నల్లగా ఎందుకు చేశావు. దీన్నిలా పాడుచేయడానికా నేను కొనిచ్చింది'' అన్నాడు తిమ్మప్ప.

విఠల్‌కి విషయం అర్థం అయింది.

''నేను పుస్తకంమీద శబ్దాలు వ్రాశాను. లెక్కలు చేశాను పాడుజేయలేదు. మాస్టరుగారిని అడుగు'' అన్నాడు.

విఠల్ రెండు మూడుసార్లు దీన్ని గురించి వివరించి చెప్పాక తిమ్మప్పకి అర్థం అయింది. అయ్యో... అనవసరంగా కొట్టానే అంటూ విఠల్‌ని కౌగలించుకున్నాడు తిమ్మప్ప.

రోజులు గడుస్తున్నాయి. బడిలో విఠల్ చాలా విషయాలు నేర్చుకున్నాడు. ఆ రోజు ఆగస్టు పదిహేను. బడి ఆవరణ అంతా చక్కగా అలంకరించి ఉంది. విఠల్ తను స్పీచ్ ఇస్తానని మాస్టరుకి చెప్పాడు. కులకర్ణి మాస్టరుగారు సరేనన్నారు.

ఆ గ్రామంలోకి పెద్దలు స్టేజి ముందువేసిన కుర్చీలలో కూర్చుని ఉన్నారు. శివరావు పాటిల్, ఔసేకర్ దేశముఖ్‌లు కూడా వచ్చారు. విఠల్ ''మా గురువులకు, ఇక్కడ కూర్చున్న పెద్దలకు, సోదర సోదరీమణులకు నమస్కారములు. మహాత్మాగాంధీ, జవహర్‌లాల్‌నెహ్రూల దయవలన మనకు పందొమ్మిది వందల నలభైఏడు ఆగస్టు పదిహేనున స్వతంత్రం వచ్చింది. వాళ్ళు మన దేశాభివృద్ధి కోసం ఎంతో పాటుపడ్డారు. మనం వాళ్ల అడుగు జాడలలో నడవాలి'' అని అందరి ముందు స్పీచ్ ఇచ్చాడు. అందరు చప్పట్లు కొట్టారు.

''ముచ్చుముండాకొడుకు ఆ తిమ్మప్ప కొడుకేగా వీడు'' అన్నాడు శివరావుపాటిల్.

''ఆహా... వాడేనండీ... వీడు చదువు వెలగబెట్టి ఊళ్లేలుదాం అనుకుంటున్నాడేమో...'' వెకిలిగా నవ్వుతూ అన్నాడు షావుకారు.

''వీడు సింహాసనం ఎక్కుదామనుకుంటున్నాడో ఏమో... కనకపు సింహాసనముపై శునకము కూర్చుండ...'' పళ్లు ఇకిలిస్తూ అన్నాడు దేశ్‌ముఖ్. ఈ మాటలు విన్న విఠల్ మనస్సు చాలా బాధపడింది.

ఒకరోజు ఎండ తీవ్రంగా ఉంది. కాళ్లకి చెప్పులు లేకపోవడంవలన విఠల్ పాదాలు బొబ్బలెక్కాయి. అరికాళ్లు విపరీతంగా మంట పుట్టసాగాయి. కొబ్బరినూనె రాద్దామంటే ఇంట్లో బొట్టులేదు. ఆరోజు అతడికి ఒక ఐడియా వచ్చింది. తన దగ్గర ఉన్న నోటుపుస్తకాల మీది అట్టలు చించాడు. వాటిని ఒకదానిమీద ఒకటి పెట్టి కుట్టాడు. చెత్తకుండీలన్నీ వెతికాడు. చివరికి రెండు వేరువేరు రంగులు కల రబ్బరు పట్టీలు దొరికాయి. ఆ అట్టలకు వాటిని కుట్టి చెప్పుల జతను తయారుచేశాడు. మరునాడు వాటిని వేసుకుని బడికి వచ్చాడు.

విద్యార్థులు విఠల్ చెప్పులవైపు చూస్తూ సైగలు చేస్తూ నవ్వడం మొదలుపెట్టారు.

''ఈ చెప్పులు జర్మనీనుంచి వచ్చాయిలా ఉందే?'' అంటూ ఒక విద్యార్థి వంగి అతడికి కాళ్లవంక చూశాడు.

''కాదు చంద్రలోకంనుంచి వచ్చాయి. ఏవీ విప్పుచూద్దాం'' అన్నాడు మరో విద్యార్థి.

విఠల్ అక్కడినుండి పారిపోదాం అని అనుకున్నాడు. కాని వాళ్లు అతడిని చుట్టుముట్టారు.

విఠల్ చెప్పులు విప్పాడు. ఒకడు ఆ చెప్పులను అటు తన్నాడు. మరొకడు ఇటు తన్నాడు.

''ఎంత ఖరీదైన చెప్పులో'' అంటూ విద్యార్థులు పెద్దగా నవ్వారు. విఠల్ అవమానంతో తలదించుకున్నాడు.

★ ★ ★





దేశదిమ్మరులు దొంగతనాలు చేయడానికి బయలుదేరారు. రామప్ప విఠల్‌ని కూడా రమ్మ నమన్నాడు.

విఠల్ రానంటే రానన్నాడు.

"విఠలియా... పద... రానంటే ఎట్లా? ముందు ముందు ఎట్లా బతుకుతావు?" అరి చింది ఎల్లవ్వ.

"నేను రాను, ఎల్లత్తా నేను రాను"

"విఠల్ స్కూల్ లేదుగా... మూటముల్లెల దగ్గర కాపలా ఉందువుగాని రా..." అన్నాడు తిమ్మప్ప.

"వాడు రానంటే ఎందుకట్లా బలవంతం చేస్తావు?" అంది సైదవ్వ.

"నువ్వు దొంగతనాలు చేయకుండా గుడి సెలో కూర్చుంటున్నావుగా. వాడి గతీ అంతే చేస్తావా ఏమిటి?" అడిగాడు రామప్ప. వెళ్లక పోతే ఇక వీళ్లు వదిలిపెట్టరు అని అనుకుని విఠల్ బయలుదేరాడు. తమ జాతివాళ్లు ఇట్లా దొంగతనాలు చేయడం తప్పు అని అతనికి అనిపించింది. తను మాత్రం చచ్చినా దొంగత నాలు చేయకూడదు అని నిర్ణయించుకున్నా డు విఠల్.

ముచ్చులు జాతరలో చాలామంది జేబులు కత్తిరించి డబ్బులు సంపాదించారు. ఎల్లవ్వ ఆడవాళ్ల మంగళసూత్రాలను పూసలు తెంపింది. వాళ్లు నడుస్తున్నారు. ఇంతలో వాళ్ల కి ఒక షావుకారు కనిపించాడు.

"ఒరేయ్ కొండప్పా! ఆ షావుకారుని మోసం చేద్దాంరా..." అన్నాడు రామప్ప.

"ఏం చేద్దాం చెప్పు?" అడిగాడు కొండప్ప.

రామప్ప కొండప్ప చెవులో గుసగుసలాడా డు.

షావుకారు నడుస్తున్నాడు. వెనకనుండి రామప్ప పరుగెత్తుకుంటూ వెళ్లి షావుకారుకి ముందు నడవడం మొదలుపెట్టాడు. అలా నడుస్తూ ఒక పొగాకుపొట్లం జారవిడిచాడు. తరువాత జేబులోంచి రెండు గాజులు కిందప డేశాడు. షావుకారి కళ్లు మెరిశాయి. ఆ గాజులు బంగారంగాజులే అనుకున్నాడు. అటు ఇటు చూసి ఎవరు చూడటంలేదని నిర్ధారణ చేసు కుని ఆ గాజులను జేబులో వేసుకోబోయాడు. ఇంతలో కొండప్ప వచ్చాడు. "షావుకారూ! నేను ఎవరికి చెప్పను కాని నాకు కొంత డబ్బు ఇవ్వు. ఆ గాజులు నువ్వు ఉంచేసుకో" అన్నాడు కొండప్ప.

కొంచెం డబ్బు ఇస్తే ఎంతో ఖరీదుకల గాజులు మిగులుతాయికదా అని కొండప్పకు కొంత డబ్బు ఇచ్చాడు షావుకారు.

పాండురంగ్ దొంగతనం చేస్తూ పట్టుబడ్డా డు. అక్కడి మనుషులు అతడిని తన్నడం మొదలుపెట్టారు. ఇంతలో రామప్ప వచ్చి "నీకు సిగ్గు లేదురా... దొంగతనం చేయడాని కి? పద- పోలీస్‌స్టేషన్‌కి" అన్నాడు.

"పదరా... పద... పోలీస్‌స్టేషన్‌కి" అని అన్నాడు కొండప్ప. అక్కడి మనుషులు పాండురంగ్‌ని రామప్ప పోలీస్‌స్టేషనుకు తీసు కువెళ్తాడుకదా అన్న ఉద్దేశంతో అతడిని వదిలి వేశారు. రామప్ప పాండురంగ్‌ని బరబర ఈడ్చుకువెళ్లాడు. వీళ్లు చేసిన మోసాన్ని వాళ్లు తెలుసుకోలేకపోయారు.

ఊరికి తిరిగివచ్చాక వీళ్లని శివరావు పాటిల్ పిలిపించాడు. రామప్ప, తిమ్మప్ప, కొండప్ప బయలుదేరారు. విఠల్ కూడా వాళ్ల వెనక బయలుదేరాడు.

శివరావు పాటిల్ కుర్చీలో కూర్చుని చుట్ట తాగుతున్నాడు.

"దొరా... ఎందుకు పిలిచారు?" అడిగాడు రామప్ప.

"వెధవల్లారా... ఎందుకు పిలుస్తానో తెలి యదుట్రా. పట్టీ విషయం. జాతర ముందు పట్టీ అడిగితే ఏమన్నారు? మా దగ్గర డబ్బులు లేవు అని అన్నారు. ఇప్పుడు బోలెడు సంపా యించే ఉంటారు. ఇవ్వండి"

"సాహెబ్... ఎక్కువగా సంపాయించలేదు. కొన్నాళ్లు ఆగండి కడతాం" అన్నాడు కొండ ప్ప.

"బాగా తాగి తిని అంతా ఖర్చుచేశారా? ఏం? ఇవ్వండి"

"మా ఇళ్లల్లో అందరు వస్తులున్నారు సాహెబ్. తరువాత ఇస్తాం" అన్నాడు కొండప్ప బతిమిలాడుతూ.

"అందరి దగ్గర వసూలుచేసి తెచ్చి ఇవ్వు"

"మా ముచ్చులకి ఈసారి రాబడి లేదు

దొరా...''

''నాటకం ఆడుతున్నారు(రా... వెధవలం... మహాదేవ జాతరకి పట్టీ ఎగ్గొడ్దాం అనుకుంటు న్నారా... తియ్యరా...''

కళ్లెర్రచేస్తూ అన్నాడు పాటిల్.

విఠల్‌కి కొంత ధైర్యం వచ్చింది.

''పట్టీ ఎందుకు కట్టాలి? మా దగ్గర డబ్బు లు లేవు. మేం కట్టం'' అన్నాడు విఠల్.

''విఠలియా అట్లా అనకురా... పట్టీ కట్టడం ఆచారం. లేకపోతే ఆ దేవుడికి కోపం వస్తుంది. తప్పు... తప్పు...'' అంటూ లెంపలు వేసుకు న్నాడు రామప్ప.

''ఇప్పుడైతే మా దగ్గర లేవు తరువాత ఇస్తాం'' అన్నాడు కొండప్ప వెనక్కి తిరుగుతూ.

''బాగా పొగరెక్కిందే. నాలుగు తన్నండిరా... ఉన్నదంతా కక్కుతాడు''

శివరావుపాటిల్ అన్నదే తడవుగా అతడి మనుషులు కొండప్పను కొట్టసాగారు.

విఠల్‌కి విపరీతమైన కోపం వచ్చింది.

''దొరా... పట్టీ కడతాం... వాడిని వదిలే యండి'' అన్నాడు రామప్ప.

''మిగతాది మా ముచ్చులందరి దగ్గర వసూలుచేసి తెచ్చి ఇస్తాను'' అని అంటూ జేబులోంచి కొంత డబ్బు తీసి పాటిల్‌కి ఇచ్చా డు రామప్ప.

ఆరోజు విఠల్ గుడిసెకి వచ్చేసరికి పోలీసు లు సైదమ్మని కొడుతున్నారు.

''నీ కొడుకు, నీ మొగుడు దొంగతనాలు చేశారు. ఆ డబ్బు ఎక్కడ దాచారో చెప్పు. చెప్పవే చెప్పు లం...'' అంటూ ఆమె జుట్టు పట్టుకున్నాడు ఓ పోలీసు కానిస్టేబుల్.

''తక్కిన ముచ్చులు ఏ్రా? వెయ్యి రూపా యలదాకా పోయాయని రిపోర్టులు వచ్చాయి. నీకు ఈ కొత్తచీర ఎక్కడిదే?'' పోలీసుఅమీను బూటుకాలితో తన్నాడు.

ఈ దృశ్యం చూసిన విఠల్ తల్లి దగ్గరికి వచ్చాడు. పోలీసు విఠల్‌ని ఒక్కతోపు తోశాడు.

''నిజం చెబుతావా? లేకపోతే చీర ఊడదీ యమంటావా?''

''నాకు కట్టుకోవడానికి మరో గుడ్డలేదు నన్ను వదలండి'' అన్నది సైదమ్మ ఏడుస్తూ.

కానిస్టేబుల్ ఆమె కొంగు పట్టుకుని గుంజా డు. ఆమె విడిపించుకుని బయటకు పారిపో యింది. పోలీసులు ఇంట్లో వున్న చిల్లిబొచ్చెలు, జర్మన్ సిల్వర్ పళ్లాలు, గ్లాసులు, చినిగిన బొంతలని గుడిసె బయటికి విసిరేశారు.

ఇంతలో తిమ్మప్ప, రామప్ప, కొండప్ప వచ్చా రు. పోలీసులను చూడగానే పారిపోవడానికి ప్రయత్నించారుగానీ పట్టుబడ్డారు. పోలీసులు వాళ్లని తన్నుకుంటూ స్టేషన్‌కి తీసుకువెళ్లారు.

పోలీసులు బూట్లతో తన్నడంవలన సైదవ్వ కి అక్కడక్కడా రక్తం కారసాగింది. విఠల్ పాతబట్ట తీసుకుని కారుతున్న రక్తాన్ని తుడిచా డు. నిజానికి తన తల్లి దొంగతనాలు చేయడా నికి వెళ్లదు. ఆమె ఎప్పుడూ అనారోగ్యంగా ఉండటంవలన ఎవరూ ఆమెను రమ్మనమని బలవంతం చేయరు. కాని... కాని... తన తల్లి అన్యాయంగా ఎంత పెద్ద శిక్ష అనుభ వించింది.

ఈ పోలీసులు నిర్దోషులను కూడా చిత్ర హింస పెడతారు. ఒకవేళ తన ఎదురు గుండానే తన తల్లి చీరను వాళ్లు విప్పే సివుంటే...

పళ్లు పటపట కొరికాడు విఠల్.

పనిచేద్దామంటే తమ జాతివాళ్లకు ఎక్కడా పనిదొరకదు. దేశదిమ్మరుల ఆడవాళ్లకు ఏ ఇంట్లోనూ పాచిపని కూడా దొరకదు. మొగవా ళ్లు కాయకష్టం చేద్దాం అన్నా 'ముచ్చు ముండా కొడుకుల్లారా' అని తిట్టి తరిమివేస్తారు. అసలు వీళ్లందరూ కలిసికదూ తమని దొంగలుగా తయారుచేస్తున్నది. తమ జాతివాళ్లు దొంగ లుగా మారడానికి కారణం ఎవరు? అతనికి తను పొద్దున్నే స్కూలుల్లో ప్రార్థనా సమయంలో వల్లించే వాక్యాలు గుర్తుకు రాగాసాయి.

''భారతదేశం నాది...'' కాని ఈ దేశంలో తమకంటూ ఓ గజం చోటులేదు. చీర దొంగ తనం చేయకపోయినా నీ చీర విప్పేస్తాం అంటూ తన తల్లి చీర విప్పడానికి అవతలివా ళ్లు ఏమాత్రం వెనుకాడరు. ఇదా నా దేశం...

''భారతీయులందరు నా సోదరులు...'' వీళ్లందరూ తనకు సోదరులు, తనకు బంధు వులు... నిజంగా సోదరులయితే తమ జాతివా




రికి ఎవరూ చేయడానికి పని ఎందుకు ఈయరు? తమ జాతివారికి దొంగతనం చేసే పరిస్థితి ఎందుకు ఏర్పడ్డది. వీళ్లందరు తన సోదరులయితే దేశదిమ్మరులను ఎందుకు ఉద్ధరించరు? సంతముచ్చులకు చేయూతను ఎందుకు ఇవ్వరు?

ఈ దేశంలో తమ జాతివారు మనుషులుగా బతకడంలేదు. తమ జాతివారికన్నా జంతువులే బాగా బతుకుతున్నాయి. జంతువులు సరిగా దాణా దొరకక కడుపుమాడితే తాళ్లు తెంచుకుని పొలాల్లోకి పారిపోతాయి. హాయిగా కడుపునిండా మేస్తాయి. తమ జాతివారికి ఆ గతి కూడా లేదు ప్చ్...

జైలులో పోలీసులు, తిమ్మప్ప, రామప్ప, కొండప్పలని విపరీతంగా కొట్టారు.

తిమ్మప్పను తలకిందులుగా వేలాడదీసి కళ్లల్లో కారం చల్లారు.

"అమ్మా... అమ్మా..." అంటూ తిమ్మప్ప అరవసాగాడు.

రామప్పని లాఠీలతో కొట్టారు. "ఓరి నాయనో... చంపకండిరా..." అంటూ రామప్ప మొత్తుకోసాగాడు.

కొండప్ప బట్టలు ఊడదీసి శరీరాన్ని సిగరెట్లతో కాల్చసాగారు. చచ్చానురా నాయనో..." అంటూ అతడు కేకలు వేయసాగాడు.

ఎంత హింసించినా వాళ్లు డబ్బు విషయం చెప్పలేదు. చివరికి పోలీసులకి కొంత ముట్టచెబుతాం అనేసరికి వాళ్లని వదిలివేశారు.

దొంగతనాలు చేశాక ఇళ్లకి తిరిగి వచ్చేటప్పుడు కొండప్ప, అందరి దగ్గర ఉన్న డబ్బు, ఆభరణాలను మూటకట్టి కొడుకుకు ఇచ్చాడు. గుడిసెలో మూలతవ్వి ఈ మూటను పూడ్చిపెట్టమని దానిమీద ఒకరాయి పెట్టమని చెప్పాడు.

జైలునుండి ఇంటికి వచ్చాక తవ్వి ఆ మూటను తీశాడు కొండప్ప. ముగ్గురు పోలీసులకి కొంత ఇచ్చారు. ఇళ్ళల్లో వాళ్ళకి కొంత ఇచ్చారు. పట్టీకి కొంత ఇచ్చారు. ఎల్లవ్వ షావుకారు జాసేకర్‌కి ఆభరణాలు అమ్మేసి కొంత డబ్బు తెచ్చింది.

దొంగతనాలు చేసి తెచ్చిన డబ్బంతా వాళ్ళకి వీళ్లకి ఇవ్వడంవలన స్థితి మళ్లీ మామూలుగానే తయారయింది. తినడానికి తిండిలేదు. రోగాలు రొష్టులకు మందు మాకూ లేదు.

శివరావుపాటిల్ పట్టీకి కట్టిన డబ్బు చాలా తక్కువగా ఉందని ఇంకా డబ్బు కట్టాల్సిందని మనిషిచేత చెప్పి పంపించాడు. పట్టీ పూర్తిగా కట్టకపోతే పాటిల్ ఏంచేస్తాడో అన్న భయంతో టోలీవాళ్లు మళ్లీ దొంగతనాలకు బయలుదేరారు. కొండప్ప తన భార్య ఎల్లవ్వను కవఠాకి పంపించాడు. కొండప్ప ఎల్లవ్వలు కవఠావాళ్లయినా ఎక్కువగా లాతూరుకి వస్తూవుంటారు.

దొంగతనాలు చేస్తున్నప్పుడు పాండురంగ్ పట్టుబడ్డాడు. పోలీసులు అతడిని పోలీస్‌స్టేషన్‌కి తీసుకువెళ్లారు. చిన్నవాడు కావడంవలన పోలీసులు పెట్టేబాధలు భరించలేకపోయాడు పాండురంగ్. టోలీలోని తక్కినవాళ్ల పేర్లు చెప్పేశాడు. పోలీసులు తిమ్మప్ప, రామప్ప, కొండప్ప, కొండప్ప కొడుకు వామనప్ప, హనుమూలను పట్టుకుని జైలుకి తీసుకువెళ్లారు.

ముచ్చులు పోలీసులకు కొంత డబ్బు ముట్టచెప్పి జైలునుండి విడుదల అయ్యారు.

ఆ దృశ్యం చూడగానే విఠల్ కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

"పాండురంగ్... మళ్లీ మా పేర్లు పోలీసులకు చెబుతావా..." అంటూ రామప్ప అతడి చెంపమీద ఛెళ్లున వేశాడు.

తిమ్మప్ప కొడుకును ఇసుకమీదకు తోశాడు. ఎండ తీవ్రంగా ఉంది. ఇసుక మలమల మాడిపోతోంది. పాండురంగ్ లేవడానికి ప్రయత్నించాడు. కొండప్ప కాలితో తన్నాడు. పాండురంగ్ కిందపడ్డాడు. అతడి చొక్కాను చింపేశాడు కొండప్ప.

"పోలీసులకి మా పేర్లు ఎందుకు చెప్పావ్" అడిగాడు రామప్ప కోపంగా.

"నువ్వు ఇకముందు దొంగతనాలు చెయ్యనని అందరితో చెబుతున్నావట. దొంగతనాలు చెయ్యకపోతే మన జాతివాళ్లు ఎట్లా బతుకుతారు? మా పేర్లు మళ్లీ చెబుతావా?" అంటూ కొండప్ప పాండురంగ్ జుట్టు పట్టుకున్నాడు.

పాండురంగ్ పెద్దగా కేకలు వేయడం మొదలుపెట్టాడు.

"పోలీసులు నా కళ్లల్లో కారం చల్లారు.

లాఠీలతో కొట్టారు. ఆ హింసలను భరించలేక పోయా..."

"మన చట్టం ప్రకారం పేర్లు చెప్పకూడదని తెలియదా?"

"పోలీసులు పేర్లు చెప్పేవరకు నన్ను వద లలేదు"

"పోలీసులు నీ కళ్లలో కారంపొడి పోశారని మా పేర్లు చెబుతావా... లం..." అంటూ హనుమా పాండురంగ్ ఒంటిమీద, కళ్లల్లో కారం చల్లాడు.

పాండురంగ్ పెద్దగా కేకలు వేయడం మొదలుపెట్టాడు.

"అరవకు అరిచావంటే ఆ మండుతున్న కట్టెలతో నీ నోటిమీద వాత పెడతా..." అన్నాడు కొండప్ప.

కొంచెం దూరంలో పొయ్యి మండుతోంది.

"ఈసారి సంతకి వెళ్లి బోలెడు బంగారం పట్టుకురావాలి. పైసలు తేవాలి తెలిసిందా..." అంటూ పాండురంగ్‌ని చెప్పుతో కొట్టడం మొదలు పెట్టాడు కొండప్ప.

"ఈసారి మా పేర్లు చెబితే చూసుకో ఏం చేస్తామో..." అన్నాడు తిమ్మప్ప కోపంగా.

పాండురంగ్ భయపడిపోయాడు.

"పోలీసులు పెట్టే బాధలు భరిస్తాను. మీ పేర్లు చెప్పను... వదలండి..." అంటూ పాండురంగ్ వాళ్లని బతిమిలాడసాగాడు.

ఎదురుగుండా నిల్చుని ఉన్న విఠల్‌ని చూశాడు తిమ్మప్ప.

"విఠలియా స్కూలు లేదా..." అడిగాడు తిమ్మప్ప.

విఠల్ సమాధానం చెప్పేలోపల పాండురంగ్ తండ్రిని అడిగాడు- "బాబా... నేను స్కూలుకి వెళ్తాను నన్ను పంపు" తను స్కూల్‌కి వెళ్తే ఇక దొంగతనాలు చేయమని తన జాతివాళ్లు బలవంతపెట్టరని అనుకున్నాడు పాండురంగ్.

"మీ అయ్య ఒకడిని పంపిస్తున్నాడుగా. నిన్ను కూడా పంపిస్తే కులంనుండి వెలివేస్తాం" అన్నాడు కోపంగా రామప్ప.

"అన్నా... ఇంటికి పోదాం పద" అన్నాడు విఠల్ పాండురంగ్ చేయి పట్టుకుంటూ.

విఠల్, పాండురంగ్ ఇంటికి బయలుదేరారు.



తిమ్మప్ప లాతూరులోని గోలాయిదాకా వెళ్లొస్తానని చెప్పి బయలుదేరాడు. స్కూలు లేకపోవడంవలన విఠల్ తనూ వస్తానని వెంటపడ్డాడు. తిమ్మప్ప విఠల్ తన వెంట రాకూడదన్న ఉద్దేశంతో ఏవేవో సాకులు చెప్పాడు. కాని విఠల్ తన పట్టుదల వదలలేదు. ఇద్దరూ బయలుదేరారు.

మధ్యదారిలో ఓ పెద్ద చింతచెట్టు వుంది. తిమ్మప్ప అక్కడ ఆగాడు.

"ఆ గోడమీద ఎక్కి చింతకాయలు కోస్తాను. నువ్వు అట్లా దూరంగా వెళ్లికూర్చో..." అన్నాడు తిమ్మప్ప విఠల్‌తో.

విఠల్ దూరంగా వెళ్లి కూర్చున్నాడు. తిమ్మప్ప గోడ ఎక్కాడు.

ధబాలున కింద పడ్డాడు. పడ్డవాడు లేవలేకపోయాడు. బాధతో విలవిలలాడిపోయాడు. విఠల్ పరుగెత్తుకుంటూ వచ్చాడు. తిమ్మప్ప కాలు పట్టుకుని అరవడం మొదలుపెట్టాడు.

"అబ్బా... అమ్మా... నొప్పి... నొప్పి నా కాలు"

విఠల్ పరుగెత్తుకుంటూ గుడిసె వద్దకు వెళ్లి జరిగిన సంగతి చెప్పాడు. రామప్ప, కొండప్ప, హనుమాలు పరుగెత్తుకుంటూ వచ్చారు. తిమ్మప్ప కాలునుండి రక్తం కారుతోంది.

"మెల్లిగా నడిపించుకుంటూ తిమ్మప్పని ఇంటికి తీసుకువెళ్దాం" అన్నాడు కొండప్ప.

"నేను లేవలేను" అన్నాడు బాధగా తిమ్మప్ప.





"లేవలేనంటే ఎట్లా...?" అంటూ రామప్ప అతడిని కదిలించాడు. కదలికకు తిమ్మప్పకు బాధ ఎక్కువ అయింది. పెద్దగా ఏడవడం మొదలుపెట్టాడు. అందరు కలిసి అతడిని ఎత్తారు. ఇంటిదాకా మోసుకువచ్చారు.

రామప్పకి కొంత వైద్యం తెలుసు. గబగబా వెళ్లి కొన్ని ఆకులు ఏరుకువచ్చి పసరు నూరి కాలికి కట్టు కట్టాడు. తిమ్మప్ప స్థితిని చూసిన సైదవ్వ ఘొల్లుమంది.

తిమ్మప్ప నాలుగైదునెలలు మంచంలోనే ఉన్నాడు. చివరికి అతడు కుంటివాడయ్యాడు.

ముచ్చులందరు అతడిని చూసి జాలిపడ్డారు.

తిమ్మప్ప కావాలనే కుంటివాడయ్యాడన్న రహస్యం ఎవరికీ తెలియదు. దొంగతనాలు చేస్తున్నప్పుడు తిమ్మప్పని పోలీసులు ఎన్నోసార్లు పట్టుకున్నారు. రకరకాల హింసలు పెట్టారు. ఆ హింసలకు ఓర్చుకోలేక దొంగతనాలు చేయడం మానేయాలి అని అనుకున్నాడు తిమ్మప్ప. ఉపాయం ఆలోచించాడు. కావాలని కాలు విరగకొట్టుకున్నాడు. కుంటివాడు ఇక దొంగతనాలు చేయలేడు అని టోలీవాళ్లు అతడిని వదిలివేశారు.

కుంటివాడైన తిమ్మప్ప తన కుంటికాలు చూపించి, ఏదైనా పనివుంటే ఇమ్మనమని ఊరివాళ్లని అడగడం మొదలుపెట్టాడు. శివరావుపాటిల్‌ని బతిమిలాడాడు. తిమ్మప్ప దొంగతనాలు చేయడం మానేశాడని పోలీసుల ద్వారా తెలుసుకుని శివరావుపాటిల్ తన పొలానికి కాపలాదారుడుగా ఉండమన్నాడు. పగలంతా తిమ్మప్ప ఉండేవాడు రాత్రిపూట మరొకడు కాపలా కాసేవాడు. తిమ్మప్పకి అతితక్కువ జీతం ఇచ్చేవారు.

దొంగతనాలు చేసే అవకాశాలు లభించక లక్ష్మప్ప, పాండురంగ్ ఏమీ సంపాదించలేకపోయారు. తిమ్మప్ప జీతంతో ఇల్లు గడవడం చాలా కష్టమయింది.

ఆరోజు శివరావుపాటిల్ తన పొలం దగ్గర కూర్చుని ఉండగా కులకర్ణి మాష్టారు ఆ దారి కుండా వెళ్తూ- "పాటిల్‌గారూ! నమస్కారం" అన్నాడు.

"ఓహో... కులకర్ణిగారా... రండి రండి" అన్నాడు శివరావుపాటిల్.

తిమ్మప్ప మాష్టారుగారి దగ్గరికి వచ్చాడు. కాళ్లకి దండం పెట్టాడు. "ఒరేయ్... తిమ్మప్పా! విఠల్ స్కూల్‌కి రావడం లేదేం?" అని అడిగారు కులకర్ణి.

"వాడు కపతా వెళ్లాడు. రేపో ఎల్లుండో వస్తాడు"

"మాష్టారుగారూ... అసలు వీళ్లకి చదువు లెందుకండి? విఠల్‌గాడు ఇప్పుడు చదివి ఏం చేయాలని?" అన్నాడు పాటిల్ మీసాలు తిప్పుతూ.

"చదువుకుంటే జ్ఞానం వస్తుంది. బాగుపడే అవకాశం ఉంటుంది"

"కులకర్ణీ! వీళ్ల బతుకులే అంత. ఆ జాతే దొంగతనాలు చేసేజాతి. వాళ్లని చదువుకో... చదువుకో... అని నెత్తికి ఎక్కించుకోవడం ఏమీ బాగాలేదు. వాళ్లు మనకింద పడివుండాల్సిన వాళ్లు.

"పాటిల్‌గారూ... మీలాంటి ధనవంతులు ఈవిధంగా మాట్లాడేవాళ్ళని కాళ్ళకింద తొక్కేస్తున్నారు. కాని రోజులు మారుతున్నాయి. వాళ్ళు కళ్ళు తెరుస్తున్నారు.

"కళ్ళు తెరిపిస్తున్నది మీరు"

"పాటిల్‌గారూ... తెరిపించాలి. వాళ్ళ బతుకులని బాగుచేయాలి"

"వాళ్ళ నుదుట భగవంతుడు అట్లా రాశాడు. ఆ రాతను ఎవరూ మార్చలేరు. వాళ్ళు అలా బ్రతకాల్సిందే"

"మీలాంటి ధనవంతులే ఇట్లాంటి అర్థంపర్థంలేని కబుర్లు చెప్పి వారిని పైకి రానీయకుండా చేస్తున్నారు. భగవంతుడిని నేను నమ్ముతాను. కాని వీళ్ళ నుదుట ఈ రాత ఏ భగవంతుడూ రాయలేదు. ఈ వ్యవస్థ అట్లా రాసింది. మీలాంటి ధనికవర్గం తమ స్వార్థంకోసం అట్లా రాసింది, రాస్తోంది. నాకు భగవంతుడి దయవలన ఇంత విద్య వచ్చింది. జ్ఞానం కలిగింది. నాతోటి మానవుడి

కి కూడా జ్ఞానోదయం కలిగించాలని నా అభి లాష. విఠల్‌కి చదువుకోవాలన్న కోరిక ఉంది శ్రమపడతాడు''

"ఓ పంతులూ... వీళ్ళని నెత్తిన ఎక్కించ కండి. మొదటినుండి ఈ వ్యవస్థ ఇట్లాగే ఉంది. ఇట్లాగే ఉంటుంది''

"పాటిల్‌గారూ... ఈ వ్యవస్థ మారుతుంది. మారి తీరుతుంది. తిమ్మప్పా! విఠల్‌ని బడికి రమ్మనమని చెప్పు'' అంటూ మాస్టారుగారు వెళ్ళిపోయాడు.

★ ★ ★

తినడానికి తిండి లేక విఠల్ ఇంట్లోవాళ్ళు రోజులతరబడి పస్తులు పడుకునేవాళ్ళు. సైద వ్వ, లక్ష్మవ్వ భార్య అప్పుడప్పుడు విసురురా ళ్లకు కలబత్తాలకు కక్కు పెట్టడానికి బయలు దేరేవాళ్ళు. ఎండిన రొట్టెలు, నాలుగు పైసలు ఇంటికి తెచ్చేవాళ్ళు.

ఒకరోజు తిమ్మప్ప పొలంలో ఉన్న కొన్ని ఆకులు తెచ్చాడు. ఆకులను నూరి ముద్దచేసి అందరు పంచుకుతిన్నారు. ఇన్ని నీళ్ళు తాగా రు. ఈవిధంగా రోజులతరబడి ఆ ఆకులు తినడంవలన వాళ్ళకు విరేచనాలు పట్టుకు న్నాయి.

విఠల్ చెల్లెలు విరేచనాలవలన డీలాపడి పోయింది. మందు తేవడానికి వాళ్ళదగ్గర ఒక్క పైసా లేదు. తిమ్మప్ప శివరావుపాటిల్ దగ్గరకు వెళ్ళి మందుకు అప్పు ఇమ్మని తరు వాత ఆ అప్పు తీరుస్తానని బతిమిలాడాడు.

"వెధవల్లారా! ఆ ఆకులు ఎవరు తినమ న్నారురా... మీ చావు మీరే చావండి'' అంటూ అతడు తిమ్మప్పను వెళ్ళగొట్టాడు. తిమ్మప్ప కళ్ళవెంట నీళ్ళు ధారలుగా కారసాగాయి. ఇంటికి వచ్చేసరికి ఎదురుగుండా కూతురి శవం ఉంది.

శవాన్ని తగలబెట్టడానికి కట్టెలు కొనడానికి విఠల్ ఇంటివాళ్ళ దగ్గర డబ్బులు లేవు. ప్రేతవస్త్రం కొనడానికి కూడా వాళ్ళదగ్గర ఒక చిల్లిగవ్వ లేదు. తిమ్మప్ప మళ్ళీ పాటిల్ దగ్గరికి బయలుదేరాడు. తిమ్మప్పతో విఠల్ కూడా బయలుదేరాడు.

అక్కడ ఆ సమయంలో తమాషాబాయి నృత్యం చేస్తోంది. ఊరి పెద్దలందరూ అక్కడే కూర్చుని ఉన్నారు. ముందువరసలోని కుర్చీ లలో శివరావుపాటిల్, మాధవరావు, దత్తా త్రేయ కూర్చుని ఉన్నారు. ముగ్గురూ పకపక నవ్వుతూ నృత్యం చూసి ఆనందిస్తున్నారు.

మరాట్వాడాలో ఒక జాతివాళ్ళు గజ్జకట్టి నృత్యంచేస్తారు. ఈ జాతి ఆడవాళ్ళని 'తమా షాబాయి' అని పిలుస్తారు. వీళ్ళ నృత్యం చాలా ప్రసిద్ధి చెందింది. ఈ నృత్యాన్ని తావణీ అంటారు. ఊళ్ళోని ధనికులు ఒకచోట చేరి వీళ్ళచేత నృత్యం చేయించి కొంత డబ్బు ముట్టచెబుతారు. సామాన్యంగా ఒక బృందంలో ఐదారుగురు ఉంటారు. ఒకడు డోలు వాయిస్తూ ఉంటాడు. ఇద్దరు ముగ్గురు ఇతర వాయిద్యాలు వాయిస్తారు. సామాన్యంగా ఒక కొజ్జావాడు కూడా ఈ గ్రూపులో ఉంటాడు. ఈ తమాషాబాయిలు తమ ఒంపుసొంపులు ఒలకపోస్తూ నృత్యం చేస్తూఉంటారు. కచ్చ పోసి చీర కట్టి బిగుతైన జాకెట్టు వేస్తారు. చాలా సెక్సీగా కనిపిస్తూ, శరీరంనిండా బోలెడు ఆభర్ణాలు వేసుకుంటారు. ఈ ఆడవాళ్ళు ఈవిధంగా నృత్యం చేసి పొట్ట పోసుకోవడానికి కారణం వాళ్ళ బీదపరిస్థితే. తల్లి ఈ వృత్తి చేస్తే కూతురు కూడా ఇదే వృత్తి చేస్తుంది. ఇట్లా తరతరాలు, ఈ జాతి ఆడవాళ్ళు నృత్యంచేస్తూనే బతుకుతున్నారు. పాటిల్ లాంటి పెద్ద మనుషులు వీళ్లచేత నృత్యాలు చేయించి ఆనందిస్తారు. అవకాశం లభిస్తే వీళ్ళను లోబరుచుకుంటారు. ఈ పెద్దమనుషు లవలన ఈ ఆడవాళ్లకి పిల్లలు కలిగినా వీళ్ళ సంతానం అని సమాజంలో చెప్పుకోవడానికి వీలుండదు. ఊరివాళ్ళు ఈ తమాషా కళాకారు లను చాలా నీచంగా చూస్తూ ఉంటారు. మారు తున్న కాలంతోపాటు ఇప్పుడు వీళ్లలో కొంత మార్పు వస్తోంది. వీళ్ళు తమ పిల్లలని బడికి పంపిస్తున్నారు. ఈనాటికీ మరాఠ్‌వాడాలో ఈ తమాషాబాయిల నృత్యాలు పల్లెల్లో జరుగు తూనే ఉంటాయి. ఇది తంతరాలనుండి వస్తు న్న వృత్తి. మానేయకూడదు అని ఈ జాతివారి లోని పాతతరంవాళ్ళు అంటూనేవుంటారు. కాని కొత్తతరంవాళ్ళు ముందడుగు వేస్తున్నా రు. చదువుకుని ఉద్యోగం చేసి బతకాలను కుంటున్నారు.

తిమ్మప్ప వెళ్ళి శివరావుపాటిల్ కాళ్ళు పట్టు




కున్నాడు.

"ఒరేయ్ తిమ్మప్పా! ఏవిటిరా..." అంటూ కాళ్ళు లాక్కున్నాడు పాటిల్.

"పాటిల్‌దొరా... నా కూతురు చచ్చిపోయింది. శవం కాల్చడానికి పైసలు లేవు. మీరు కొంత..."

శివరావుపాటిల్ దృష్టంతా నృత్యంచేసే అమ్మాయిలమీదే ఉంది.

"కొంత డబ్బివ్వండి మై బాప్..."

"ఎందుకురా డబ్బు?"

"నా కూతురు చచ్చిపోయింది"

"చచ్చిపోయిందా... అసలు తిండికి గతిలేనివాళ్ళు మీరు పిల్లలని ఎందుకురా కంటారు" వినుగ్గా అన్నాడు పాటిల్. జోసీకర్, దేశ్‌ముఖ్ ఒకళ్ళ భుజాలు ఒకళ్ళు కొట్టుకుంటూ నవ్వుతున్నారు.

"మై బాప్... డబ్బు..." నసుగుతూ అన్నాడు తిమ్మప్ప.

"పోరా వెధవా..." అన్నాడు కోపంగా పాటిల్.

ఇక ఏం చేయలేక తిమ్మప్ప బయలుదేరాడు. విఠల్ పాటిల్‌వంక రౌద్రంగా చూస్తూ తండ్రివెనక నడిచాడు.

ముచ్చులందరూ గుడిసెముందు చేరారు. రామప్ప కొండప్ప తమదగ్గర ఉన్న డబ్బులు ఇచ్చారు. సైదవ్వ యాదవ్వ గుండెలు కొట్టుకుంటూ ఏడవడం మొదలుపెట్టారు. విఠల్ కంటికి మంటికి ఏకధారగా ఏడవడం మొదలుపెట్టాడు. శవాన్ని తీసుకుని బయలుదేరాడు.

"పోరీ! మమ్మల్ని వదిలి ఎందుకు వెళ్ళిపోయావు. ఈ చేతులు పడిపోనూ... నీకు ఆ ఆకులు ఎందుకు తినిపించాను. నువ్వు ఈ సంతముచ్చులో ఎందుకు పుట్టావు" అంటూ తల కొట్టుకుంటూ ఏడవసాగాడు తిమ్మప్ప.

శవానికి నిప్పంటించారు.

"దొంగతనం చేసి తెచ్చిన డబ్బుతో నిన్ను కాలుస్తున్నాను. సంతముచ్చులలో పుట్టిన ప్రతివాడి గతి ఇంతేకదా..." అంటూ తిమ్మప్ప నెత్తి నోరు కొట్టుకోసాగాడు.

"ఆ భగవంతుడు మన నుదుటిన దొంగలుగా బతకమని రాశాడు. ఆఖరికి నిన్ను పైలోకంలోకి పంపడానికి కూడా దొంగతనం చేసిన డబ్బులే..." మండుతున్న అగ్నిజ్వాలలను చూస్తూ బాధగా అన్నాడు తిమ్మప్ప.

విఠల్ మనస్సు బాధతో విలవిల్లాడింది.

★ ★ ★

ఆరోజు హనుమ కూతురు తులసీబాయి పెళ్ళి. కొండప్పకొడుకు వామనప్ప పెళ్ళికొడుకు. కవ్‌తానుండి చాలామంది ముచ్చులు ఈ పెళ్ళికి వచ్చారు. సామాన్యంగా వీళ్ళల్లో పెళ్ళి పూర్తి అయ్యేవరకు నమ్మకంలేదు. ఏదో విషయానికి పోట్లాట పెట్టుకుంటారు. పెళ్ళిళ్ళు ఆగిపోతాయి. అందరు కలిసి బాగా తాగుతారు. ఆ మత్తులో ఇష్టంవచ్చినట్లు పోట్లాడుకుంటూ వుంటారు.

పెళ్ళికూతురికి పెళ్ళికొడుకుకి తలంటిపోసే కార్యక్రమం మొదలయింది. రాగిచెంబులో కుంకుమ, పసుపు కలిపిన నీళ్ళు పోశారు. దారాన్ని ముంచారు.ముగ్గురు ముత్తయిదువలు ఆ చెంబెడు నీళ్ళని వీళ్ళిద్దరిమీద పోశారు. ఇంతలో అరుపులు వినిపించాయి. హనుమా భార్య పుతిలీబాయిని చూస్తూ - రామప్ప పెద్దగా అరుస్తున్నాడు-

"పుతిలీతల్లి ఓ మరాఠాతో లేచిపోయింది. వీళ్ళ ఇంటికి భట్టీ (మచ్చ) పట్టింది. ఈ పెళ్ళి జరగడానికివీల్లేదు"

"రామప్పా... మరి ఈ సంగతి ఇప్పుడా చెప్పేది. నా కొడుక్కి ఏ మచ్చాలేదు. తులసిని నేను కోడలుగా చేసుకోను" అంది ఎల్లవ్వ.

"వాళ్ళని శుద్ధీకరణ చేయలేదా?" అడిగాడు కొండప్ప.

"ఊహు... చేయలేదు. లేవండి ఈ పెళ్ళి జరగడానికి వీల్లేదు" పెళ్ళికొడుకువైపు వాళ్ళందరూ లేచారు.

పుతిలీ ఏడవడం మొదలుపెట్టింది.

"దాని అమ్మమ్మ ఏనాడో లేచిపోతే దీనికి మచ్చ ఎట్లా వస్తుంది" అడిగాడు తిమ్మప్ప.

"భట్టీపట్టినదాన్ని మేం చేసుకోం..." అంటూ కొండప్ప మండపం బయటికి వచ్చాడు.

హనుమ కొండప్పను బతిమిలాడడం మొ

దలుపెట్టాడు- "కొండప్పా... ఇప్పుడు ఇట్లా పెళ్ళి ఆగిపోతే దాని జీవితం ఏంకాను. ఇంకా డబ్బు కావాలన్నా ఇస్తాను"

కొండప్ప ఎల్లవ్వ ససేమిరా ఒప్పుకోలేదు.

పంచాయితీ పెట్టించాలని ముచ్చులంద రు నిర్ణయించారు.

తగ్గు (జాతి పంచాయితీ) మొదలయింది. పంచాయితీ పెద్దలను తెలగాలు అని అంటా రు. పోట్లాడుకునే రెండు పార్టీలలోని మనుషు లు తప్పించి తక్కిన ముచ్చులలో ఎవరైనా పంచాయితీ పెద్దలుగా వ్యవహరించవచ్చు. సామాన్యంగా ఐదుగురు పంచాయితీ పెద్ద లుగా ఉంటారు. వాళ్ళు జాతివాళ్ళ తగవుల ను తీర్చడానికి ఊరూ, ఊరూ వెళ్తూఉంటారు. సామాన్యంగా తెలగాలు తెల్ల ధోవతి, ఎర్రపగి డీ ధరిస్తారు.

తిమ్మప్ప రామప్ప తెలగాల వేషం వేసుకు న్నారు. పోట్లాడుకునే రెండు పార్టీలవాళ్ళు పంచాయితీ పెద్దలకు రాకపోకల ఖర్చులు ఇవ్వాలి. పంచాయితీ నడిచినన్ని రోజులు వాళ్ళకు తినిపించాలి, తాగిపించాలి. పంచా యితీ మూడు పగళ్ళు మూడు రాత్రుళ్ళు నడిచింది.

"పిల్ల తల్లి జరిమానాకింద కొంత డబ్బు కడితే సరిపోతుంది. భట్టా పోతుంది" అన్నా డు తిమ్మప్ప.

"పిల్ల తల్లి ముక్కు కోస్తే కాని ఆ మచ్చ పోదు" అన్నాడు రామప్ప.

"పిల్ల తల్లికి పెంట తినిపిస్తే కాని ఆ భట్టా పోదు" అన్నాడు పంచాయితీ పెద్దలలో ఒక డు.

"పిల్ల తల్లికి తల గొరిగించాలి" అన్నాడు మరొకడు.

చివరికి పిల్ల తల్లి తల గొరిగించాలని, జరి మానా కింద డబ్బు కట్టాలని నిర్ణయించారు.

పంచాయితీ పెద్దలకు ఇరువైపులవాళ్ళు తాగించారు. పందిమాంసాన్ని వండి తిని పించారు.

పుతిలీబాయి వచ్చి అందరి కాళ్ళకు దండంపెట్టింది.

పుతిలీకి జుట్టు గొరిగే కార్యక్రమం మొదల యింది. ఈ తంతు చూస్తున్న విఠల్ మనస్సు చివుక్కుమంది. ఒకవైపు ఎంతో నాగరికత పెరి గిన సమాజం, మరోవైపు అనాగరికులైన తమ జాతివాళ్ళు. తను పుస్తకాలలో, పేపర్లలో నాగరి కుల గురించి ఆధునిక నాగరిక సమాజం గురించి ప్రతీరోజు చదువుతూనే ఉంటాడు. తమజాతివాళ్ళు ఎంతగా వెనకబడివున్నారు. పంచాయితీ పెద్దలు ఎంత హృదయవిహీను లు అని అతడి మనస్సుకు అనిపించింది.

పుతిలీబాయి నోట్లో కొంగు పెట్టుకుని కన్నీ ళ్ళు కార్చసాగింది.

ఆమె తల గొరగడం అయ్యాక పెళ్ళి కార్యక్రమం మొదలయింది. పుతిలీ ఓ మూ లకు పోయి కూర్చుంది.

★ ★ ★

రోజులు గడుస్తున్నాయి.

యాదవ్వ జబ్బుపడి చచ్చిపోయింది. ఆమె తనజాతివాళ్ళ గురించి, తన చిన్నప్పుడు జరి గిన సంఘటనల గురించి తన మనవలకు చెబుతూ వుండేది. కథలు చెబుతూ ఉంటే పిల్లలందరూ శ్రద్ధగా వినేవారు. ముఖ్యంగా విఠల్ నాయనమ్మ చెప్పే అన్నింటినీ విని వాటి గురించి ఆలోచిస్తూ ఉండేవాడు. నాయ నమ్మ చనిపోయిందని తెలిశాక విఠల్ చాలా బాధపడ్డాడు.

హఠాత్తుగా సైదవ్వ జబ్బుపడ్డది. ఆమెకు మందు కొనడానికి ఆ ఇంటివాళ్ళ దగ్గర పైస లు లేవు. సైదవ్వ దాచిపెట్టిన రెండు ఇత్తడి పళ్ళాలను తాకట్టుపెట్టి పైసలు తెద్దామని తిమ్మప్ప, లక్ష్మప్ప కలసి షావుకారు దగ్గరికి బయలుదేరారు. వారి వెంట విఠల్ కూడా బయలుదేరాడు.

అది శివరావుపాటిల్ తోట. అక్కడ శివ రావు, ఔసేకర్, దేశ్‌ముఖ్ కూర్చుని ఉన్నారు. కబుర్లు చెప్పుకుంటూ పకపక నవ్వుకుంటున్నా రు. శివరావు కొడుకు జగన్నాథరావు దూరంగా కూర్చుని చెట్లమీద రాళ్ళు విసురుతున్నాడు. ఒక్కొక్క రాయి తగలంగానే పిట్టలు ఎగిరిపో తున్నాయి. ఈ దృశ్యం చూసి అతడు నవ్వుతు న్నాడు.

"షావుకారూ... ఈ రెండు ఇత్తడి పళ్ళాలు గిరవీ పెట్టుకుని మాకు డబ్బులిప్పించండి"





దీనంగా అడిగాడు తిమ్మప్ప.

"మా అమ్మకి జబ్బుగా ఉంది. పెద్దాసుపత్రి కి తీసుకుపోవాలి" అన్నాడు లక్ష్మప్ప.

"ఏవీ వళ్ళాలు ఇలా ఇవ్వు" అన్నాడు ఔసేకర్.

తిమ్మప్ప వళ్ళాలు ఇచ్చాడు. ఔసేకర్ వాటిని అటు ఇటు తిప్పి చూశాడు.

"ఈ వళ్ళాలు ఎక్కడినుండి దొంగతనం చేశార్రా... ముం..ల్లారా..." కోపంగా అన్నాడు శివరావు.

"దొరా... ఇవి దొంగతనం చేసినవి కావు. మా సైదవ్వ పైసపైస దాచి కొన్నది"

"అవును, మా అమ్మ పైసలు దాచి కొన్నది" అన్నాడు లక్ష్మప్ప.

"ముచ్చు ముం...ల్లారా... అది ఏ వెధవపని చేసి కొన్నదో... పొండిరా... పొండి..." ఔసేకర్ గట్టిగా అరిచాడు.

జగన్నాథరావు అల్లరిచేయడానికని విఠల్ మీద ఓ రాయి విసిరాడు. విఠల్ ఆ రాయి తీసి మళ్ళీ అతడి ముఖాన కొట్టాడు.

జగన్నాథరావు పళ్ళు పటపట కొరికాడు.

"ఒరేయ్ విఠలిగా... నీకెంత పొగరురా... రాయి మళ్ళీ విసిరేస్తావా..." అరిచాడు శివరావుపాటిల్.

"జగన్నాథం! విఠల్‌గాడు స్కూల్లో చదువు వెలగబెడుతున్నాడు. అందుకే వాడికా తలబిరుసుతనం" అన్నాడు ఔసేకర్ వెకిలిగా నవ్వుతూ.

"అయినా ముచ్చు... లం...లకి చదువులెందుకు. ఆ కులకర్ణి మాస్టారు వీళ్ల బుర్రలు పాడుచేస్తున్నాడు" అన్నాడు దేశ్‌ముఖ్ ఉమ్మే

స్తూ.

"నువ్వు నామీద రాయి విసిరేస్తావా..." అంటూ జగన్నాథరావు కుర్చీకి కట్టబడి వున్న కుక్కను వదిలేశాడు. ఛూ... ఛూ... టోనీ... ఛూ... అని అంటూ విఠల్‌వైపు చూపించాడు.

కుక్క భౌభౌమంటూ విఠల్ వెంబడి పడ్డది. విఠల్ పరుగెత్తాడు.

"దొరా... దొరా... కుక్కని పిలవండి" భయపడుతూ అన్నాడు తిమ్మప్ప. లక్ష్మప్ప శివరావు పాటిల్ కాళ్ళుపట్టుకున్నాడు.

"జగన్నాథం... టోనీని వెనక్కి పిలవరా..." అన్నాడు శివరావు. జగన్నాథం టోనీ... టోనీ... అంటూ పిలిచాడు. అది వెనక్కి వచ్చేసింది. విఠల్ గుడివైపు పరుగెత్తాడు.

తిమ్మప్ప లక్ష్మప్ప మళ్ళీ ఔసేకర్‌ని, పాటిల్‌ని బతిమిలాడడం మొదలుపెట్టారు.

"ఒక్క పైసా యివ్వను. అసలు ఈ పళ్ళేలు ఎవరివో కనుక్కోవాలి. పోలీసులకి ఇవ్వాలి"

"షావుకారూ... అవి మావి. మేం కొన్నాం... ఇచ్చేయండి"

"ఎక్కువగా వాగావంటే పోలీసులని పిలుస్తాను" పెద్దగా అరిచాడు దేశ్‌ముఖ్.

ఉన్న పళ్ళాలు కూడా పోయాయని తిమ్మప్ప బాధపడ్డాడు. అసలు వీళ్లదగ్గరికి రాకుండా ఉండాల్సిందని అనుకున్నాడు లక్ష్మప్ప.

ఆరోగ్యం పూర్తిగా పాడయి సైదవ్వ చచ్చిపోయింది. విఠల్ తల్లికోసం వెక్కివెక్కి ఏడ్చాడు.

దేశదిమ్మరులలో మూఢనమ్మకాలు ఎక్కువ. చేటకీ విద్య నేర్చుకుంటే శత్రువుల ఇళ్ళలోని పెనాలమీద ఉన్న రొట్టెలు, తిండిపదార్థాలు ఈ విద్య ప్రయోగించినవాళ్ళ ఇళ్ళకి వస్తాయని వీళ్ళలో నమ్మకం ఉంది. ఈ చేటకీ విద్య నేర్చుకోవడం చాలా కష్టం. ఈ విద్య నేర్చుకుంటే తమ ఇంటికీ రొట్టెలు వస్తాయి. ఇక ఉపవాసాలు ఉండాల్సిన అవసరం ఉండదు, కడుపునిండా తిండి దొరుకుతుందికదా, అన్న ఆశతో విఠల్ ఈ విద్యను నేర్చుకోవడం మొదలుపెట్టాడు. కాని నేర్చుకోలేకపోయాడు. తను నిష్ఠగా నేర్చుకోలేదు. అందుకే ఆ విద్య రాలేదు అనుకున్నాడు అమాయకుడైన విఠల్.

★ ★ ★

కాలచక్రం తిరుగుతోంది. విఠల్ పెద్దవాడవుతున్నకొద్దీ పరిస్థితులను మరింతగా అర్థంచేసుకోసాగాడు. ధనికవర్గం, అగ్రవర్ణాల వాళ్ళూ తమపై చేస్తున్న అత్యాచారాలని ఎదుర్కోవాలని అనుకునేవాడు. కులకర్ణి మాస్టారు దగ్గర శ్రద్ధగా విద్య నేర్చుకునేవాడు. రాత్రి ఎనిమిది గంటలనుండి గుడి అరుగుమీద కులకర్ణి మాస్టారు పురాణం చెప్పేవాడు. రామాయణ మహాభారతాలను చదివేవాడు. భజనలు చేసేవాడు.

విఠల్ దూరంగా కూర్చుని ఇవన్నీ వింటూ ఉండేవాడు. అతడికి తను కూడా కొన్ని భజనలు నేర్చుకోవాలనిపించింది. రామాయణ మహాభారతాలని చదవాలనిపించింది. తను పాథ్‌రూట్ కులంలో పుట్టాడు. తనను ఎవరూ ముట్టుకోరు. తమజాతివారి నీడనుసైతం అందరూ అసహ్యించుకుంటారు. తను నేర్చుకోగలడా... ఎవరు నేర్పిస్తారు... ఇట్లా ప్రతిరోజూ ఆలోచిస్తూంటే అతడిలో భజనలు నేర్చుకోవాలన్న కోరిక పెరిగింది. ఆరోజు కులకర్ణి మాస్టారింటికి వెళ్ళాడు.

"ఏమిటిరా విఠల్... ఇటువచ్చావేం? ఏదైనా పనిఉందా?"

విఠల్ మాస్టారుగారికి దండంపెట్టాడు.

"మరి... మరి..." నసిగాడు విఠల్.

"చెప్పు... విఠల్..."

"మాస్టారుగారూ... నాకు... నాకు భజనలు నేర్చుకోవాలని ఉంది"

"నీలో ఈ ఆలోచన కలిగినందుకు నిన్ను మెచ్చుకోవాలిరా... చాలా సంతోషం... తప్పకుండా నేర్పిస్తాను. కాని మాంసం తినడం మానేయాలి. తాగుడు గీగుడు పనికిరాదు.

"మాంసం తినను, తాగను"

"రోజూ శుభ్రంగా స్నానం చేయాలి"

"చేస్తాను"

"ఉతికిన బట్టలు వేసుకోవాలి" అంటూ మాస్టారు ఇంట్లోకి వెళ్ళి తన కొడుకు లాగూ చొక్కా తీసుకువచ్చి విఠల్‌కి ఇచ్చాడు.

విఠల్‌కి కులకర్ణి మాస్టారు దేవుడిలా కనిపించాడు.




మరునాటినుండి భజనలు నేర్చుకోవడానికి మాస్టారు దగ్గరికి వెళ్ళడం మొదలుపెట్టాడు. మాంసం తినడం మానేశాడు. తాగడం మానేశాడు. నదిదాకా వెళ్ళి రోజూ స్నానం చేసేవాడు. సబ్బు కొనడానికి డబ్బులు లేకపోవడంవలన బట్టలు బండకేసి ఉతికేవాడు. రోజూ భజనలను కంఠతా పట్టేవాడు. అతడి కోరిక నెరవేరింది. కొన్ని భజనలు నోటికి వచ్చాయి.

గుడిసెల దగ్గర విఠల్ తనకు వచ్చిన భజనలు పాడి అందరికీ వినిపించేడు. తిమ్మప్ప, రామప్ప, కొండప్ప, ఎల్లవ్వ మరి కొందరు ముచ్చులు అక్కడ చేరేవారు. తిమ్మప్ప పూర్తిగా వినేవాడు. కొంత శ్రద్ధ చూపించేవాడు.

"ఇవన్నీ మనకెందుకురా... నీవు మన కులంవాడిలా ఉండటంలేదు" అన్నాడు రామప్ప.

"ఒరి తిమ్మప్పా... వాడిని మన టోలీతో రమ్మనరా... పెద్దవాడయ్యాడు. ముచ్చులు చేయకపోతే ఎట్లా?" అన్నాడు కొండప్ప.

"మా మాస్టారు మన దేశదిమ్మరులు చదువుకుంటే బాగుపడతారని చెప్పారు. తమలాగే మనమూ బతకవచ్చని చెప్పారు" అన్నాడు విఠల్.

"మన బతుకులింతేరా..."

"రామప్పమామా! కాలం మారుతోంది. మాస్టరుగారు నన్ను బాగా చదువుకోమని చెప్పారు. నేను ఛస్తే టోలీతో రాను. దొంగతనం చెయ్యను"

"మన కులంలో నువ్వు తప్పపుట్టావురా!" కోపంగా అన్నాడు రామప్ప.

ఎంతో కష్టపడి స్కూలు చదువు పూర్తిచేశాడు విఠల్. అతడికి కొంత మనోవికాసం కలిగింది. ఆలోచించగల శక్తి పెరిగింది. తన టోలీవాళ్ళు ఊరూరు, వాడవాడ తిరుగుతున్నా, దొంగతనాలు చేస్తున్నా విఠల్ వాళ్ళ వెంట ససేమిరా వెళ్ళేవాడు కాదు.

కులకర్ణి మాస్టారు రామాయణం చెప్పడం మొదలుపెట్టారు. విఠల్ రోజూ వెళ్ళి శ్రద్ధగా విని రామాయణం కథ అంతా తెలుసుకున్నాడు. ఆరోజు కులకర్ణి రామాయణంలోని ఉత్తర కాండ గురించి చెబుతున్నాడు. అందరూ ఎంతో ఆసక్తిగా వింటున్నారు.

"ఇందులోని జ్ఞానదీపక అనే ప్రసంగానికి ఎంతో ప్రాముఖ్యత ఉంది. నిన్న మీకు కొంత కథ చెప్పాను. తరువాత కథ వినండి. భగవంతుడైన శంకరుడు చెప్పినట్లుగా గరుడుడు సత్సంగం చేయడంకోసం నీలగిరి పర్వతంపైన ఉన్న కాకభుసుండి ఆశ్రమానికి వచ్చాడు. కాకభుసుండి నిత్యం అక్కడ పవిత్రమైన రామకథను గానం చేస్తూ ఉంటాడు. ఆ రఘురాముని కథను పక్షులన్నీ ఎంతో శ్రద్ధగా వింటూ ఉంటాయి. ముసలి పక్షులు రామకథ విని తన్మయత్వం చెందుతూ ఉంటాయి.

నీలగిరి సౌందర్యాన్ని చూడంగానే గరుడపక్షిలో ఉన్న మాయ, మోహం, చింత మొదలగు మనోవికారాలన్నీ దూరం అయిపోయాయి. అక్కడ ఉన్న ఓ సరోవరంలో స్నానం చేసి వటవృక్షం దగ్గరికి వచ్చింది. వటవృక్షం కింద భుసుండి రామకథను చెబుతున్నాడు. పక్షులకు రాజు అయిన గరుడపక్షిని చూడగానే అందరూ ఎంతో సంతోషపడ్డారు.

కాకభుసుండి అతడి రాకకు కారణమేమని అడిగాడు. గరుడుడు తనకు రాముడే ఈశ్వరుడా అన్న సందేహం కలిగిందని చెప్పాడు. ఈ ఆశ్రమానికి రాగానే తనలోని మోహం నశించి పోయిందని తనకు రామకథను వినాలని ఉందని చెప్పాడు.

భుసుండి రామజన్మ నుండి రామరాజ్యాభిషేకందాకా కథ చెప్పాడు. తనకు కలిగిన అనుభవాల గురించి కూడా భుసుండి చెప్పాడు. కాకిగా తను ఎందుకు జన్మనెత్తాడో చెప్పాడు. లోమమహర్షి బ్రహ్మజ్ఞాని. భుసుండి అతడి నోటినుండి రామకథను వినాలని అనుకునేవాడు. అతడు లోమ మహర్షిని ఎన్నోసార్లు కథ చెప్పమని అడిగాడు. భుసుండి వేసే ప్రశ్నకు విసుగుచెంది కాకిగా జన్మ నెత్తమని లోమ మహర్షి శాపం పెట్టాడు. నిర్భయంగా భుసుండి ఈ శాపాన్ని స్వీకరించాడు. చివరికి భుసుండి సహనశీలతకు మెచ్చి లోమ మహర్షి అతడికి రామమంత్రాన్ని ఉపదేశించాడు. ఈ పర్వతంమీద పర్ణశాలను ఏర్పరుచుకుని ఆనాటి నుండి ఈ నాటివరకు రామకథను చెబుతూ తను జీవితాన్ని గడుపుతున్నానని చెప్పాడు. రాముడి కథను భజించడం వల్లనే

తను రాముడి భక్తుడు కాగలిగాడని భక్తిని పరిత్యజించి జ్ఞానప్రాప్తికోసం శ్రమపడడం వ్యర్థం అని కాకభుసుండి గరుడ పక్షికి చెప్పాడు. జ్ఞానం వెనక పరుగెత్తడం నావ లేకుండా మహాసాగరాన్ని దాటాలి అని కోరుకోవడం లాంటిది అని చెప్పాడు.

గరుడపక్షి జ్ఞానానికి భక్తికిమధ్య ఏం భేదం ఉందని అడిగాడు. అసలైతే రెండింటికి మధ్య ఎటువంటి భేదం లేదని మనందరికి ఈ సంసారంలోని బాధలనుండి విముక్తి కలిగించ గల శక్తి రెండింటిలోనూ ఉందని, కాని కొంద రు మహాఋషులు ఈ రెండింటిమధ్య భేదం ఉందంటారని కాకభుసుండి చెప్పాడు.

జ్ఞానం, వైరాగ్యం, విజ్ఞానం మొదలగునవన్నీ పురుషజాతికి చెందినవి. కాని భక్తి స్త్రీ జాతికి చెందినది. మాయ అనేది కూడా స్త్రీయే. స్త్రీకి స్త్రీ యెడల ఆకర్షణ ఉండదు. అందువలన భక్తిని చూడంగానే మాయ దూరంగా పారిపోతుంది. జ్ఞానం పురుషుడు కనుక మాయ వదిలిపెట్టదు. స్త్రీ పురుషుల ఆకర్షణ చాలా బలమైంది. అందువలన మహాపురుషులు భక్తినే ఆశ్రయిస్తారు. ఈ రహస్యం తెలిసినవారు కామ క్రోధ మదమోహలోభాలలో చిక్కుకోరు. వాళ్లు భక్తిలో తల్లీనులైపోతారు.

భుసుండి జీవుడు, ఈశ్వరుడు ఈ రెండింటిని గురించి చెప్పాడు. జీవుడు పరమాత్ముడి అంశం. ఆత్మ నిర్మలమైనది. అది నశించదు. అది చైతన్యవంతమైనది. ఇటువంటి ఆత్మ చిలకకోతులలాగా అసత్యమైన మాయలో చిక్కుకుపోతుంది. ఈ విధంగా చైతన్య రహితమయిన మాయ చైతన్యవంతమైన ఆత్మలకు మధ్య స్నేహమనే గట్టి ముడి పడిపోతుంది. జీవుడు ఈశ్వరుడి స్వరూపాన్ని విస్మరించి సంసారసుఖాలలో మునిగిపోతాడు. ఈ ముడి విప్పుకోడు. జీవుడికి సుఖము లభించదు. ఈ ముడి విప్పడానికి వేదాలలో శాస్త్రాలలో ఎన్నో ఉపాయాలు చెప్పారు. ఏం చేసినా ఈ ముడి గట్టిపడుతూనే ఉంటుంది. కాని విప్పుకోడు. అజ్ఞానమనే అంధకారంలో జీవుడు చిక్కుకుపోతాడు. ఈ సత్యం మనకు దృష్టి గోచరం అయితేగా? కనబడనప్పుడు దానిని విప్పడం ఎట్లా? ఈశ్వరుడి కృప ఉంటేనే ఈ ముడిని విప్పగలుగుతాం. దీనికోసం జ్ఞానదీపాన్ని వెలిగించాలి.

ఈ జ్ఞానదీపానికి ఏయే వస్తువులు కావాలి. నెయ్యి కావాలి. నెయ్యి ఎక్కడ నుండి వస్తుంది? ఆవు పాలనుండి. కాని మనకు సాధారణంగా పాలుఇచ్చే ఆవులు పనికిరావు. భగవత్ కృపను పొంది హృదయమనేటటువంటి ఇంట్లో శ్రద్ధ అనే ఆవును ఉంచాలి. జపం, తపం, వ్రతం, నియమం, కళ్యాణకారమైన ధర్మాలు, మంచి అలవాట్లు మొదలగునని ఈ ఆవుకి ఆహారంగా పెట్టాలి. ఈ గడ్డి తిన్నాక ఆస్తిక భావమనే దూడను పొందిన తరువాత ఈ ఆవు పాలు ఈయడానికి సిద్ధమవుతుంది. పాలు తీయడానికి విశ్వాసం అనే గిన్నె కావాలి. మోక్షం అనే తాడుకావాలి. పాలు పితికేటప్పుడు తాడును ఆవు వెనక కాళ్లకు కడతారు. నిర్మలమైన మనస్సును పాలుపితికే గొల్లవాడుగా మనం భావించాలి. శ్రద్ధ అనేటటువంటి ఆవునుండి ధర్మమయం అయిన పాలను పితికి నిష్కామమైన అగ్నిమీద వాటికి మరిగించాలి. క్షమ, సంతోషం అనే గాలిద్వారా వాటిని చల్లార్చి, ధైర్యం, మనోనిగ్రహం అనే పెరుగు వేసి వాటిని తోడుపెట్టాలి. ఆ పెరుగును ఆనందం అనే కుండలో పోసి తత్త్వవివేచన అనే కవ్వంతో సత్యం, మంచి మాటలనే తాడుని బిగించి చిలకాలి. పవిత్రమైన, నిర్మలమైన వైరాగ్యరూపమైన వెన్నను తీయాలి. శుభాశుభ కర్మలనే కట్టెలను పెట్టి ప్రేమ అనే అగ్నిని ప్రజ్వలింపచేసి ఆ వెన్నను కాచి బుద్ధితో దానిని చల్లబరిచి జ్ఞానం అనే నెయ్యిని తీయాలి. విజ్ఞానానికి నిలయం అయిన బుద్ధి జ్ఞానమనే ఈ నెయ్యిని మనస్సనే ప్రమిదలో పోసి, సమత అనే దీవపునమ్మెలో ఈ దీపాన్ని బిగిస్తుంది. వెన్నను కాచినప్పుడు వైరాగ్యమనే ఆ వెన్నెలో అడుగున మిగిలి ఉన్న మమత అనే మాలిన్యం అంతా మాడిపోతుంది.

జాగృత, స్వప్న సుషుప్తి అనే స్థితులు సత్వరజ తమోగుణాలు అనే వత్తిలోంచి తురీయావస్థ అనే దూదిని తీసి దానితో అందమైన వత్తిని తయారు చేయాలి. దీపాన్ని వెలిగించాలి. ఈ జ్ఞానదీపం యొక్క మహత్యం ఇంతా అంతా కాదు. ఈ జ్ఞాన దీపం వెలగగానే మదమాత్సర్యాలనే దీవపుపురుగులు దానిలో




పడి భస్మం అవుతాయి. ఆ పరమాత్మను నేనే అన్న తేజోమయమయిన కాంతివలన ఆత్మా నుభవం అనే సుఖం కలుగుతుంది. దీనివలన ఈ సంసార దుఃఖాలకు మూలమైన భ్రమ భస్మం అయిపోతుంది. దీనివలన మోహం నశిస్తుంది.

ఇటువంటి జ్ఞానప్రకాశాన్ని పొంది విజ్ఞాన మైన బుద్ధి హృదయమనే ఇంట్లో కూర్చుండి జడ చేతనాలకు మధ్యఉన్న ముడి విప్పడానికి ప్రయత్నిస్తుంది. ఏ విధంగానయినా సరే ఈ ముడి విడివడితే ఆత్మకృతార్థమవుతుంది. ఈ జ్ఞానదీపాన్ని ప్రతినిత్యం వెలిగించి ఉంచా లంటే చాలా కష్టం. విజ్ఞానమయమైన బుద్ధి ముడి విప్పడానికి ప్రయత్నిస్తోంది అని తెలి యగానే మాయ అనేకమైన ప్రలోభాలను చూ పెట్టి దానిని పదభ్రష్టురాలిని చేయాలని ప్ర యత్నిస్తుంది. జ్ఞానదీపానికి దగ్గరగా వెళ్ళి దానిని ఆర్పడానికి ప్రయత్నిస్తుంది. కాని ఒక వేళ బుద్ధి తెలివి కలది అయితే మాయ తనకు హాని కలిగిస్తోందని తెలుసుకోగలుగు తుంది. దానిని దగ్గరకి రానీయకుండా ప్రయ త్నం చేస్తుంది. విఘ్నాల గుప్పిట్లో బుద్ధి రాకపో వడం చూసి దేవతలు పరీక్షకోసం ఉత్పాతాన్ని కలిగించడానికి ప్రయత్నిస్తారు. ఈ శరీరంలో ఇంద్రియాల రూపంలో ఎన్నో కిటికీలు ఉన్నాయి. ప్రతి కిటికీలోను దేవతలు తిష్టవేసు కుని కూర్చుని ఉంటారు. సాంసారిక సుఖభోగా లనే వాయువు వీస్తోంది అని తెలియగానే ఈ దేవతలు కిటికీలు తెరిచేస్తారు. ఆ గాలికి జ్ఞానదీపం ఆరిపోతుంది. ఇంద్రియాలను తమ గుప్పిట్లో ఉంచుకున్న దేవతలకు జ్ఞానం అంటే ఇష్టం ఉండదు. వారికి సుఖభోగాల యందు ఆసక్తి ఎక్కువ. జ్ఞానదీపాన్ని వెలి గించడం కష్టం. ఈ దీపం లేకపోతే ఆత్మ అనేక రకాలయిన కష్టాలకు గురిఅవుతుంది.

సామాన్య మానవుడికి జ్ఞానదీపం వెలి గించడం చాలా కష్టమయినపని. అయినా ప్రతి మనిషి తనలో జ్ఞానదీపాన్ని వెలిగించుకో వాలి. దీనివలన హృదయంలో మాలిన్యం ఉండదు. తోటి మనిషిని మానవత్వంతో చూడ గలశక్తి మనిషిలో కలుగుతుంది. మనిషిలో ఉండే రాక్షసప్రవృత్తి నశిస్తుంది. మనిషి మని షికి దగ్గరవుతాడు. సమతాభావం వెల్లివిరు స్తుంది. అప్పుడు సమాజంలో అసమానతలు ఉండవు. ఈరోజుకి ఇక్కడ ఆపేద్దాం''

అంటూ కులకర్ణి లేచాడు. భక్తులందరు ఒక్కొక్కరే లేవడం మొదలుపెట్టారు. విఠల్‌కి, కులకర్ణి చెప్పింది పూర్తిగా అర్థంకాకపోయినా ఇంటికి వెళ్ళి ఆయన చెప్పిన వాటిగురించి ఆలోచించడం మొదలుపెట్టాడు. తనలో జ్ఞాన దీపం వెలిగించడానికి ప్రయత్నించాడు. తను భక్తి, జ్ఞానం, శ్రద్ధ ఇటువంటి శబ్దాలు గురించి ఏ మాత్రం ఆలోచనలేని జాతిలో పుట్టాడు... కాని తను అన్నీ నేర్చుకోవాలి. తన జాతివారికి మార్గం చూపెట్టాలి అని నిర్ణయించుకున్నా డు.

మరునాడు కులకర్ణి మాస్టారు చెప్పడం మొదలుపెట్టాడు. విఠల్‌ఃఅతడు చెప్పే ప్రతీ విషయాన్ని శ్రద్ధగా వింటూ కూర్చున్నాడు.

''ఇవాళ మనం ఉత్తరకాండలో వర్ణింపబ డిన మానసిక రోగాల గురించి తెలుసు కుందాం. గోస్వామి తులసీదాసు గొప్ప పండి తుడు. అన్ని శాస్త్రాలు ఆయనకి క్షుణ్ణంగా వచ్చు. ఆయన జీవితంమీద ఆయన వ్రాసిన రచనలమీద ఈనాటికీ కూడా ఎందరో పరిశోధ నలు జరుపుతున్నారు. మనస్సును గురించిన వర్ణన మన శాస్త్రాలలో దొరుకుతుంది. అట్లాగే పాశ్చాత్య పుస్తకాలలో కూడా దొరుకుతుంది. కాకపోతే కొందరు మనస్సు యొక్క స్థానం బుర్రలో ఉందన్నారు. మరికొందరు హృద యంలో ఉందన్నారు. మనస్సు ఆత్మ ఒకటే నని చాలామంది శాస్త్రజ్ఞుల అభిప్రాయం. మానసిక రోగాలు రెండు కారణాలవలన వస్తాయి. వంశ పారంపర్యంగానైనా రావచ్చు. లేకపోతే మనిషి తాను చేసిన కొన్ని పాడు పనులవలనైనా రావచ్చు. కామ, క్రోధ, మద మోహాలు ముఖ్యంగా ఈ రోగాలకు కారణం. శారీరక మానసిక రోగాలకు ముఖ్యమైన కా రణం మోహం. మానవ శరీరానికి మూలా ధారం. వాతపిత్త కఫాలు. వీటిలో ఏమాత్రం దోషం వచ్చినా మనిషి శరీరం రోగానికి గురిఅ వుతుంది. మన మనస్సు కామ క్రోధ మదమో హలోభ అహంకారాలతో నిండి ఉంటుంది.

తులసీదాసు కామాన్ని వాతంతో పోల్చాడు. కామం వలనే పిత్త కఫాలకు కదలిక కలుగు

తుంది. మనస్సులో ఉన్న క్రోధలోభాలను కామం ప్రేరేపిస్తుంది. కామం తీరనప్పుడు కోపం వస్తుంది. క్రోధాన్ని తులసీదాసు ఉష్ణంతో పోల్చాడు. క్రోధం కూడా మనిషిని దగ్ధంచేస్తుంది. కఫం లోభం ఒకటే. కఫాన్ని అణచడం చాలా కష్టం. అట్లాగే లోభాన్ని అణచడం చాలా కష్టం. కఫంవలన మనిషికి మృత్యువు వస్తుంది. మనస్సులో లోభం ప్రవేశించినప్పుడు మనిషి పూర్తిగా రోగిగా మారిపోతాడు.

కొన్ని చర్మవ్యాధులతో మమతని ఈర్ష్యని పోల్చవచ్చు. చర్మం మీద గుండ్రటి పుళ్ళు వస్తాయి. దీనివలన దురద కూడా వస్తుంది. గోకితే కాని ఈ దురద తగ్గదు. గోకినంతసేపు శరీరానికి ఎంతో ఆనందం కలుగుతుంది. కాని గోకడం మానేయగానే విపరీతమైన మంట పుడుతుంది. మమతను ఈ రోగంలో పోల్చవచ్చు. మమత అనేది ఒక మనోవికారం. బంధువుల మీది మమతలో చిక్కుకున్న జీవుడు తాత్కాలికంగా ఎంతో సంతోషపడుతూ ఉంటారు. ఈరోజు తనతో ఉంటూ తనకు ఆనందాన్ని కలిగిస్తున్న ఈ బంధువులు రేపు తనని వదిలి వేస్తారు అన్న సత్యం అతడికి తెలియదు. ఈర్ష్య అనేది కూడా ఒక మనోవికారం. చర్మంమీద చిన్నచిన్న పొక్కులు వస్తాయి. వీటివలన మంట దురద పుడతాయి. ఈర్ష్యవలనకూడా మనిషి ఎదుటివాడు బాగుపడుతున్నాడు, ఉన్నతస్థితికి వస్తున్నాడు అని తెలియగానే అతడిని చూడగానే మండిపడతాడు. అతడిలో అశాంతి ప్రవేశిస్తుంది.

క్షయవ్యాధివలన మనిషియొక్క ఊపిరితిత్తులు పాడయిపోతాయి. జ్వరం ఉంటుంది. దగ్గుతున్నప్పుడు కఫము వస్తుంది. వాసన వస్తుంది. రోగం ముదిరినప్పుడు రక్తం కూడా పడుతుంది. ఈ రోగంవలన మనిషి చిక్కిశల్యం అయిపోతాడు. ఈర్ష్యవలన కూడా మనిషి లోలోపల దహించుకుపోతాడు. ఓర్వలేనితనం అతనిలో ప్రవేశిస్తుంది. అతడిలోని మంచి గుణాలన్నీ నశిస్తాయి.

కుష్ఠు భయంకరమైన వ్యాధి. ఈ వ్యాధితో బాధపడుతున్న రోగులను ఎవరూ దరిచేరనీయరు. అతడు కనిపిస్తే చాలు పక్కకు తప్పుకుపోతారు. దుష్టత్వాన్ని ఈ వ్యాధితో పోల్చవచ్చు. కుటిల హృదయం కలవాళ్లని ఎవరూ దగ్గరకి రానీయరు. దుష్టులను ఎవరూ ఆదరించరు. వాతంవలన మనిషి నడవలేక కూర్చోలేక బాధపడతాడు. మాట కూడా పడిపోతుంది. మనిషి పూర్తిగా అశక్తుడవుతాడు. అహంకారాన్ని ఈ వ్యాధితో పోల్చవచ్చు. అహంకారి ఎవరితోనూ మాట్లాడడు. ఒంటరిగా బతుకుతూ చివరికి అశక్తుడవుతాడు.

జలోదర రోగంవలన కడుపులో నీళ్ళు నిండుతాయి. మెల్లిమెల్లిగా ఈ నీరు ఒళ్లంతా వచ్చేస్తుంది. మనిషి క్షీణించుకుపోతాడు. దీని వలన మనిషి కూర్చోలేక నిల్చోలేక నడవలేక బాధపడతాడు. తృష్ణని ఈ రోగంతో పోల్చవచ్చు. ఏ విధంగా అయితే జలోదర రోగం వలన కడుపు విపరీతంగా పెరిగిపోతుందో అదే విధంగా మనిషిలో ఏదో పొందాలన్న తృష్ణ పెరుగుతూ ఉంటుంది. దీనివలన మనస్సుకు అశాంతి ఏర్పడుతుంది.

మాత్సర్యం అవివేకాలు ఒకరకమైన జ్వరంలాంటివి. జ్వరంవలన మనిషి శరీరం వేడిపడిపోతుంది. జ్వరం తీవ్రత ఎక్కువయితే మనిషి స్పృహ కూడా తప్పిపోతాడు. నోరు చేదుపడితే అన్నం తినబుద్ధికాదు. మాత్సర్యం అవివేకంవలన మనిషికి మానసిక స్థితి సరిగా ఉండదు. ఏదో ఒక రోగం అయితే మనిషికి మృత్యువు కలుగుతుంది. కాని ఈ వ్యాధులు రకరకాలు. ఈ రోగాలు జీవుడిని పీడిస్తాయి. ఇటువంటి స్థితిలో మనిషి ఏకాగ్రతగా ధ్యానించడం అంటే కష్టతరమైన పని. ఈ వ్యాధులనుండి ముక్తి పొందడానికి నియమాలు, ధర్మాలు, మంచి అలవాట్లు, యజ్ఞజప తపాలు, దానాదులను ఔషధములుగా ఉపయోగించవచ్చు. కాని వీటివలన పూర్తిగా ఈ వ్యాధులనుండి విముక్తి పొందలేరు. మరి ఈ వ్యాధులనుండి బయటపడేది ఎట్లా? దీనికి ఉపాయం ఏమిటి? ఎందరో మహనీయులు, మహాఋుషులు వీటినుండి ముక్తిపొందలేకపోయారు. ఇహ సామాన్యమానవుల సంగతి వేరే చెప్పాలా... గోస్వామి తులసీదాసు ఈ కామ క్రోధ మద మాత్సర్యాలనుండి విముక్తి పొందడానికి రామభక్తిని ఔషధంగా ఉపయోగించమన్నాడు. గురువును డాక్టరుగా భావించి అతడి




మాటలమీద నమ్మకం ఏర్పరుచుకోవాలని చెప్పాడు. తృష్ణను దూరంగా ఉంచడమే పథ్యం అని చెప్పాడు. రాముడి భక్తి అనే సంజీవినీ మూలికను ఉపయోగించినచో ఈ వ్యాధుల నుండి బయటపడవచ్చని గోస్వామి తులసీదాసు చెప్పాడు. ఎవడి హృదయంలో అయితే వైరాగ్యంభావం సద్బుద్ధి ఈ ప్రాపంచిక సుఖాల యెడల విముఖత కలుగుతుందో అతడు ఈ వ్యాధులనుండి విముక్తి పొందాడని మంచి ఆరోగ్యవంతుడుగా తయారయ్యాడని మనం భావించవచ్చు. అందువలన కామక్రోధ లోభమోహ అహంకారాలకు మనిషి బానిస కాకూడదు. వీటినుండి రామభక్తి మాత్రమే మనకు విముక్తి కలిగిస్తుంది. మనం ఈ అజ్ఞానాంధకారంనుండి బయటపడతాం. మనిషి తన మనోవికారాలమీద కంట్రోలు ఉంచుకోవాలి. అప్పుడే అతడికి నైతిక బలం కలుగుతుంది. అతడు ముందడుగు వేయగలుతాడు. లోకకల్యాణంకోసం పాటుపడగలుగుతాడు. ఇహ ఇవాళ ఇక్కడ ఆపేద్దాం'' అంటూ కులకర్ణి లేచాడు.

మాస్టారు చెప్పిన ప్రతీ మాట, ప్రతీ శబ్దం, ప్రతీవాక్యం విఠల్ హృదయంలో చొచ్చుకుపోయాయి. అతడి బుర్రలో ఎన్నెన్నో ప్రశ్నలు తలెత్తేవి. నిజంగా రాముడు పుట్టాడా? మనిషిగా పుట్టిన అతనిలో ఇన్ని శక్తులు ఎట్లా వచ్చాయి? వారు చెప్పిన వాక్యాలు అతడిలో పదేపదే ప్రతిధ్వనించేవి. రామ్‌బనో... రావణ్‌న బనో (రాముడివిగా... కాని రావణుడిగా మాత్రం కాకు) రాముడు ప్రేమకు త్యాగానికి కరుణకు జాలికి ప్రతీక. రావణుడు మహాపండితుడు. శివభక్తుడు అయిఉండి కూడా అతడిలోని కామక్రోధ అహంకారాల మూలంగా నాశనం అయ్యాడు. ఈ మనోవికారాలను మనం ఏవిధంగానయినా సరే అదుపులో పెట్టుకోవాలి. ఏ పనిని అయినా సరే వివేకంతో చేయాలి. పరాయి స్త్రీని పొందాలి అన్న కోరికే రావణుడిని అథోగతి పాలు చేసింది. ప్రేమ, త్యాగం, క్రోధం, మోహం, అహంకారం ఈ శబ్దాలన్నీ విఠల్‌కి ఎంతో కొత్తగా అనిపించాయి. ఈ ఆలోచనలు అతనిలో నైతికబలాన్ని ఇచ్చాయి.

★ ★ ★

రచ్చబండదగ్గర ఎల్లవ్వ తలకొట్టుకుంటూ ఏడుస్తోంది. "వీడు నాశనం కాను... కూతురినే ఉంపుడుకత్తెను చేశాడు. ఎంత నీచమైన పనిచేశాడో చూశావా..." అంటూ నోటిమీద చేత్తో కొట్టుకోవడం మొదలుపెట్టింది.

అటునుండి వస్తున్న విఠల్‌కి ఆమె ఎందుకు ఏడుస్తోందో అర్థంకాలేదు.

ఎల్లవ్వ తన కూతురి జుట్టుపట్టుకుని బరబరా ఈడ్చుకుంటూ లాక్కువచ్చింది. సంతముచ్చులందరు అక్కడ చేరారు.

"సిగ్గులేని లం...నా ఇంటికి నిప్పు పెట్టావు కదుటే" అంటూ ఎల్లవ్వ కూతురి చెంప పగలకొట్టింది.

"తిమ్మప్పా...విన్నావా... కొండప్ప ఈ ముండతో కులుకుతున్నోడు" పెద్దగా అంది ఎల్లవ్వ.

"నీకు సిగ్గు శరం లేదుర్రా కొండప్పా..." రామప్ప తలపాగా దులుపుకుంటూ అన్నాడు.

"ఒరేయ్... కొండప్పా.... నీ బతుకు చెడ ఇటువంటి పనిచేత్తావుర్రా" అన్నాడు హనుమా.

"ఆ రోజు మా అమ్మ మరాఠితో లేచిపోయిందని నా బిడ్డ పెళ్ళి ఆపుచేశావు. ఇవాళ నీ మొగుడు కూతురు ఏం చేశారే ఎల్లవ్వా? పెంట తిన్నంత పనిచేశారు... ఛీ...థూ..." అంటూ పుతిలీ ఉమ్మేసింది.

ఎల్లవ్వ పుతిలీబాయి జుట్టుపట్టుకుంది. ఇద్దరు ఒకళ్ళ మీద ఒకళ్ళు దుమ్మెత్తిపోసుకోవడం మొదలుపెట్టారు. రామప్ప ఇద్దరిని విడదీశాడు.

ఈ విషయం తెలుసుకున్న పాథ్‌రూట్ లందరు ముక్కుమీద వేలువేసుకున్నారు. కొండప్ప తమ కులానికే తలవంపులు తెచ్చాడు అని అందరు బాధపడ్డారు. నెమ్మది నెమ్మదిగా ఈ విషయం పాకిపోయింది. అందరు కలిసి పంచాయితీ పెట్టించాలని నిర్ణయించారు. కాని పంచాయితిలో ఏ నిర్ణయం తీసుకోలేకపోయారు. దేశదిమ్మరుల దృష్టిలో ఈ కేసు చాలా పెద్దది. తప్పకుండా ఏదో ఒక నిర్ణయం తీసుకుని తీరాలి. పంచాయితీ పది రోజులు నడిచి కొండప్పని అతడి కూతురిని

కులంనుండి వెలివేసింది.

కూతురి మూత్రంలో కొండప్ప తన ముక్కును ముంచాలి, మూత్రంతో మీసాలు కడుక్కోవాలి అని శిక్ష వేశారు. కొంతడబ్బు జరిమానా విధించారు.

కొండప్ప కూతురు చిప్పలో మూత్రం పోసుకు వచ్చింది.

కొండప్ప మూత్రంలో ముక్కును ముంచాడు. మీసాలు కడుక్కున్నాడు. కొండప్పకి అతడి కూతురికి ఇనప బొచ్చెలో అన్నం పెట్టారు. కొబ్బరి చిప్పలో తాగడానికి నీళ్ళు పోశారు. గ్రామాల్లో పెద్ద కులాలవారు తక్కువ జాతివాళ్లని ముట్టుకోకుండా వాళ్లకి ఏది ఇచ్చినా ఏది పెట్టినా ఏ విధంగా ఎత్తిపడేస్తారో అదే విధంగా ఈ కులం నుండి వెలివేయబడ్డవాళ్ల యెడల సంతముచ్చులందరూ ప్రవర్తిస్తారు.

ఈ సందర్భంలో కులకర్ణి మాస్టారు చెప్పిన మాటలు విఠల్‌కి పదేపదే గుర్తుకురాసాగాయి. కొండప్ప కామాన్ని అదుపులో పెట్టుకోకపోవడం వలనే ఇంత అసహ్యకరమైన పని చేశాడు. నైతికంగా దిగజారాడు. పశువులా ప్రవర్తించాడు... అనుకున్నాడు విఠల్.

రోజులు గడుస్తున్నాయి. కొండప్ప తన తప్పు క్షమించమని తన కులం వారిని ఎన్నోసార్లు బతిమిలాడాడు. ఒక సంవత్సరం తరువాత మాత్రమే వాళ్ళకి శుద్ధీ కరణ చేసి తమ కులంలో కలుపుకున్నారు సంతముచ్చులు.

★ ★ ★

విఠల్ ఇంటి పరిస్థితి పూర్తిగా దిగజారింది. తిమ్మప్పకి కాలునెప్పి ఎక్కువ కావడంవలన అతడు శివరావుపాటిల్ దగ్గర పనిమానేశాడు. లక్ష్మప్ప, పాండురంగ్‌లకి దొంగతనాలు చేసే అవకాశం లేనందున ఇంట్లోనే కూర్చోవడం మొదలుపెట్టారు. విఠల్ ఆకలితో అలమటిస్తూ పనికోసం బయలుదేరాడు. తిరుగుతూ తిరుగుతూ కులకర్ణి మాస్టారింటికి వెళ్లాడు. మాస్టారు ఇంట్లో లేరు.

విఠల్ గేటుతీసి లోపలికి వెళ్లాడు. కులకర్ణి తల్లి బాగా ముసలావిడ. ఆవిడ విఠల్‌ని చూసి- "అయ్యో రామచంద్రా... మడినీళ్లు తీసుకుపోదామని వచ్చావా... బయటికి పో..." అని అరిచింది.

"రెండురోజులనుండి తిండిలేదు. ఏదైనా ఉంటే ఇంత పెట్టండి. పని ఏదైనా ఉంటే చేస్తాను" అన్నాడు విఠల్ దీనంగా.

"ఇంట్లో వ్రతం జరుగుతోంది. నిన్నటివి ఏమీ లేవు. మళ్లీరా... ఏమైనా పెడతా. ఉండరా... ఓ పావలా ఇస్తాను..." అంటూ లోపలికి వెళ్లి పైసలు, ఇంత పసుపు తీసుకువచ్చింది. విఠల్‌కి పైసలిచ్చింది. గేటులోపల కొంచెం పక్కగా బావివుంది. బావిలోంచి ఓ బిందెడు నీళ్లు తోడింది. తలమీదనుండి గుమ్మరించుకుంది. పసుపులో నీళ్లు కలిపి గేటు నుండి చల్లుకుంటూ వచ్చింది. దూరంనుండి విఠల్ ఇదంతా చూస్తున్నాడు. కొంచెం సేపయ్యాక మళ్లీ పనికోసం వేట మొదలుపెట్టాడు. రెండంతస్థుల బిల్డింగ్ దగ్గర ఆగాడు.ఆ ఇల్లు శివరావుపాటిల్‌ది. శివరావుపాటిల్ కొడుకు జగన్నాథరావు. బయట కుర్చీలో ఠీవిగా కూర్చునివున్నాడు. విఠల్ గేటుదాకా వెళ్లాడు. "సాహెబ్ రెండురోజుల నుండి తిండిలేదు. ఏదైనా పనివుంటే 'ఇవ్వండి" అని అడిగాడు.

"విఠలియా నువ్వు... మీ ముచ్చులకు పనులు ఎవడిస్తాడురా? మీ అయ్యను పొలంకి కాపలాదారుడిగా ఉంచితే ఏం చేశాడు?"

"సాహెబ్... రెండురోజులనుండి తిండిలేదు. ఏదో ఒకపని ఇవ్వండి" బతిమిలాడుతూ అన్నాడు విఠల్.

"ఇవిగో ఈ చెట్ల కటింగ్ చెయ్యాలి. బయట కాలవలు బాగుచేయాలి"

"చేస్తాను"

"లోపలికి రా..."

విఠల్ దాదాపు ఎనిమిదిగంటలు పనిచేశాడు. ఇంటికి పక్కన ఉన్న తోటలోని చెట్ల కటింగ్ చేశాడు. ఊడ్చి శుభ్రం చేశాడు.

"చూడు ఆ చెట్లకింద ఎంత చెత్త ఉందో..."

తను ఏమాత్రం చెత్తలేకుండా శుభ్రం చేశాడు. అయినా పాటిల్ ఇట్లా అంటున్నాడేమని




వినుక్కున్నాడు విఠల్.

మళ్లీ కొంతమేర ఊడ్చి శుభ్రం చేశాడు.

"నా పనికి కూలి ఇవ్వండి"

"ఇస్తాను. ఈ వరండాలోకి రా... వెధవపిల్లి ఆ చోటంతా పాడుచేసింది. కొంచెం ఎత్తేసేయి" అంటూ పాటిల్ మొహం చిట్లించుకుంటూ ముక్కుకి జేబురుమాలుని అడ్డుపెట్టుకున్నాడు. వీళ్లకు అసహ్యమనిపించినట్లు తనకు మాత్రం అసహ్యం అనిపించదా... అయినా తనకు తప్పదు అని అనుకుంటూ అదంతా ఎత్తేశాడు విఠల్.

పాటిల్ ఒక్కరూపాయి ఇచ్చాడు. ఇన్ని గంటలు పనిచేస్తే ఒక్క రూపాయా. ఆ ముసలావిడే నయం. ఏపని చేయించుకోకుండా పైసలు ఇచ్చింది. ఈ పాటిల్ తన శ్రమకుతగ్గ పైసలు ఇవ్వలేదు. ఓ మూల తన కడుపు మండుతోంది.

అయినా కూడా అన్ని గంటలు పనిచేశాడు. ఓ పాటిల్... బీదవాళ్ల శ్రమను ఇంతగా దోచడం నీకు మంచిదికాదు. అని అరుద్దామని అతనికి అనిపించింది. కాని అరవలేకపోయాడు. అతడు నిస్సహాయుడు.

ఇంటికి తిరిగి వెళ్లేటప్పుడు కులకర్ణి ఇంటి దగ్గర ఆగాడు. ముసలావిడ అరుగుమీద కూర్చుని ఉంది. విఠల్‌ని చూసి వెంటనే లేచింది. లోపలికి వెళ్లి విస్తరినిండా అన్నం, పూరీలు, కూరలు వేసి తీసుకువచ్చి కిందపెట్టింది. విఠల్‌కి పిచ్చాకలి వేస్తోంది. వాటిల్లోంచి కొంచెం ఇంట్లోవాళ్లకి తీసుకువెళ్దాం అని కూడా అనిపించలేదు.

"ఏమిరా... ఇప్పుడే తింటావా... తినాలనిపిస్తే ఇక్కడే తిను. మంచినీళ్లు తెచ్చి ఇస్తాను" అని ముసలావిడ అంది.

విఠల్ తినడం మొదలుపెట్టాడు. ముసలావిడ చెంబునిండా నీళ్లు తెచ్చింది. విస్తరిని చెత్తకుండీలో పడేసివచ్చాడు విఠల్. దోసిలి పట్టాడు. ఆవిడ దూరంగా నిల్చుని నీళ్లు పోసింది. "ఓహ్... ఈవిడ ఎంత మంచిది. తనచేత ఏపని చేయించుకోకుండానే కడుపునిండా అన్నం పెట్టింది..." అని మనస్సులో అనుకున్నాడు విఠల్.

గుడిసెకి వెళ్లాడు. గుడిసెంతో కంపు కొడుతోంది. తిమ్మప్ప ఓ మూల జ్వరంతో పడివున్నాడు. లక్ష్మప్ప, పాండురంగ్‌లు స్నానంచేసి ఎన్నాళ్లయిందో వాళ్ల దగ్గర గబ్బుకంపు కొడుతోంది. పొగాకు, సున్నం అరచేతిమీద కలిపి ఇద్దరు తింటున్నారు. పక్కనే ఉమ్మేస్తూ మాట్లాడుకుంటున్నారు. విఠల్‌కి అక్కడి వాతావరణం చూడగానే అసహ్యం అనిపించింది. తన బట్టలవంక చూసుకున్నాడు. బాగా మాసిపోయి వున్నాయి. తను నది దగ్గరికి వెళ్లి స్నానం చేస్తాడు. కాని మార్చుకుందామంటే ఓ రెండు జతల బట్టలు లేవు. తెల్లగా ఉతకాలంటే తన దగ్గర సబ్బుకి డబ్బులు ఉండవు. తన కులంవాళ్లు వారంరోజులకొకసారి స్నానం చేస్తే గొప్ప. ప్రతీరోజు స్నానం చేయడం తమ జాతివాళ్లకి ఇష్టం ఉండదు. స్నానం చేయడం, బట్టలు ఉతుక్కోవడం పైకులాలవాళ్లకి కాని మనకెందుకు అని అంటారు. తమ జాతివాళ్లు ముఖాలు కడుక్కుండానే ప్రొద్దున్నే లేవంగానే తిండి తింటారు. అందుకేనేమో పైకులాలవాళ్లు తమ జాతివాళ్లని చూసి అసహ్యించుకుంటారు. ఆరోజు అతడికి ఒక సత్యం తెలిసింది. ముసలావిడలాంటి బ్రాహ్మణులు తమని దగ్గరకు రానీయరు. ముట్టుకోరు అంటుకోరు. కాని వాళ్లకి తమయెడల ప్రేమ, దయ, మానవత్వం ఉన్నాయి. తనకు ఆకలి వేస్తోందంటే అన్నం పెట్టింది. నీళ్లిచ్చింది. కడుపు నింపింది. పాటిల్‌లాంటి ధనికవర్గం తమ శ్రమని దోస్తారు. శ్రమకితగ్గ పైసలు ఇవ్వరు. తమని కొడతారు. తిడతారు. కులకర్ణి మాస్టారు తమ జాతివాళ్లకి మనోవికాసం కలిగించాలని శుచిశుభ్రతలు నేర్పించాలని ఎన్నో ప్రయత్నాలు చేస్తారు. కాని ధనికవర్గం దళితులను ఎప్పుడూ అణచాలనే చూస్తుంది. అంటే ఒకవర్గం తమని కేవలం అంటరానివారుగానే చూస్తుంది. కాని మరో వర్గం తమని అంటరానివారిగా చూస్తూ తమ శ్రమని దోచుకుంటుంది. ఆ వర్గంలో చేరాలంటే శుచిశుభ్రతలు సత్ప్రవర్తన దళితులు నేర్చుకోవాలి. ధనికవర్గంలో చేరాలంటే తమ శ్రమకి తగ్గ కూలీ తాము పొందాలి... వాళ్లని ఎదిరించాలి. తమ హక్కులకోసం దళితులు

పోరాడాలి...

★ ★ ★

టోలీవాళ్లు సంతలకి, జాతర్లకి వెళ్లేటప్పుడు విఠల్‌ని రమ్మనమని బలవంతం చేసేవారు. పెద్దవాడు అవుతున్నకొద్దీ ఏదో ఒకపనిచేసి కడుపు నింపుకోవాలి అన్న పట్టుదల విఠల్‌లో పెరిగింది. నూత్‌గిర్నీ గురించి విన్నాడు. ఎట్లాగయినాసరే అక్కడ చిన్న ఉద్యోగం సంపాదించాలి అని అనుకున్నాడు. ఆ గిర్నీ యజమాని శివరావుపాటిల్ అని తెలియగానే నిరుత్సాహపడ్డాడు. శివరావుపాటిల్ కొడుకు జగన్నాథరావు అక్కడ మేనేజర్ అయినా ఏదోవిధంగా ఉద్యోగం సంపాదించాలన్న పట్టుదలతో మేనేజర్‌ని కలిశాడు.

"పాటిల్ సాహెబ్... నాకు మీ నూత్‌గిర్నీలో ఏదో ఓ పని ఇప్పించండి" అని వినయంగా అడిగాడు.

"విఠలియా... మీ జాతివాళ్లు దొంగతనాలు చేసి బతుకుతారు. నువ్వు పని... పని... అంటూ తిరుగుతావు. గిర్నీలో బోలెడు సామానులు ఉంటాయి. నువ్వు కళ్లుగప్పి ఎత్తుకుపోతే..."

"నేను దొంగతనం చెయ్యను మై బాప్... నాకు ముందు పని నేర్పించండి. నేను బాగా పనిచేస్తేనే డబ్బు ఇవ్వండి"

బతిమిలాడగా బతిమిలాడగా జగన్నాథరావు విఠల్‌ని పనిలో తీసుకోవడానికి ఒప్పుకున్నాడు. మూడునెలలదాకా జీతం భత్యం ఇవ్వకుండా గిర్నీలో విఠల్‌చేత పనిచేయించుకున్నారు.

ఆరోజు విఠల్ తనకు జీతం ఇప్పించమని అడిగాడు.

"నీకు దారం సరిగ్గా పెట్టడం రావడంలేదు. ముందు అది నేర్చుకో అప్పుడు జీతం ఇస్తాం" అని మేనేజర్ అన్నాడు.

రెండు మూడురోజులు అతడికి దారం పెట్టడం వస్తోందా లేదా అని పై ఆఫీసర్లు ట్రైయల్ తీసుకున్నారు. విఠల్‌కి దారం పెట్టడం వచ్చింది.

మొదటి జీతం తీసుకున్నరోజున అతడి ఆనందానికి అంతులేదు. తనూ ఓ ఉద్యోగస్తుడయ్యాడు. ఈ జన్మకిది చాలు. పాథ్‌రూట్‌లలో పుట్టిన తను దొంగ కాకుండా పలెడీ పట్టుకుని ఊరుఊరు వాడవాడ అడుక్కోవడానికి బయలుదేరకుండా ఒకచోట పనిచేసే సామర్థ్యం కల పనిమంతుడయ్యాడు. అంతే చాలు... తుల్‌జాపూర్ తల్లీ... నీకు కోటిదండాలు తల్లీ అని మనస్సులో అనుకున్నాడు. కులకర్ణి మాస్టారు దగ్గరికి వెళ్లి తనకు ఉద్యోగం వచ్చింది. జీతం కూడా తీసుకున్నాను అని ఆయనకు చెప్పాడు. మాస్టారు చాలా సంతోషపడ్డాడు.

"ఒరేయ్ విఠల్... నీవు ఇంకా అభివృద్ధి చెందాలని ఆశీర్వదిస్తున్నానురా... నువ్వు మంచి మంచి పుస్తకాలు చదువు. ఇంకా జ్ఞానం తెచ్చుకో. జ్ఞానమే మనలని రక్షిస్తుంది" అని ఆయన విఠల్‌తో అన్నాడు.

రోజులు గడుస్తున్నాయి. ఫ్యాక్టరీలో విఠల్‌కి పనిపెరిగింది. కాని పనికి తగ్గట్టు జీతం పెరగలేదు. రోజూ ఫ్యాక్టరీకి అతడు నడిచివెళ్లేవాడు. ఏదోవిధంగా పైసలు కూడబెట్టి సైకిల్ తీసుకోవాలని అనుకున్నాడు. అప్పుడప్పుడు అద్దె సైకిల్ తీసుకునేవాడు. సైకిల్ నేర్చుకోవడం మొదలుపెట్టాడు. ఎన్నోసార్లు కిందపడ్డాడు. గాయాలు తగిలాయి. మోకాళ్లు డొక్కుపోయాయి. ఒకసారి... రెండోసారి... మూడోసారి... నాలుగోసారి... చివరికి అతడి ప్రయత్నం ఫలించింది. సైకిల్ తొక్కడం అతడికి బాగా వచ్చింది. సైకిల్‌మీద స్పీడ్‌గా వెళ్లేవాడు. అతడి మనస్సు ఎక్కడో తేలిపోయేది. సైకిల్‌మీద స్పీడ్‌గా... దూరదూరాలకు వెళ్లిపోవాలని అతని మనస్సు పదేపదే అనుకునేది.

అతడు ఉద్యోగస్థుడు అయినప్పటినుండి అందరూ అతడిని విఠల్‌గాయక్‌వాడ్ అని పిలవడం మొదలుపెట్టారు. అతడికి ఎంతోమంది స్నేహితులయ్యారు. ఒకసారి విఠల్‌ని అతని స్నేహితుడు భోజనానికి ఇంటికి పిలిచాడు. ఆ స్నేహితుడి ఇంటివాళ్లు పాతకాలంవాళ్లు అయినా మారుతున్నకాలంతో పాటు వాళ్లల్లో కొంత మార్పు వచ్చింది.

అందరు పంక్తిలో కూర్చున్నారు. విఠల్‌ని వచ్చి కూర్చోమన్నారు. అతడు చాలా సంకోచపడ్డాడు. తమ కులంవాళ్లను అందరు దొంగలుగా చూస్తారు. అంటరానివారుగా చూస్తారు.





అట్లాంటి తను వీళ్లల్లో కూర్చోవడం. అతడికి భూమి తలకిందులయిందా అని అనిపించింది.

"రా... విఠల్ గాయక్వాడ్... భోజనానికి కూర్చో" అని విఠల్ స్నేహితుడు అన్నాడు.

విఠల్ వెళ్లి కూర్చున్నాడు. ఎదురుగుండా స్టీలుపళ్లెం. పళ్లెంనిండా రకరకాల పదార్థాలు. ఘుమఘుమ వాసనలు వస్తున్నాయి. జీవితంలో మొదటిసారి తను స్టీలుపళ్లెంలో తింటున్నాడు. కళ్ల ఎదురుగుండా గుడిసెలు, సత్తుపళ్లాలు కదలాడ సాగాయి. పళ్లెంలో స్టీలు వాటీలు ఆ గిన్నెలనిండా రకరకాల పదార్థాలు. ఇన్ని స్టీలుగిన్నెలని తను ఎప్పుడైనా చూశాడా...

అందరూ తినడం మొదలుపెట్టారు.

విఠల్‌కి తినాలంటే ఎంతో సిగ్గుగా అనిపించింది. అలవాటు ప్రకారం రెండు చేతులతో రొట్టెను తుంచాడు. ఎడంచేత్తో పళ్లెం పైకెత్తి రొట్టెను గిన్నెలలోని కూరలో నంజుకుంటూ తినసాగాడు. రొట్టెముక్కలు కిందామీదా పడసాగాయి. మూతిమీదనుండి పప్పు చారలుగా కారసాగింది. అంట్ల చేత్తోనే తన చొక్కాతో మూతి తుడుచుకున్నాడు. గ్లాసును నోటికి కరచుకుని నీళ్లు తాగాలంటే అతడికి భయం వేసింది. ఇంతకుముందు ఎవరినైనా దాహం వేస్తోంది నీళ్లు కావాలి అని అడిగితే నీళ్లు తన దోసిట్లో పోసేవాళ్లు. తను తాగేవాడు. కొందరి ఇళ్లల్లో పాత కప్పులలో నీళ్లు పోసేవారు. తాగి దాన్ని కడిగి ఓ మూల పెట్టేవాడు. కాని ఇప్పుడు... అసలు తను ఈ లోకంలోనే ఉన్నాడా అని అతనికి అనిపించింది. విఠల్ భోజనం చేయడం పూర్తయింది. పళ్లెం పట్టుకుని లేచాడు. బూడిదతో దాన్ని తోమి కడిగి ఈయాలని అనుకున్నాడు. ఇంత ఆప్యాయంగా భోజనం పెట్టినందుకు తను వీళ్లకు ఎంతసేవ అయినా చేయవచ్చు. ఇంతలో విఠల్ స్నేహితుడు 'గాయక్వాడ్... ఆ కంచం అక్కడ పెట్టేసేయి" అని అన్నాడు. విఠల్ కంచం కింద పెట్టకుండా అట్లాగే నిల్చుకున్నాడు. అతడి స్నేహితుడు కంచాన్ని కింద పెట్టమని మరీ చెప్పాడు. అతడి మాటను తోసేస్తే బాగుండదు అని అనుకుని విఠల్ కంచాన్ని కిందపెట్టాడు. కాళ్లు చేతులు కడుక్కున్నాడు. స్నేహితుడు విఠల్‌ని సాగనంపటానికి బయటిదాకా వచ్చాడు.

"విఠల్... భోజనం చేసేటప్పుడు ఎడమచేతితో ఏదీ ముట్టుకోకూడదు. రొట్టెను కుడిచేత్తోనే తుంచాలి. తినేముందు కంచం చుట్టూ నీళ్లు చల్లాలి. అందరు తినేవరకు మనం కూర్చోవాలి. మధ్యలో లేచిపోకూడదు. పళ్లెం ఎత్తి తినకూడదు. పళ్లెం కిందే పెట్టాలి. బట్టలమీద పడకుండా శుభ్రంగా తినాలి. ఎంగిలిచేత్తో ఏదీ ముట్టుకోగూడదు. మన ఎంగిలిని ఇంకొకళ్ల కంచంలో వేయకూడదు. ఎక్కడంటే అక్కడ ఉమ్మేయకూడదు. నువ్వు కొంత నాగరికత నేర్చుకోవాలి" అని అంటూ అతడు విఠల్‌కి సభ్యసమాజంలో ఎట్లా నడుచుకోవాలో చెప్పాడు.

"ఫాథ్‌రూట్ కులంలో పుట్టిన నాకు ఇవన్నీ ఎట్లా తెలుస్తాయి. నీలాంటి వాళ్లు నేర్పిస్తే తప్పకుండా నేను నేర్చుకుంటాను" అని అన్నాడు విఠల్.

విఠల్ సూత్‌గిర్నీ పనికి పూర్తిగా అలవాటు పడ్డాడు. కాని ఇంతలోనే అతడి ఆరోగ్యం పాడయి మంచం ఎక్కాడు. ఫలితంగా ఉద్యోగం పోయింది. పరిస్థితి మళ్లీ మొదటికి వచ్చింది.



వర్షాలు లేకపోవడంవలన ఊళ్లో తాగడానికి నీళ్లు కూడా దొరకని పరిస్థితి ఏర్పడ్డది. దేశదిమ్మరులు నివసించే ప్రదేశంలో ఒక చిన్న చెరువు వుంది. వాళ్లు ఆ చెరువు నీటినే అన్ని పనులకు వాడుకుంటూ వుంటారు. వర్షాలు

లేకపోవడంవలన అది పూర్తిగా ఎండిపోయింది. గుడిసెలకి చాలా దూరంలో ఉన్న నదిలోను నీళ్లు లేవు. ఫలితంగా దేశదిమ్మరుల బస్తీలో ప్రతీ గుడిసె ఒక శోకదేవతలా ఉంది. పిల్లలు పెద్దలు నీళ్లులేక అలమటిస్తున్నారు. ఊళ్లో ధనవంతుల ఇళ్లలోని బావులలో కొంత నీరు ఉంది. వాళ్లందరికి ఇంటికో బావి ఉంది. దేశదిమ్మరులు అస్పృశ్యులు అన్న ఉద్దేశంతో వాళ్లు వీరిని తమ బావుల్లో నీరు తోడుకోనీయరు.

హనుమా జబ్బు పడ్డాడు. పుతిలీబాయి ఒడిలో మూడునెలల పిల్లవాడున్నాడు. మంచంమీద ఆమె భర్త హనుమా దాహం... దాహం అంటూ అలమటిస్తున్నాడు. పదేళ్ల కొడుకు అమ్మా... నీళ్లు... నీళ్లు అంటూ అరుస్తున్నాడు. ఆ ఇంటిల్లిపాదీ చిక్కిశల్యం అయిపోయారు. అయిదురోజులనుండి ఓ దోసిలి నీళ్లయినా వాళ్లు తృప్తిగా తాగిఎరుగరు. పుతిలీబాయికి నాలుకపిడచ కట్టుకుపోతోంది. పిల్లవాడిని కింద పడుకోపెట్టింది. అక్కడ చినిగిన చింకి పాతబట్ట ఒకటి వేల్లాడుతోంది. దానికి అవతలివైపు వెళ్లింది పుతిలీ.

పుతిలీ చిన్న గిన్నెను తీసుకుని చనుబాలని పిండసాగింది. చిక్కిశల్యం అయిపోయిన ఆమెలో బలం ఉంటేగా పాలు రావడానికి. కాసిని వచ్చాయి. వాటితో తన నోరు తడుపుకుందాం అని ఆమెకు అనిపించింది. కాని భర్త కొడుకులు గుర్తుకు వచ్చారు. వెంటనే వాళ్ల దగ్గరికి వచ్చింది. రెండు మూడు బొట్లు భర్త నోట్లో పోసింది. మరో రెండు మూడు బొట్లు పిల్లల నోట్లో పోసింది. వాళ్లు చప్పరించారు. నోరు కొంత తడి అయింది కాని దాహం ఎట్లా తీరుతుంది. మళ్లీ వాళ్లు దాహం దాహం అని అనడం మొదలుపెట్టారు. పుతిలీబాయి కొన్ని గంటలు అట్లానే కూర్చుంది. అర్ధరాత్రి అయింది. ఎట్లాగయినాసరే ఎవరి బావిలోంచయినా నరే ఓ కడివెడు· నీళ్లు తేవాలి. తెచ్చి భర్తకి పిల్లవాడికి తాగించి తాను తాగాలి.

· పుతిలీబాయి లేచింది. ఇనవకడవ. గూట్లో ఉన్న అగ్గిపెట్టె తీసుకుంది. అడుగులో అడుగులు వేస్తూ ఎవరు చూడకుండా బయటపడింది. దారి చీకటి గుయ్యారంగా ఉంది. పుతిలీబాయి గుండె దడదడ కొట్టుకుంటోంది. ఆమె ఒక్కొక్క అడుగువేస్తూ ముందుకు నడుస్తోంది. నాలుగురోజుల నుండి తిండి, నీళ్లు లేనందున ఆమె చాలా నీరసించిపోయింది. అడుగులు వేసేటప్పుడు రెండుమూడుసార్లు తూలి పడబోయింది. తనను తాను సంభాళించుకుని మళ్లీ అడుగులు ముందుకు వేసింది. చుట్టుపక్కల ఎక్కడో ఒక కుక్క భౌభౌమని అరిచింది. పుతిలీబాయి భయపడిపోయింది. ఆమె గుండె వేగంగా కొట్టుకోసాగింది. గేటు దగ్గరికి వచ్చి అగ్గిపుల్ల వెలిగించింది. గబగబా గేటు తెరిచింది. అది శివరావుపాటిల్ ఇల్లు. ఒక్కక్షణం గేటుపక్కన ఉన్న చెట్టు దగ్గర ఆమె నిల్చుంది. ఏ శబ్దం వినబడనందున గబగబా ముందుకు నడిచింది. ఇంతలో కడవ జారి కిందపడింది. ధన్‌మని శబ్దం అయింది. ఆమెకు పైప్రాణాలు పైనే పోయాయి. వెంటనే కడవని చేతిలోకి తీసుకుంది. బావిదాకా వెళ్లింది. చేతులతో తడిమి తాడు ఎక్కడుందో చూసింది. తాడు దొరకగానే కడవకుకట్టి నెమ్మదిగా బావిలో దింపబోయింది. కడవ బావిగోడకు తగిలింది. శబ్దం అయింది. ఎక్కడో కుక్క మొరిగింది. అంతే... ఒకదాని తరువాత ఒకటి కుక్కలు అరవడం మొదలుపెట్టాయి. పుతిలీబాయి భయపడిపోయింది. తననూ కనక ఆ ఇంటివాళ్లు చూశారంటే చంపేస్తారు. ఒక అస్పృశ్యురాలు వాళ్ల బావిని ముట్టుకోవడమా... ఇంకేమైనా వుందా... వాళ్ళు చిందులు తొక్కుతారు. వాళ్లకి ఈ సంగతి తెలిస్తే తనని బతకనివ్వరు. నీళ్లు తీసుకుని వెళ్లకపోతే తన భర్త పిల్లలు బతకరు. అప్పుడు తన బతుకు ఏం కావాలి? వాళ్లు లేకుండా తను బతికి మాత్రం ఏంచేస్తుంది. ఎవరు? ఎవరు? అన్న కేకలు ఆమె చెవిన పడ్డాయి. ఆమెకు కళ్లు తిరిగినట్లుగా అనిపించింది. అమ్మో... వాళ్లు... వాళ్లు వచ్చేస్తున్నారు. తనని పట్టుకుంటారు... తనని కొడతారు... తిడతారు... తనని అవమానపరుస్తారు. ఆమె వెంటనే బావిలో దూకింది. శివరావుపాటిల్ కుక్క బావిచుట్టూ తిరుగుతూ మొరగసాగింది. చుట్టుపక్కల కుక్కలు కూడా అరవసాగాయి. శివరావుపాటిల్ బయటికి వచ్చాడు. ఎవరు? ఎవరు? అని అరిచాడు.





పాటిల్ ఇంటివాళ్లందరు అక్కడికి చేరారు.

బావిలో ఎవరో పడ్డారు అని అందరు అనుకున్నారు. కాని ఎవరు? ఎవరు పడ్డారు? ఎందుకు పడ్డారు? అర్ధరాత్రి పడాల్సిన అవసరం ఏం వచ్చింది? తర్జనభర్జనలు జరిగాయి.

అక్కడ హనుమా నీరసంగా కళ్లు తెరిచాడు. పిల్లవాడు గుక్కపెట్టి ఏడుస్తున్నాడు. "అమ్మా... అమ్మా... దాహం వేస్తోంది" అని అంటున్నాడు పెద్ద పిల్లవాడు.

హనుమా పిల్లవాడిని చేతిలోకి తీసుకున్నాడు.

"ఓ పుతిలీ... పుతిలీ... ఎక్కడికెళ్లావు...?" అంటూ అరిచాడు హనుమా.

అతడి ప్రశ్నకు జవాబు వినిపించలేదు.

"ఓ పోరడా అమ్మ ఎక్కడుందో చూడు" అని పిల్లవాడికి చెప్పాడు.

పిల్లవాడు నీరసంగా లేచాడు. గుడిసె మధ్యలో కట్టబడ్డ బట్టపీలికల వెనక చూసివచ్చాడు.

"విఠల్ ఇంట్లో ఉందేమో... చూసిరా..." అన్నాడు హనుమా. పిల్లవాడు విఠల్ గుడిసెకి వచ్చాడు. అక్కడ పుతిలీబాయి లేదు విఠల్‌తో కలిసి నాలుగు గుడిసెలు గాలించాడు. ఆమె ఎక్కడా కనిపించలేదు.

ఈలోగా శివరావుపాటిల్ తన మనుమల చేత బావిలోంచి శవాన్ని పైకి తీయించాడు. వాళ్లు ఆమెను గుర్తుపట్టారు. పాటిల్ మనిషి దేశదిమ్మరుల గుడిసెలకి వచ్చి తిమ్మప్పకి ఈ విషయం చెప్పాడు. దేశదిమ్మరుల బస్తీ అంతా ఈ వార్త పాకిపోయింది.

హనుమా బావురుమని ఏడ్చాడు. "ఓ పుతిలీ! మమ్మల్ని వదిలి ఎందుకుపోయావే... మమ్మల్ని ఏంచేసిపోయావే... ఓ పుతిలీ..." అంటూ నెత్తినోరు కొట్టుకోసాగాడు.

పిల్లవాడు కెవ్వుమని ఏడవడం మొదలుపెట్టాడు. ఈ దృశ్యం చూస్తున్న విఠల్ కళ్లల్లోంచి నీళ్లు జలజలా రాలాయి.

"పిల్లవాడి నోట్లో ఓ చుక్క నీళ్లుపోయి" అన్నాడు తిమ్మప్ప.

హనుమా కడవకోసం వెతికాడు. కడవ ఎక్కడా కనిపించలేదు. అతడికి సంగతి తెలిసిపోయింది.

"పుతిలీ అర్ధరాత్రి అక్కడికి ఎందుకు వెళ్లిందో అర్ధం అవుతోంది. నీళ్లకు వెళ్లింది"

హనుమా గుండెలు బాదుకుంటూ ఏడవడం మొదలుపెట్టాడు.

"ఇట్లా ఏడుస్తూ కూర్చుంటే ఎట్లా... పద శవాన్ని తెద్దాం" అన్నాడు రామప్ప.

ఎల్లవ్వ పిల్లాడిని చంకనేసుకుంది. దేశదిమ్మరులందరు బయలుదేరారు.

ఊరిలోని పెద్దలందరు అక్కడ మంచాలు వేసుకుని కూర్చుని ఉన్నారు. వాళ్ళల్లో అన్ని కులాలవాళ్ళు ఉన్నారు. వాళ్ళకు కొంతదూరంలో పుతిలీబాయి శవం ఉంది. దేశదిమ్మరులందరు అక్కడ చేరారు.

"చావడానికి దీనికి మా బావే దొరికిందా! ఆ చచ్చేదేదో మరెక్కడైనా చచ్చిఉంటే బాగుండేదిగా..." కోపంగా అన్నాడు శివరావుపాటిల్.

"దాని నుదుటిన ఇట్లా రాసిపెట్టి ఉంది. మీ బావిలోనే దాని చావు రాసిపెట్టి ఉంది. ఖర్మను అనుభవించక తప్పుదుకదా..." అన్నాడు దేశ్‌ముఖ్.

"మీ ఖర్మసిద్ధాంతం మాకు అర్ధంకాదు. ఈ బావినీళ్ళు ఇహమీదట మనకి పనికివస్తాయా. వీళ్ళు అస్పృశ్యులు... అది బావిలో చచ్చింది" విసుగ్గా అన్నాడు శివరావు.

"అస్పృశ్యులు ముట్టుకున్న బావి దరిదాపులకి కూడా మనం వెళ్లకూడదు" లెంపలు వేసుకుంటూ అన్నాడు దేశ్‌ముఖ్.

"మరయితే ఏంచేద్దాం..." అన్నాడు శివరావు.

"బావికి శుద్ధీకరణ చేయిద్దాం... ఏమండి దేశ్‌ముఖ్‌గారూ..." అన్నాడు ఔసేకర్.

"శుద్ధీకరణ చేయించవచ్చు. కాని చాలా ఖర్చుపెట్టాల్సి ఉంటుంది. పూజలు చేయించాల్సి ఉంటుంది" అన్నాడు దేశ్‌ముఖ్.

ఇంతలో వాళ్ళందరికి పెద్దగా ఏడుపులు, అరుపులు వినిపించాయి. పుతిలీబాయి శవంమీద పడి హనుమా గుండెలు కొట్టుకుంటూ ఏడుస్తున్నాడు.

తక్కిన దేశదిమ్మరులు ఆమె మంచితనా

న్ని వర్ణిస్తూ ఏడుస్తున్నారు.

"ఏమిటిరా... అంత పెద్దగా కేకలు వేస్తు న్నావు. నిన్న నీ పెళ్ళానికి నీకు కొట్లాట అయిందా... బాగా తాగివచ్చి దాన్ని తన్నావా ఏమిటి? అది నీ బాధలు భరించలేక మా బావిలో పడి ఆత్మహత్యా చేసుకుంది. ఇంత ఎండ్రిన్ తాగి చస్తే సరిపోయేదిగా... నా నెత్తి మీద ఇదంతా తెచ్చిపెట్టింది. అసలు వీడిని తన్నాలిరా... తన్నండిరా... వీడిని" అన్నాడు శివరావుపాటిల్.

పాటిల్ మనుమలు వచ్చి హనుమాని తన్నారు. హనుమాని విడిపించాలి అన్న ఉద్దే శ్యంతో విఠల్ మధ్యలోకి వెళ్తే అతడికీ దెబ్బలు తగిలాయి.

"అసలు ఎందుకిట్లా జరిగిందో తెలుసా... మీరు జాతరకు పట్టీ కట్టం అని మమ్మల్ని ఎదిరించినందుకు. ఆ దేవుడికి మీమీద కోపం వచ్చింది. అందుకే మీరు నీళ్ళు తాగే చెరువు ఎండిపోయింది. ఇది బలయిపోయింది.

"పాటిల్‌సాహెబ్... పట్టీ కట్టం అని అనలే దే. తక్కువ పైసలు కడతాం అన్నాం" అన్నా డు కొండప్ప.

"పాటిల్ దొర చెప్పింది నిజమే... అందుకే మన చెరువు ఎండిపోయింది. తాగేందుకు గుక్కెడు నీళ్ళు లేకుండా పోయాయ్. ఆ దేవుడికి, యల్లమ్మ దేవికి మన పైన చాలా కోపం వచ్చింది. మమ్మల్ని క్షమించు దొరా..." అన్నాడు రామప్ప తల వంచుకుంటూ.

"పాటిల్ సాహెబ్ మావాళ్ళు అమాయకు లు. మీరు ఏది చెబితే అదే నమ్ముతారు. మామా... పట్టీ కట్టనందువలన ఇదంతా జరగ లేదు. వర్షాలు పడలేదు గనుకే మన చెరువు నిండలేదు. నీళ్లకోసం పుతిలీఅత్త బావి దగ్గరికి వచ్చింది. పట్టుబడితే వీళ్ళు ఘోరంగా హింసిస్తారని భయపడి బావిలో దూకి చచ్చిపో యింది" అన్నాడు విఠల్ ఆవేశంగా.

"విఠల్... మమ్మల్ని అనేంతటివాడివయ్యా వన్నమాట. జాగ్రత్త, నోరు దగ్గర పెట్టుకో..." కోపంగా అన్నాడు శివరావు.

"విఠలియా... నువ్వు మాట్లాడకు. ఎంతైనా వీళ్ళు మనకన్నా పెద్దకులంవాళ్ళు. డబ్బు దస్కం ఉన్నవాళ్ళు" అన్నాడు రామప్ప.

"ఆ... శుద్ధీకరణ ఎట్లా చేయించాలో చె ప్పండి దేశ్‌ముఖ్‌గారూ..."

"ముందు బావిలోని నీళ్ళన్నీ తోడించి పార పోయాలి"

"అసలే నీళ్ళు లేక చస్తుంటే నీళ్లన్నీ తోడేయమంటారేవిటండీ దేశ్‌ముఖ్‌గారూ..." అన్నాడు జోసేకర్.

"కొంత పారపోశాక నీళ్ళు శుద్ధి అవుతాయి. అందులో శవం తేలిందాయె. మామూలుగా శవం తేలితేనే మనం నీళ్ళు పారపోయిస్తాం కదా. ఇది అస్పృశ్యుల శవమాయె. పదకొండు కొబ్బరికాయలు కొట్టాలి. వ్రతం చేయించాలి. ఊరి పెద్దలకు భోజనం పెట్టించాలి. ఇదంతా బోలెడు ఖర్చుతో కూడినపని. అయినా మీకు డబ్బు కొదవ ఏం ఉందని. మరో సలహా కూడా చెబుతున్నాను వినండి. ఏటూ ఆ బావిని అస్పృశ్యులు ముట్టుకున్నారు. వాళ్ళ చెరువు ఎండిపోయింది. వాళ్ళకి ఈ బావి ఇచ్చే యండి. వాళ్లకు నీళ్ళు దొరుకుతాయి. మీకు పుణ్యం దక్కుతుంది. బావి ఇచ్చేయడం అంటే మాటలు కాదు. మీ ఔదార్యానికి, ఊళ్ళో మంచి పేరు వస్తుంది"

"ఈ సలహా బాగుంది. ఇటువేపు గోడ కట్టేసుకోండి. ఆ బావిని వాళ్ళకి వదిలే యండి" అన్నాడు జోసేకర్.

"నాన్నగారూ... బావిని వదిలిపెట్టడమా..." బాధగా అన్నాడు జగన్నాథరావు.

"బావిని వదలడం అంటే బోలెడు డబ్బు వదులుకున్నట్లే. నేనొక ఉపాయం చెప్పనా... వాళ్లదగ్గర నెమ్మదిగా డబ్బు వసూలు చేసు కోండి" ఎవరికీ వినిపించకూడదని చిన్నగా అన్నాడు జోసేకర్.

"ఈ పద్ధతి బాగానే ఉంది" అన్నాడు జగన్నాథరావు.

దేశదిమ్మరులు పుతిలీబాయి శవాన్ని వాళ్ళ బస్తీకి తీసుకువెళ్ళే ప్రయత్నంలో ఉన్నారు.

"ఒరేయ్... మీకో సంతోషకరమైన వార్త. ఈరోజునుండి ఈ బావి మీదే. మీ కష్టాలు గట్టెక్కాయి" అన్నాడు శివరావుపాటిల్. ఈ మాట వినంగానే అందరికి ఎగిరి గంతులేయా లనిపించింది. కాని వాళ్ళ కళ్ళల్లో పుతిలీ




బాయి మెదిలింది. బాధతో వాళ్ళు నిట్టూర్చారు.

"ఈ బావి మీకే ఇస్తాం. కాని మీరు నాకు కొంత డబ్బు చెల్లించాల్సి ఉంటుంది" అన్నాడు శివరావు.

"మేం అంత డబ్బు ఎక్కడనుండి తేగలం" అన్నాడు రామప్ప.

"బాగా దొంగతనాలు చేయండి. బోలెడు బంగారం తెమ్మని ఎల్లవ్వతో చెప్పు"

అందరు తలలు ఊపారు. ఇంతలో పోలీసులు వచ్చారు. వాళ్ళు ఊరి పెద్దలు చెప్పిన మాటలు విని ఏ గొడవ పెట్టకుండా వెళ్ళిపోయారు.

పుతిలీబాయి శవాన్ని మోసుకుంటూ దేశదిమ్మరులు బస్తీకి తీసుకువచ్చారు.

పరిస్థితి మామూలే. శవాన్ని తగలెయ్యడానికి వాళ్ళదగ్గర కట్టెలకు కూడా డబ్బులు లేవు. అందరు తలాకాస్తా వేసుకుని కొంత డబ్బు పోగుచేశారు. శవానికి స్నానం చేయించడానికి నీళ్ళు ఎట్లా అన్న ప్రశ్న వాళ్ళల్లో తలఎత్తింది.

"పాటిల్ బావి మనదే అన్నాడుగా. బావిలో నుండి నీళ్ళు తెద్దాం" అన్నాడు తిమ్మప్ప.

"పుతిలీ దాహం దాహం అంటూ చచ్చిపోయింది. దాని శవానికి బోలెడు నీళ్ళు పోద్దాం. పైలోకంలో అది సంతోషపడుతుంది" అని అన్నాడు కొండప్ప వస్తున్న కన్నీళ్లను తుడుచుకుంటూ.

అందరు వెళ్ళి కడవలతో నీళ్ళు మోసుకువచ్చారు. దాహంతో అలమటించిన పుతిలీబాయికి చచ్చాక బోలెడు నీళ్ళు దొరికాయి. ఇదంతా చూస్తున్న విఠల్‌కి శివరావుపాటిల్, దేశ్‌ముఖ్ వగైరాలమీద విపరీతమైన కోపం వచ్చింది.

★ ★ ★

నూత్‌గిర్నీలో రిక్రూట్‌మెంట్ జరుగుతోందని తెలిసి ఔరంగాబాద్ వచ్చాడు విఠల్‌గాయక్‌వాడ్. పనిచేయడంలో కొంత గతానుభవం ఉంది కనక ఎక్కువ శ్రమ పడకుండానే ఉద్యోగం దొరికింది.

మూడు సెలవలు వరసగా రావడంవలన బీబీకాముక్బారా, పన్‌చక్కీ, ఔరంగాబాద్ గుహలు, దౌలతాబాద్ ఫోర్టు, ఖులదాబాద్, ఎల్లోరా గుహలు, ఘృష్ణేశ్వర్‌గుడి, అజంతా గుహలు మొదలైన ప్రసిద్ధిచెందిన స్థలాలను చూడటానికి బయలుదేరాడు. అతని తోటి పనివాళ్ళు మరో ఇద్దరు కూడా అతడితో బయలుదేరారు.

బీబీకాముక్బారా చూడంగానే విఠల్‌కి తను ఎన్నోసార్లు పుస్తకాలలో చూసిన తాజ్‌మహల్ గుర్తుకురాసాగింది. వెళ్ళినచోటల్లా గైడ్‌కి డబ్బులిచ్చి అక్కడి విశేషాలను తెలుసుకున్నారు. బీబీకాముక్బారా తాజ్‌మహల్‌కి కాపీ అని చెప్పవచ్చు. ఔరంగజేబు తన భార్య అయిన దిల్‌రాస్ జామూబేగమ్ పేరుమీద దీనిని కట్టించాడు. ఆమెను రబియాదౌరానీ అని కూడా పిలిచేవాళ్ళు. ఔరంగజేబు రాణి సమాధి ఇక్కడే కట్టించాడు. రాణి కొడుకైన షహజాదా ఆజమ్ మక్‌బరా కట్టడిని 1679 సంవత్సరంలో పూర్తిచేశాడు. ఈ మక్‌బరాకి ఉపయోగించిన చలువరాతి రాళ్ళు జైపూర్ నుండి తెప్పించారు. ముఖద్వారంముందు అందమైన బ్రాన్‌షీట్‌తో తయారుచేయబడిన తలుపులు ఉన్నాయి. లోపల పెద్ద టాంక్ ఉంది. మక్‌బరా ప్రధాన భవనం పెద్ద ప్లాట్‌ఫారంమీద ఉంది. మార్బుల్‌తో చేయబడిన గ్యాలరీ ఉంది. ఇక్కడినుండి చూస్తే సమాధి కనిపిస్తుంది. పైన డోములాగా ఉంది. ఇదీ మార్బుల్‌తోనే చేయబడింది. దీనిచుట్టూ మళ్ళీ నాలుగు డోములు ఉన్నాయి. దాదాపు ముప్పైరెండు ఉద్యానవనాలు ఉన్నాయి. ఔరంగజేబుకి, అతడి రాణికి చెందిన కొన్ని వస్తువులను ఇక్కడ మ్యూజియమ్‌లో పెట్టారు. కామ్‌నది ఇటునుండే ప్రవహిస్తుంది.

బీబీకాముక్బారానుండి విఠల్ అతని స్నేహితులు పన్‌చక్కీవెళ్ళారు. దీనిని వాటర్‌మిల్ అని కూడా పిలుస్తారు. ఇక్కడ ఒక గ్రైండింగ్ మిల్ ఉంది. ఈ గ్రైండింగ్‌మిల్‌లో ఒకేసారి ఎక్కువమొత్తంలో ధాన్యాన్ని విసిరి పిండిచేయవచ్చు. ఈ గ్రైండింగ్‌వీల్‌కి ఇనపబ్లేడులు ఉన్నాయి. పైనుండివడే నీళ్ల ఫోర్స్‌కి ఈ గ్రైండిగ్‌వీల్ తిరుగుతుంది. పన్‌చక్కీకి అండర్‌గ్రౌండ్ వాటర్‌ఛానల్ ఉంది.

ఔరంగాబాదు గుహలు చాలా ప్రసిద్ధి చెందినవి. ఇక్కడ పన్నెండు బౌద్ధగుహలున్నాయి. ఇవి దాదాపు ఆరు, ఎనిమిది శతాబ్దా

లనాటివి. చైత్యాలు, విహారాలు అని రెండు రకాలుగా ఈ గుహలు ఉన్నాయి. చైత్యాలలో ప్రార్థనలు జరిగేవి. విహారాలు బౌద్ధ భిక్షువుల నివాసస్థానాలు.

ఒకటవ నంబరు గుహ విహారం. లోపల గుహ కప్పుమీద బుద్ధుడివి, పక్షులవి, బొమ్మలు ఉన్నాయి.

రెండవ నెంబరు గుహలో బుద్ధుడి శిల్పం ఉంది. అభయముద్రలో కూర్చున్నట్లుగా ఈ శిల్పం చెక్కబడ్డది. పద్మపాణి వజ్రపాణిల బొమ్మలు ద్వారందగ్గర ఉన్నాయి. నాగరాజు బొమ్మలు మలచబడ్డాయి. మూడవ నంబరు గుహలో పెద్ద హాలు ఉంది. ఇది స్తంభాలమీగ నిలబడి ఉంది. దీనిపక్కన బుద్ధవిగ్రహం ఉంది. ప్రలంబ పాదముద్రలో బుద్ధుడు ఉన్నాడు. భక్తులు ఇతడిని పూజిస్తున్నట్లుగా బొమ్మలు ఉన్నాయి.

నాలుగో నంబరు గుహ చైత్యము. ఇక్కడ స్థూపం ఉంది. ఐదోనంబరు గుహలో పద్మాసనంలో ఉన్న బుద్ధశిల్పం ఉంది. ఇందులో టన్నల్ ఉంది. ఈ దారి తక్కిన ఐదు గుహలకు రహదారి. ఆరవ నంబరు గుహలో ప్రలంభ పాదముద్రలో బుద్ధుడి శిల్పం ఉంది. అతడి చుట్టూరా ఆడ మొగ బొమ్మలు ఉన్నాయి. ఈ స్త్రీపురుషులు బుద్ధుడిని పూజి



స్తున్నారు. గోడలమీద కొన్ని బుద్ధుడి పెయింటింగ్స్ ఉన్నాయి. ద్వారం దగ్గరిగా పద్మపాణి మరియు వజ్రపాణి బొమ్మలున్నాయి. ఇక్కడే మరొక గుహ ఉంది. హిందువుల దేవుడయిన గణపతి బొమ్మ ఇక్కడ ఉంది. అక్కడే కొన్ని బుద్ధుడి బొమ్మలు కూడా ఉన్నాయి. ఏడవ నంబరు గుహలో కొన్ని డెమీగాడ్స్ బొమ్మలు ఉన్నాయి. ఎదురు గోడ మీద పద్మపాణి బుద్ధుడి బొమ్మ ఉంది. తన శిష్యులను అష్టభయాలనుండి రక్షిస్తున్నట్లుగా ఈ బొమ్మ మలచబడ్డది. కుడివైపు వజ్రపాణి ఇద్దరు స్త్రీల బొమ్మలు ఉన్నాయి.

వెనుకగదిలో పెద్ద బుద్ధుడి బొమ్మ ఉంది. నాగరాజుల బొమ్మలు కూడా ఉన్నాయి. ఎడమవైపు నృత్యభంగిమలలో కొన్ని బొమ్మలు ఉన్నాయి. ఎనిమిదవ గుహ దాదాపు శిథిలావస్తలో ఉంది. తొమ్మిదో నంబరు గుహలో మూడు భాగాలున్నాయి. ఒకదాంట్లో బుద్ధుడు స్వర్గస్థుడయినట్లుగా బొమ్మ ఉంది. తక్కినవాటిలో పడగలతో నాగరాజు బొమ్మలు ఉన్నాయి.

పదవ నంబరు గుహ అసంపూర్ణంగా ఉంది. పదకొండు, పన్నెండవ గుహలు కొండకు అవతలివేపున ఉన్నాయి. అక్కడివరకు వెళ్లడానికి దారిలేదు.

ఔరంగాబాద్ గుహలకు దగ్గరలో ఉన్న మరాఠ్వాడా యూనివర్శిటీకి విఠల్ అతడి స్నేహితులు వెళ్ళారు. యూనివర్శిటీ కొండల మధ్య ఉండటంవలన దీనికి ఒక ప్రత్యేకమయిన సౌందర్యం ఉంది. ఇక్కడ చాలా డిపార్ట్మెంట్లు ఉన్నాయి. యూనివర్శిటీలో హిస్టారిక్ మ్యూజియమ్ ఉంది. అందులో విలువైన పురాతన వస్తువులు ఉన్నాయి. శాతవాహనుల కాలంనాటి వస్తువులు కొన్ని ఉన్నాయి. తవ్వకాలలో వెలువడిన కొన్ని శిల్పాలు ఉన్నాయి. ఇవి చాలావరకు మరాఠ్వాడా ప్రాంతానికి సంబంధించినవి. మరాఠాలు, రాజపుత్రులు, మొగలులు, ఈస్ట్ఇండియా కంపెనీవారు మొదలగువారి పరిపాలనాకాలంనాటి కొన్ని మినియేచర్ పెయింటింగ్స్ ఉన్నాయి. మధ్యయుగాలనాటి కొన్ని ఆయుధాలు ఉన్నాయి. కొన్ని పర్షియన్, అరబిక్ భాషలలో వ్రాయబడిన వ్రాతప్రతులు ఉన్నాయి. ఇవి పదిహేడు, పద్ధెనిమిది శతాబ్దాలనాటివి.

విఠల్గాయక్వాడ్ అతని స్నేహితులు దౌలతాబాద్ఫోర్ట్ చేరుకున్నారు. కోటముందు చిన్నచిన్న దుకాణాలు, బళ్ళు ఉన్నాయి.



వాళ్ళు తినుబండారాలు కొనుక్కుని తింటూ అక్కడ కాసేపు విశ్రాంతి తీసుకున్నారు. ఆ తరువాత గైడ్ వెనక కోటను ఎక్కడం మొదలుపెట్టారు. దౌలతాబాద్ నిజానికి చూడతగిన ప్రదేశం. దీనివెనక చాలా చరిత్ర ఉంది. ఈ కోటను జయించిన ప్రతీవాడు మొత్తం దక్కన్ ప్లాటోను పరిపాలించేవాడు. యాదవరాజు అయిన మొదటి ఖిలామ ఈ కోటను పన్నెండవ శతాబ్దంలో కట్టించాడు. 1294లో అల్లాఉద్దీన్‌ఖిల్జీ ఈ కోటను జయించాడు. మహమ్మద్ తుగ్లక్ దీనివలన ఆకర్షితుడై ఢిల్లీ నుండి రాజధానిని దౌలతాబాద్‌కు మార్చాడు. హిందువుల పాలన ఉన్నప్పుడు ఈ ప్రదేశాన్ని దేవగిరి అని పిలిచేవారు. తరువాత ఇది దౌలతాబాద్‌గా మారింది. ఈ కోటను పెద్ద కొండమీద ఆరువందల అడుగుల ఎత్తు నిర్మించారు. కోట గోడ చాలా ఎత్తయింది. లోపల చాలా గోడలు, పెద్దపెద్ద ఇనుపగేట్లు ఉన్నాయి.

ఈ కోట నిర్మాణం వెనుక మానవ మేధస్సు ఎంతో ఉంది. చాలా కట్టుదిట్టంగా ఉండి ఆనాటి ఇంజనీరింగ్ టెక్నాలజీని వ్యక్తంచేస్తుంది. ప్రహరీగోడ దాటగానే లోపల ఎడమవైపు పెద్ద నీళ్ళ టాంక్ ఉంది. దాదాపు ఆరు నెలలకు సరిపడే నీటిని ఇక్కడ నిలవచేసేవారు. ఇక్కడే హిందువుల గుడి ఉంది. దీనిని భారతమాత గుడి అని పిలుస్తారు. నూటఏభై స్థంబాలమీద ఈ గుడి కప్పు నిర్మించబడి ఉంది. దీనిలో ఉన్న చీనీమహల్‌లో అబుల్‌హసన్ తానీషా తన చివరి స్థితి వరకు ఉన్నాడు. ప్రస్తుతం ఈ మహల్, లోపలి కొన్ని కట్టడాలు శిథిలావస్థలో ఉన్నాయి. పద్దెనిమిది అడుగుల పొడవు కల ఒక గన్ అక్కడ ఉంది. దీనిని మెన్‌థాటోప్ అని పిలుస్తారు. దీనికి ఒకవైపు చివరన పొట్టేలు తల అమర్చబడివుంది. ఇక్కడి చాంద్‌మినార్ చాలా అందమైనది. దీనిని అల్లాఉద్దీన్ బహమనీ కట్టించాడు. ఒకసారి కోటలోకి ఏ శత్రువైనా వచ్చాడంటే బయట పడటం చాలా కష్టం. లోపల కొంతభాగం చీకటి గుయ్యారంగా ఉంటుంది. శత్రువు ఎటూ తప్పించుకోకుండా దీన్ని ఏర్పాటుచేశారు. ఒకప్పుడు దీనిని జైలుగా కూడా వాడేవారు. తానీషా, శంభూజీ ఇక్కడే బంధింపబడ్డారు. గోలకొండను పరిపాలించిన చివరి రాజు దాదాపు పదమూడు సంవత్సరాలు ఇక్కడే బందీగా ఉన్నాడు.

విఠల్ అతడి స్నేహితులు ఖులదాబాద్‌కి బయలుదేరారు. ఇది దౌలతాబాద్‌కి దగ్గరగానే ఉంది. ఔరంగజేబు సమయంలో ఈ నగరం ఒక వెలుగు వెలిగింది. ఇక్కడ చాలామంది ముస్లిం ఫకీర్ల, సూఫీల సమాధులు ఉన్నాయి. ఔరంగజేబు చనిపోయేటప్పుడు తన సమాధి ఏ అట్టహాసం లేకుండా, సాధారణంగా ఉండాలి అనే కోరిక వెలిబుచ్చాడు. తను కష్టపడి సంపాదించిన డబ్బుతోనే కట్టాలి అనుకునేవాడు. అందుకోసం సమయం దొరికినప్పుడల్లా బట్టలు కుట్టీ, టోపీలు తయారుచేసీ, ఖురాన్ కాపీలు రాసీ డబ్బు సంపాదించేవాడు. తరువాత హైదరాబాద్ నైజాం ఈ సమాధి చుట్టూ మార్బుల్ స్క్రీన్ కట్టించాడు. 1921లో అప్పటి వైస్‌రాయ్ లార్డ్ కర్జన్ ఈ మాన్యుమెంట్‌ని రక్షించాలనే ఉద్దేశంతో కొన్ని ఏర్పాట్లు చేశాడు. మహమ్మదీయుల పండుగ ఈద్‌ఎ మిలాదున్‌నబి రోజున మహమ్మద్ ప్రవక్త యొక్క వస్త్రాన్ని ప్రజల దర్శనంకోసం బయట పెడతారు. మిగతా సమయంలో ఇది గాజుపెట్టెలో ఉంటుంది. ఈ పవిత్ర వస్త్రాన్ని దర్శనం చేసుకోవడంకోసం ప్రపంచం నలుమూలలనుండి మహమ్మదీయులు వస్తారు. మహమ్మదీయుల మరో ప్రవక్త అయిన ఖ్వాజా బుర్‌హానుద్దీన్ సమాధి ఔరంగజేబు సమాధికి ఎదురుగుండా ఉన్నది.

విఠల్ అతని స్నేహితులు ఎల్లోరా గుహల వద్ద గైడ్‌వెంట నడవడం ప్రారంభించారు. విఠల్ ఎన్నో విషయాలు తెలుసుకున్నాడు. ఈ గుహలలో ముఖ్యంగా మూడు మతాలు - బౌద్ధమతము, హిందూమతము, జైనమతములకు సంబంధించిన శిల్పాలు ఉన్నాయి. రాళ్ళల్లో పెద్దపెద్ద శిల్పాలు మలచబడ్డాయి. ఇక్కడ మొత్తం ముప్పైనాలుగు గుహలు ఉన్నాయి. పన్నెండు గుహలు బౌద్ధులకు సంబంధించినవి. పదిహేడు గుహలు హిందువులకు సంబంధించినవి. మిగతా అయిదు జైనులకు సంబంధించినవి. ఎల్లోరా గుహలన్నింటిలో పదహారవ నంబరు గుహ చాలా




ప్రసిద్ధిచెందింది.

ఒకటో నంబరు గుహ బౌద్ధులకు సంబంధించింది. లోపల ఎనిమిది చిన్న గదులు ఉన్నాయి. బౌద్ధభిక్షువులు వీటిని నివాసస్థానాలుగా ఉపయోగించేవారు.

రెండవ నంబరు గుహలో బుద్ధుడి బొమ్మలు చాలా ఉన్నాయి. తార అనే ఒక బౌద్ధమతస్థురాలి బొమ్మ ఉంది. గుహ ముందు ఇద్దరు ద్వారపాలకుల శిల్పాలు అసమగ్రంగా ఉన్నాయి. మూడో గుహ నాలుగో గుహ రెండవ నంబరు గుహను పోలివున్నాయి. నాలుగో నంబరు గుహలో రెండు అంతస్థులు ఉన్నాయి. బౌద్ధులకు సంబంధించిన బొమ్మలు ఇందులో ఉన్నాయి.

ఐదవ నంబరు గుహను 'మహర్‌వాడా' అంటారు. ఇది విహారము. దీని పొడవు వెడల్పులనుబట్టి దీనిని ఆనాటి భిక్షువులు డైనింగ్‌హాలుగానో లేక క్లాస్‌రూమ్‌గానో వాడుకునేవారని చెప్పవచ్చు. లోపల బుద్ధుడి బొమ్మ ధర్మచక్రముద్రలో ఉంది.

ఆరోనంబరు గుహ విహారము. వేరే విహారాలకి దీనికి కొంత తేడా ఉంది. దీనిలో హిందువుల దేవతల బొమ్మలు ఉన్నాయి. ఇదే దీనికి ప్రత్యేకత. ఇక్కడ సరస్వతి బొమ్మ ఉంది. బౌద్ధులు దీనిని మహామయూరి అని పిలిచేవాళ్ళు. బోధిసత్వులు, తార, అవలోకితేశ్వర, మంజుశ్రీ, ధనదేవత అయిన జమకలా మొదలగువారి బొమ్మలు ఉన్నాయి. ద్వారంముందు నదీదేవతలయిన గంగ యమునల బొమ్మలు ఉన్నాయి. ఏడవ ఎనిమిదో నంబరు గుహలలో చెప్పుకోదగిన శిల్పాలు ఏవీ లేవు. ఇందులో బొమ్మలు అసంపూర్ణంగా ఉన్నాయి. తొమ్మిదో నంబరు గుహలో చైత్యాలు, పొట్టి మనుషుల బొమ్మలు ఉన్నాయి. తార బొమ్మ కూడా ఉంది. దీనిలోనుండి ఆరోనంబరు గుహకి దారిఉంది.

పదోనంబరు గుహ చైత్యము. క్షీణించిపోతున్న బౌద్ధమతమును వ్యక్తపరచడమే దీని ఉద్దేశ్యము కావచ్చును. హిందూ శిల్పకళ ఇందులో స్పష్టంగా కనిపిస్తుంది. గుహ అనేక రకములైన బొమ్మలతో అలంకరింపబడ్డది. సీలింగ్ మీద పాముల బొమ్మలు ఉన్నాయి. నాగరాజు శిలకు తన భుజాలమీద సపోర్టు ఇచ్చినట్టుగా బొమ్మలు చెక్కిఉన్నాయి. అశ్వపునాడా ఆకారంలో ఉన్న కిటికీలోంచి గుహలోకి వెలుతురు ప్రసరిస్తుంది. స్థూపం ఎదురుగుండా బుద్ధుడు కూర్చుని ఉన్నట్లుగా బొమ్మ చెక్కిఉంది. ఈ బొమ్మ చాలా పెద్దది. ఇక్కడే పాలీభాషలో బుద్ధుడిని గురించిన వివరాలు ఉన్నాయి.

పదకొండో నంబరుది రెండు అంతస్థుల గుహ. దీనిని దోతల్ అని అంటారు. కుబేరుడు యక్షుడు మొదలగువారి బొమ్మలు ఉన్నాయి. కుడివైపు మహిషాసురమర్దని వినాయకుడు మొదలగువారి బొమ్మలున్నాయి.

పన్నెండో నంబరు గుహ మూడంతస్థులది. దీనిని తీకతల్ అని అంటారు. ధ్యానముద్రలో ఉన్న బుద్ధుడి బొమ్మ ఒకటి ఇక్కడ ఉంది. మర్దాలా బొమ్మలు చాలాచోట్ల కనిపిస్తాయి. ఇది బౌద్ధమతానికి సంబంధించిన ఆఖరి గుహ.

ఎల్లోరాలో ఉన్న గుహలు శివునికి అంకితం అయిపోయినాయా అనిపిస్తుంది. అక్కడక్కడ విష్ణువు బొమ్మలు కూడా కనిపిస్తాయి. పదమూడో నంబరు గుహ ధర్మశాలలాంటిది. పధ్నాలుగో నంబరు గుహలో హిందువుల దేవుళ్ళు, దేవతల బొమ్మలు ఉన్నాయి. కుడివైపు వినాయకుడు వీరభద్రుడు మొదలైన బొమ్మలు ఉన్నాయి. శివుడు పిశాచమైన అంధకుని చంపుతున్నట్లుగా శిల్పాలు చెక్కిఉన్నాయి. రావణుడు కైలాస పర్వతాన్ని ఊపేస్తున్నట్టుగా ఒక బొమ్మ ఉంది. ఎదురుగా నంది ఉంది. శివుడు పార్వతితో పాచికలు ఆడుతున్నట్లుగా బొమ్మ చెక్కిఉంది.

పదిహేనో నంబరు గుహలో రెండంతస్థులు ఉన్నాయి. మొదటి అంతస్థులో ఒక పెద్ద హాలు ఉంది. రెండో అంతస్థులో హిందూ దేవత, దేవుళ్ల బొమ్మలు ఉన్నాయి. శివపార్వతుల పరిణయ దృశ్యం ఇక్కడ కూడా చెక్కబడింది. శివుడు యముడినుండి మార్కండేయుని రక్షిస్తున్నట్లుగా ఒక బొమ్మ ఉంది. ఒక శివలింగం ఉంది, వినాయకుడు, కార్తికేయుల బొమ్మలు కూడా ఉన్నాయి. బ్రాహ్మీలిపిలో పాలీభాషలో రాష్ట్రకూటుల గురించిన శిలాశాసనం ఉంది.

పదహారో నంబరు గుహను కైలాసనాథాలయం అంటారు. ఇక్కడ పెద్ద శివాలయం



ఉంది. ఒకేరాయిలో ఇది మలచబడింది. ఇది రెండంతస్థులగుహ. ఏభై మీటర్లు పొడవు ముప్పై ఐదు మీటర్లు వెడల్పు, ముప్పై మీటర్లు ఎత్తు ఉంది. దీనిని చెక్కిన శిల్పి బహుశ దక్షిణభారతంనుండి వచ్చి ఉండవచ్చునని ఈ గుహను చూడగానే అనిపిస్తుంది. రాష్ట్రకూటుల వంశానికి చెందిన కృష్ణరాజు ఏడవ శతాబ్దంలో దీనిని చెక్కించాడని చరిత్ర చెబుతోంది. శైవ, వైష్ణవ పురాణాలకు సంబంధించిన బొమ్మలు ఉన్నాయి. ఇది పూర్తి కావడానికి దాదాపు నూట ఏభై రెండు సంత్సరాలు పట్టిందని చరిత్రకారుల అంచనా. దీనిలో శిల్పులు తమ నైపుణ్యాన్ని అద్భుతంగా కనబరిచారు. ఈ దేవాలయంలో రెండు పెద్దపెద్ద ఏనుగుల శిల్పాలు ఉన్నాయి. ఈ గుడి అందంగా పెయింట్ చేయబడింది. కాని ప్రస్తుతం ఆ రంగులు వెలిసిపోయాయి. ప్రపంచం మొత్తంలో గుహల్లోకెల్లా ఇది చాలా ప్రసిద్ధి చెందింది. రావణుడు తాగిన స్థితిలో ఉన్నట్లూ, కైలాసపర్వతాన్ని ఎత్తుతున్నట్లూ, శివుడు తన కాలి వేలితో పర్వతాన్ని నొక్కిపెట్టినట్లుగా బొమ్మ ఉంది. నరసింహ అవతారంలోని విష్ణువు బొమ్మ కూడా చెక్కబడ్డది. అసురుల పతనాన్ని కూడా శిల్పాలుగా చెక్కారు.

గుడి బయట నంది ఉంది. రామాయణం, మహాభారతాలకు సంబంధించిన కొన్ని దృశ్యాలు చెక్కిఉన్నాయి. పదిహేడో నంబరు గుహలో విష్ణు, బ్రహ్మాల బొమ్మలు, శివలింగం ఉన్నాయి. ఈ హాలులో పన్నెండు స్థంభాలు ఉన్నాయి. వీటిమీద వినాయకుడు, దుర్గ మొదలైన వారి బొమ్మలు చెక్కబడ్డాయి.

పద్దెనిమిది, పంతొమ్మిదో నంబరు గుహలలో శివలింగాలు ఉన్నాయి. ఇరవయ్యవ నంబరు గుహలో సేవకుల బొమ్మలు ఉన్నాయి. ఇరవై నంబరు గుహని రామేశ్వర్ అని కూడా పిలుస్తారు. గుహ ఎదురుగుండా నంది ఉంది. గంగాదేవి మొసలి వాహనం మీద ఎక్కి వస్తున్నట్లుగా ఒక బొమ్మ ఉంది. వీటిని చూడగానే శిల్పాలకు ప్రాణాలు వచ్చాయా అనిపిస్తుంది. కుడివైపు కార్తికేయుడు యమునా దేవిల బొమ్మలు, శివ పార్వతుల పరిణయం దృశ్యం ఉన్నాయి. ఎడమవైపు బ్రహ్మ, హిమవంతుడు, పార్వతి, శివుడు మొదలైనవారి బొమ్మలు ఉన్నాయి. మధ్యలో శివపార్వతుల పెళ్ళి దృశ్యం ఉంది. శివుడు పార్వతి పాణిగ్రహణంచేస్తే బ్రహ్మ పూజారి అయి వాళ్ల వివాహం జరిపిస్తున్నాడు. ఎదుటి గోడమీద, కింద ఏనుగుల బొమ్మలు ఉన్నాయి. నృత్యంభంగిమలలో శివుడి అనుయాయులు ఉన్నారు. హాలులో శివుడు, పార్వతి, విష్ణువు మొదలైనవారి బొమ్మలు చెక్కి ఉన్నాయి. ఇరవైరెండో గుహను నీలకాంత అని పిలుస్తారు. ఇక్కడి శివలింగం నీలం రంగులో ఉండటం వలన దీనికి ఈ పేరు వచ్చింది. రకరకాల దేవతల బొమ్మలు కూడా ఉన్నాయి. వినాయకుడు, గజలక్ష్మి, కార్తికేయుడు మొదలగు వారి బొమ్మలు చెక్కబడి ఉన్నాయి. ఇరవైమూడో గుహలో త్రిమూర్తుల శిల్పం ఉంది. ఇరవైనాలుగో గుహలో నాలుగు శివుడి గుళ్ళు ఉన్నాయి. ఇరవై అయిదో గుహ పెద్దది. కుబేరుడి బొమ్మ ఉంది. బయట ద్వారపాలకుల బొమ్మలు ఉన్నాయి. పైకప్పుమీద రథంతో సూర్యుడు, ఏడు గుర్రాలు ఉన్నాయి.

ఇరవైఆరో నంబరు గుహలో ఆరు స్థంభాలు, శివలింగం ఉన్నాయి. ఇద్దరు మహిళా ద్వారపాలకుల బొమ్మలు ఉన్నాయి. ఇరవైఏడో నంబరు గుహలో మహిషాసురమర్థని, బ్రహ్మ, విష్ణుమహేశ్వరుల బొమ్మలు ఉన్నాయి. రెండో వైపు బలరాముడు, శ్రీకృష్ణుడు మొదలగు వారి బొమ్మలు ఉన్నాయి. విష్ణువు పాముల బొమ్మ ఒకటి ఉంది.

ఇరవైఎనిమిదో నంబరు గుహని ధారతీర్థ అనిపిలుస్తారు. ఇక్కడ జలపాతం, శివలింగం, దుర్గ బొమ్మ ఉన్నాయి. ఈ దేవికి ఎనిమిది చేతులు ఉన్నాయి.

ఇరవైతొమ్మిదో నంబరు గుహను సీతాన హాని (సీత స్నానాల గది) అని పిలుస్తారు. కైలాస గుహ తరువాత దీనికే ఎక్కువ ప్రాముఖ్యత. ఇక్కడ ఇరవైఆరు స్థంభాలు ఉన్నాయి. దీని లోపల సూర్యరశ్మి బాగా వస్తుంది. రెండు సింహాలు, కొన్ని ఏనుగుల బొమ్మలు ఉన్నాయి. శివుడు అంధకుడిని చంపుతున్నట్లుగా పార్వతి ఆనందిస్తున్నట్లుగా ఒక శిల్పం, నటరాజ శిల్పం, పద్మాసన ముద్రలో వున్న శివుడి




శిల్పం, తాబేలు మీద మానవరూపంలో యమునాదేవి శిల్పం, నాలుగు ముఖద్వారాల దగ్గర ద్వారపాలకుల శిల్పాలు ఉన్నాయి.

ముప్పయ్యవ నంబరు గుహ రెండు భాగాలుగా ఉంది. మొదటి భాగంలో రకరకాల డిజైన్లతో స్థంభాలు ఉన్నాయి. మహావీరుడి శిల్పం ఉంది. కప్పుపైన పెద్ద కమలం చెక్కి ఉంది. రెండో భాగం ఇంచుమించుగా కైలాస నాథాలయంలాగే ఉంటుంది. అయినా ఇందులో జైన మతప్రభావం బాగా కనబడుతుంది.

ముప్పైఒకటో నంబరు గుహలో మహావీరుడు, పారశ్వనాథుడు, గోమతేశ్వరుడు మొదలైన వారి శిల్పాలు ఉన్నాయి.

ముప్పై రెండో నంబరు గుహలో మహావీరుడి శిల్పం కొందరు జైనమత ప్రవక్తల శిల్పాలు ఉన్నాయి. మాతంగుడు ఏనుగుమీద, రావిచెట్టుకింద కూర్చున్నట్లున్న శిల్పాలున్నాయి. కుడివైపు మామిడి చెట్లకింద సింహాసనం మీద సిద్ధాయకా కూర్చున్నట్లుగా ఒక శిల్పం, మహావీరుడి బొమ్మలు ఉన్నాయి. సీలింగ్ మీద అందమైన కమలం ఉంది. గుహ చాలా వరకు పెయింట్ చేయబడి ఉంది. ప్రస్తుతం రంగులు వెలసిపోయాయి.

ముప్పైమూడో నంబరు గుహలో మహావీరుడు, మాతంగ, సిద్ధాయక మొదలగు వారి బొమ్మలు, అందంగా చెక్కబడిన కొన్ని స్థంభాలు, మామిడి చెట్టు బొమ్మ ఒకటి కొన్ని తీర్థంకుల బొమ్మలు ఉన్నాయి.

ముప్పైనాలుగో నంబరు గుహలో మహావీరుడు, పారశ్వనాథుడు, గోమతేశ్వరుడు మొదలగు వారి బొమ్మలు ఉన్నాయి.

ఎల్లోరా గుహలకు ఒకటిన్నర కిలోమీటర్ల దూరంలో ఘృష్ణేశ్వర ఆలయం ఉంది. ఇది పన్నెండు జ్యోతిర్లింగాలలో ఒకటి. ఎర్రరాయితో కట్టబడింది. ఇక్కడ శివలింగం ఉంది. ఇది పదవ శతాబ్దినాటిది. మహాశివరాత్రిని ఇక్కడ ఘనంగా జరుపుతారు.

మరునాడు విఠల్ అతడి స్నేహితులు అజంతా గుహలకి వెళ్ళారు. ప్రపంచ ప్రసిద్ధి చెందిన అజంతా గుహలు ఔరంగాబాద్‌కి నూటపది కిలో మీటర్ల దూరంలో ఉన్నాయి. బౌద్ధులు ఈ గుహలలో ఉండేవారు. బౌద్ధమతం క్షీణించాక ఈ గుహలు చాలా సంవత్సరాలు అజ్ఞాతంగా పడిఉన్నాయి. ఆంగ్లేయులు పరిపాలించే కాలంలో ఒక ఆంగ్లేయ ఆఫీసర్ ఇటువైపు వేటకని వచ్చాడు. అనుకోకుండా అతడి దృష్టి ఈ గుహలపై పడ్డది. ఈ గుహలనిండా రంగు రంగుల అద్భుతమైన పెయింటింగ్స్ ఉన్నాయి. మట్టి, పేడ, బియ్యపు ఊక, కలిపిన మిశ్రమాన్ని రాళ్లకు పట్టించేవారు. ఒక పూత పూశాక సున్నం, నిమ్మకాయ రసం, నీళ్ళు కలిపిన మిశ్రమాన్ని దానిమీద పూసేవారు. ఇదంతా ఎండిపోయాక రాతిగోడలమీద స్కెచ్ గీసేవాళ్ళు. తరువాత దానిమీద రంగులలో పెయింట్ చేసేవాళ్ళు. వీటిలో స్త్రీల బొమ్మలు అద్భుతంగా ఉన్నాయి. స్త్రీల ముఖకవళికలను చిత్రకారులు ఎంతో నేర్పుగా వేశారు. ఈ స్త్రీల కళ్ళు ఎంతో అందంగా కనిపిస్తాయి. రకరకాల శిరోజాలంకారాలు కనిపిస్తాయి. ఆధునికయుగంలో ఈ హెయిర్ స్టైయిల్స్‌ని అనుకరిస్తున్నారు.

ఒకటో నంబరు గుహలో ఒక పెద్ద హాలు ఇరవై స్థంభాలు ఉన్నాయి. వీటిమీద అందమైన శిల్పాలు చెక్కారు. ఇవి జాతక కథలను వ్యక్తం చేస్తాయి. బుద్ధుడి జీవితానికి సంబంధించిన బొమ్మలు ఎన్నో ఉన్నాయి. ఇక్కడి బుద్ధుడి శిల్పం అద్భుతమైనది. కుడివైపునుండి ఎడమవైపు ఎడమవైపునుండి, ఎదురుగుండా దీనిమీద కాంతిని ప్రసరింపచేస్తే బుద్ధుడి ముఖము ఒకవైపు నవ్వుతున్నట్లుగా మరొకవైపు ధ్యానముద్రలో ఉన్నట్లుగా కనిపిస్తుంది. బయట ప్రేమ దేవతైన మీరా పెయింటింగ్ ఉంది.

హాలులో ఎడమవైపు శిబిజాతక కథ చెక్కిబడింది. డేగ చేతులలోనుండి పావురమును రక్షిస్తున్నట్లుగా ఒక బొమ్మ ఉంది. నాగరాజ జన్మకు సంబంధించిన ఒక బొమ్మ ఉంది. రథములో ఒక స్త్రీ ఆ పక్కనే ఓ గుంపు ఉన్నట్టుగా ఉంది పద్మపాణి ముద్రలో ఉన్న బుద్ధుడి పెయింటింగ్ ఒకటి ఉంది. ప్రపంచం మొత్తంలోని పెయింటింగ్స్‌లో ఇది ప్రసిద్ధిచెందిన పెయింటింగ్. బుద్ధుడి చేతిలోని కమలము శాంతి పవిత్రతలకు చిహ్నా



ము. పద్మపాణి దగ్గరగా ఒక స్త్రీ బొమ్మ ఉంది. కుడివైపు వజ్రపాణి, బ్లాక్‌ప్రిన్సెస్ బొమ్మలు ఉన్నాయి. ఈ యువరాణి ఒంటినిండా ఆభరణాలతో నగ్నంగా ఉంది. భర్తకోసం ఎదురుచూస్తున్నట్లుగా ముఖభావం ఉంది.

భారతదేశపు రాజులకు విదేశీయులు బహుమతులు ఇస్తున్నట్లుగా, బుద్ధుడి తల్లి మాయాదేవి స్నానం చేస్తున్నట్లుగా, గోదాలో కొన్ని జంతువులు పోట్లాడుకుంటున్నట్లుగా బొమ్మలున్నాయి. పైకప్పుమీద పక్షులు పువ్వులు పళ్ళు మొదలైన పెయింటింగ్స్ ఉన్నాయి. ఈ కాలంలో వస్తున్న చీరలమీద శాలువాలమీద ఈ డిజైన్లు వేస్తున్నారు. రెండవ నంబరు గుహలో హంస స్నానం చేస్తున్నట్లు బుద్ధుడి తల్లి తనకు వచ్చిన స్వప్నాన్ని రాజుకి చెబుతున్నట్లు బుద్ధుడు పుట్టినట్లు బుద్ధుడిని తల్లితండ్రులు ముద్దాడుతున్నట్లు పెయింటింగ్స్ ఉన్నాయి.

ఎడమవైపు బుద్ధుడి బొమ్మ ఉంది. కప్పుపైన కొన్ని హంసలు గుంపుగా ఉన్నాయి. అక్కడ ఉన్న కొన్ని చిత్రాలలో ఆధునిక యుగంలో వాడే పర్సులు, చెప్పులులాంటి వస్తువులే ఉన్నాయి. కప్పుపైన ఉన్న కొన్ని డిజైన్లు ఈనాటి చీరలమీద శాలువాలమీద వేస్తున్నారు. అరుంధతి ఊయలలో ఉన్నట్లుగా, బుద్ధుడు శిష్యులతో ఉన్నట్లుగా పెయింటింగ్స్ ఉన్నాయి. సారిపుత్ర, మహా మొగలుల చిత్రాలు ఉన్నాయి. అసెంబ్లీహాల్ స్థంభాలమీద బొమ్మలున్నాయి.

మూడవ నంబరు గుహ పూర్తిగాలేదు.

నాలుగో నంబరు గుహ చాలా పెద్దది. ఇందులో ఇరవైఎనిమిది స్థంభాలు ఉన్నాయి. ద్వారం దగ్గర ద్వారపాలకుల బొమ్మలు, కొన్ని ప్రేమ జంటల బొమ్మలు ఉన్నాయి. లోపల పెద్ద బుద్ధుడు బొమ్మ ఉంది.

ఐదో నంబరు గుహలో కొన్ని బుద్ధుడి బొమ్మలు ఉన్నాయి.

ఆరవ నంబరు గుహలో పద్మాసన ముద్రలో ఉన్న బుద్ధుడి బొమ్మ, అసెంబ్లీహాల్‌లో స్థంభాలు, పూలదండలతో ఉన్న మొసళ్ల బొమ్మలు ఉన్నాయి. ఇవన్నీ ఒక ఆర్క్ ఆకారంలో ఉన్నాయి. ఏడో నంబరు గుహలో ఆరు బుద్ధుడి బొమ్మలు, ద్వారపాలకుల బొమ్మలు ఉన్నాయి.

ఎనిమిదో నంబరు గుహలో ప్రస్తుతం పవర్ హౌస్ ఉంది.

తొమ్మిదో నంబరు గుహ చాలా పురాతన చైత్యం. ఇందులో ఇరవైరెండు స్థంభాలు ఉన్నాయి.

పదవ నంబరు గుహ హీనాయనాలయం. దాదాపు నలభై స్థంభాలు ఉన్నాయి. ఈ స్థంభాల మీద అందమైన బొమ్మలతో పాటు ఒక స్థూపం ఉంది. దీనిమీద బ్రాహ్మీలిపిలో, పాలీ భాషలో శిలాశాసనం ఉంది.

పదకొండవ నంబరు గుహలో పెద్ద సమావేశమందిరం ఉంది. ఒక బుద్ధుడి బొమ్మ కూడా ఉంది.

పన్నెండు, పదమూడు, పధ్నాలుగు, పదిహేను గుహలలో ప్రత్యేకించి చూడతగినవేమీ లేవు.

పదహారో నంబరు గుహలో కొన్ని అందమైన పెయింటింగ్స్ ఉన్నాయి. ఇవి బుద్ధుడి జీవితానికి సంబంధించినవి. ఎడమవైపు నందుడు బుద్ధుడి శిష్యరికం స్వీకరిస్తున్నట్లుగా ఒక బొమ్మ ఉంది. నందుడి తల్లి స్పృహతప్పి పడిఉన్నట్లుగా ఒక సేవిక ఆమెకు సేవ చేస్తున్నట్లుగా ఉంది. ఆధునిక యుగంలో నర్సులు వేసుకునే డ్రెస్, ఈ పెయింటింగ్‌లోని నర్స్ వేసుకున్న డ్రెస్ ఒకేలా ఉండటం ఆశ్చర్యం కలిగించే విషయం. ఇవిగాక నృత్యం చేస్తున్న కొందరి బొమ్మలు ఉన్నాయి.

పాలంబపాద్ ముద్రలో ఉన్న బుద్ధుడి పెయింటింగ్ చాలా బాగుంటుంది. ఏనుగు, గుఱ్ఱం, మొసలి మొదలగువాటి పెయింటింగ్స్ చూడతగ్గవి. పైకప్పు మీద కూడా రకరకాల పెయింటింగ్స్ ఉన్నాయి.

బుద్ధుడి తల్లి గర్భవతిగా ఉన్నప్పుడు తనకు వచ్చిన కల గురించి రాజుకి చెబుతున్నట్లుగా ఒక పెయింటింగ్ ఉంది. ఇందులో జ్యోతిష్కుడు కూడా ఉన్నాడు. ఇది అద్భుతమైన త్రీడైమెన్షనల్ పెయింటింగ్.

పదిహేడవ నంబరు గుహలో జాతక కథలు ఉన్నాయి. ఇవి బుద్ధుడి జీవితానికి





సంబంధించినవి. ఎడమవైపు బుద్ధుడు కిందటి జన్మలో అనేక దంతములు కల ఏను గుగా పుట్టినట్లు చిత్రించి ఉంది. చీమలు చెట్టుమీదకి ఎక్కుతున్నట్లుగా ఒక చిత్రం ఉంది. మహాకవి కథకూడా చిత్రించారు. బుద్ధుడు ఔదార్యము కల రాజుగా పెయింట్ చేశారు. భోగభాగ్యాలను త్యజించిన మహనీయుడైన బుద్ధుడికి యశోధర, రాహుల్ భిక్ష ఇస్తున్నట్లుగా పెయింటింగ్ ఉంది. ఇది మన మనస్సులను స్పర్శిస్తుంది. యశోధర, రాహుల్‌ల హృదయ స్పందన వినిపిస్తుంది. బుద్ధుడి శరీరం పెద్దదిగాను యశోధర రాహులుల శరీరాలు చిన్నవిగాను చిత్రీకరింపబడ్డాయి. వాకాటకుల కాలానికి చెందిన హరిశన్, అతడి మంత్రి నరహదేవ చేతులతో దీపాలు పట్టుకుని బుద్ధుడి ఎదురుగుండా నిల్చున్నట్లుగా ఒక పెయింటింగ్ ఉంది. కప్పులోపలిభాగాన రకరకాల పెయింటింగ్స్ ఉన్నాయి. వీటిని బట్టతో తయారుచేశారా అని ప్రేక్షకులకు అనిపిస్తుంది. కొన్ని జాతక కథలు చిత్రీకరించారు. వరండాలో జీవితంలోని వివిధ దశలకు సంబంధించిన రకరకాల చిత్రాలు ఉన్నాయి. బుద్ధుడిని చంపటానికి దేవదత్తుడు ఏనుగును తెచ్చినట్లుగా బుద్ధుడు ఆ ఏనుగును జయించినట్లుగా ఒక చిత్రం ఉంది. అద్భుతమైన ఒక అప్సరస చిత్రం కూడా ఉంది.

పద్ధెనిమిదో నంబరు గుహలో జలాశయం ఉంది.

పంతొమ్మిదో నంబరు గుహ గుర్రపునాడా ఆకారంలో ఉంటుంది. ఇందులో బుద్ధుడి బొమ్మలు ఉన్నాయి. నాగరాజు భార్యతో ఉన్నట్లుగా ఒక బొమ్మ ఉంది. బుద్ధుడు తన భార్యా కొడుకుల నుండి భిక్ష తీసుకుంటున్నట్లుగా ఓ చిత్రం ఉంది. మూడు గొడుగుల ఆకారంలో ఒక స్థూపం ఉంది. దీనిమీద బుద్ధుడి బొమ్మ చెక్కబడింది.

ఇరవయ్యవ గుహలో బుద్ధుడు బోధ చేస్తున్నట్లుగా ఓ చిత్రం ఉంది.

ఇరవైఒకటవ గుహ చైత్యము. బుద్ధుడి నిర్వాణమును పెద్ద బొమ్మగా చెక్కారు.

ఇరవై రెండవ గుహ అసంపూర్ణంగా ఉంది. గోడకు కుడివైపున బుద్ధుడు మైత్రేయులతో బోధివృక్షం కింద ఉన్నట్లుగా ఒక చిత్రం ఉంది.

ఇరవైమూడవ గుహ అసంపూర్ణంగా ఉంది.

స్థంభాలమీద రకరకాల డిజైనులు వేయబడి ఉన్నాయి. కళాకారుల నైపుణ్యం ఇందులో కనిపిస్తుంది.

ఇరవైనాలుగవ గుహ చాలా పెద్దది. ఇది పూర్తి చేయబడి ఉంటే అన్ని గుహలలోకన్న మిన్నగా రూపొంది ఉండేది. ఇందులోని అలంకరణ చాలా బాగుంటుంది.

ఇరవైఅయిదవ గుహ కూడా అసంపూర్తిగా ఉంది. ఇది విహారము, దీనిలో ఒక్క సభా మందిరం మాత్రమే ఉంది.

ఇరవైఆరవ గుహలో బుద్ధుడి జీవితానికి సంబంధించిన బొమ్మలున్నాయి. మహానిర్వాణ ముద్రలో బుద్ధుడి బొమ్మ, బుద్ధుడు బోధివృక్షం కింద కూర్చున్నట్లుగా ఓ చిత్రం, మారుడు బుద్ధుడిని ఆకర్షించడానికి ప్రయత్నిస్తున్నట్లుగా కొన్ని బొమ్మలు ఉన్నాయి.

ఇరవైఏడవ గుహ చాలా చిన్నది. ఈ గుహలో రెండంతస్థులు ఉన్నాయి. ఈ గుహ చాలావరకు శిథిలావస్థలో ఉంది.

ఇరవైఎనిమిది ఇరవైతొమ్మిదో నంబరు గుహలు ఎత్తుగా ఉన్నాయి.

ఈ గుహలను చూస్తున్నంతసేపూ విఠల్‌కి ఏదో తెలియని అనిర్వచనీయమైన ఆనందం కలగసాగింది. లాతూర్‌లో ఉన్న తన తండ్రి, అన్నలకోసం తను సంపాదించిన దాంట్లో కొంత డబ్బు పంపిస్తూ ఉండేవాడు. తను తన జాతివాళ్లలాగా దొంగతనాలు చేయకుండా ఒక చోట పనిచేస్తూ మంచిగా జీవించే అవకాశం దొరికినందుకు అతడు సదా ఉప్పొంగిపోతూ ఉండేవాడు. ఔరంగాబాద్ వచ్చాకే అతడికి బయటి ప్రపంచం గురించి కొంతయినా తెలిసింది. రోజూ కట్టెలపొయ్యి మీద వంట చేసుకుని డ్యూటీకి వెళ్ళేవాడు. గిర్నీవాళ్ళిచ్చే చాలీచాలని జీతంలో కారం మెతుకులు తింటూ గడిపే ప్రతిక్షణం తనవాళ్లందరు గుర్తుకువచ్చేవాళ్ళు. అలా గుర్తుకు వచ్చినప్పుడల్లా అతడి మనస్సు బాధపడేది. తిమ్మప్ప

కొన్నాళ్ళు ఏమీ మాట్లాడలేదు. కాని రోజులు గడుస్తున్నకొద్దీ విఠల్ అక్కడ ఒంటరిగా ఉంటున్నాడే అన్న బాధ ఎక్కువ కాసాగింది. లక్ష్మప్ప, పాండురంగ విఠల్‌ని ఔరంగాబాద్ నుండి వెనక్కి వచ్చేయమని బలవంతం చేయసాగారు. తిమ్మప్ప కూడా వెనక్కి రమ్మనమని చెప్పి పంపించాడు. ఇక వాళ్ళ మాటను కాదనలేక విఠల్ లాతూరుకి వచ్చేశాడు. మళ్ళీ ఉద్యోగం వెతుక్కోవడం మొదలు పెట్టాడు.



విఠల్ జగన్నాథరావు పాటిల్‌ని సూత్‌గిర్నీలో పని ఇవ్వమని బతిమిలాడాడు. పాటిల్ పదిసార్లు ఇంటిచుట్టూ తిప్పించుకుని తన స్వంత పనులను అతడి చేత కూలీ డబ్బులు ఇవ్వకుండా చేయించుకుని సూత్‌గిర్నీలో పని ఇచ్చాడు. శివరావు పాటిల్ విఠల్‌కి పని ఇవ్వవద్దని వాదించాడుగానీ విఠల్ చేత బోలెడు చాకిరీ చేయించుకోవచ్చునని జగన్నాథరావు తండ్రికి చెప్పి ఒప్పించాడు.

విఠల్ డ్యూటీలో చేరాడు. జగన్నాథరావే అక్కడ మేనేజరూ సూపర్‌వైజరూ కూడా. విఠల్‌మీద అధికారం చెలాయించేవాడు. మిషను మీద కాస్త దుమ్ము కనిపిస్తే చాలు ఎందుకు తుడవలేదంటూ అతడిని తన్నేవాడు. ఆలస్యంగా వస్తే ఆరోజు దెబ్బలు తప్పవు. వాళ్ళు చేస్తున్న అన్యాయాలను అందరికి చెబుదామా అని విఠల్‌కి అనిపించేది. కాని కళ్ళ ఎదురుగుండా కాలుతున్న కడుపు కనిపించేది. రోగగ్రస్తుడయిన తండ్రి కనిపించేవాడు. ఈ పని కూడా పోతే దొంగతనం చేయాల్సి వస్తుంది అని అనుకుని మౌనంగా ఉండేవాడు. విఠల్‌కి సూత్‌గిర్నీలో చాలా మంది స్నేహితులయ్యారు. కార్మికులందరు పై అధికారులను తిట్టుకునేవారు. కాని వారిని ఎదిరించే ధైర్యం ఎవరికీ లేదు.

విఠల్ పనిచేసేచోట మిషనుకి దుమ్ముపట్టినప్పుడల్లా అతడి డ్యూటీని డిపోకి మార్చేవాళ్ళు. కారణం మిషనుదగ్గర పనిచేసే వాళ్ల కూలి డిపోలో పనిచేసేవాళ్ల కూలికన్న ఎక్కువ.

ఆరోజు నైట్ డ్యూటిచేశాడు. మరునాడు డ్యూటీచేసేటప్పుడు అతడు బాగా అలసిపోయి ఉండటంవలన ఒక్కనిమిషం కన్ను మూశాడో లేదో సూపర్‌వైజర్ వచ్చి బూటుతో తన్నాడు. "నిద్రపోతున్నావ్... పని నీ బాప్ చేస్తాడా?" అని కళ్ళెర్రచేస్తూ అడిగాడు. విఠల్ వెంటనే లేచి నిల్చున్నాడు. సూపర్‌వైజర్ విఠల్‌ని జుట్టుపట్టుకుని లాగి మిషనువైపు తోసేశాడు. అతని తలకి బాగా దెబ్బ తగిలింది.

ఆగస్టు పదిహేను, మే ఒకటి, జనవరి ఇరవైఆరు సూత్‌గిర్నీకి సెలవులు. ఆ మూడు రోజులు మాత్రం జీతం కూడా ఇస్తారు. ఆగస్టు పదిహేనున జండావందనం జరిగింది. కార్మికులందరు వచ్చారు. విఠల్ ఆరోజు తాను చెప్పదలుచున్ననాలుగు వాక్యాలు అందరిముందు చెప్పాలని అనుకున్నాడు. "మనదేశానికి స్వతంత్రం వచ్చింది. కాని మా కార్మికులకు మాత్రం అన్యాయానికి విరుద్ధంగా నాలుగు కేకలు వేసే స్వతంత్రం కూడా రాలేదు. ఈ ఫాక్టరీలో జరిగే అన్యాయాలు ఎవరికి తెలుసు. ఏ కార్మికుడైనా సరే రెండు క్షణాలు ఆలస్యంగా వస్తే కార్డును చింపివడేస్తారు. ఎనిమిది గంటల ఓవర్‌టైమ్ చేస్తే నాలుగు గంటలు మాత్రమే రాసుకుంటారు. పదమూడు పద్నాలుగు సంవత్సరాల వయస్సుగల పిల్లలతో కూలి డబ్బులు ఇవ్వకుండానే పనిచేయించుకుంటారు. ఎవరైనా పై అధికారులు సూపర్‌విజన్‌కి వస్తే వీళ్లని లెట్రిన్‌లలోకి తోసేస్తారు. కార్మికులను బానిసలలాగా చూస్తారు. ఈ కొట్టడం తిట్టడం నుండి మమ్మల్ని రక్షించండి. ఎట్లాగయినా సరే ఈ అన్యాయాలను అరికట్టండి"

విఠల్ ఈ విధంగా చెబుతాడని ఎవరూ





అనుకోలేదు. జగన్నాథరావు పాటిల్‌కి విఠల్ మీద కోపం వచ్చినా కార్మికులందరూ ఎంతో సంతోషపడ్డారు. కాని మరునాడు డ్యూటికి వెళ్ళి నప్పటినుండి విఠల్‌ని జాబర్‌లు మరీ ఏడి పించసాగారు. మిషను మీద ఏ మాత్రం దుమ్ము కనిపించినా అతడికి నోటీసు ఇచ్చేవా ళ్ళు.

కార్మికులందరికి తమకన్నా చిన్నవాడైన విఠల్ మీద ప్రేమ కలగసాగింది. వాళ్ళు విఠల్‌కి నమస్కారం చేసినప్పుడల్లా అతడి మనసు సంతోషంతో ఉప్పొంగిపోయేది. తక్కిన మిల్లులలో ఉన్న సదుపాయాలు ఈ మిల్లులో లేవు, అన్న విషయం కార్మికులకి తెలిసిపో యింది. కార్మికులకు వచ్చేదే తక్కువ జీతం. జీతం రాంగానే హొటల్ యజమానుల బిల్లు ఇచ్చేయాలి. రాత్రిపూట నిద్రరాకూడదని చాలా మంది టీ తాగుతారు. హొటల్ యజ మానులు రెండింతల పైసలు వసూలుచేసేవా ళ్ళు. ఇక్కడ ఆసుపత్రి వసతి కూడా లేదు. జీతం సరిపోక కార్మికులు వడ్డీలకు అప్పులు తెచ్చుకుంటూ వుంటారు. మొదటి తారీఖు రాగానే ఫ్యాక్టరీ గుమ్మంలో వడ్డీ వ్యాపారస్తులు, సారాదుకాణం యజమానులు రెడీగా ఉంటారు. జీతంలో దాదాపు మూడువంతులు వీళ్లకే సరిపోతుంది. తిండికి చాలక మళ్లీ వడ్డీకి డబ్బులు తీసుకో వడం మొదలు. ఎంతోమంది కార్మికులు టి.బి.తో బాధపడుతుంటారు. అయినా రోగంతో పనికి వచ్చేవాళ్లు.

మిల్లులో అత్యాచారాలు, అన్యాయాలు ఎక్కువ అయినాయి. చివరికి కార్మికులందరు కలిసి యూనియన్ స్థాపించాలనుకున్నారు. మేనేజరుకి ఈ విషయం తెలిసి విఠల్‌ని పనిలోంచి తీసేస్తానని బెదిరించాడు.

కులకర్ణి మాస్టారు తన కొడుకైన వినాయక రావు ఈ విషయంలో విఠల్‌కి సహాయం చేయగలడని సలహా ఇచ్చాడు. వినాయక రావు కమ్యూనిస్టు పార్టీ కార్యకర్త. మాస్టారికి తన కొడుకు పార్టీలో చేరడం ఏమాత్రం ఇష్టంలేదు. ఇంట్లో రోజూ గొడవే. కమ్యూనిజం అంటే మాస్టారుకి గౌరవం ఉంది. బీదవాళ్లయెడల సహానుభూతి ఉంది. వాళ్ల శ్రమ దోచుకునేవా రంటే కోపం ఉంది. కాని మొదటినుండీ అతడు దైవభక్తుడు. కమ్యూనిజం దేవుడిని నమ్మదు. మతాన్ని నమ్మదు కనుక అతడిలోని దైవభక్తి అడ్డుపడ్డది. అందువల్లనే కొడుకు పార్టీమెంబరు కావడానికి ఇష్టపడలేదు. అయినా మారుతున్న కాలంతోపాటు తాను మారాలి. కొడుకు వ్యక్తిగత విషయంలో తను జోక్యం చేసుకోవడం సంస్కారం అనిపించుకో దనుకున్నాడు. అందుకే పార్టీలో మెంబర్ అయినప్పుడు పార్టీయెడల నియమ నిష్ఠలతో ఉండాలనీ, పార్టీసేవ చేయాలనీ వినాయకరా వుకి చెప్పాడు. వినాయకరావు అప్పటికే కమ్యూనిజం గురించి చాలా పుస్తకాలు చదివా డు. కమ్యూనిజం గురించి తెలుసుకున్నాడు. పార్టీ కార్యకర్తగా శ్రమపడడం నేర్చుకున్నాడు.

విఠల్ వినాయకరావుకి విషయం అంతా వివరించి చెప్పాడు. తక్కిన ఫ్యాక్టరీలలో ఏయే సదుపాయాలు ఉన్నాయో, అక్కడ అప్రెంటిస్ కి టెంపరరీగా పనిచేసేవాళ్లకి మెకానిక్‌లకు ఎంతెంత జీతం వస్తోందో కనుక్కుంటాననీ, ఈ విషయంలో కార్మికులకు సహాయం చేస్తాననీ హామీ ఇచ్చాడు. కార్మికులకు అన్యాయాలు జరుగుతూంటే ఊరుకోగూడదనీ, యూనియన్ స్థాపించి ఎదిరించాలనీ, అవసరం అయితే కోర్టుకు కూడా వెళ్లాలనీ చెప్పాడు.

విఠల్ తమకు జరుగుతున్న అన్యాయాలకి విరుద్ధంగా పోరాటం సాగించాలని నిశ్చ యించుకున్నాడు. కార్మికులందరు సమ్మె మొ దలుపెట్టారు. వాళ్ల షరతులకు మేనేజ్ మెంటువాళ్లు ఒప్పుకుంటేనే సమ్మె విర మించాలి అని నిర్ణయించుకున్నారు. మేనేజ్ మెంటు ఉలుకు పలుకు లేకుండా కూర్చుంది. కార్మికులు ఆమరణ నిరాహారదీక్ష చేయడం మొదలుపెట్టారు. ఏ ఇంట్లోని పొయ్యి వెలగలే దు. పిన్నలకి పెద్దలకి ఉపవాసాలు చేయడం తప్పలేదు. చివరికి విఠల్ మరికొందరు వర్క ర్లు కలిసివెళ్లి కార్మికులకు సహాయం చే యండని పౌరులను అడగడం మొదలుపెట్టా రు. మొదట కొందరు వ్యాపారస్తులు జాలిత లచి కొంత డబ్బు వేశారు. అది తెలిసి జగన్నాథరావు పాటిల్ వీళ్లెవరికీ సహాయం చేయవద్దని ఫోన్లుచేసి చెప్పడంతో వాళ్లు ఆ తర్వాత డబ్బు ఇవ్వటం మానేశారు. ప్రతినెలా



సరుకులు అప్పు ఇచ్చేవాళ్లు కూడా అప్పు ఇవ్వడం మానేశారు. రోజుల తరబడి ఉపవాసాలు చేయడంవలన కార్మికులకు కళ్లు తిరగడం మొదలుపెట్టాయి. నీరసంతో కొందరు స్పృహతప్పి పడిపోవటంతో వారిని హాస్పిటల్‌లో ఎడ్మిట్ చేశారు. కొందరు హాస్పిటల్‌కి వెళ్లడానికి నిరాకరించారు. మరి రెండురోజులు గడిచిపోయాయి. విఠల్ బాగా నీరసపడిపోయాడు. పోలీసులు వచ్చారు. సెలైన్ ఎక్కించడానికి హాస్పిటల్‌కి రమ్మన్నారు. అతడు మొండిగా రానన్నాడు.

శివరావుపాటిల్, జగన్నాథరావు పాటిల్, దేశ్‌ముఖ్ కులకర్ణి ఇంటికి వచ్చారు.

"మాస్టారూ! మీ అబ్బాయికి మా ఫ్యాక్టరీ విషయంలో జోక్యం కలిగించుకోవద్దని చెప్పండి" అన్నాడు శివరావుపాటిల్.

"కులకర్ణిగారూ! అసలు ఈ తక్కువ కులాలవాళ్లతో మనకెందుకండి. వాళ్లని ఎక్కడ ఉంచాలో అక్కడ ఉంచాలి" అన్నాడు దేశ్‌ముఖ్.

"పాటిల్‌గారూ... నేను కొన్నేళ్లనుండి చెబుతున్నాను. బీదవాళ్లని దోచుకుంటే పాపం తగులుతుందని. మీరు అన్ని లాభాలు గడిస్తూ కార్మికులకు తిండికి కూడా సరిపోనంత జీతం ఇస్తే ఎట్లా చెప్పండి? ఇప్పుడు రోజులు మారుతున్నాయి. తక్కువ కులంలో పుట్టినా విఠల్ మాణిక్యంలాంటివాడు. సంస్కారం కలవాడు. ఇట్లాంటివాళ్లు చాలామంది ఉన్నారు. వాళ్లకి మనం చేయూతనివ్వాలి" అన్నాడు కులకర్ణి.

"ఆ రోజుల్లో కూడా నేను మీకు చెబుతూనే వచ్చాను. వీళ్లని చదువు చట్టుబండలు అంటూ నెత్తిన ఎక్కించుకోవద్దని. ఆ విఠల్‌గాడూ... ఆ ముచ్చు ముం... కొడుకులూ మన కాలికింద చెప్పుల్లాంటివాళ్లే. మీరే నేర్పిపెట్టారు. ఇప్పుడు వాళ్లు మనల్ని ఎదిరిస్తున్నారు.

"మరి ఎదిరించక ఏం చేస్తారు. మీరు రాబందుల్లా పీక్కుతింటున్నారు. మీరు ధనవంతులు కనక ఏమైనా చేయగలం అనుకుంటున్నారు. చాలా తప్పుగా ఆలోచిస్తున్నారు. మా అబ్బాయి వినాయకరావు ఏ తప్పు చేయడంలేదు"





"కులకర్ణీ మమ్మల్ని ఎదిరిస్తున్నారా... నేను తలచుకుంటే మిమ్మల్ని ఈ ఊరినుండే వెళ్లగొట్టగలను. బడిపంతులుగానే బతకడం నేర్చుకో... మళ్లీ ఇంకోసారి చెబుతున్నాను. వినాయకరావుని విఠల్‌తో మాట్లాడవద్దని చెప్పండి. అతడు ఏ సహాయం అడిగినా చేయవద్దని చెప్పండి"

"నేను చెప్పను. విఠల్, అతని తోటికార్మికులు తమ హక్కుల కోసం పోరాడుతున్నారు. ఎవరి దయాభిక్షలు వాళ్లకి అక్కర్లేదు"

"కులకర్ణీ... రిటైర్ అయ్యాక చెప్తాను నీపని. దయాభిక్ష లేకుండా ఎట్లా బతుకుతారో చూస్తాను" అంటూ కోపంగా శివరావుపాటిల్ బయటికి వచ్చేశాడు. జగన్నాథరావు, దేశ్‌ముఖ్ అతడిని అనుసరించారు.

చివరికి మేనేజ్‌మెంటువాళ్లు మీటింగ్ పెట్టారు. స్ట్రయిక్ చేసిన పిరీయడ్‌లో మాత్రం జీతం ఈయమన్నారు. తక్కిన షరతులకు ఒప్పుకున్నారు. తాము పూర్తిగా విజేతలు కాకపోయినా మేనేజ్‌మెంటువారు కొన్ని షరతులకైనా ఒప్పుకున్నారుకదా అని విఠల్, కార్మికులు ఎంతో సంతోషపడ్డారు.

విఠల్ నాయకుడై కార్మికులందరిని యాజమాన్యానికి వ్యతిరేకంగా తయారుచేస్తున్నాడన్న కోపం జగన్నాథరావులో ఉంది. లేట్‌గా వస్తున్నాడని, పని సరిగా చేయడంలేదని నోటీసు ఇచ్చి జగన్నాథరావు అతడిని పనిలో నుండి తీసేశాడు. విఠల్‌ని పనిలోంచి తీసేయడంవలన తోటి కార్మికులకు జగన్నాథరావు మీద కోపం వచ్చింది. వాళ్లు ఎదిరించడం మొదలుపెట్టారు. విఠల్‌తో ఉన్న మరికొందర్ని కూడా మెల్లిమెల్లిగా మేనేజ్‌మెంటువాళ్లు పనిలోంచి తొలగించడం మొదలుపెట్టారు. అందరు కలిసి మళ్లీ సమ్మె చేయాలనుకున్నారు.

సమ్మె మొదలయింది. కార్మికులందరూ ఫ్యాక్టరీకి వెళ్లడం మానేశారు. ఫ్యాక్టరీ బయట "మేనేజ్‌మెంట్ డౌన్ డౌన్, కార్మికులకు విజయం, అందర్నీ పనిలోకి తీసుకోవాలి" అంటూ అరవడం మొదలుపెట్టారు.

జగన్నాథరావు గుండాలని పిలిపించాడు. వాళ్లని కావాలని ఫ్యాక్టరీమీద, తన ఆఫీసు రూమ్‌పైన రాళ్లు విసరమని చెప్పాడు. గుండాలు బయట కార్మికుల గుంపులో కలిసిపోయి

రాళ్లు విసిరారు. జగన్నాథరావు పత్తిని ఒకచోట పోగుగావేసి నిప్పంటించాడు. మంటలు రావటంచూసి విఠల్ తరపు కార్మికులు చెల్లాచెదురయ్యారు. గబగబా నీళ్లు తెచ్చిపోశారు.

జగన్నాథరావు పోలీస్‌స్టేషన్‌కి ఫోనుచేసి విఠల్, తోటికార్మికులు కలిసి తనమీద, ఫ్యాక్టరీ మీద రాళ్లు విసిరారనీ, తన తలకి గాయాలు తగిలాయని, ఆఫీసురూమ్ అద్దాలు విరిగాయని, చాలా నష్టం కలిగిందని వెంటనే యాక్షన్ తీసుకోవాలని సబ్‌ఇన్‌స్పెక్టరుకి చెప్పాడు.

వెంటనే పోలీస్‌వాన్ వచ్చింది. సబ్‌ఇన్‌స్పెక్టర్ విఠల్‌ని, కొందరు కార్మికులని పట్టుకున్నాడు. తాము రాళ్లు విసరలేదనీ, నిప్పంటించలేదనీ, ఇదంతా జగన్నాథరావు తమపైన పగ తీర్చుకోవడానికి ఆడిన నాటకం అని విఠల్ చెప్పాడు. కాని ఎవరూ వినిపించుకోలేదు. వాళ్లని పోలీసుస్టేషన్‌కి తీసుకువెళ్లారు. జగన్నాథరావు గుండాలు కార్మికుల దగ్గరికి వచ్చి బెదిరించి, ఎక్కువ కూలి ఇస్తామని చెప్పి ఫ్యాక్టరీకి తీసుకుపోయారు. ఇక పస్తులు ఉండలేక కార్మికులు పనిచేయడం ప్రారంభించారు. ఫ్యాక్టరీ నడవడం మొదలుపెట్టింది.

జైలునుండి బయటకు వచ్చాక విఠల్‌కి తన తోటికార్మికులమీద చాలా కోపం వచ్చింది. కాని తిండికి గతిలేక వాళ్లు పనిచేయడం మొదలుపెట్టారు అని మనస్సుకు సమాధానం చెప్పుకున్నాడు. వినాయకరావు సహాయంతో విఠల్, కొందరు కార్మికులు కలిసి మేనేజ్‌మెంటు వాళ్లపై కేసుపెట్టారు.

కేసు చాలారోజులు నడిచింది. విఠల్ నిరుద్యోగిగా చాలారోజులు గడిపాడు. కేసు వెనక్కి తీసుకుంటే మళ్లీ పనిలోకి తీసుకుంటాం అని జగన్నాథరావు చెప్పాడు. విఠల్‌కి కేసు వెనక్కి తీసుకోవడం ఎంత మాత్రం ఇష్టంలేదు. అయినా తక్కిన కార్మికులు ఒప్పుకున్నారు. కేసు ఉపసంహరించుకున్నారు. కాని జగన్నాథరావు ఇక్కడ కూడా నాటకం ఆడాడు. వాళ్లు కేసు వెనక్కి తీసుకోగానే ఇదుగో ఇస్తాం, అదుగో ఇస్తాం అంటూ తమ చుట్టూ తిప్పుకుని చివరికి పనిఇవ్వకుండా ఎగ్గొట్టారు.

విఠల్ పనికోసం మళ్లీ వేట ప్రారంభించాడు. రోజులు గడుస్తుండగా ఆ ఇంటిమీద మరో పిడుగు పడ్డది. తిమ్మప్పకి పక్షవాతం వచ్చింది. మంచంమీదపడి తీసుకుని తీసుకుని చచ్చిపోయాడు.

పాండురంగ్ ఒకరోజు విపరీతంగా తాగి ఇంటికి వచ్చి మంచంమీద పడ్డాడు. క్రమంగా వెక్కిళ్లు రాసాగాయి. చేతులు కాళ్లు కొట్టుకోవడం మొదలుపెట్టాడు. ఓ రెండుగంటలపాటు స్పృహ కోల్పోయాడు. ఆ తరువాత స్పృహ వచ్చిందిగానీ విఠల్ వెళ్లి డాక్టర్‌కి చెప్పి మందు తెచ్చేలోపే చనిపోయాడు. ఇంటిల్లిపాదీ బావురుమన్నారు. లక్ష్మప్ప, రామప్ప, కొండప్ప, ఎల్లవ్వ, హనుమా గుండెలు బాదుకుంటూ ఏడవడం మొదలుపెట్టారు. విఠల్ ఎంత చెప్పినా వినకుండా వీళ్లందరు దుఃఖాన్ని మరచిపోవడానికి విపరీతంగా తాగారు.

పాడెను తయారుచేసి విఠల్‌ని కుండ పట్టమన్నారు.

శవానికి, విఠల్‌కి నీళ్లుపోసి శ్మశానానికి తీసుకువెళ్లారు. అక్కడ శవానికి నిప్పంటించారు.

విఠల్ వెక్కి వెక్కి ఏడ్చాడు.

అందరూ ఇంటికి వచ్చారు. ఆరోజు ఇంట్లో పొయ్యి వెలిగించకూడదు. వంట చేసుకోకూడదు. ఎల్లవ్వ భాకరీ (జొన్నరొట్టెలు) తెచ్చి ఇచ్చింది. విఠల్‌కి తినబుద్ధి కాలేదు "పైకి పోయేవాళ్లు ఎటూ వెళ్లిపోతారు ఏడవకు" అంటూ రామప్ప అతడిని ఓదార్చాడు.

విఠల్‌కి భూతం పట్టగూడదని రామప్ప ఒక గొడ్డలి ఇచ్చాడు. నలుపు పూశాడు. "వీడికి భూతం పట్టగూడదు" అని ముచ్చులందరు అరిచారు. పాండురంగ్ ఆత్మ విఠల్‌లో మూడు రోజులు ఉంటుందని విఠల్‌ని వేరుగా కూర్చోపెట్టారు. అతడి కంచం గ్లాసు వేరుగా పెట్టారు. ఆ మూడురోజులు అన్నం, రొట్టె ఎత్తి కంచంలో పడేశారు. నీళ్లు ఎత్తిపోశారు. తను తక్కువ కులంలో పుట్టాడని అగ్రవర్ణాలవాళ్లు తనను ముట్టుకునేవాళ్లు కాదు. ఇప్పుడు వీళ్లు ముట్టుకోవడంలేదు అని మనస్సులో అనుకున్నాడు విఠల్. పాడెను మోసినవాళ్ల భుజాల మీద నూనె, పాలు, పెరుగు పోసి వాళ్లని శుద్ధిచేస్తారు.

ఊరినది దగ్గరికి విఠల్‌ని తీసుకువెళ్లారు. పాండురంగ్‌కి ఇష్టమైన వస్తువులను తీసుకు





న్నారు. బజ్జీలు, ఆకులు, వక్క, పొగాకు, ఒకసీసా సారా కొత్త చాటలో పెట్టుకుని నది దగ్గరికి వెళ్లారు. కోడిని కోశారు. మాంసం వండారు. నైవేద్యం పెట్టారు. విఠల్‌కి జుట్టు తీసేయాలని పెద్దలు నిర్ణయించారు. విఠల్ తీయించుకోవడానికి ఇష్టపడలేదు- "నేను జుట్టు తీయించుకోను. కావాలంటే నాలుగు వెంట్రుకలు తీసుకోండి" అని అన్నాడు.

"ఒరేయ్ విఠలియా నువ్వు పట్నంపోయి పూర్తిగా చెడిపోయావురా. మన ఆచారాలంటే నీకు గౌరవంలేదు. మన ఆచారం ప్రకారం అన్నీ జరిపిస్తేనే నీ అన్నకు ఆత్మశాంతి కలుగుతుంది" అని రామప్ప అన్నాడు.

చివరికి విఠల్ జుట్టు తీయించుకోవడానికి ఒప్పుకున్నాడు. తల గొరిగించాక అతడిని నదిలో స్నానం చేయమన్నారు. తడిబట్టలతోనే ఇంటికి తీసుకువెళ్లారు. కొండప్ప చెట్లఆకులు తీసుకువచ్చి వాటిమీద విఠల్‌ని కూర్చోమన్నాడు. ఒక గ్లాసు సారా ఇచ్చాడు. విఠల్ తాగనంటే తాగనన్నాడు. అన్న ఆత్మశాంతి కోసం తాగాలి అని అక్కడ ఉన్నవాళ్లందరు అన్నారు. ఇంకేమీ మాట్లాడలేక విఠల్ తాగాడు. కోడిమాంసం ఇంకా కొన్ని పదార్థాలు నైవేద్యం పెట్టి అతడికి పెట్టారు. పొగాకు తినమని చెప్పాడు రామప్ప. విఠల్‌కి అలవాటు లేదు కనక తిననని అన్నాడు. 'మీ అన్నకి పొగాకు ఎంతో ఇష్టం తిను' అని రామప్ప బలవంతం చేశాడు. పొగాకు నోట్లో పెట్టుకున్నాడో లేదో విఠల్‌కి కడుపులో తిప్పినట్లయింది. వెంటనే ఉమ్మేశాడు. విఠల్ నెత్తిమీద చాటపెట్టారు. నదికి తీసుకువెళ్లి ఆ చాటతోసహా విఠల్‌ని మునగమన్నారు. ఆ తరువాత చాటను నదిలో పడేశారు. ఒక్కొక్కరే వచ్చి విఠల్‌మీద నీళ్లు పోశారు. ఇట్లా చేస్తే విఠల్‌లో ప్రవేశించిన పాండురంగ్ ఆత్మ సంతుష్టి చెంది వెళ్లిపోతుందని వాళ్ల నమ్మకం. విఠల్ మనస్సులో ఎన్నెన్నో ప్రశ్నలు తలెత్తాయి. చచ్చిపోయినవాళ్లు ఎక్కడికి వెళ్తారు? ఆత్మ అనేది ఉంటుందా? అసలు ఆత్మ అంటే ఏమిటి? ఒకరి ఆత్మ మరొకరిలో ప్రవేశిస్తుందా? పాండురంగ్ ఆత్మ తనలో ఎట్లా ప్రవేశిస్తుంది... తమ జాతివాళ్లకి ఆత్మలు భూతాలు ఉంటాయని చాలా నమ్మకం. కులకర్ణి మాస్టారు కొడుకు వినాయకరావు తనకి కమ్యూనిజం గురించి చెప్పాడు. కమ్యూనిజం భౌతికశక్తులను మాత్రమే నమ్ముతుందనీ, దేవుడు, ఆత్మ, పరమాత్మ, దయ్యాలు, భూతాలు, వీటిమీద కమ్యూనిజానికి నమ్మకం లేదని చెప్పాడు. దేవుడు లేడని, ధనవంతులు దేవుడిని సృష్టించి, అతడిని అడ్డుపెట్టుకుని బీదవాళ్లను దోచుకుంటున్నారని చెప్పాడు. బీదవాళ్లు, బానిసల్లాగా బతకాలని అది వాళ్ల ఖర్మ అని అంటూ దోపిడీదారులు వాళ్లని మోసపుచ్చుతున్నారని చెప్పాడు. ఫ్యాక్టరీ యజమానులు కార్మికుల శ్రమని దోచుకుంటున్నారని చెప్పాడు. గొప్ప బీద అనే భేదం లేని సమసమాజాన్ని నిర్మించడమే కమ్యూనిజం లక్ష్యం... అని చెప్పాడు. నిజమే దేవుడనేవాడు ఉంటే వాళ్లని ఎందుకింత నిక్రృష్టంగా పుట్టించాడు. దేవుడనేవాడే ఉంటే తమకు ఎందుకు న్యాయం చేకూర్చలేకపోతున్నాడు. తమకి కనీసం రెండు పూటలా తిండి దొరికేటట్లుగా ఎందుకు చేయడంలేదు. శివరావుపాటిల్, జగన్నాథరావుపాటిల్, జోసెకర్, దేశ్‌ముఖ్‌లలాంటి దుర్మార్గులను ఎందుకు శిక్షించడు?

కాని... కాని కులకర్ణి మాస్టారు తనకి దేవుళ్లను గురించి ఎన్నో కథలు చెప్పేవాడు. ఏదో ఒకరోజు దేవుడు దుర్మార్గులను శిక్షిస్తాడని చెప్పాడు. ఆయన ప్రభావం తనమీద చాలా ఉంది...

కులకర్ణి మాస్టారు కొంత డబ్బు ఇచ్చి కూరల దుకాణం పెట్టుకోమన్నాడు. విఠల్ చిన్న దుకాణం పెట్టాడు. దానిమీద వచ్చే రాబడితో అంతో ఇంతో తింటూ బతకసాగాడు.

★ ★ ★

"మా కథ విన్నారుగా... మా జాతివాళ్ల బతుకులు బాగుచేయాలని నేను ఎంతో ప్రయత్నిస్తున్నాను. కాని మా బతుకులు బాగుపడేదెప్పుడో... అసలు మా జాతివాళ్లు బాగుపడరేమో అని ఒక్కొక్కసారి నిరాశ కలుగుతుంది" అన్నాడు విఠల్ నిరాశ నిస్పృహలతో.

"మీరు చెప్పినవన్నీ విన్నాక, మీ జాతివాళ్లు ఇంత ఘోరంగా బతకడం ఈ నాగరిక సమాజానికే అవమానం అనిపిస్తోంది. విఠల్, మీరు నిరాశపడకండి. సాలీడు గూడు కట్టడాని

కి ఎన్నిసార్లు ప్రయత్నిస్తుందో మీకు తెలుసా? అది తన ప్రయత్నాలు ఎన్నిసార్లు విఫలమయినా అలసిపోదు నిరాశచెందదు. చివరికి గూడు కట్టితీరుతుంది. మీ దేశదిమ్మరుల జీవితాలు మార్చడానికి మీరు ప్రయత్నం చేయండి. నేను మీకు సహాయం చేస్తాను. మీ జీవితాలు తప్పక మారుతాయి''

''మీ పేరు?''

''భారతి...''

''భారతిగారూ... మీతో పరిచయం అవడం నా అదృష్టంగా భావిస్తున్నాను. మావాళ్లు చాలా మూర్ఖులు. ఈమధ్య జరిగిన ఒక కార్యక్రమం చూశాక ఇటువంటివి మానేయమని నేను వాళ్ళకి ఎంతో చెప్పాను. కాని చదువుకుని నువ్వు చెడిపోయావు, నువ్వు మాకు చెప్పేదేమిటి అని కొట్లాడటానికి వచ్చారు.''

''ఏవిటా కార్యక్రమం?''

''ఈమధ్య మావాళ్లలో ఒకడు పైసా పైసా కూడబెట్టి తిరుపతి వెళ్లివచ్చాడు. అతడు తిరుపతి వెళ్లివచ్చాడు కనక అతడి వెంట బాలాజీ వెంకటేశ్వరస్వామి వచ్చాడనీ, తాము తక్కువ కులంవాళ్లు కాబట్టి తమ దగ్గరికి అట్లా దేవుడు రాకూడదనీ, తమకు పాపం తగులుతుందనీ, అందరు కలిసి ఒకతంతు జరిపితే ఆ దేవుడు తిరిగి తన ఊరికి వెళ్లిపోతాడని వాళ్ల నమ్మకం''

''ఎంత అమాయకులు... సరే, ఏమిటా తంతు?''

''ఈ కార్యక్రమానికి ఆంధ్రనుండి, కర్నాటక నుండి ఎంతోమంది దేశదిమ్మరులు వచ్చారు. తిరుపతి వెళ్లివచ్చిన ఆ వ్యక్తిని ఎవరూ ముట్టుకోకుండా ఒక గదిలో వుంచారు. అందరూ తెలుగులో పాటలు పాడటం మొదలుపెట్టారు. కొందరు నృత్యం చేయడం మొదలుపెట్టారు. వాయిద్యాలు వాయించడం మొదలుపెట్టారు. ఇంట్లో నైవేద్యం సిద్ధం చేశారు. ఆ నైవేద్యాన్ని తీసుకుని ఆ వ్యక్తి దగ్గరికి వచ్చారు. అతడికి స్నానం చేయించారు. తడిబట్టలతో అతడికి ఊరి బయటిదాకా తీసుకువచ్చారు. పాటలు పాడుతూనే వున్నారు. అందరు కలిసి ఆ వ్యక్తికి నైవేద్యం తినడానికి పెట్టారు. కొంత భాగం కిందపెట్టారు. ఓ బాలాజీ దేవా! నీవు నీ ఊరు వెళ్లిపో... అంటూ అరవడం, అతడికి మొక్కడం మొదలుపెట్టారు''

''చదువు లేకపోవడంవలన మీవాళ్లు ఇంత మూర్ఖంగా ఆలోచిస్తున్నారు. విఠల్! ముందు మీ వాళ్లలో చదువుకోవాలి అన్న కోరికను కలిగించాలి. మీ వాళ్లు నాగరిక ప్రపంచానికి చాలా దూరంలో వున్నారు. ఈ ముఖ్యధారలో వాళ్లని కలపాలి. దీనికి ప్రయత్నం, సాహసం, సహనం కావాలి''

''మీకు టాక్‌ముద్దా గురించి చెబుతాను''

''టాక్ ముద్దా అంటే...''

''తరతరాలనుండి ఇక్కడి జమీందారులు, పోలీసులు ఏకమై తక్కువ కులాలవాళ్లను ఏడిపిస్తూనే వున్నారు. హింసిస్తూనే వున్నారు. ముఖ్యంగా పారధీలనే దేశదిమ్మరులు దీనికి బలిఅవుతున్నారు. పోలీసులు జమీందారుల ఉంగరాలు, గొలుసులు, గడియారాలు లాంటివి వస్తువులు తీసుకుని కావాలనే పారధీల ఇళ్లలో వాటిని పడేస్తారు. తర్వాత వాళ్ల గుడిసెలకు వెళ్లి జమీందారులు మాకు రిపోర్టు ఇచ్చారు. మీరు దొంగతనం చేశారు అని చెప్పి ఆ వస్తువులను తీసుకుని దొంగతనం నేరంమోపి జైల్లో పడేస్తారు. కేసు పెడతారు. దీనిని టాక్‌ముద్దా అని అంటారు. ఆ కేసు విడిపించుకోవడానికని దేశదిమ్మరులు తలతాకట్టుపెట్టయినా సరే, పైసలు తెస్తారు. పోలీసులకి లంచాలు తినిపించడానికి దొంగతనాలయినా సరే చేసి డబ్బు తెస్తారు. అప్పుడు పోలీసులు వాళ్లని వదిలివేస్తారు''

''అంటే ఒకరకంగా ఇది పోలీసులు, ధనవంతులు కలిసి ఆడుతున్న నాటకం అన్నమాట''

''ఉస్మానాబాద్ జిల్లాలో ఈనాడు కూడా పోలీసులు ఇటువంటి అత్యాచారాలు చేస్తూనే వున్నారు''

''ఈనాడు జమీందారీ విధానం లేకపోయినా ధనికవర్గంలో జమీందారీ స్వభావం మాత్రం పోలేదు. మీరు ఈ అన్యాయాలని అత్యాచారాలని ఎదిరించాలి''

''నేను పై అధికారులకు ఈ విషయం చెప్పి ఈ అత్యాచారాలను అంతం చేయాలని ఎంతో





ప్రయత్నించాను. కాని ఫలితం శూన్యం''

''మీ వాళ్లని మూఢాచారాలనుండి విముక్తులను చేయాలంటే ముందు వాళ్లకు చదువు చెప్పాలి. చదువుకుంటే వివేకజ్ఞానం పెరుగుతుంది. మీరు ఇక్కడ, తక్కిన ఊళ్లలో ఉన్న మీ వాళ్లందరిని పిలవండి. ఒక సంఘాన్ని స్థాపిద్దాం. మీ వాళ్లందరికి తెలిసేటట్టుగా వివరంగా అన్ని విషయాలు చెబుతాను. మీ వాళ్లకు బుర్రలు లేకకాదు బుర్రలకు పదును పెట్టేవాళ్లు లేకపోవడంవల్లనే ఇంత నిక్కష్టంగా జీవించాల్సివస్తోంది. నేను తెలుగు, మరాఠీ పుస్తకాలు తెప్పిస్తాను. మీ కులకర్ణి మాస్టారు ఇప్పుడు ఎక్కడ ఉన్నారు?''

''మాస్టారు చాలా ముసలివారైపోయారు. ప్రస్తుతం ఆయన ఈ ఊళ్లోనే ఉన్నారు. ఆయన అంటే నాకు చాలా గౌరవం. ఇప్పటికీ నేను అప్పుడప్పుడు వెళ్తూనే ఉంటాను. మీరు ఈవిధంగా అన్నారంటే ఆయన ఎంతో సంతోషపడతారు. మీరు చెప్పినట్లు చేస్తాను. మళ్లీ కలుస్తాను'' అంటూ విఠల్ వెళ్లిపోయాడు.

భారతి ఆలోచనలో మునిగిపోయింది. వీళ్ల కోసం తను ఏంచేయాలి? తను ఏం చేయగలదు? తనచేతనైనంత సహాయం వీళ్లకు చేయాలి. సుమలతను కూడా సహాయం చేయమని అడగాలి...

ఇంతలో సుమలత లలా... లలా... లలా... అంటూ హుషారుగా పాడుతూ లోపలికి అడుగుపెట్టింది.

''ఏమిటే అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు?'' అని అడిగింది సుమలత భారతి ఎదురుగుండా వచ్చి పెద్దగా చప్పట్లు కొడుతూ.

''ఈ దేశదిమ్మరులకోసం ఏం చేయగలుగుతాం అని ఆలోచిస్తున్నాను. వీళ్లకోసం సాయంత్రంపూట చదువు చెప్పటానికని స్కూల్ తెరుద్దాం అని అనుకుంటున్నాను. లతా! నీ హెల్ప్ కూడా కావాలి''

''భారతీ... వాళ్ళ గురించి మనకెందుకే... మనవాళ్ళు మనలని ఇంతదూరం పంపించింది ఉద్యోగం చేసుకోమని కాని వీళ్లని ఉద్ధరించమని కాదు''

''వెనకబడిన తరగతులవాళ్ళగురించీ, దోపిడీ చేయబడుతున్నవాళ్ల గురించీ ఆలోచించి మీరు ఇట్లా ఎందుకు బతకాలి. మీ హక్కులకోసం మీరు పోరాడండి అనే ఆలోచన వాళ్లలో కలిగించినవారిలో ఎక్కువగా మన మధ్యతరగతివాళ్ళే ఉన్నారు. కాస్తో కూస్తో చదువుకున్నవాళ్ళే వాళ్ళకోసం పోరాడినవాళ్ళు. మనం చదువుకున్నవాళ్ళం. మనకు పెద్ద పెద్ద మేడలు మిద్దెలు లేకపోవచ్చు, కిలోలకొద్దీ బంగారం లేకపోవచ్చు కాని మనకు తినడానికి తిండి, కట్టుకోవడానికి బట్ట దొరుకుతున్నాయి. ఫరవాలేదు మనది కొంతవరకు సుఖమయమయిన జీవితమే. మనలాంటి విద్యావంతులు కొంత టైమ్‌ని వీళ్లగురించి ఆలోచించేందుకు కేటాయించాలి. వీళ్లకు సహాయం చేస్తేనే మన చదువుకు సార్థకత''

''ఏమో తల్లీ... ఈ ఉపన్యాసాలు వినే ఓపిక నాకు లేదు. ఇవాళ సందీప్ వాళ్ల ఇంట్లో పార్టీ ఉంది తెలుసుగా - పార్టీకి కట్టుకోవడానికి కొత్తచీర కొనుక్కున్నాను. ఇదిగో చూడు'' అంటూ పాకెట్ విప్పింది సుమలత.

''లతా! నువ్వు ఈనాడు ఉద్యోగం చేసుకుంటున్నావు. స్వంతంత్రంగా అటూ ఇటూ వెళ్తున్నావు. ఈనాడు నీకీ స్వాతంత్ర్యం ఎంత మంది మహనీయులు ఎన్నేళ్ళు పోరాటం సాగిస్తే వచ్చిందో ఒకసారి ఆలోచించుకో. ఒకనాడు స్త్రీ కూపస్థమండూకంలా బతికేది. ఇంట్లో పొయ్యిదగ్గర పురిటి గది దగ్గర జీవితం గడిపేది. మగవాడికింద బానిసగా బతికేది. హృదయంలో మండుతున్న మంటలను కన్నీళ్లతో తడిపి ఆర్పేసుకునేది. ఆనాడు రవీంద్రనాథ్ ఠాకూర్, గురజాడ అప్పారావు, చలం, ప్రేమ్‌చంద్, మైథిలి శరణ్‌గుప్త... ఇంకా ఎందరో మహానుభావులు జీవితాంతం సమాజంతో పోరాడి ఉండకపోతే తమ అమూల్యమైన సమయాన్ని మనకోసం కేటాయించకపోతే ఈనాడు నువ్వు ఇంత సుఖంగా ఉండగలిగేదానివా! ఆనాడు చలం ఆడదాన్ని గడపదాటించకపోతే ఈనాడు నువ్విలా ఉండేదానివా? నువ్వూ ఆ పొయ్యి పొగలోనే జీవితం గడిపేదానివి. ఆనాడు స్త్రీ బంగారు భవిష్యత్తుకు వాళ్లందరు బంగారుబాట వేయకపోతే ఈనాడు నీకూ ముళ్ళబాటే గతయ్యేది''



"అబ్బబ్బ... భారతీ ఇక నీ ఉపన్యాసాలు ఆపేయి తల్లీ వాళ్ళేం చేశారో నాకెందుకు. ఈనాడు నాకు అన్నివిధాల సుఖమయ జీవితం గడిపే అవకాశం కలిగింది. నేను ఈ జీవితాన్ని జారవిడవను. నీలాగా అనవసరంగా వాళ్ళకోసం వీళ్లకోసం ఆలోచించి బుర్ర పాడుచేసుకోను. ప్రతీక్షణం మత్తుగా ప్రతిక్షణం ఆనందంగా గడపడమే నా జీవితలక్ష్యం. చూడు పార్టీకి పెట్టుకోవడానికి ఈ నెక్లెస్ కొన్నాను" అంటూ ఎర్రపెట్టె తెరిచి నెక్లెస్ చూపెట్టింది సుమలత.

"అబ్బబ్బ... నీకీ పార్టీల పిచ్చి ఎప్పుడు పోతుందే..."

"నీకు ఎంజాయ్ చేయడం చేతకాదు ఫో..." అంటూ మంచంమీద వాలింది సుమలత.

★ ★ ★

భారతి ప్రోత్సహించడంవలన విఠల్ ఉత్సాహంగా లాతూర్‌లో వున్న దేశదిమ్మరుల గుడిసెలకి వెళ్ళాడు. వాళ్ళని సాయంత్రంపూట చదువుకోవడానికి రమ్మనమని చెప్పాడు. రామప్ప, కొండప్ప, హనుమా, లక్ష్మప్ప, ఎల్లవ్వ, వామనప్ప, తులసీబాయి, నారియా ఇంకా మరికొందరు అక్కడికి చేరారు.

"మావా! సాయంత్రంపూట ఒక టీచరమ్మ మన చదువు చెబుతుంది. మీరందరు స్కూల్‌కి రావాలి" అన్నాడు విఠల్ రామప్ప దగ్గరగా కూర్చుంటూ.

"ఎవరురా ఆ టీచరమ్మ - ఆడది చదువు చెబుతుందా!" కొండప్ప ఆశ్చర్యంగా అన్నాడు.

"ఆడదైతే ఏమయింది మావా! ఆమె బాగా చదువుకున్నామె మన జీవితాలను బాగుచేయాలని ఆమె కోరిక"

"మనజాతిలో చదువుకోవడం లేదు అని నీకు ఎన్నిసార్లు చెప్పాం. ఎల్లమ్మదేవికి కోపం వస్తుంది. ఆనాడు నిన్ను స్కూల్‌కి పంపించవద్దని చెబితే మీ అయ్య వినలేదు. మనకు ఎన్ని రోగాలు వచ్చాయి. మనవాళ్ళల్లో ఎంతోమంది చచ్చిపోయారు. చదువు గిదువులు మనకు పనికిరావు" అన్నాడు కొండప్ప బీడి పడేస్తూ కోపంగా.

"మావా! రోజులు మారుతున్నాయి. మనం మారాలి"

"మన నుదిటిమీద ఇట్లాగే బతకమని దేవుడు రాశాడు. ఇట్లాగే బతకాలి" అన్నది ఎల్లవ్వ.

విఠల్ నిరాశ చెందకుండా వారందరికీ మళ్ళీ మళ్ళీ చదువు గురించి చెప్పాడు. ప్రభుత్వం చదువుకున్నవాళ్లకి కొంత డబ్బు ఇస్తుందని చెప్పాడు. చివరికి ఇద్దరు ముగ్గురు రావడానికి ఒప్పుకున్నారు.

భారతి విఠల్ కలిసి ఒక రూమ్ అద్దెకు తీసుకున్నారు. అక్కడ 'దేశదిమ్మరుల విముక్తి సంఘం' (భటక్యా విముక్త జమాతీ సంఘటన) అన్న బోర్డు పెట్టారు. ఈ వార్త ఊరంతా పాకిపోయింది. శివరావుపాటిల్, జగన్నాథరావు పాటిల్, ఔసేకర్, దేశ్‌ముఖ్‌లు ఆశ్చర్యపోయారు.

ఓరోజు స్కూల్ నడుస్తుండగా ఎల్లవ్వ వచ్చింది.

"ఓ పోరడా! ఇక్కడ కూర్చున్నావేం. రేపు తుల్‌జాపూర్ జాతర ఉంది పద. మన టోలీవాళ్ళు వెళ్తున్నారు" అంటూ ఓ పిల్లవాడి భుజాన్ని పట్టుకుని లేపింది.

"వాడు రాడు. ఇక వాడు దొంగతనాలు చేయడు. వాడిని చదువుకోనీ" అంది భారతి.

"ఓ టీచరమ్మా... నీవు మా కడుపులు కొడుతున్నావు. ఈ చదువులు మాకెందుకు?" అంటూ ఆ పిల్లవాడిని బరబరా ఈడ్చుకుపోయింది ఎల్లవ్వ.

ఆ తరువాత ఆ పిల్లవాడి దీనగాథ భారతి తెలుసుకుంది. ఆ పిల్లవాడి తల్లిదండ్రులు దొంగతనం చేసేవాళ్ళు. ఒకసారి పట్టుబడ్డారు. వాళ్లదగ్గర ఉన్న డబ్బంతా పోలీసులు తీసుకున్నారు. చివరికి టిక్కెట్లకి డబ్బులు లేక తమ రెండేళ్ల కూతురును రెండొందలకు అమ్మేశారు. పిల్లవాడిని దగ్గర పెట్టుకుని వాడికి దొంగతనం నేర్పించారు.

మరో ఇద్దరి పిల్లల హృదయవిదారకమైన కథ కూడా విన్నది భారతి. ఆ పిల్ల తల్లి, తండ్రి దొంగతనాలు చేసేవాళ్ళు. తండ్రి హఠాత్తుగా జబ్బుపడి మందు, మాకు లేక చచ్చిపోయాడు. తల్లి బోలెడంత బంగారం దొంగ




తనం చేసి తీసుకువచ్చేది. షోలాపూర్‌లోని ఒక కోమటివాడికి అమ్మింది. ఆ కోమటాడు పది తులాల బంగారం ఉంటే ఐదు తులాలు ఉందని అబద్ధం చెప్పి ఐదుతులాలకే డబ్బు లెక్కకట్టి ఇచ్చేవాడు. ఈమె దొంగసొమ్ము కొని ఈమెను దోపిడీ చేసి ఆ కోమటివాడు మూడంతస్థుల బిల్డింగ్ కట్టాడు. హఠాత్తుగా ఆమె చనిపోయింది. ఆమె పిల్లలు దిక్కులేనివాళ్ళయ్యారు. ఆమె పిల్లలకు టోలీలోనివాళ్ళు దొంగతనం చేయడం నేర్పించారు. వాళ్ళు చిన్నపిల్లలు కావడంవలన పోలీసులకు భయపడి మేం దొంగతనం చెయ్యం అని టోలీవాళ్లని ఎదిరించేవాళ్ళు. వాళ్లని టోలీవాళ్ళు అనేక హింసలు పెట్టి దొంగలుగా తయారుచేశారు. పట్టుబడితే దొంగ పట్టుబడకపోతే దొర... ఈమె దొంగసొమ్ము తీసుకునేకదా ఆ షావుకారు అంత ధనవంతుడయ్యాడు. కాని అతడిని ఎవరూ దొంగ అనరు. అతడు దొరలా బతుకుతున్నాడు అనుకుంది భారతి.

భారతి ఎంతో శ్రద్ధ తీసుకుని దేశదిమ్మరులకు చదువు నేర్పేది. నెమ్మది నెమ్మదిగా వారి సంఖ్య ఎక్కువ కాసాగింది. వామనప్పలో కొంత మార్పు వచ్చింది. దొంగతనాలు చేయడం పూర్తిగా మానేశాడు. అతనూ, భార్య తులసీబాయీ భారతి చెప్పేవన్నీ శ్రద్ధగా వినడం మొదలుపెట్టారు. తన కొడుకు నారియాని కూడా స్కూల్‌కి తీసుకువచ్చేవాడు. భారతి వామనప్పకి కొంత డబ్బు సహాయం చేసింది. ఆ డబ్బుతో అతడు విస్తళ్ళు కుట్టి అమ్మి జీవించసాగాడు.

ఆరోజు కవ్‌ఠా అనే ఊరునుండి ఓ ఇద్దరు పాథ్‌రూట్ జాతివాళ్ళు విఠల్ దగ్గరికి వచ్చారు. వాళ్ళు చెప్పిన విషయాలు విన్నాక విఠల్‌కి చాలా కోపం వచ్చింది. తను వెంటనే ఆ ఊరుకి వస్తున్నానని చెప్పి వాళ్లని పంపించాడు. ఆ తరువాత భారతిని కలిశాడు.

"భారతిగారూ... నేను కవ్‌ఠాకి వెళ్తున్నాను"

"ఇంత హఠాత్తుగా..."

"కవ్‌ఠాలో మావాళ్ళందరిని గ్రామ పెద్దలు విపరీతంగా కొట్టారు. అక్కడినుండి ఇద్దరు వచ్చారు"

"మీవాళ్లని కొట్టారా?... ఎందుకు?"

"మహాదేవ జాతరకి ప్రతీ ఏడాది పట్టీ పేరున మావాళ్లదగ్గరనుండి గ్రామపెద్దలు పైసలు వసూలుచేస్తారు. మావాళ్ళు దొంగతనాలు చేసి కాస్తో కూస్తో సంపాదిస్తారు. అందులో మూడొంతులు ఈ గ్రామపెద్దలకు ఈయక తప్పదు. జాతరకి పట్టీ కట్టకపోతే ఆ దేవుడికి తమ కులంవాళ్లమీద కోపం వస్తుందని, కోపం వస్తే తాము నాశనం అయిపోతామని మావాళ్లకు నమ్మకం"

"ఎంత అన్యాయం... ఒక్కపూట అయినా కడుపు నింపుకోవడానికి నోచుకోని మీదగ్గరా వాళ్ళు డబ్బులు తీసుకునేది. మహాదేవుడి పూజ ఎంతో పవిత్రమయింది. దొంగతనం చేసిన డబ్బులు ఎట్లా పనికివస్తాయి"

"వాళ్లకి కావలసింది డబ్బు. ఏవిధంగా సంపాయించారు అన్న ప్రశ్నకాదు. మాజాతివాళ్లదగ్గర డబ్బులు లేకపోతే ఆ గ్రామపెద్దలే రేపు అక్కడ జాతర ఉంది, ఇక్కడ జాతర ఉంది వెళ్ళి ముచ్చులు చేసిరండి అని చెబుతారు. నేను ఆమధ్య మూడునాలుగుసార్లు కవ్‌ఠా వెళ్ళాను. మాజాతివాళ్లందరిని ఏకంచేసి మన సంఘం గురించి చెప్పాను. మనవాళ్లకు ఎటువంటి అన్యాయం జరిగినా ఇక సహించేది లేదు. మీకు అన్నివిధాల సంఘం తరఫునుంచి సహాయం అందుతుంది అని చెప్పాను. అప్పటినుండి వాళ్లల్లో కొంత ధైర్యం వచ్చింది"

"ధైర్యం రావాలనే మనం కోరుకుంటున్నాం"

"ఆ ధైర్యంతోటే వాళ్ళు ఈసారి పట్టీ కట్టం అని చెప్పారుట"

"చాలా మంచిపని చేశారు"

"మాజాతివాళ్ళు ఇంత ధైర్యంగా ఇంతకు ముందెప్పుడూ గ్రామపెద్దలకు ఎదురుమాట చెప్పలేదు. ఎప్పుడూ గొర్రెలలాగా తలవంచుకునేవాళ్ళు"

"ఇక అట్లా తల వంచాల్సిన పనిలేదు"

"ఎదిరించినందుకు గ్రామపెద్దలు మా జాతివాళ్లను లాఠీలతో కొట్టారు. పెద్దవాళ్లను కొట్టడమేకాక పిల్లలపైన కూడా ఇష్టంవచ్చినట్లు అత్యాచారాలు జరిపారు"

"మీరు వెళ్ళి వెంటనే పోలీసులను పిలిపించండి"

"మావాళ్ళు పోలీసులకు చెప్పారటకాని, వాళ్ళు ఈ విషయాన్ని పట్టించుకోలేదు. సంవత్సరం పొడుగునా ఉండే గొడవలే ఏమైనా చేసుకోండి మేం రాం అన్నారుట"

"అయితే మరి మీరిప్పుడేం చేయదలచుకున్నారు"

"నేను పదిమంది గూండాలను తీసుకువెళ్తాను. ఆ గ్రామ పెద్దలకు బుద్ధిచెబుతాను" అతనిలో ఆవేశం ఉప్పొంగింది.

"ఈ పద్ధతి మంచిది కాదు, దీనివలన రక్తపాతం తప్ప మరేమీ జరగదు"

"వాళ్లకి బుద్ధి చెప్పే మార్గం ఇది ఒక్కటే"

"మీరు జైలుపాలు కావాల్సి వస్తుంది. అప్పుడు మీవాళ్ళకు మీరు ఏం చేయగలుగుతారు?"

"మరయితే ఏంచేయమంటారు?"

"వాళ్ళల్లో హృదయ పరివర్తన తేవాలి"

"భారతీదేవీ... మీరు ఈ లోకంలోనే ఉన్నారా? వాళ్ళు మనుష్యులయితేగా వాళ్లల్లో హృదయం ఉండటానికి. వాళ్లల్లో పరివర్తన తీసుకురావడం ఈ జన్మలో జరగదనిపిస్తోంది. నా చిన్నప్పటి సంఘటన ఒకటి చెబుతాను. వాళ్ళెంత క్రూరులో వాళ్ళెంత హృదయవిహీనులో మీకు అర్థం అవుతుంది. కవ్‌ఠాలో మాదగ్గరి బంధువులు చాలామంది ఉన్నారు. నా చిన్నప్పుడు మా అమ్మ నన్ను అక్కడికి తరచు తీసుకువెళ్తూ ఉండేది. మహాదేవ జాతరప్పుడు నేను అక్కడే ఉన్నాను. పట్టీ ఈయడంకోసం మా సంతముచ్చులు దొరికిన చోటల్లా ధొంగతనం చేశారు. వాళ్లల్లో భగవానప్పకి ఆరోగ్యం సరిగాలేక ముచ్చులకి వెళ్లలేదు"

"నేను వెళ్లలేను, నాదగ్గర డబ్బులు లేవు మళ్ళీ వచ్చే సంవత్సరం పట్టీ కడతాను" అన్నాడు.

"అబద్ధాలు చెబుతావా"అని అతడిని కొట్టారు. జ్వరంగా ఉండటంవలన బాగా నీరసపడిపోయాడు. అయినా అతడు గ్రామపెద్దలకు దండం పెట్టి మళ్ళీ అదే మాట చెప్పాడు. వాళ్ళేం చెప్పారో తెలుసా..."ఇహ నువ్వు ముచ్చులు చేయకుండా నీ చేతులే కొట్టేస్తాం అని గొడ్డలితో రెండు చేతులను నరికేశారు"

"అబ్బా..." భారతి బాధగా అంది.

"ఎంత క్రూరులో ఇప్పుడు అర్థం అయిందా. భారతిగారు... ఈ ధనవంతులకు మనస్సు ఉండదు. నేను వెంటనే వెళ్ళాలి. మిమ్మల్ని మళ్ళీకలుస్తాను" అంటూ విఠల్ వెళ్ళిపోయాడు. భారతి బాధగా నిట్టూర్చింది.



విఠల్ కవ్‌ఠా వచ్చాడు. దేశదిమ్మరుల గుడిసెలకి వెళ్ళి వాళ్ళతో మాట్లాడాడు. అక్కడ హృదయవిదారకమైన దృశ్యాలు చూశాడు. గూండాలచేత గ్రామపెద్దలను కొట్టించాలనుకున్నాడు. కాని అతడి మనస్సు ఒప్పుకోలేదు. ఉమర్గా వెళ్ళి ఈ విషయం పోలీసులకి చెప్పాడు. అంతక్రితంరోజే అక్కడికి వెళ్ళామని దేశదిమ్మరులు అనవసరంగా సర్పంచ్‌ని కొట్టారనీ, గ్రామపెద్దల తప్పు ఏమీ లేదనీ ఎస్.పి. చెప్పాడు. రిపోర్టు వ్రాయడానికి నిరాకరించాడు. విఠల్ ఇక ఏమీ చేయలేక లాతూర్‌కి వచ్చాడు.

భారతికి సంగతంతా చెప్పాడు. భారతి ఈ విషయాన్ని వార్తాపత్రికలకి ఈయమని చెప్పింది. లాతూర్‌నుండి వెలువడే ఓ దినపత్రిక ఆఫీసుకు వెళ్ళి ఎడిటర్‌కి ఈ విషయం చెప్పాడు విఠల్. మరునాడు 'కవ్‌ఠా గ్రామంలోని దేశదిమ్మరులమీద గ్రామపెద్దల అత్యాచారాలు' అన్న పతాక శీర్షికన ఈ వార్త వచ్చింది.

రోజులు గడుస్తున్నాయి. భారతి మొదలు





పెట్టిన 'దళిత జాగృతి' కార్యక్రమం చుట్టుప క్కల ఊళ్లవరకు పాకింది. విఠల్ ఈ పనిమీద ఊరూరా వాడవాడలా తిరగసాగాడు.

లాతూర్‌కి దగ్గరగా ఉన్న మరో ఊళ్ళో వామన్ అనే అతను హత్యచేయబడ్డాడు. ఆ ఊరినుండి జాధవ్ అనే వ్యక్తి విఠల్ దగ్గరకి వచ్చాడు.

వామన్ మరాఠాల బావిలోంచి నీళ్ళు తీసుకోవడంవలన నువ్వు అస్పృశ్యుడివి, నీళ్ళు ఎందుకు తీసుకున్నావ్ అని కొట్టారు.

వామన్ వాళ్లని ఎదిరించాడు. మాటామాటా పెరిగింది. మమ్మల్నే ఎదిరిస్తావా అని అంటూ అతడిని హత్యచేశారు.

వెంటనే విఠల్ వెళ్ళాడు. పోలీసులకి ఈ విషయం చెప్పాడు. కొన్నిరోజుల తరువాత ఆ హంతకుడిని పట్టుకున్నారు. కాని అతడికి ఏ శిక్షా పడలేదు. ఆ ఊరి పాటిల్, గ్రామపెద్దలు పోలీసులకి లంచాలు పోసి హంతకుడిని విడి పించారు.

విఠల్ భారతికి ఈ విషయం చెప్పాడు.

"ప్చ్... ఎంత అన్యాయం... మీరు అధైర్యప డకండి. ఇన్ని సంవత్సరాలనుండి వాళ్ళు చేస్తున్న అత్యాచారాలను సహిస్తూ వాళ్లన్నదాని కి తల ఊపుతూ బతికారు. కనీసం తలెత్తి వాళ్ళతో మాట్లాడే ధైర్యంలేనివాళ్ళు ఈనాడు మామీద ఈ అత్యాచారాలు ఎందుకు జరుపు తున్నారని అడిగేదాకా వచ్చింది. అంటే మీరు మొదటిమెట్టు ఎక్కారన్నమాట"

"ఆ మొదటిమెట్టు మా చేయి పట్టుకుని ఎక్కించింది మీరే భారతిగారూ..."

"ఇందులో నేనుచేసింది ఏముందని. మెల్లి మెల్లిగా మీ జాతివాళ్లలో ఎదిరించగల ధైర్యం వస్తోంది. ఈనాడు పోలీసులదాకా వెళ్ళి రిపోర్టు ఈయగల ధైర్యం వచ్చింది. రిపోర్టు ఇచ్చినా ఏం లాభం, హంతకులకు, అత్యాచారాలు జరిపే పెద్దపదవులలో ఉన్న వాళ్లకు ధన వంతులకు ఎటువంటి శిక్ష పడటంలేదు అని మీరనవచ్చు. విఠల్... మీరు నిరాశ చెంద కండి. ఈనాడు వాళ్లకి శిక్ష పడకపోవచ్చును. కాని వాళ్ల రాజ్యం ఎక్కువకాలం సాగదు. మీరు రేపటి విఠల్‌గా ఆలోచించండి. దళితులకు పీడితులకు విజయం తప్పదు"

"మీమాటలు నాకు ఎంతో ధైర్యాన్ని ఇస్తాయి. రాత్రింబవళ్ళు నేను మా దేశదిమ్మ రుల గురించే ఆలోచిస్తాను. నేను ఇతర ఊళ్లకి కూడా వెళ్లామనుకుంటున్నాను. ఆ తరువాత పట్నాలకు వెళ్ళివస్తాను"

"తప్పకుండా వెళ్ళండి. మీ జాతివాళ్ళను మేల్కొలపండి. ఈ దళిత జాగృతి కార్యక్రమా న్ని మీరు నిరంతరం కొనసాగించండి. ఇప్పు డు ప్రభుత్వం అక్కడక్కడ ఉచిత భోజనం, ఉచిత వసతి గృహాలు, ఉచిత విద్య, దళితు లకోసం ఏర్పాటుచేసింది. కాని ఇటువంటివి వేళ్లమీద లెక్కపెట్టవచ్చు. మీరు వీటి సంఖ్య పెంచాలని గవర్నమెంట్‌కి అర్జీ పెట్టండి. మనం ఎటూ దేశదిమ్మరుల విముక్తి సంఘం రిజిస్టర్ చేయించాము కాబట్టి ఒక లెటర్‌పాడ్ కొట్టించండి. విరాళాలు వసూలుచేయండి. ప్ర తీచోట సాయంత్రంపూట మీవాళ్లకి స్కూల్ ఏర్పాటుచేయించండి"

"ప్రతీచోట టీచర్లు, లెక్చరర్లు ఈ పని చేయడానికి ఒప్పుకోవాలిగా"

"ప్రేమ, కరుణలు కల హృదయాలు ప్రతి చోటా తప్పకుండా ఉంటాయి, ట్రైచేయండి"

"మళ్ళీ కనిపిస్తాను" అంటూ విఠల్ వెళ్ళి పోయాడు.

★ ★ ★

ఓరోజు భారతి విఠల్ మాట్లాడు కుంటూండగా ఎల్లవ్వ వచ్చి పెద్దగా ఏడ వటం, గుండెలు బాదుకోవడం మొదలుపె ట్టింది. "నా రెండో కోడలిని పోలీసులు పట్టుకె ళ్ళారు విఠలియా..." అంటూ పెద్దగా రాగాలు తీయడం మొదలుపెట్టింది.

"ఎందుకు తీసుకుపోయారు?" అడిగాడు విఠల్.

"అది బాలింతరాలు. తినడానికి తిండికి లేక అది పిల్లల ఆపరేషన్ చేయించుకుంది. సర్కార్ దానికి రెండొందల రూపాయలు ఇచ్చింది. అది జొన్నలు కొనుక్కుంది. ఇన్ని జొన్నలు కొనడానికి నీకు డబ్బెక్కడిది. ఎక్కడ ముచ్చులు చేశావు? అని పోలీసులు దాన్ని కొట్టారు. అది తను ముచ్చులు చేయలేదని ఎంతో మొత్తుకుంది. అయినా వాళ్ళు వినలే

దు. జైల్లో పడేశారు. పిల్లవాడు పాలకోసం ఏడుస్తున్నాడు''

విఠల్ వెంటనే పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళి ఆమెను విడిపించాడు. విఠల్‌కి 'సంఘం' తరఫున తిరగడంవలన కొంతమంది పెద్దపెద్ద అధికారులతో పరిచయం అయింది. అతడి పేరు అందరినోట్లో నానడం మొదలుపెట్టింది. ''దేశదిమ్మరుల విముక్తి సంఘం'' గురించి చాలా మందికి తెలిసిపోయింది.

శివరావుపాటిల్ ముసలివాడయ్యాడు. కాని చింత చచ్చినా పులుపు చావదన్నట్లు అతడిలోని అహంకారం చావలేదు. ఊరంతటికీ తామే అధికారులం అన్న భావం అసలే చావలేదు. ఇది తరతరాలనుండి వాళ్ళ రక్తంలో కలిసిపోయింది. అతడు పేపర్లో విఠల్ పేరు చదవగానే మండిపడేవాడు. అతడి ఉద్దేశ్యంలో వీళ్లందరూ కాలికింద ఉండాల్సిన చెప్పులలాంటివాళ్ళు. కాని ఎప్పుడో ఒకప్పుడు కాలికింద చెప్పు కూడా తిరగబడి చెంప వగలకొడుతుందనీ, ఆ చెంపదెబ్బ జన్మజన్మలకు గుర్తుండేలా బాధ కలిగిస్తుందన్న జ్ఞానం అతనికి లేదు.

అతడి కొడుకు జగన్నాథరావు చేతిలో మూడు ఫ్యాక్టరీలు ఉన్నాయి. ధనికవర్గపు స్వభావం అతడిలో కావలసినంత ఉంది. మాధవరావు ఔసేకర్‌కు పక్కఊళ్ళో ఉన్న షుగర్ ఫ్యాక్టరీకి ఛైర్మన్ అయినప్పటినుండీ అతడికీ పొగరు ఎక్కువయింది. దత్తాత్రేయ దేశ్‌ముఖ్ బీద బ్రాహ్మణుడు. చదువుకున్నవాడు. సంస్కృతం మరాఠీ, ఇంగ్లీషు, హిందీలలో మంచి జ్ఞానం ఉన్నవాడు. వేదాలను ఔపోసన పట్టిన మహా పండితుడు. కాని అతని జ్ఞానం అంతా బూడిదలో పోసిన పన్నీరయింది. దుర్మార్గులైన ధనికవర్గంతో చేతులు కలవడంవలన స్వయంగా అతడు ఎదగలేకపోయాడు. సమాజానికి పంచి ఇవ్వాల్సిన జ్ఞానాన్ని బూడిదపాలు చేశాడు. తనకు తెలియకుండానే శివరావుపాటిల్ బానిస అయ్యాడు. ఈ దుష్టచతుష్టయం విఠల్ అందరిదగ్గర మంచిపేరు తెచ్చుకోవడం, లీడరు అవడం ఏమాత్రం సహించలేకపోయారు. ఏవిధంగానయినాసరే విఠల్‌ని, అతని జాతివాళ్లని ఏడిపిస్తేకాని వాళ్లకి నిద్రపట్టేదికాదు.

జగన్నాథరావు తన పరుసు పోయిందని అందులో దాదాపు మూడువేల రూపాయలు ఉన్నాయని పోలీసులకు రిపోర్టు ఇచ్చాడు. సబ్‌ఇన్‌స్పెక్టర్ దేశదిమ్మరుల గుడిసెలకు వచ్చాడు.

ఓ పోలీస్ కాన్‌స్టేబుల్ గుడిసెల్లో జొరబడి ఉన్న సామానంతా బయట పడేశాడు. ఏ గుడిసెలోనూ రెండేసి ఇత్తడి పళ్ళాలు, రెండు మూడు జర్మన్ సిల్వర్ బొచ్చెలు, కుండలు, చినిగిన పాత బొంతలు తప్ప మరేమీ లేవు. చివరికి వామనప్ప గుడిసెలో పరుసు దొరికింది. రామప్ప, లక్ష్మప్ప, ఎల్లవ్వ, అందరు ఆశ్చర్యపోయారు. వామనప్పకి ఈ పరుసు తన గుడిసెలోకి ఎట్లా వచ్చిందో ఎంతకీ అర్థంకాలేదు. తను దొంగతనం చేయడం పూర్తిగా మానేశాడు.

వామనప్ప భార్య తులసీబాయి జ్వరంతో మంచం మీద పడిఉంది.

''పదరా... స్టేషన్‌కి పద...'' సబ్ ఇన్‌స్పెక్టర్ బూట్ కాలితో వామనప్పను తన్నాడు.

''మై బాప్ నేను దొంగతనం చేయలేదు మై బాప్...'' అంటూ ఇన్‌స్పెక్టర్ కాళ్ళు పట్టుకున్నాడు వామనప్ప.

''మీకెన్నిసార్లు చెప్పినా వినరు. ఎన్నిసార్లు జైల్లో తోసినా దొంగతనం చేయడం మానరు. లేవే ఇంకా పడుకుని ఉన్నావేం?'' అంటూ తులసీబాయిదగ్గరికి వెళ్ళాడు కాన్‌స్టేబుల్.

''నాకు బాగా జ్వరంగా ఉంది. నేను లేవలేను'' అంది నీరసంగా తులసీబాయి.

''నీ జ్వరం గిరం వదులుస్తాను... ఊం... నాటకాలు ఆడుతున్నావా?'' అంటూ ఆమె జుట్టుపట్టి లాగాడు సబ్‌ఇన్‌స్పెక్టర్.

''తిన్నదంతా ఎటుపోయిందే. అంత నీరసంగా ఉందా... ఇంకో నాలుగు తంతే నీ నీరసం పరుగెత్తుకుని పారిపోవాలి'' అంటూ బూటుకాలితో తన్నాడు ఇన్‌స్పెక్టర్.

''అమ్మా... అమ్మా...'' అంటూ ఆమె మూలుగుతోంది. కళ్ళ వెంబడి ధారలుగా నీళ్ళు కారుతున్నాయి.

''మై బాప్ నేను ముచ్చులు చేయలేదు. ఈ





పరును నా గుడిసెలోకి ఎట్లా వచ్చిందో నాకు తెలియదు''

రామప్ప, లక్ష్మప్పలకు వామనప్పను చూస్తే చాలా జాలివేసింది. ''మై బాప్... వామనప్పను వదిలివేయండి. వాడు దొంగతనం చెయ్యలేదు'' అన్నారు.

''మరి మీరు చేశారా... పదండి జైల్‌కి'' అంటూ అక్కడున్న కుండల్ని తన్నాడు ఇన్‌స్పెక్టర్.

కుండలు పగిలి నీళ్ళు ఒలికిపోయాయి.

తులసీబాయికి బాధ, కోపం రెండు కలిగాయి. ''మై బాప్ అసలే నీళ్ళు దొరకడంలేదు. కుండలని తన్నే అవసరం ఏమిటి?''

''ఏవే! మాటలు ఎక్కువగా మాట్లాడుతున్నావ్? నీకు ఈ కొత్తచీర ఎక్కడిది? ఎక్కడ దొంగతనం చేశావు చెప్పు?'' అంటూ ఆమె చెంపమీద ఛెళ్ళున వేశాడు ఇన్‌స్పెక్టర్.

''ఈ చీర చాలా పాతది. చూడండి రంగు పోయింది''

''అది నీకళ్లకు పాతదానిలా కనిపిస్తోందా. చెప్పు ఎక్కడనుండి తెచ్చావో? లేకపోతే చీర విప్పేస్తా'' ఇన్‌స్పెక్టర్ కళ్ళు పెద్దవి చేశాడు.

ఆ తరువాత వామనప్పని పోలీసులు స్టేషన్‌కి లాక్కుంటూ వెళ్ళారు. ఇన్‌స్పెక్టర్ ఎవరూ లేనప్పుడు పరును తెరచి చూశాడు. అందులో మూడువేలు ఉన్నాయి. ఒక వెయ్యి తీసి జేబులో వేసుకున్నాడు.

పోలీసులు వామనప్ప మీద ఎన్నో అత్యాచారాలు చేశారు. కళ్లల్లో కారం చల్లారు. నానా హింసలు పెట్టారు.

ఆ హింసలు భరించలేక వామనప్ప తనే ఈ దొంగతనం చేశానని ఒప్పుకున్నాడు. కోర్టువాళ్ళు అతనికి రెండువేల రూపాయల జరిమానా వేశారు.

కొండప్ప జగన్నాథరావు పాటిల్ దగ్గరికి వెళ్ళాడు ''మీరు చెప్పిన పనిని చేశాను. నాకు ఇస్తానన్న రెండు వేలు ఇవ్వండి'' అని అడిగాడు.

జగన్నాథరావు ఇవాళరా రేపురా అని అంటూ అతడి చేతిలో రెండొందలు పెట్టాడు. కొండప్పకి చాలా కోపం వచ్చింది. రెండువేలు దొరుకుతాయన్న దురాశతో ఎంత తప్పు పనిచేశాడు. పాటిల్ మాట విని తను వామనప్ప గుడిసెలో పరును పడేశాడు. తను ఎంతో తప్పు పని చేశాడు. ఏ పాపం ఎరుగని వామనప్ప ఎన్ని హింసలు భరించాడు.?

వామనప్ప డబ్బుకోసం వేట ప్రారంభించాడు. దొంగతనం చేయకూడదు అనుకున్నాడు గానీ మరీ అంత డబ్బు ఎట్లావస్తుంది?

వామనప్ప జగన్నాథరావుపాటిల్ దగ్గరికి వెళ్ళి డబ్బు అడిగాడు. వడ్డీ ఇస్తానన్నాడు.

''ఎవడురా వచ్చింది?'' అడిగారు శివరావు పాటిల్.

''నాన్నగారూ!...వామనప్ప వచ్చాడు''

''వాడా ముచ్చువెధవ... అయినా ఈ మధ్య ఒకసారి వీడిని పిలిపిస్తే రానేరాలేదు. ఇంట్లో లేడుట. వీడి పెళ్ళాం వీడు స్కూల్‌కి వెళ్ళాడు అని చెప్పిందిట''

''అవును...నేను, నా పెళ్ళాం తులసీబాయి, నా కొడుకు నారియా సాయంత్రం స్కూల్‌కి వెళ్తున్నాము. ఈమధ్య అసలు దొంగతనాలే చేయడంలేదు. విస్తళ్ళు కుట్టి అమ్ముతున్నాను''

''మీకు చదువు ఎవరు నేర్పిస్తున్నారురా...''

''ఒక మాస్టరమ్మ ఉంది. చాలా మంచిది. మా విఠల్ కూడా మాకు సహాయం చేస్తున్నాడు''

''మాస్టరమ్మ... మాస్టరమ్మ అని అందరినోట వింటున్నాం. ఎవరు రా అది? దాన్ని ఒకసారి చూడాలని ఉంది. పనీ పాటూ లేదేమో మీకు చదువులు చెప్పడం మొదలుపెట్టింది''

''అట్లా అనకండి మై బాప్... ఆమె చాలా మంచిది. ఆమె కాలేజీలో పనిచేస్తోంది.''

''మీకు చెప్పడం మరచిపోయాను. దానిపేరు భారతిట. అభ్యుదయ కాలేజీలో పనిచేస్తోంది. ఆ పిట్ట మన చేతిలోనే ఉంది నాన్నగారూ...'' పళ్ళు ఇకిలిస్తూ అన్నాడు జగన్నాథరావు.

''మైబాప్ నాకు రెండువేల ఐదువందలు ఇప్పించండి- వడ్డీ కడతాను'' మళ్ళీ అడిగాడు వామనప్ప.

"ఎందుకురా?" అడిగాడు శివరావుపాటిల్ దగ్గుతూ.

"పోలీసులు నన్ను దొంగతనం చేశావంటూ పట్టుకున్నారు. నేను దొంగతనం చేయకున్నా జరిమానా వేశారు"

"దొంగతనం చేయకపోతే వాళ్ళు జరిమానా ఎందుకు వేస్తారు. మీ జాతే అంత ముచ్చు ముం... థూ, మీ బతుకులు పాడుగాను" ఉమ్మేస్తూ అన్నాడు జగన్నాథరావు.

"డబ్బిస్తాం కాని నీకొడుకుని నా దగ్గర ఉంచు. నీవు అప్పు తీర్చేదాకా వాడు ఇక్కడే ఉండాలి- తెలిసిందా" అంటూ మీసం తిప్పాడు శివరావుపాటిల్.

"నారియాని... నారియాని మీ దగ్గర... నరే అప్పు తీర్చేదాకా ఉంచుతాను" అన్నాడు వామనప్ప. అతడి కళ్లల్లో నీళ్ళు తిరిగాయి.

జగన్నాథరావు దగ్గర డబ్బు తీసుకుని ఇన్‌స్పెక్టర్‌కి ఇచ్చాడు వామనప్ప. ఇన్‌స్పెక్టర్ ఐదొందలు తన జేబులో వేసుకుని తక్కిన రెండువేలు కోర్టువాళ్లకు ఇచ్చాడు.

కొండప్ప వెళ్ళి విఠల్‌కి ఈ సంగతి చెప్పాడు. విఠల్ కొండప్పని తీసుకుని ఇన్‌స్పెక్టర్ దగ్గరికి వెళ్ళాడు. పై అధికారులకు ఈ విషయం తెలుపుతానని ఇన్‌స్పెక్టర్‌తో అన్నాడు. ఇన్‌స్పెక్టర్ విఠల్‌కి క్షమాపణ చెప్పుకున్నాడు. కొంత డబ్బు వామనప్పకి ఇచ్చేశాడు. అయినా విఠల్ ఊరుకోలేదు. వామనప్ప చొక్కా ఎత్తి అందరికి చూపించాడు. శరీరం గాయాలతో నిండిపోయింది. పోలీసులు కొడుతున్నప్పుడు బెల్ట్ బకిల్ వామనప్ప కంటికి తగిలింది. అక్కడ గాయం ఏర్పడ్డది. ఈ వార్తను విఠల్ పేపర్లకు ఇచ్చాడు. జగన్నాథరావు బండారం కూడా బయటపెట్టాడు.

విఠల్ ఇదంతా కావాలని చేస్తున్నాడనీ తనకు ఏమీ తెలియదనీ పత్రికలో తిరిగి ప్రకటించాడు జగన్నాథరావు. పోలీసులపై చర్య తీసుకోవాలని గాయక్‌వాడ్ మీటింగులు పెట్టి వాదించాడు. పోలీసులపై గవర్నమెంటు ఏ చర్య తీసుకోలేదు కాని రెండువేల రూపాయలు తిరిగి ఇచ్చేశారు. వామనప్ప డబ్బు తీసుకు వెళ్ళి పాటిల్‌కి ఇచ్చాడు. తక్కిన డబ్బు మళ్ళీ ఇస్తానంటూ బతిమిలాడి, కాళ్ళు పట్టుకుని నారియాని విడిపించి తెచ్చుకున్నాడు.

★ ★ ★

ధోకీ అనే గ్రామంలో ఏడు మంది పారధీవడ్డర్ అనే దళితజాతివాళ్లను ఆ గ్రామ పెద్దలు కొందరు గుండాలచేత సజీవ సమాధి చేయించారు. వాళ్ల పిల్లలు అనాథలయ్యారు. ఈ విషయం తెలియగానే విఠల్ ఆ ఊరు వెళ్ళి వాళ్లల్లో ముగ్గురి పిల్లలని లాతూర్‌కి తీసుకువచ్చాడు. తనకు తెలిసిన కంపెనీలో చిన్న ఉద్యోగం ఇప్పించాడు. ఇంతలో అతడు మరో ఊరు వెళ్లవలసి వచ్చింది. ఈ లోపల ఆ ముగ్గురు పిల్లలని పోలీసులు పట్టుకుని బాగా కొట్టారు. అక్కడి నుండి ఇక్కడికి ఎందుకు వచ్చారు. ఇంక ఇక్కడికి రాకండి వచ్చారంటే చంపేస్తాం అంటూ వాళ్లని బెదిరించారు. ఆ పిల్లలు ఉంటున్న ఇంటికి వెళ్ళి వీళ్లకు ఇల్లు ఎందుకు ఇచ్చారు అంటూ ఆ ఇంటివాళ్ళను తిట్టారు. పోలీసులు జీపులో లాతూరుకి పదిహేను మైళ్లదూరంలో వాళ్లని వదిలివేశారు. ఆ పిల్లలు నడుచుకుంటూ వాళ్ల ఊరు వెళ్ళిపోయారు.

విఠల్‌కి ఈ విషయం తెలియగానే ఆ పిల్లల దగ్గరికి వెళ్లాడు. వాళ్లని మళ్ళీ లాతూర్‌కి రమ్మనమని ఎంతో బతిమలాడాడు "మేము అక్కడ పనిచేయం, పోలీసులు మమ్మల్ని తంతారు, మా కాళ్ళు చూడు ఎట్లా వాచినాయో" అని అంటూ కాళ్ళు చూపించారు. వాళ్ల పాదాలు ఎర్రబడి ఉబ్బి ఉన్నాయి.

అహమ్మద్‌పూర్‌లో మనక జోగీలు అనే దళిత జాతివారు ఉన్నారు. వీళ్ళు చుట్టుపక్కల ఉన్న చిన్నచిన్న ఊళ్ళకి వెళ్ళి బిచ్చం అడుక్కుని బతుకులు ఈడుస్తున్నారు. కిన్‌గాంవ్‌లో ఒక ధనవంతుడి పర్సుపోయింది అతడు కంప్లైంట్ ఇవ్వగానే పోలీసులు ఈ మనకజోగీల గుడిసెలమీదకు వచ్చారు. గుడిసెలలో ఉన్న వాళ్లందరిని తన్నారు. వాళ్ల గుడిసెలలో ఉన్న సామానులను బయట పడేసారు. వాటిల్లో రెండు మూడు జర్మన్ సిల్వర్ గిన్నెలు, ఒకటి రెండు అల్యూమినియమ్ పళ్ళాలు, చిన్నచిన్న బోడిగిన్నెలు, నెమలి ఈకలు (వీళ్ళు తలమీద కిరీటం పెట్టుకుంటారు. ఆ కిరీటం ఇత్తడితో చేయబడి ఉంటుంది,




దాంట్లో నెమలి ఈకలను గుచ్చుతారు. ఇది వాళ్ల ఆచారం. ఎంత తిండికి గడవకపోయినా ఈ కిరీటాన్ని మాత్రంఎట్లాగోలా చేయించు కుంటారు) తప్పితే ఇంకేమీ లేవు. ఈ గుడిసె ల్లో ఉండే ఒక గుడ్డివాడి ఇంట్లో చిల్లులుపడ్డ ఓ ఇత్తడి పళ్ళెం కనిపించింది. దానిమీద ఎక్ బోటె అన్న పేరు ఉంది. ఆ గుడ్డివాడి దగ్గర ఉన్న కిరీటం పూర్తిగా పాడయిపోయింది. గంటవాయిస్తూ హరహర మహాదేవ అంటూ అడుక్కుంటూ జీవితం గడుపుతున్నాడు. కిరీ టంకోసం ఇత్తడి కావాలి, అందుకని ఒక ఇంటామెను ఎన్నో నెలలనుండి విరిగిన ఇత్త డి పళ్ళెం ఏదైనా ఉంటే ఇమ్మనమని బతిమి లాడుతున్నాడు. ఆ ఇంటి ఆవిడ విరిగిన చిన్న ఇత్తడి పళ్ళెం ఇచ్చింది. దానిమీద ఎక్‌బోటే అన్న పేరు ఉంది. అవకాశం దొరికింది కదా అని ఈ ఇత్తడి పళ్ళెం ఎక్కడ దొంగతనం చేశావు అంటూ ఆ గుడ్డివాడిని పోలీసులు విపరీతంగా కొట్టారు. ఆ తరువాత కొన్ని రోజులకు ధనవంతుడి పరును దొంగిలించిన దొంగ దొరికాడు. అయినా అనుమానం మీద ఈ మనక జోగిలమీద పోలీసులు జరిపిన అత్యాచారాలు అన్నీ ఇన్ని కావు.

విఠల్ చెప్పిన మరో కేసు విన్నది భారతి. సంతముచ్చులలో ఒకడిని పోలీసులు దొంగ తనం చేశాడు అన్న అనుమానంమీద పట్టుకు న్నారు. అతడిని బరబరా ఈడ్చుకువెళ్ళి తన్నారు. తలకిందుల్లా వేలాడదీసి కళ్లలో కారం చల్లారు. అతడు కేకలు వేయడం మొదలు పెట్టాడు ఆ హింసలకు భరించలేక చివరికి నేరం తనే చేశానని ఒప్పుకున్నాడు. కొన్ని రోజుల తర్వాత అసలు దొంగ పట్టుబడ్డా డు. పోలీసులు ఇతన్ని వదిలివేశారు. ఇతడు తనను పోలీసులు ఎంత ఘోరంగా హింసించారో చెప్పడం, చొక్కా ఎత్తి అందరికి చూపించడం మొదలుపెట్టాడు. వీపుమీద ఛాతిమీద చర్మం అంతాపోయింది. ఎర్రగా గాయాలు ఉన్నాయి.

అంతా విన్నాక భారతి బాధగా నిట్టూ ర్చింది.

"విఠల్...మీరు ఓ పెద్ద ఊరేగింపు తీయండి. ఈ అన్యాయాలకి విరుద్ధంగా పోరాటం సాగించండి"

విఠల్ సరేనన్నాడు. అతడు ఊరూరా వాడ వాడా తిరిగి 'ఊరేగింపు' సంగతి అందరికి చెప్పాడు. దేశదిమ్మరులందరిలో కొంత చైత న్యం వచ్చింది.

లాతూర్‌లో పెద్ద ఊరేగింపు బయలు దే రింది. వాళ్లల్లో వడ్డర్లు, పాథ్‌రూట్, వగైరా వెనుకబడిన నానా జాతులవారందరూ ఉన్నా రు. తమ కుక్కలని, పందుల్ని గాడిదలని వెంట తీసుకుని మరీ బయలుదేరారు, ఊరే గింపుగా. తమతమ కులాల సాంప్రదాయిక దుస్తులే ధరించారు. "ఈ అన్యాయాలను అరికట్టాలి"

"దోపిడీదారుల అత్యాచారాలను ఇక మేం సహించం, సహించం, పోలీసుల అత్యాచారా లు ఇక మేం సహించం, సహించం"

"మాకు ప్రభుత్వం ఇళ్ళు కట్టించాలి"

"మాకు ప్రభుత్వం పనులిప్పించాలి"

"మమ్మల్ని దొంగలను చేసిందెవరు? ఈ సమాజమే"

"మాకు దొరలా బతికే అవకాశం కావాలి, కావాలి" అంటూ వారంతా ఉత్సాహంగా ముందుకు నడవడం మొదలుపెట్టారు.

భారతి వ్రాసి ఇచ్చిన గీతాన్ని పాడుతూ ముందడుగు వేయసాగారు.

ఇది దళిత జాగృతి యుద్ధం. అమ్మలార! అయ్యలార! అక్కలార! అన్నలార! తమ్ము లార! చెల్లెళ్లార! రండి రండి దళిత జాగృతి యుద్ధంలో సైనికులై చేరండీ దళితశక్తి రథం ముందుకు సాగుతోంది సాగుతోంది పరుగు తీస్తోంది శక్తియుక్తి ఉడికే రక్తమే చైతన్యచక్రాల రథం పరుగు తీస్తోంది.

॥ఇది॥

దళితులార! విజయ తిలకం దిద్దుకోండి
పీడితులార! విజయ పతాకం చేతపట్టండి
దళితుల కన్నీరు సముద్రం అయిపొంగింది
పీడితుల హృదయ జ్వాల భుగభుగ
మండింది

॥ఇది॥

ఈ సముద్రం కుళ్ళిన సమాజాన్ని ముంచక

మానదు
ఈ జ్వాల వృద్ధ ప్రపంచాన్ని బూడిద చేయక మానదు
ఈ ప్రవాహం కఠిన శిలలను నుగ్గునుగ్గు చేయక మానదు
ఈ అగ్గి బానిసపు సంకెళ్లను బుగ్గి చేయక మానదు
॥ఇది దళిత శక్తి ఇది దళిత శక్తి॥
ఇది పావురాలకు రాబందులకు మధ్య పోరాటం
ఇది చీమలకు పాములకు మధ్య పోరాటం
పడి ఉండే పావురాలు శక్తిని తెచ్చుకొన్నాయి
నలిగే చిట్టి చీమలు సైన్యంగా మారాయి
॥ఇది దళిత సైన్యం, ఇది దళిత సైన్యం॥
ఇటు దళిత వర్గం అటు ధనికవర్గం...
ఇటు పీడిత తాడితులు అటు దోపిడి దారులు
ఇటు హరిజనులు అటు అగ్రవర్ణం...
ఇటు శ్రామికులు అటు యజమానులు
॥ఇది॥
ఈ సైన్య సారథ్యంలో అల్లూరి శ్రీశ్రీలున్నారు
వేలవేల ఝాన్సీ ఇందిరలున్నారు...
వేలవేల గాంధీ అంబేద్కర్‌లున్నారు...
వేలవేల రామ్మోహన్‌లు పులేలున్నారు
॥ఇది విప్లవాగ్ని॥ ఇది విప్లవాగ్ని॥
ఈ సైన్యంలో అల్లూరి అంబేద్కర్ గాంధీల వారసులున్నారు
ఈ సైన్యంలో శ్రీశ్రీ విప్లవ కవిత్వపు విత్తనాలు చల్లేవాళ్ళున్నారు
ఈ సైన్యంలో రేపటి భగత్ గాయక్ వాడులున్నారు
ఈ సైన్యంలో రేపటి భారతీ, సూర్యచంద్రులున్నారు
॥ఇది దళిత శక్తి ఇది దళిత శక్తి॥
దళిత కోయిలలు పాడుతున్నాయి విప్లవరాగాలు
దళిత హృదయాలు మ్రోగిస్తున్నాయి విజయ భేరీలు
దళిత పావురాలు పూరిస్తున్నాయి శంఖారావాలు
ఆకాశం ఎర్ర బారింది అగ్నివాన కురుస్తోంది
॥విజయం దళితులదే విజయం పీడితులదే॥
అల్లదుగో నవోదయం అల్లదుగో శుభోదయం
అల్లదుగో వసంతోదయం అల్లదుగో అరుణోదయం
అల్లదుగో శ్రీశ్రీ సృష్టించిన మరో ప్రపంచం
అల్లదుగో అంబేదకర్ కలలు కన్న ఓ కొత్త రాజ్యం
॥ఇది॥

ఈ ఊరేగింపు గురించి వార్తలు పత్రికలలో పడ్డాయి. సంపాదకులు ఊరేగింపు గురించి చాలా పొగిడారు. విఠల్ తల పెట్టిన ఈ ఉద్యమం నిరంతరం కొనసాగాలని విజయం దళితులదే అని కూడా వాళ్ళు వ్రాశారు.

ఈ వార్తలు చదవంగానే శివరావు పాటిల్, జగన్నాథరావు, ఔసేకర్, దేశ్‌ముఖ్‌లకు విపరీతమైన కోపం వచ్చింది. కులకర్ణి మాస్టారు, వినాయకరావు చాలా సంతోషపడ్డారు.

భారతి కృషి కూడా కొంత ఫలించింది. స్కూల్‌లో చదువుకునేవారి సంఖ్య ఎక్కువ అయింది.

ఒకరోజు ఎల్లవ్వ పరుగెత్తుకుంటూ స్కూల్ దాకా వచ్చింది. ఆమె తలనుండి రక్తం కారుతోంది. ఆమె వెనకే కొండప్ప వచ్చాడు. అతడి చేతిలో కర్ర ఉంది. బాగా తాగి తూలుతున్నాడు. ఎల్లవ్వను బూతులు తిడుతున్నాడు. భారతి తన దగ్గర ఉన్న రుమాలుతో ఎల్లవ్వ తలకి కట్టింది. అయినా రక్తం కారడం ఆగలేదు. భారతి ఎల్లవ్వను ఆసుపత్రికి తీసుకువెళ్ళింది. కొండప్ప స్కూల్ దగ్గర పడిపోయాడు. ఇద్దరు ముగ్గురు కలిసి అతడిని గుడిసె దగ్గరికి తీసుకువెళ్ళారు.

ఆరోజునుండి స్కూల్‌కి వచ్చే దేశదిమ్మరులకు, తాగడంవలన వచ్చే దుష్పరిణామాల గురించి చెప్పడం మొదలు పెట్టింది. వాళ్ళందరికి జ్ఞానం కలగాలన్న ఉద్దేశ్యంతో ఒక కథ కూడా చెప్పింది.

"ఒక ఊళ్ళో చంద్రయ్య, మల్లయ్య అనే ఇద్దరు వ్యక్తులుండేవాళ్లు. ఇద్దరూ చాలా స్నేహంగా ఉండేవాళ్ళు. ఇద్దరు కలిసి ఒకేచోట పనిచేసేవాళ్ళు. ఇద్దరికి కూలి డబ్బులు సమానంగా దొరికేవి. ఇద్దరికి రోజూ ఐదురూపాయలు దొరికేవి. ఆ ఐదు రూపాయలలో చంద్రయ్య




ఇంటి ఖర్చుకని మూడు రూపాయలు భార్యకు ఇచ్చేవాడు. మిగతా దాంట్లో రూపాయిన్నర దాచిపెట్టుకునేవాడు. అర్థరూపాయి తనకోసం ఖర్చు చేసుకునేవాడు. మల్లయ్య నాలుగు రూపాయలు తన తాగుడికి, జూదంకి, తిండికి ఖర్చుపెట్టుకునేవాడు. ఒక రూపాయి మాత్రం భార్యకి ఇచ్చేవాడు. అతడు ఒక్కపైసా దాచేవాడుకాదు. మల్లయ్యకి ఈ విధంగా తాగి డబ్బు పాడుచేయవద్దని చంద్రయ్య ఎన్నోసార్లు చెప్పేవాడు. కాని ఈ మంచి మాటలు మల్లయ్య తలకి ఎక్కలేదు. ఇట్లా రోజులు గడుస్తున్నాయి. చంద్రయ్య దాచిపెట్టే డబ్బులు రోజులు గడుస్తున్నకొద్దీ పెరగసాగాయి. లెక్కగా ఖర్చు చేయడంవలన అతడికి అంతగా ఇబ్బందులు ఉండేవికావు. చంద్రయ్య దాచిపెట్టిన డబ్బుతో చిన్నదుకాణం పెట్టాడు. మిరపకాయ బజ్జీలు, ఇడ్లీలు, దోసెలు చేసి అమ్మడం మొదలుపెట్టాడు. వగలంతా చంద్రయ్య భార్య దుకాణంలో కూర్చునేది. సాయంత్రం చంద్రయ్య కూర్చునేవాడు. వచ్చిన లాభంతో నెమ్మది నెమ్మదిగా కుర్చీలు బల్లలు కొన్నాడు.

భార్యాభర్తలిద్దరు రాత్రింబవళ్ళు కష్టపడేవాళ్ళు. కొన్నేళ్ల తరువాత చిన్న హోటలు తెరిచాడు. ఇంట్లో భార్యకు డబ్బులివ్వడంవలన ఆమె పిల్లల అవసరాలను తీర్చేది. పిల్లలు బాగా చదువుకోవడం మొదలుపెట్టారు. తండ్రి ఇచ్చిన డబ్బుతో వాళ్ళు చిన్న ఫ్యాక్టరీ పెట్టారు. అన్నదమ్ములందరు కలిసి ఆ ఫాక్టరీని నడపడం మొదలుపెట్టారు. బోలెడు లాభాలు గడిచారు. ఈ విధంగా వాళ్ళ కుటుంబ వృక్షం దినదినం మూడు పూవులు ఆరు కాయలుగా పెరగసాగింది. నెమ్మదినెమ్మదిగా అది వటవృక్షం అయి మరి కొంతమంది బయట వాళ్ళకి కూడా నీడనీయసాగింది. కాని మల్లయ్య తాగి తందనాలాడడంవలన అతడి ఆరోగ్యం పూర్తిగా పాడయింది. చేతిలో ఒక్క పైసా లేకుండా పోయింది. ఇంట్లో సరిగ్గా డబ్బులు ఈయకపోవడంవలన సరైన పోషణ లేక భార్య, పిల్లల ఆరోగ్యం క్షీణించసాగింది.

పిల్లలెవరూ పైకిరాలేకపోయారు. మల్లయ్య కుటుంబం పూర్తిగా దిగజారిపోయింది. అతడి పిల్లలు కూలివాళ్లలాగానే ఉండిపోయారు. దీనికి కారణం మల్లయ్యకున్న చెడు అలవాట్లు, రేపును దృష్టిలో పెట్టుకుని కొంత డబ్బు దాచుకోకపోవడం''

ఇటువంటి చిన్నచిన్న కథలు చెప్పి వాళ్ళల్లో కొంత మార్పు తీసుకురావాలని భారతి ఎంతో ప్రయత్నించేది.

ఆరోజు స్కూల్‌కి వచ్చిన తులసీబాయి తను ఓ ఇరవై రోజులు స్కూల్‌కి రాలేనని చెప్పింది. ఎందుకని భారతి అడిగితే తన పది సంవత్సరాల కూతురికి పెళ్ళిచేస్తున్నానని ఆ పనులవలన రాలేనని చెప్పింది. భారతి పది సంవత్సరాల పిల్లలకు పెళ్ళిచేయకూడదని, దీనివలన ఎన్నో నష్టాలు ఉన్నాయని, ఇది చట్టవిరుద్ధం అని చెప్పింది. తులసీబాయి ఇంటికి వెళ్ళి ఈ విషయం అందరికీ చెప్పింది. వినంగానే రామప్ప, లక్ష్మప్ప, కొండప్ప అరవడం మొదలుపెట్టారు. మన కులాచారం ప్రకారం చిన్నప్పుడే పెళ్ళి చేయాలని అట్లా చేయకపోతే ఎల్లమ్మదేవికి కోపం వస్తుందని అరిచారు.

భారతి దేశదిమ్మరులలో జరిగే బాల్యవివాహాలను ఏవిధంగానైనా సరే ఆపేయాలని ఎంతో ప్రయత్నించింది.

విఠల్ లాతూర్‌లోనూ చుట్టుపక్కల ఊళ్ళలోనూ మంచి పేరు తెచ్చుకున్నాడు. ఓ రోజు భారతిని కలిసి ''మీరు నాకో సలహా ఇవ్వాలి'' అన్నాడు విఠల్.

''విషయం చెప్పండి'' అన్నది భారతి.

''జనకళ్యాణ్ పార్టీవాళ్లు నన్ను రాజకీయాలలోకి రమ్మంటున్నారు

ఈ ఎలక్షన్‌లో వాళ్ల పార్టీ తరఫున నన్ను నిల్పోమంటున్నారు''

''మరింకేం... మంచి అవకాశం దొరికింది. జారవిడవకండి. తప్పకుండా నిల్చోండి. మీ వాళ్ళ స్థితిగతులను ఢిల్లీదాకా తెలియపరచవచ్చు''

''నేను... నేను... ఈ పనిని చేయగలనా?''

''మనిషి తలచుకుంటే చేయలేనిది ఏదీలేదు. మీరు తప్పకుండా ఆ పార్టీ తరఫునుంచి పోటీ చేయండి''

ఆ మరునాడే విఠల్ జనకళ్యాణ్ పార్టీ ఆఫీసుకు వెళ్లాడు. అక్కడి కార్యకర్తలు అతడిని ఆహ్వానించారు.

★ ★ ★

జనకళ్యాణ్ పార్టీవారు ఎలక్షన్ల ప్రచారం ముమ్మరంగా మొదలుపెట్టారు. ఆ పార్టీ గుర్తు మామిడి ఆకు, సుత్తి. పార్టీ ఆఫీసు వాళ్లు ప్రతీరోజు ఎక్కడో ఒక చోట మీటింగ్ పెట్టేవాళ్ళు. రిక్షాలో స్పీకరును ఏర్పాటు చేశారు. స్పీకరులో విఠల్‌గాయక్‌వాడ్‌ని గెలిపించండి అంటూ తిరిగేవాళ్ళు. గోడల మీద విఠల్ ఫొటోలను అంటించారు.

ఆ రోజు మీటింగ్‌కు విఠల్ భారతి చేత ఉపన్యాసం వ్రాయించుకున్నాడు. మీటింగ్‌కి చాలామందే వచ్చారు. విఠల్ ఉపన్యాసం మొదలుపెట్టాడు. మనం పైవాళ్ల చెప్పుల కింద చీమల్లా బతుకుతున్నాము. ఇప్పుడిప్పుడు మనవాళ్లకు కనువిప్పు అయింది. చిట్టిచీమలు సైన్యంగా మారాయి. ఇకపైవాళ్ల ఆటలు సాగవు. మనం మన హక్కుల కోసం పోరాడుదాం. మనం మనుషుల్లా బతుకుదాం. మనకు తినడానికి గుప్పెడు మెతుకులులేవు కాని పై వర్గాల వాళ్లు నిత్యం విందుభోజనాలు చేస్తున్నారు. ఇది అన్యాయం. ఈ అన్యాయాన్ని మనం అరికట్టాలి. మనం పోరాటం సాగించాలి. ఈ పాలకవర్గం ఉన్నంత కాలం మనకు పనులు దొరకవు. కడుపునిండా తిండి దొరకదు. ఉండటానికి ఇళ్ళు దొరకవు. కట్టుకోవడానికి బట్ట దొరకదు. మీరందరూ కలిసి మీకు మేలు చేసే మరో పాలకవర్గాన్ని ఎన్నుకోవాలి. ఓట్లు వేసి మా పార్టీని గెలిపించండి. మేం మీకష్టాలను తొలిగిస్తాం. మేం మీకు పనులు ఇప్పిస్తాం. కడుపునిండా తిండి పెడతాం. కట్టుకోడానికి బట్టలిప్పిస్తాం. ఇళ్ళు కట్టిస్తాం. నీటి సదుపాయాలు చేయిస్తాం. మీరు ఏదో ఒక వ్యాపారం చేసుకోవడానికి బ్యాంక్ నుండి రుణాలిప్పిస్తాం. సమాజ కళ్యాణంకోసం పరివార కళ్యాణం కోసం మేం మా శాయశక్తులా పాటుపడతాం. మనం అందరం కలిసి ఈ సమాజాన్ని మార్చాలి. రిక్షావాడు, కూలివా





డు, రాళ్లు కొట్టే వడ్డర్లు, సంతముచ్చులు కూడా మనుష్యులేనని నిరూపించాలి. సూర్యకాంత్ త్రిపాఠీనిరాలా అనే గొప్ప హిందీ కవి ఏమన్నాడో తెలుసా... పై వర్గాల వాళ్లు గులాబి చెట్లయితే మన దళితులు కుక్క గొడుగులు. గులాబీ చెట్లు వేరే వాళ్ళ మీద ఆధారపడి ఉంటాయి. గులాబీ చెట్లను మాలినాటాలి. వాటికి నీళ్లు పోయాలి. ఎరువులు వెయ్యాలి. అప్పుడే వాటిలో ప్రాణం ఉంటుంది. కాని కుక్క గొడుగులో... తమంతట తామే ఎక్కడ బడితే అక్కడ పుడతాయి. ఎవరిమీదా ఆధార పడక వాటంతట అవే పెరుగుతాయి. పరాయి వాళ్లకి ఎంతో ఉపయోగపడుతాయి. కుక్క గొడుగులతో చేసిన కవాబ్ ఎంత బాగుంటుందో మీ అందరికి తెలుసు. ఈ గులాబీలు ఉన్నాయి చూశారా ఎరువుల రక్తం తాగి చెట్ల మీద వికసిస్తాయి. ఈ వ్యవస్థలోని కాపిటలిస్టులూ అంతే. దళిత రక్తాన్ని పీల్చి తాము కులుకుతున్నారు. అవి చేస్తాం ఇవి చేస్తాం అంటూ వేదికలెక్కి కేకలేస్తూ ఉంటారు. కాని దళితుల కోసం, బీదల కోసం ఏమీ చేయరు. కూలీవాడు కుర్చీలో కూర్చున్ననాడు ఇద్దరూ ఒకటేనని, ఇద్దరికి అవకాశాలు సమంగా కలిగించాలని, ఇద్దరి మధ్యా ఎటువంటి భేదభావం లేకుండా ఇద్దరు ఒకేరకంగా బతికే అవకాశం కోసం మేం పోరాడుతాం. మీ అమూల్యమైన ఓటువేసి నన్ను గెలిపించండి. మీ కళ్యాణం కోసం పాటుపడతానని మీకు నేను మాటఇస్తున్నాను. పెద్దలారా... అన్నలారా... తమ్ములారా... అక్కలారా... చెల్లెళ్ళారా... మీరందరు మీ అమూల్యమైన ఓటును వేసి నన్ను గెలిపించాలని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. జైహింద్... దళిత వర్గానికి జయం కలుగుగాక...''

అక్కడవున్న జనం అంతా చప్పట్లు కొట్టారు. వాళ్లందరూ తప్పకుండా విఠల్‌నే గెలిపించాలనీ, గెలిపిస్తే తమ కలలు పండుతాయనీ అనుకున్నారు.

మరునాడు విఠల్ భారతిని కలిశాడు.

"నిన్న మీరు చాలా బాగా ఉపన్యాసం ఇచ్చారు'' అంది భారతి.

"మీరు వచ్చారా?'' ఆశ్చర్యంగా అడిగాడు విఠల్.

"నేను ఒక్కతినేకాదు నావెంట నా స్నేహితుల్ని కూడా తీసుకువచ్చాను. అందరూ మిమ్మల్ని ఎంతో పొగిడారు''

"మీరు వ్రాసిన ఉపన్యాసం అంతా అక్కడ చెప్పలేకపోయాను. ఎల్లుండి మరో మీటింగ్ ఉంది. అక్కడ ఇంకా బాగా చెప్పడానికి ప్రయత్నం చేస్తాను. ఈ చెప్పినవన్నీ చేతలలో పెట్టగలిగితే చాలు. దళితులకోసం మాదేశదిమ్మరుల కోసం నేను అనుకున్నవన్నీ చేయగలిగితే చాలు. నా జన్మ ధన్యం అవుతుంది''

"తప్పకుండా మీకు జయం కలుగుతుంది. ఆ నమ్మకం నాకు ఉంది''

★ ★ ★

ఆరోజు కాలేజీ ప్రిన్సిపాల్ భారతిని పిలిపించాడు. "భారతిగారు! మీరు విఠల్‌గాయక్‌వాడ్ పార్టీకి మద్దతు ఇస్తున్నారని తెలిసింది. అతడి పార్టీలో మీరు చేరారని కాన్వాసీ కూడా చేస్తున్నారని విన్నాను. నిజమేనా?'' అని అడిగాడు ప్రిన్సిపాల్.

"విఠల్‌గాయక్‌వాడ్‌తో నాకు పరిచయం ఉన్న మాట నిజమే. కాని నేను అతడి పార్టీలో మెంబర్నయ్యాననీ, నేను పాలిటిక్స్‌లో పాల్గొంటున్నాననీ అనటం మాత్రం అబద్ధం ఇవన్నీ ఎవరో మీకు కల్పించి చెప్పారు''

"నిన్న కాలేజీ కమిటీ చైర్మెన్ శివరావుపాటిల్‌గారు ఫోను చేశారు. మీరు ఆయన కొడుకైన జగన్నాథరావు పాటిల్‌కి పోటీగా నిలబడ్డ విఠల్‌గాయక్‌వాడ్ తరపున కాన్వాస్ చేస్తున్నారని చెప్పారు. ఆయన తలచుకుంటే ఉద్యోగం పీకేయగ్గలడు. మీ శ్రేయోభిలాషిగా చెబుతున్నాను. మీరిది మానేయండి. ఉద్యోగం కోసం ఉన్న ఊరినుండి ఇంతదూరం వచ్చి ఉద్యోగానికే ముప్పు వచ్చే పని ఎందుకు చేస్తారు?''

"నాకు రాజకీయాలతో ఎటువంటి సంబంధంలేదు. కాకపోతే విఠల్ జాతి వాళ్ల మీద నాకు సానుభూతి, జాలి ఉన్నాయి. దేశదిమ్మరులూ మనుష్యులే. వాళ్లకి మనుష్యుల్లా బతికే అవకాశం ఈ సమాజం ఈయాలి. వీళ్లలో అమాయకత్వం, పేదరికం, మూఢనమ్మకాలని పోగొట్టాలి. దొంగతనం చేసి బతకాలి

అని తమ నుదుట మీద వ్రాసి ఉన్నది అన్న అర్థం పర్థంలేని నమ్మకాలు, ఇంకా తదితర దీర్ఘకాల రుగ్మతలను పోగొట్టేందుకు నేను ప్రయత్నిస్తున్నాను. ఈ విషయంలో నేను ఏ తప్పు చేయడం లేదని నా నమ్మకం''

''దేశదిమ్మరులను మార్చడం మీతరం అవుతుందనుకుంటున్నారా. పొరపాటు పడుతున్నారు. వాళ్ళను మీరు మార్చలేరు''

''ఎందుకు మార్చలేను తప్పకుండా మార్చగలను అన్న నమ్మకం నాకు ఉంది''

''వీళ్ల యెడల ఇక్కడివారి దృష్టివేరు. వీరు అస్పృశ్యులుగా చూడబడతారు. దొంగతనాలు చేసే వీళ్లని నమ్మేదెవరు?''

''మన సమాజంలో ఇంకా అస్పృశ్యత ఉన్నదంటే అది మన నాగరిక సమాజానికే అవమానం. వీళ్ళు దొంగలుగా ఎందుకు మారారు అని ఒక్కసారి ఆలోచించారా?''

''తరతరాలనుండి వస్తున్న ఈ నమ్మకాలను, ఈ సాంప్రదాయాలను రూపుమాపడం చాలాకష్టం. వీళ్ళు ఎవరు ఎంత చెప్పినా వినరు. ఆ దొంగబుద్ధిని పోనిచ్చుకోరు. నిజానికి వాళ్ళకు చదువుకునే అవకాశం కల్పించాలి. వాళ్ల బీదతనాన్ని పోగొట్టాలి కాదనను. కాని మనలాంటి వాళ్లవలన ఈ పని అయ్యేది కాదు. మీరు అనుభవజ్ఞులుకారు. అనవసరంగా వీళ్ల విషయాలు పట్టించుకుని మీ భవిష్యత్తు పాడు చేసుకోకండి''

''మనం చదువుకున్న వాళ్లం. భావి భారత పౌరులను తీర్చిదిద్దవలసిన వాళ్ళం మనం. మనం మన విద్యార్థులకు ఆదర్శంగా నిలవాలి. అప్పుడే రేపటి పౌరులై ఈ సమాజాన్ని మార్చగలుగుతారు. జంతువులకన్నా హీనంగా బతుకుతున్న దేశదిమ్మరులను వారు మంచి దృష్టితో చూస్తారు. వారికి తమతోపాటు జీవించే అవకాశం కలగచేస్తారు

నిజమే వారికి కనీసపులోకజ్ఞానం కలిగించడానికి ప్రయత్నిస్తున్నాను. వాళ్లకు చదువు చెబుతున్నాను''

''మీరు కొరివితో తల గోక్కుంటున్నారు భారతీ. మిమ్మల్ని నేను అర్థం చేసుకోగలుగుతాను. దళితులమీద సహానుభూతి ఉండటం మంచిదే. కాని... కాని... అవతలివాళ్ల ఇళ్లు బాగుచేయడానికని మీ ఇల్లు తగలబెట్టుకోకండి''

''సమాజం పట్ల నాకున్న బాధ్యతను నేను మరవలేను. వాళ్ళ హక్కుల కోసం వాళ్లు పోరాడాలి. వాళ్ళలో స్పందనని మనం కలిగించాలి. వాళ్ళు అమాయకులు. ఈ అమాయకులపై పోలీసులు జరిపే అత్యాచారాలు పైవర్గం వాళ్లు చేసే అన్యాయాలను వింటే ఎవరి హృదయం మాత్రం బాధతో గిలగిలకొట్టుకోదు.''

'''మీ హక్కుల కోసం పోరాడండి, తెలివి తెచ్చుకోండి, మనుషుల్లా బతకండి' అంటూ ఎంతకాలం మీరు వాళ్లకు రక్తం ఎక్కిస్తారు? స్వతహా వాళ్లకు ఉండాలికాని''

''వాళ్ళకి దొంగలుగా బతకమన్నది మన సమాజమే. ఏమనిషీ దొంగగా పుట్టడు. పరిస్థితులు వాళ్ళని అట్లా తయారుచేశాయి. ఈ సమాజం వాళ్ల నుదుటన మీరు దొంగలు అన్న పచ్చబొట్టు పొడిచింది. వాళ్ళను అగాథంలోకి తోసింది ఈ సమాజం. వాళ్ళకి చేయూతనిచ్చి వాళ్ళని అగాథంలోంచి పైకి తీయాల్సిన బాధ్యత సమాజం మీద ఉంది. ఈ బాధ్యతను మనం స్వీకరించాలి.

''ఉద్యోగరీత్యా మన బాధ్యత విద్యార్థులకు పాఠాలు చెప్పడం. జీతాలు తీసుకుంటున్నాం కాబట్టి మనం తప్పకుండా మన సంస్థకో సేవ చేయాలి. కాని సమాజంలోని ఓ మనిషిగా మనకు మరికొన్ని బాధ్యతలు ఉన్నాయి. దళితులను మనం ఎడ్యుకేట్ చెయ్యాలి. వాళ్ళ చీకటి బతుకులలో మనం వెలుగు నింపాలి''

''వెలుగు నింపాల్సింది మనంకాదు. వాళ్లు మరో సూర్యుడికోసం ఎదురుచూడాలి''

''సర్ ఆ సూర్యుడు మనమే ఎందుకు కాకూడదు?''

''భారతిగారు... మరొకసారి మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను. వీటన్నింటిని వదిలివేయండి. అనవసరంగా మీ ఉద్యోగానికి ముప్పు తెచ్చుకోకండి. శివరావుపాటిల్ తలుచుకుంటే ఏమైనా చేయగలరు''

''మీరు నాకన్నా పెద్దవారు. మీకు నేను గౌరవం ఇస్తాను. కాని ఈ విషయంలో నా పట్టుదలను నేను వదలలేను'' అంటూ




భారతి లేచింది.

వెళ్తున్న ఆమెవైపు ప్రిన్సిపాల్ చూస్తూ కూర్చుండి పోయాడు. అతనికి భారతంటే అభిమానం కలగసాగింది. తన కాలేజీలో ఎందరో లెక్చరర్లు ఉన్నారు, మరునాడు చెప్పే పాఠాలను చదువుకోవడం, ఆరోజు వచ్చి విద్యార్థులకు పాఠాలు చెప్పడం ధనసంపాదన కోసం కాలేజీ డ్యూటీ కాంగానే ఏదో ఒక వ్యాపారం చేయడం లేదా ట్యూషన్‌లు చెప్పడం ఇంతకు మించి వాళ్లలో తనేమీ చూడలేదు. భారతి చాలా తెలివికలది. ఆమెలాంటి వాళ్లు ఉంటే సమాజం ఎంతో బాగుపడుతుంది. కాని ఈ సమాజంలో సజ్జనులు ఎంతమంది ఉన్నారు? కాకుల గూట్లో కోయిలలు నిలవగలుగుతాయా? ఈమె అనవసరంగా ఈగొడవలలో ఇరుక్కోదుకదా? ఆమె మంచితనాన్ని ఆమె త్యాగాన్ని తక్కినవాళ్లు తమస్వార్థాలకు ఉపయోగించుకోరుకదా! భగవాన్ ఆమెను రక్షించు అని అనుకున్నాడు ప్రిన్సిపాల్.

★ ★ ★

భారతి రేడియో మీద ఉన్న దుమ్మును తుడుస్తోంది. ఇంతలో సుమలత మరో అమ్మాయి లోపలికి వచ్చారు. "కూర్చోండి లలితగారూ..." అని తన స్నేహితురాలిలో అంది సుమలత.

లలిత కూర్చుంది.

భారతి వెనక్కి తిరిగి చూసింది.

"భారతీ! ఈమెపేరు లలిత. జగన్నాథరావు పాటిల్‌గారి కోడలు"

"నమస్తే..." అంది భారతి.

"నమస్తే..." ఆమె ప్రతి నమస్కారం చేసింది.

"భారతిగారూ... మీ పేరు నేను చాలాసార్లు విన్నాను. అప్పుడప్పుడు మీ గురించి మా ఇంట్లో చర్చ జరుగుతూ ఉంటుంది. మా మామగారు ఎలక్షన్లలో నిల్చుంటున్నారు తెలుసుగా..."

"వారి పేరు తెలియనివారు ఉన్నారా? ఎలక్షన్ల సమయం కదా! ఆ పార్టీవాళ్లు బాగా ప్రచారంచేస్తున్నారు"

"ప్రచారానికి లక్షలు లక్షలు ఖర్చు పెడుతున్నారు"

"కోటీశ్వరులాయె... ఆ మాత్రం ఖర్చు పెట్టడంలో ఆశ్చర్యం ఏముంది"

"ఖర్చు పెట్టడంలో ఆశ్చర్యం ఏమీలేదు కాని ఎంత డబ్బు ఉన్నా ఇంకా డబ్బు సంపాదించాలి అన్న దురాశే ఆయనలో ఉంది. వాళ్ల నాన్న శివరావుపాటిల్ గురించి చెప్పక్కరలేదు. మన దగ్గర కోట్లు కోట్లు మూలుగుతున్నాయి కదా అన్న తృప్తి వాళ్లలో లేదు. మరో వెయ్యిరూపాయలు ఎక్కడనుండైనా వచ్చే అవకాశం ఉంటేచాలు వాటిని ససేమిరా వదులుకోరు. ఆ వెయ్యిరూపాయల కోసం ఎంత అవినీతికైనా పాల్పడతారు. ఎటువంటి చండాలపు పనినైనా చేయడానికి తయారవుతారు. వెయ్యిరూపాయలదాకా ఎందుకు? వందరూపాయల కోసమైనాసరే వాళ్లు కక్కుర్తి పడతారు. ఒక కోటికి వంద ఎట్లు కలపాలా అని చూస్తుంటారే తప్ప మనకు కోటి ఉన్నాయిగదా ఆ వంద లేకపోతే మాత్రం తక్కువేమిటి అనే జ్ఞానంలేదు. మీకు ఒక సంఘటన చెబుతాను వినండి. వీళ్ళెంత కఠిన హృదయులో తెలుస్తుంది. వీళ్లందరు కలిసి చాలా సంవత్సరాల క్రితం ఓ గుడి కట్టించారు- పూజారిగారు ఇన్నేళ్ళనుండి నయాపైసా తీసుకోకుండా పూజలు చేస్తున్నారు. ఎవరైనా పళ్ళెంలో దక్షిణ వేస్తే అది మాత్రం తీసుకునేవారు. ఈమధ్య ఆయనకు మరీ ఇల్లు గడవక కమిటీవాళ్లని నెలకు కొంత జీతం ఏర్పాటు చేయమని అడిగారు. ఈ ధనవంతులు వారికి ఎంత ఇస్తామన్నారో తెలుసా? కేవలం ఏభైరూపాయలు"

"ఏభై రూపాయలా?"

"ఈరోజుల్లో ఒక ఇంటి పాచిపని చేస్తే పనిమనిషికి ఏభై రూపాయలు దొరుకుతున్నాయి. ఆ పూజారిగారు సంస్కృత పండితుడు. వారు వేదం చదువుతుంటే వినితీరాలి. వారు రామాయణం, మహాభారతం ఎంత బాగా చెబుతారనుకున్నారు. నేను చాలాసార్లు విన్నాను. వారు చెబుతుంటే రోజులతరబడి



వినాలనిపిస్తుంది. లేవబుద్ధికాదు. ఈ రాజకీయ నాయకులకు సరస్వతీదేవియందు శ్రద్ధ, భక్తి ఉంటేగా. చదువుకున్నవాళ్ళంటే గౌరవం ఉంటేగా. ఆనాటి రాజులే నయం, పాండిత్యానికి ఎంతో విలువ ఇచ్చేవాళ్ళు. వాళ్ళని ఆదరించి సత్కరించేవాళ్ళు ఆర్థిక సహాయం చేసేవాళ్ళు. తామూ స్వయంగా కష్టపడి ఎన్నో విద్యలు అభ్యసించేవాళ్ళు. ఆశ్రమాలలో ఉండి కూడా నేర్చుకునేవాళ్ళు. మరి ఇప్పుడో రాజకీయ నాయకులకు ఏ చదువూ అక్కరలేదు. ఏ కళలు అక్కర్లేదు. ఈ దేశంలో ప్రతీ పోస్టుకి ఇంత చదువు ఉండాలి, ఇంత ఎక్స్‌పీరియన్స్ ఉండాలి. ఇంత వయస్సు ఉండాలి అన్న నియమాలు ఉన్నాయి. కాని ఈ రాజకీయ నాయకులకు మాత్రం ఏ నియమాలు లేవు. అవినీతిగానైనాసరే అన్యాయంగానైనాసరే సంపాదించిన ధనం ఉంటే చాలు. జ అంటే ఢం రానివాళ్ళు కూడా ఎలక్షన్లలో నిల్చోవచ్చు. అ,ఆ, ఇ,ఈ,ల జ్ఞానం లేకపోయినాసరే, వీళ్లకి గూండాయిజం తెలిస్తేచాలు. వెనక గోతులు తవ్వగల తెలివి ఉంటే చాలు. గూండాలు, స్మగ్లర్లు, తాగుబోతులు, అవినీతిపరులు, దుర్మార్గులు గద్దెలెక్కుతున్న రోజులివి. ఛీ... ఛీ... శివరావుపాటిల్‌గారికి సంతకం కూడా సరిగ్గా పెట్టటం చేతకాదు. మా మామగారు కొంతనయం, కాని ఆయనకు పెద్ద చదువు లేదు, జ్ఞానం లేదు - ఈ వయస్సులో కృష్ణా రామా అని అనుకుంటూ కూర్చోక ఎందుకండీ ఇంత పదవీ వ్యామోహం''

భారతి ఓ నిట్టూర్పు విడిచింది. ''రాజకీయ నాయకుల్లో కూడా అస్సలు మంచివారు లేరని మనం అనలేం''

''మంచివాళ్ళు లేరని నేననడంలేదు కాని దుర్మార్గులే ఎక్కువగా ఉన్నారు. ధనవంతులకు తప్పితే ఈ దేశంలో మరెవరికీ విలువలేదు. బుద్ధిజీవులకు అసలే విలువ లేకుండా పోతోంది. ఎంతోమంది అష్టకష్టాలు పడి పై చదువులు చదివి డిగ్రీలు, డాక్టరేట్లు పుచ్చుకుంటున్నారు. పెద్దపెద్ద సైంటిస్టులవుతున్నారు. కాని ఏంలాభం ఈ రాజకీయ నాయకుల కింద బానిసల్లా బతుకుతున్నారు. ఉద్యోగాలు లేక వెనక ఆస్తిపాస్తులు లేక తినడానికి తిండికి లేక ఈ పూట గడిస్తే చాలు అని అనుకుంటూ నిరాశ నిస్పృహలతో బతుకులీడుస్తున్నారు. వాళ్ళు క్షణక్షణం చస్తూ బతుకుతున్నారు. ఒక్కొక్కసారి నాకేమనిపిస్తుందో తెలుసా... ఈ రాజకీయ నాయకులకు కూడా తక్కినవాళ్లకు పెట్టినట్లుగా పరీక్షలు పెట్టాలి. వీళ్లకి ప్రతి దేశపు రాజ్యాంగ చరిత్ర, చట్టాలు, ఇదివరకటి రాజులు పరిస్థితులను ఏవిధంగా ఎదుర్కొన్నారో మొదలగు విషయాలు క్షుణ్ణంగా తెలిసిఉండాలి. లేకపోతే ఈ పనులకు వీళ్ళు అనర్హులు''

''విద్యావంతులయి ఉండాలని మీరనడం సమంజసంగానే ఉంది కాని, వాటికన్నా మరో ముఖ్యమైన విషయం ఉంది. నైతిక విలువలను గురించి వీళ్లకు తెలిసిఉండాలి. మానవత్వం, కరుణ, ప్రేమ, జాలి ఈ గుణాలు వీళ్లలో ఉండితీరాలి. నిస్వార్థంగా దేశసేవ చేయాలి. అప్పుడే ఈ దేశ స్థితి బాగుపడుతుంది''

''నైతికత అన్న పదం వీళ్ళ డిక్షనరీలో లేదు భారతిగారూ... మానవత్వం, కరుణ, ప్రేమ, జాలి వీళ్లలో మచ్చుకి కూడా కనిపించవు. వీళ్ళు చేసే ఎన్నెన్నో ఘోరాలను విన్నాను. ఇప్పుడు చూస్తున్నాను కూడా. వీళ్ళు చేసే అవినీతి పనులను గురించి చెబితే మీరు ఆశ్చర్యపోతారు. కాని వీళ్ళను ఎదిరించి వీళ్ళ ముసుగును తొలగించగల ధైర్యం నాలో ఇంకా రాలేదు''

ఇంతలో సుమలత లోపలికి వచ్చింది.

''ఏమిటీ హాట్ హాట్‌గా డిస్కషన్ చేస్తున్నారు. ఎదురింటావిడ ఈమధ్య టూర్ చేసివచ్చింది. బోలెడు నగలు రకరకాల బట్టలు తీసుకువచ్చింది. ఒక్కొక్క డిజైన్ ఎంతో అద్భుతంగా ఉంది. నాకు వాటిని చూస్తూ అక్కడే కూర్చోవాలనిపించిందనుకోండి. మీ అత్తగారు ఈమధ్య చేయించారే బంగారు నెక్లెస్ అదే డిజైను ఈవిడ దగ్గర కూడా ఉంది''

భారతి టీపెట్టి తీసుకువచ్చింది. ముగ్గురూ టీ తాగడం పూర్తిచేశాక ''మరి ఇక నేను వెళ్తాను'' అంటూ లేచింది లలిత.

''భారతీ... నేను ఈవిడని దిగబెట్టివస్తాను'' అన్నది సుమలత టేబుల్‌మీద ఉన్న పర్సును తీసుకుంటూ.





''భారతిగారూ... మీరు తప్పకుండా మా ఇంటికి రండి''

''తప్పకుండా వస్తాను''

సుమలత, లలిత ఇద్దరూ రోడ్డువైపు వెళ్ళే వరకు చూస్తూ నిల్చుంది భారతి.

★ ★ ★

భారతిని లలిత తరచూ కలుస్తూ ఉండేది. తన మరిది కొడుకు పుట్టినరోజు సందర్భంలో ఫంక్షన్ ఏర్పాటుచేశారనీ, భారతి తప్పకుండా తమ ఇంటికి రావాలనీ ఆహ్వానించింది లలిత. వెళ్ళాలా వద్దా అని ఆలోచిస్తూ కూర్చుంది భారతి. తను ప్రతీసారి ఏదో ఒక సాకు చెప్పి వాళ్ళ ఇంటికి వెళ్ళకుండా తప్పించుకుంటూంది. కాని ఈ సందర్భంలో వెళ్లక తప్పదు. అసలు లలిత తనతో ఎందుకు స్నేహం చేస్తోంది. తను వాళ్లనుండి ఎంతదూరంగా ఉండాలనుకుంటే ఆమె అంత దగ్గరగా రావడానికి ప్రయత్నిస్తోంది. వాళ్ల మామగారు జగన్నాథరావు ఆయన తండ్రి శివరావు రాజకీయాలలో ఆరితేరినవాళ్ళు. విఠల్ అంటే వాళ్ళకు గిట్టదు. లలితకి వాళ్ళ మామగారన్నా ఈ రాజకీయ నాయకులన్నా నిజంగానే అసహ్యమా, లేక నాటకం ఆడుతోందా? కాని ఆ అమ్మాయికి నాటకం ఆడాల్సిన అవసరం ఏముంది? వాళ్ల ఆలోచనలు వేరు, తన ఆలోచనలు వేరు. తను ఈ ఒక్కసారికీ వాళ్ల ఇంటికి వెళ్తుంది. ఆ తరువాత కట్‌చేస్తుంది.

భారతి, సుమలత కలిసి లలిత ఇంటికి వెళ్ళారు. లలిత ఎంతో ఆప్యాయంగా వాళ్ళిద్దరిని ఆహ్వానించింది. భారతిని శివరావుకి జగన్నాథరావుకి పరిచయం చేసింది.

''మీగురించి చాలా విన్నాం'' అన్నాడు శివరావుపాటిల్.

''చాలా ఇంటలిజెంట్, గుడ్ టీచర్... సమాజ సేవకురాలు అని విన్నారా?'' అంది నవ్వుతూ లలిత.

జగన్నాథరావు కొంచెంసేపు కన్నార్పకుండా భారతినే చూస్తూ నిలుచున్నాడు.

''మీరు దేశదిమ్మరులను ఉద్ధరిస్తానని ప్రతిజ్ఞ చేశారని విన్నాను. చాలా సంతోషం... ఇప్పటివరకు వాళ్ళలో ఆవగింజంత మార్పు అయినా కనిపించిందా?'' అడిగాడు జగన్నాథరావు వ్యంగ్యంగా.

''ఇవాళ కాకపోయినా రేపైనా వాళ్ళల్లో పూర్తిగా మార్పు వస్తుంది'' అంది భారతి.

''విఠల్‌గాయక్‌వాడ్ ఇచ్చే స్పీచ్‌లు విన్నాక నాకు మిమ్మల్ని చూడాలని ఎన్నోసార్లు అనిపించింది. ఇవాళ దర్శనభాగ్యం కలిగింది. మీరు చాలా బాగా రాస్తారు మేడమ్. మీ విఠల్ ఏమంటున్నాడు. దేశదిమ్మరులందరిని ఎమ్.ఎ. పరీక్షలకి కూర్చోపెడతానంటున్నాడా... దేశంలోని చెత్తనంతా ఊడ్చేసి కొత్తరోడ్లు వేస్తానంటున్నాడా? భారతదేశంలో బీదతనం రూపుమాపుతానని కంకణం కట్టుకున్నాడా? గుడిసెల్లో వెలుగు తేవడానికి చుక్కలని కోసుకు వస్తానంటున్నాడా? సూర్యచంద్రులను కిందకు దించుతానంటున్నాడా?'' పెద్దగా నవ్వుతూ అన్నాడు జగన్నాథరావు.

''తక్కిన రాజకీయ నాయకుల్లాగా మరీ ఇన్ని గొప్పలు చెప్పుకోవడంలేదులెండి'' అంది భారతి కోపాన్ని బయటకి కనబడనీయకుండా.

''మా లలిత మీ ఆదర్శాల గురించి ఎప్పుడూ చెబుతూ ఉంటుంది. మీ ప్రభావం ఎదుటివాళ్లమీద అతి తొందరగా పడుతుంది. విఠల్‌కి మీ పుణ్యమా అని బోలెడన్ని ఓట్లు పడవచ్చు''

''ఇందులో నాదేముంది. అతడు నీతి నిజాయితీ కలవాడు. ప్రజలు అతడిని గుర్తించగలిగితే తప్పకుండా అతడు గెలుస్తాడు''

ఇంతలో జగన్నాథరావుని ఎవరో పిలుస్తున్నారని చెప్పడంతో అతడు అక్కడినుండి వెళ్ళిపోయాడు.

భారతి, సుమలతలు భోజనంచేసి అక్కడినుండి బయటపడ్డారు.

ఆ తరువాత కూడా లలిత మూడు నాలుగుసార్లు భారతిని తమ ఇంటికి రమ్మనమని బలవంతం చేసింది. లలితమాట కాదనలేక భారతి వాళ్ళింటికి వెళ్ళింది.

విఠల్ ఎలక్షన్ల ప్రచారంలో మునిగిపోయాడు. భారతి తను మూడునాలుగుసార్లు లలిత బలవంతం చేయడంవలన జగన్నాథరావు ఇంటికి వెళ్ళాననీ, ఆ ఇంటి వాతావరణం

తనకేమీ నచ్చలేదనీ విఠల్‌కి చెప్పింది. జనక ళ్యాణ్ పార్టీవాళ్ళు భారతి తరచు అపోజిషన్ పార్టీవాళ్ళ ఇంటికి వెళ్తోంది, ఆమె తమ పార్టీ రహస్యాలు వాళ్ళకి అందచేస్తోందేమో అన్న అనుమానం అంతకుముందే వెలిబుచ్చారు. భారతియెడల విఠల్‌కి ఎంతో గౌరవం, నమ్మకం ఉన్నాయి. కాని అతడూ మనిషే. మనిషిలోని మనస్సు పరిపరివిధాల ఆలోచి స్తుంది. ఇది సహజం. భారతి తన ప్రత్యర్థి అయిన జగన్నాథరావుతో కలిసి ఏదైనా నాటకం ఆడటంలేదుకదా... ఎన్నో ఆదర్శాలు గల భారతి జగన్నాథరావు గురించి విని కూడా అక్కడికి ఎందుకు వెళ్తోంది? తను ఆమె మాటలకు మోసపోయాడా... ఆమె తనకు నాలుగు మంచి మాటలు చెప్పి మోసవుచ్చ టంలేదుకదా... తమ పార్టీవాళ్ల కార్యకలాపాల గురించివ సమాచారాన్ని వాళ్లకు అందించ డంలేదుకదా... ఆమె ప్రత్యక్షంగా వేదికలెక్కి తనకి ఓటు వేయమని అందరికీ చెప్పకపో యినా పరోక్షంగా ఆమె చాలామందిని తన వైపు తిప్పింది. వాళ్ళపై ఈమె ప్రభావం చాలా పడ్డది. వాళ్లంతటవాళ్ళే తన దగ్గరికి వచ్చి 'గాయక్‌వాడ్... మా ఓటు నీకే... మీరు తప్ప కుండా గెలుస్తారు' అని చెప్పారు. భారతి ఇప్పుడు జగన్నాథరావుకోసం...

ఛ... ఆమె అటువంటి మనిషి కాదు. మరి అతడు ఆమెకు ఏదైనా ఆశ చూపించాడా? తన సాలెగూడులో ఇరికించాడా... శివరావు, జగన్నాథరావు కలిసి ఆమెను మోసగించ డంలేదుకదా... భారతి వాళ్ల మాటలు నమ్మ దు. ఆమె చాలా తెలివికలది. అంత తొంద రగా మోసపోదు. కాని... కాని ఏమైనాసరే ఆమెను అసలుసంగతి అడగాలి...

అతడు రెండుమూడుసార్లు భారతి ఇంటికి వెళ్ళాడు. కాని ఇల్లు తాళంవేసిఉంది. రెండు సార్లు ఆమె క్లాసులు చెప్పే చోటికి వెళ్ళాడు. కాని చుట్టుపక్కల తమజాతివాళ్ళు ఉండ టంవలన విషయం అడగలేకపోయాడు.

★ ★ ★

జగన్నాథరావు, మాధవరావు పనిమీద ఔరంగాబాద్ వెళ్ళారు. శివరావు ఉద్‌గిర్‌లో ఉన్న తమ బంధువుల ఇంటికి వెళ్ళాడు. ఈలోగా వాళ్ల ఇళ్ళల్లో దొంగలు పడ్డారు. దొంగ లు ఆ ఇంటి ఆడవాళ్లకు మత్తుమందు వాసన చూపించి స్పృహలేకుండా చేశారు. దొంగలలో కొండప్ప, లక్ష్మప్పలు కూడా ఉన్నారు. వీళ్ళు ఇంతమటుకు సంతలో జాతర్లలో దొంగతనా లు చేయడంతప్ప ఇట్లా రాత్రిపూట ఇళ్లలో జొరబడి దొంగతనాలు చేసి ఎరుగరు. కొండ ప్పకి జగన్నాథరావు ఇంతకుముందు తనకి ఇస్తానన్న డబ్బు ఇవ్వకుండా మోసంచేశాడన్న కోపం ఉంది. అందుకే అతడు దొంగతనం చేయడానికి ముందుకు వచ్చాడు. ఒక్కసారిగా బోలెడు డబ్బు సంపాదిస్తే ఇక తమకు మాటి మాటికి సంతలలో దొంగతనాలు చేసే అవ సరం ఉండదన్న ఉద్దేశ్యంతో లక్ష్మప్ప కూడా ఒప్పుకున్నాడు.

ఊరినుండి తిరిగి వచ్చిన జగన్నాథరావు, ఔసేకర్ ఈ వార్త విని ఆశ్చర్యపోయారు. పోలీ సు డిపార్ట్‌మెంటువాళ్ళు వచ్చి ఎంక్వయిరీ చేశారు. జగన్నాథరావు తన ఇంట్లో ఐదువేలు, కొంత బంగారం, వెండి పోయిందని పోలీసు లకు చెప్పాడు. మాధవరావు తన ఇంట్లో ఎనిమిదివేలకు మించి ఏమీ పోలేదని చెప్పా డు. పోలీసులు దొంగలకోసం వేట మొదలుపె ట్టారు.

పోలీసులు కొండప్ప, లక్ష్మప్పలను పట్టుకు న్నారు. తక్కిన ఇద్దరు దొంగలు తెలివిగా తప్పించుకున్నారు. పోలీసులు వాళ్లని వివరీ తంగా కొట్టారు. ఆ పదమూడువేలు వెండి, బంగారం ఎక్కడ పెట్టారో చెప్పమని ఇన్‌స్పె క్టర్ అడిగాడు. అతడి మాటలు వినంగానే కొండప్ప, లక్ష్మప్పలు ఆశ్చర్యపోయారు. ఎందు కంటే, వాళ్ళు వాళ్ళ ఇళ్ళల్లో ఇన్‌స్పెక్టర్ చెప్పిన దానికంటే బోలెడు డబ్బు బంగారం దొంగ తనం చేశారు. మరోవైపు వాళ్లకు సంతోషం కూడా కలిగింది. ఎందుకంటే, దొంగతనం చేశాక నలుగురు దొంగలు కలిసి కొండప్ప గుడిసెలో పదిహేనువేల రూపాయలు, కొంత వెండి, బంగారం సంచిలో కట్టి, గొయ్యి తవ్వి, అందులో పడేసి పూడ్చేశారు. తక్కిన డబ్బు ఆ ఇద్దరు దొంగలు తీసుకున్నారు. రెండురోజుల తర్వాత అంతా కలిపి పంచుకుందాం అని వాళ్ళు కొండప్ప, లక్ష్మప్పలకి చెప్పారు. కొండ ప్ప పోలీసులకు సంచి ఎక్కడ పెట్టాడో చెప్పా




డు. పోలీసులు సంచీని స్వాధీనం చేసుకున్నారు. సంచీలో పదమూడు వేలకంటే ఎక్కువ కాష్ ఉండటంవలన మిగిలిన ఆ రెండువేలు తమ జేబుల్లో వేసుకున్నారు. మిగిలింది జగన్నాథరావుకి, మాధవరావుకి ఇచ్చారు. కొండప్ప, లక్ష్మప్పలని పోలీసులు వదల్లేదు.

దొంగల్లో కొండప్ప, లక్ష్మప్పలు ఉన్నారని తెలియగానే శివరావుకి, జగన్నాథరావుకి, మాధవరావుకి విపరీతమైన కోపం వచ్చింది. ఎలక్షన్ల సమయంలో విఠల్‌ని అవమాన పరచడానికి వాళ్లకి మంచి అవకాశం కలిగింది. ఈ అవకాశాన్ని వాళ్ళు వదలదలుచుకోలేదు. 'తమ ఇంట్లో దొంగతనం జరిగినదానికంటే దొంగలలో దేశదిమ్మరులైన కొండప్ప, లక్ష్మప్పలు ఉన్నారన్న విషయం తమని బాగా కలవరపరిచిందని, దళితులయెడల తమకు సహానుభూతి, ప్రేమ ఉన్నాయని, కాని వీళ్లకి బాగుపడడానికి ఎన్ని అవకాశాలు ఇచ్చినా వీళ్ళు దొంగతనాలు చేయకుండా ఉండలేరా. విఠల్ గాయక్వాడ్ జాతివాళ్ళు బాగుపడరా, వీళ్ళలో మార్పు వచ్చేదెప్పుడు' అని అంటూ పత్రికలకు రాసి పంపించారు.

ఈ వార్త తెలియగానే విఠల్‌కి తనజాతివాళ్ళంటే విపరీతమైన కోపం కలిగింది. వెంటనే కొండప్ప, లక్ష్మప్పలని కలిశాడు. తనకు తలవంపులు వచ్చేలా చేశారని వాళ్లని తిట్టాడు.

"ఒరేయ్ విఠలియా... మేం దొంగతనం చేసినమాట నిజమే. కాని వాళ్ల ఇళ్ళలో కేవలం పదమూడు వేలు, కొంత బంగారం, వెండి పోయాయన్నది మాత్రం అబద్ధం" అన్నాడు కొండప్ప.

"వాళ్ళు ఇంతే పోయిందని పోలీసులకి చెప్పారు. ఈ విషయాలు పేపర్లో కూడా వచ్చాయి" అన్నాడు విఠల్.

వాళ్ళిద్దరు అటూ ఇటూ చూశారు. అక్కడ ఎవరూ లేరని నిశ్చయించుకున్నారు.

విఠల్‌గాయక్వాడ్ చెవిలో కొండప్ప ఏదో చెప్పాడు. విఠల్ కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవి

అయ్యాయి.

"లక్షా ఏభైవేలా? ఇది నమ్మేటట్లుగా లేదు"

"ఇది నిజం. పోలీసులు తీసుకున్నదేదో తీసుకున్నారు. మిగతా డబ్బులో కొంతభాగం నీకు ఇస్తాం. నీవు ఎలక్షన్లకు ఖర్చుపెట్టుకో" అని అన్నాడు లక్ష్మప్ప.

"ఆ పాపపు సొమ్ము నాకక్కర్లేదు"

"విఠలియా... మా మాట విను. డబ్బులిస్తే ఎవరు ఓటు వేయరని. నువ్వు గెలుస్తావు. మామాట విను"

"అట్లాంటి పని నేను చస్తే చేయను. అన్యాయం సొమ్ము నాకొద్దు. మీకెన్నిసార్లు చెప్పాను - దొంగతనాలు మానేయమని" అంటూ కోపంగా అక్కడినుండి బయటకి వచ్చేశాడు విఠల్.

విఠల్ భారతిని కలిశాడు. కొండప్ప, లక్ష్మప్పలు చెప్పిన విషయం ఆమెకు చెప్పాడు. భారతి తరచుగా జగన్నాథరావు ఇంటికి ఎందుకు వెళ్తోందో అడుగుదామనుకున్నాడు. కాని ఆమె ఏమనుకుంటుందో అన్న ఉద్దేశ్యంతో ఏమీ మాట్లాడలేదు.

ఆరోజు తనని కలవడానికి వచ్చిన లలితకు భారతి తనకు విఠల్ చెప్పిన సంగతి చెప్పింది.

"కొండప్ప, లక్ష్మప్పలు ఒకటిన్నర లక్షదాకా దొంగతనం చేశారని విఠల్‌కి చెప్పారట. కాని మీ మామగారు, ఔసేకర్ చాలా తక్కువ డబ్బు పోయినట్లుగా పోలీసులకి చెప్పారు"

"మరంతే... అట్లాగే చెబుతారు. భారతీ! వీళ్ల నాటకాలు మీకేం తెలుసు. పోయిన సొమ్ము ఒకటిన్నర లక్షదాకా ఉంది. ఆ మాట నిజమే. మా మామగారు, ఔసేకర్ కలిసి మగర్ ఫ్యాక్టరీలోను, పోలీసు డిపార్ట్‌మెంటులోను ఉద్యోగాలు ఇప్పిస్తాం అంటూ కొందరి దగ్గర లంచాలు తీసుకున్నారు కాని ఇదంతా బ్లాక్‌మనీయేగా. అదీ ఆరోజు ఇళ్లలో అంతే డబ్బు ఉంది. తక్కినదంతా మరొకచోట పెట్టారు. ఈ బ్లాక్‌మనీ గురించి బయటికి ఏవిధంగా చెప్పుకుంటారు. చెప్పుకోలేరు. అందుకే పదమూడువేలు, కాస్త బంగారం, వెండి పోయాయని చెప్పారు. పైగా మా ఇళ్ళల్లో బోలెడు డబ్బు దొరుకుతుందని వీళ్ళు దొంగతనం చేశారు. మేం ప్రజలకు సేవచేసే మనుషులం, ప్రజాసేవే మా జీవిత లక్ష్యం అంటూ అందరికీ చెబుతున్నారు"

"ఈవిధంగా వాళ్ళు లంచాలు తీసుకుంటున్నారన్న విషయం ఎవరికీ తెలియదు. కొండప్ప మిగిలినదాంట్లో కొంత విఠల్‌కి ఇస్తానన్నాడట. ఎలక్షన్లకి ఖర్చుపెట్టుకోమని చెప్పాడు. కాని విఠల్ ఒప్పుకోలేదు"

"విఠల్ ఎంత నీతిమంతుడు. ఈ ఎలక్షన్లలో అతడు గెలిస్తే ఇప్పుడు వీస్తున్న ఈ గాలిలో కొంత మార్పు వస్తుంది. భారతీ... మీరు దళితుల బంగారు భవిష్యత్తుకు పునాది వేయండి"

ఆ తరువాత వాళ్ళిద్దరు కొంచెంసేపు జరుగుతున్న రాజకీయాల గురించి చర్చించుకున్నారు.



జనకళ్యాణ్ పార్టీవాళ్ళు విఠల్ ఎలక్షన్ల ఖర్చులకి ఇస్తామన్న డబ్బు ఇవ్వలేదు. అతని పేరును విత్‌డ్రా చేసుకోమని బలవంతం చేయసాగారు. చివరిదశలో పార్టీవాళ్ళు ఇంతగా మోసంచేస్తారని విఠల్ కలలో కూడా అనుకోలేదు. ఎలక్షన్ల ప్రచారంకోసం అతడు తన స్వంత డబ్బు కొంత ఖర్చుపెట్టాడు. అప్పులు తెచ్చి తనకోసం ప్రచారం చేయడానికి పిలిపించిన మనుషులకు తినిపించాడు. కాని వాళ్లకు తృప్తి కలగలేదు. మరో పార్టీవాళ్ల తరఫున ప్రచారం చేస్తే రోజూ పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం దొరుకుతుందని,




వాళ్ళు కడుపునిండా తాగిస్తారని, అడిగితే ఆడ వాళ్లనుసైతం సప్లయి చేస్తారని విఠల్‌తో చెప్పడం మొదలుపెట్టారు. విఠల్‌దగ్గర అంత పెద్ద తాహతు లేకపోవడంవలన వాళ్లకి జొన్న రొట్టెలు, పప్పు అన్నం పెట్టించేవాడు. నెమ్మది నెమ్మదిగా ఆ మనుష్యులు కూడా రావడం మానేశారు. చివరికి ఏం చేయలేని పరిస్థితిలో అతడు నిల్చోవడం మానేశాడు.

పార్టీవాళ్ళు విఠల్‌మీద చెడుగా ప్రచారం చేయడం మొదలుపెట్టారు. అపోజిషన్ పార్టీ వాళ్ల దగ్గర అతడు లక్ష రూపాయలు తీసుకుని నిల్చోవడం మానేశాడని ప్రచారం చేశారు. అతడు తన స్వార్థం చూసుకున్నాడని, పార్టీవాళ్ళకి ద్రోహం చేశాడని అందరికి చెప్పడం మొదలుపెట్టారు. ఇదంతా విన్న తరువాత దళితులందరికి అతడిమీద విపరీతమైన కోపం వచ్చింది. గాయక్‌వాడ్ జాతి వాళ్ళందరు కారాలు మిరియాలు నూరడం మొదలుపెట్టారు. అతడు చాలా బాధపడ్డాడు.

ఆ వార్త విని అందరు ఆశ్చర్యచకితులయ్యారు. విఠల్ కనిపించడంలేదు అన్న వార్త చాలామందికి తెలిసిపోయింది. భారతికి ఆదుర్దా ఎక్కువ అయింది. ఎటువెళ్ళి ఉంటాడు? గుండాలు అతడిని ఎత్తుకుపోలేదుకదా! ఎక్కడికి వెళ్ళాడు... ఏమయ్యాడు... ఎవరైనా అతడిని హత్యచేశారా... ఊహు... అట్లా కాకూడదు... ఎంత ఆలోచించినా భారతి అతడు ఎక్కడికి వెళ్ళిఉంటాడో ఊహించలేకపోయింది. ఎంత ప్రయత్నించినా ఆమెకు అతడి ఆచూకి దొరకలేదు.

భారతి, సుమలత ఈ విషయంమీద ఎంతో సేపు మాట్లాడారు.

"అపోజిషన్ పార్టీవాళ్ళు అతడిని ఏమైనా చేసిఉంటారా?"

"అతడిని మాయంచేసే అవసరం వాళ్లకేం ఉంది? అయినా ఏమో తల్లీ ఇవన్నీ రాజకీయాలు... ఈనాడంతా అరాజకీయమేగా... ఏమన్నా జరగవచ్చు" అన్నది సుమలత.

భారతి విఠల్ గురించి ఆలోచిస్తూ కూర్చుంది.

★ ★ ★

విఠల్ హాస్పిటల్లో బెడ్‌మీద పడుకుని ఉన్నాడు. అతడి తలకి కట్టు కట్టిఉంది. చేతులకి కాళ్లకి బాండేజి వేసివుంది. అతడు చాలా బలహీనంగా ఉన్నాడు. "నేను ఈ హాస్పిటల్‌కి ఎట్లా వచ్చాను?" ఎదురుగుండా కూర్చున్న వ్యక్తిని అడిగాడు.

"జోసా దాటాక కొంచెం దూరంలో నువ్వు స్పృహ లేకుండా పడివున్నావు. నేను సైకిల్ మీద వెళ్తున్నాను. అటువైపునుండి ఒక లారీ వెళ్తుంటే ఆపి, లారీ డ్రైవరును బతిమిలాడి నిన్ను అందులో ఎక్కించి లాతూరుకి తీసుకు వచ్చాను" అని సమాధానం చెప్పాడు ఆ వ్యక్తి.

మూలుగుతూ కళ్లు మూసుకున్నాడు విఠల్. కొంచెంసేపయ్యాక కళ్లు తెరిచాడు. అతడి కళ్ల ఎదురుగుండా జరిగిన సంఘటనలు కదలాడసాగాయి.

ఆరోజు తను ఒంటరిగా సైకిల్‌మీద వెళ్తున్నాడు. కొండప్ప ఆగమని చేయి ఊపాడు. తను ఆగాడు. అక్కడ మానవసంచారం లేదు. ఇంతలో రామప్ప, లక్ష్మప్ప, అక్కడికి వచ్చారు. కొండప్ప లక్ష్మప్పలు జైలునుండి విడుదల కాగానే జగన్నాథరావు, ఔసేకర్ ఇళ్లలోంచి ఎత్తుకొచ్చిన డబ్బుకోసం తమతోపాటు దొంగతనం చేసిన తక్కిన ఇద్దరు దొంగలకోసం వెతికారు. కాని వాళ్లు ఎక్కడా దొరకలేదు. ఆ డబ్బంతా తీసుకుని వాళ్లు పారిపోయారు. వాళ్లిద్దరు ఎంతో బాధపడ్డారు. శ్రమపడ్డారు. చెడ్డపేరు తెచ్చుకున్నారు. పోలీసులచేత చచ్చేట్టుగా తన్నులు తిన్నారు కాని ఫలితం దక్కలేదు. దొంగలు పారిపోయారు అన్న సంగతి తెలియకముందు విఠల్‌ని ఆ డబ్బు తీసుకోమంటే అటువంటి పాపిష్టి డబ్బు తీసుకోనంటూ నీతులు చెప్పాడు. కాని ఇప్పుడు లక్ష రూపాయలు లంచం తీసుకుని తమ జాతివాళ్లందరిని మోసం చేశాడని కొండప్ప లక్ష్మప్పలకి విఠల్ మీద గొంతుదాకా కోపం ఉంది.

"విఠలియా నువ్వు అపోజిషన్ పార్టీవాళ్ల దగ్గర లక్షరూపాయలు తీసుకున్నావటకదా! ఏవి ఆ లక్ష?" అడిగాడు రామప్ప కోపంగా.

"నేను తీసుకోలేదు"

"తీసుకోకపోతే వాళ్లు ఎందుకట్లా అంటారు?"

"వాళ్లు చెప్పేదంతా అబద్ధం"

"అసలు ఆ మాస్టరమ్మ నువ్వు కలిసి నాటకం ఆడుతున్నారు. మన జాతివాళ్లు చదువుకోకూడదని చెబితే నువ్వు విన్నావా? మీరు ఇద్దరు కలిసి మమ్మల్ని మోసం చేస్తున్నారు'' అంటూ రామప్ప విఠల్ చెంపమీద ఛెళ్లున వేశాడు.

"ఏవిరా ఆ లక్షరూపాయలు. మన వాళ్లందరికి పంచు. లేకపోతే మన కులంనుండి నిన్ను వెలివేస్తాము. నువ్వు మమ్మల్నందరిని మోసం చేసినందుకు నీకు ఇదే శిక్ష'' అన్నాడు రామప్ప.

తను లక్ష రూపాయలు తీసుకోలేదు. మరి తనకు తనవాళ్లకు మధ్య ఈ అగ్గి ఎవరు రగిలించారు. కులంనుండి తను వెలివేయబడితే ఎలా? తన జాతివాళ్లకు విముక్తి కలిగించాలంటే తను వాళ్లతోటే వుండాలి. వాళ్లతో ఉంటూ వాళ్లని మార్చడానికి ప్రయత్నించాలి. కాని వాళ్లు తనని వెలివేస్తే... అతడి ఎదురు గుండా ఇనుపబొచ్చె, కొబ్బరిచిప్ప కదలాడసాగాయి. ఊహు అట్లా... జరగకూడదు. భారతిని వీళ్లు ఎంతగా అపార్థం చేసుకుంటున్నారు. ఆమె దళితుల విముక్తికోసం ఎంతగా కష్టపడుతోంది. తన జాతివాళ్లెంత మూర్ఖులు...

"ఏంరా విఠలియా ఆ లక్ష రూపాయలు ఇస్తావా ఇవ్వవా?'' బెదిరిస్తూ అడిగాడు లక్ష్మప్ప.

"నీ సంగతి అటో ఇటో తేలిపోవాలి. ఇక ఆ మాస్టరమ్మ ఈ ఊళ్లో ఉండటానికి వీలులేదు'' అని అంటూ కొండప్ప విఠల్‌ని కింద పడతోశాడు.

"ఆమె చాలా మంచిది. మమ్మల్ని అర్థం చేసుకోండి''

మెల్లిమెల్లిగా అక్కడ అతడి జాతివాళ్లందరు చేరారు.

"విఠలియా... ఆ డబ్బిచ్చేసెయి. అందరం పంచుకుందాం. ఆ మాస్టరమ్మని ఈ ఊళ్లో నుండి వెళ్లిపొమ్మని నువ్వు చెప్పేసెయి. లేకపోతే మేం చెబుతాం'' అన్నాడు రామప్ప.

"ఆమె మనందరికి ఎంతో ఉపకారం చేస్తోంది. మీరు మూర్ఖులు. చెప్పినా వినరు'' అంటూ లేవబోయాడు విఠల్.

"ఆరోజు డబ్బు తీసుకుని ఎలక్షన్లకి ఖర్చు పెట్టుకోమంటే ఏం అన్నావు? ఆ సొమ్ము ముట్టుకోనన్నావు. మరి ఇప్పుడు నీ నీతి ఏమయింది? లక్ష రూపాయలు ఎందుకు తీసుకున్నావు'' అంటూ కొండప్ప విఠల్‌ని కొట్టడం మొదలుపెట్టాడు.

రామప్ప అతడి పొట్టలో గట్టిగా గుద్దాడు. విఠల్‌లో వెర్రి ఆవేశం వచ్చింది. లేచాడు వాళ్లని కొట్టడం మొదలుపెట్టాడు. కాని నలుగురైదుగురు కలిసి అతడిమీద కలియబడటంవలన ఏం చేయలేకపోయాడు. "ఇంత అన్యాయం చేస్తావా? ఇంత మోసం చేస్తావా?'' అంటూ అతడిని అందరూ కలిసి చితకబాదారు.

విఠల్‌కి బాగా దెబ్బలు తగిలాయి. తల నుండి రక్తం కారసాగింది. వాళ్లు అతడిని వదిలేసి పారిపోయారు.

★ ★ ★

విఠల్ ఈ లోకంలోకి వచ్చాడు. తనని కొట్టినట్లే వీళ్లు భారతినీ కొట్టరుకదా... ఛ కొట్టరు... కాని ఏమో... తన జాతివాళ్లు మూర్ఖులు. ఆవేశంలో ఏదైనా చేస్తారు. తను భారతికి ముందే ఈ విషయం తెలియపరచాలి. ఇక ఆమెను దేశదిమ్మరుల విముక్తి సంఘంనుండి దూరంగా ఉండమని చెప్పాలి... కాని ఎట్లా? తనా లేవలేడు. పోనీ ఎవరి చేతనైనా చెప్పి పంపిస్తే... తనకు భారతి అంటే ఎంతో గౌరవం... ఎట్లాగైనాసరే ఆమెను రక్షించాలి. తను లక్ష రూపాయలను తీసుకున్నాడని భారతి నమ్మితే... ఎవరు నమ్మినా ఫరవాలేదు కాని ఆమె నమ్మకూడదు. తను భరించలేడు. ఆమెకు తనకు మధ్య పవిత్రబంధం వుంది. ఆమెకు తనకు మధ్య గురుశిష్యుల సంబంధం ఉంది. గురువుకి శిష్యుడిమీద అపనమ్మకం కలిగితే... ఆ శిష్యుడి మనస్సుకు ఎంతో బాధ కలుగుతుంది. ఆమెకు తను నిజం తెలియపరచాలి.

మెల్లిమెల్లిగా విఠల్ హాస్పిటల్లో ఉన్నాడన్న విషయం అందరికి తెలిసిపోయింది.

భారతికి కూడా ఈ విషయం తెలిసింది. భారతి సుమలతలు కలిసి హాస్పిటల్‌కి వచ్చారు. వీరిద్దరిని చూసి విఠల్ లేవబోయాడు.

"ఫరవాలేదు పడుకోండి. ప్చ్... చాలా గాయాలు తగిలాయి. మిమ్మల్ని ఎవరు కొట్టారో





చెబుతారా?'' అని భారతి అడిగింది.

''మావాళ్లే... నాకు అపోజిషన్ పార్టీవాళ్లు లక్ష రూపాయలు ఇచ్చారని మా వాళ్లకు పార్టీవాళ్లు చెప్పారట''

''అవును ఆ విషయం తెలిసింది''

''మీరు కూడా నమ్ముతున్నారా...?'' బాధగా అన్నాడు విఠల్.

''నేను నమ్ముతానని మీరెట్లా అనుకున్నారు. నాకు అసలు నిజం ఏమిటో తెలిసింది?''

''ఏమిటా నిజం?''

''నిన్ననే లలిత మా ఇంటికి వచ్చింది. ఆమె చెప్పిన సంగతి విని నేను ఆశ్చర్యపోయాను''

''ఏమిటా సంగతి?''

''జనకళ్యాణ్ పార్టీవాళ్లకు అపోజిషన్ పార్టీ వాళ్లు మీరు ఎలక్షన్లో నిల్చోకుండా రెండు లక్షలు ఇచ్చారు. జనకళ్యాణ్ పార్టీవాళ్లు తమ స్వార్థం చూసుకున్నారు. పార్టీవాళ్లు మిమ్మల్ని మోసం చేశారు. మీ జాతివాళ్లూ, ప్రజలూ మీరు వాళ్లని మోసం చేశారని అనుకుంటున్నారు. పార్టీవాళ్లు వాళ్ల స్వార్థంకోసం మిమ్మల్ని ఉపయోగించుకున్నారు. ఇక్కడ కూడా మిమ్మల్ని అణచివేశారు. మీరు ముందుకు పోకుండా మీ కాళ్లకు సంకెళ్లు వేశారు. అందరి దృష్టిలో మిమ్మల్ని నీచుడిగా చిత్రీకరించారు''

''నేను వాళ్లని వదలను. మా కులం వాళ్లందరికి నామీద కోపం వచ్చింది. ఇప్పుడు లక్షరూపాయలు నన్ను ఇవ్వమంటున్నారు. అసలు నేను తీసుకోందే ఎక్కడినుండి తెచ్చి ఇవ్వను. నన్ను మావాళ్లు ఇక బతకనీయరు''

''మీ వాళ్లందరికి నేను తెలియజెబుతాను''

''వాళ్లకి మీ మీద కూడా అనుమానం ఉంది. బాగా చదువుకున్నవాళ్లు మోసం చేస్తారు. మమ్మల్ని ఉద్ధరిస్తామంటూనే మమ్మల్ని గోతిలోకి తోస్తారు అని వాళ్లనుకుంటున్నారు. మీరు క్లాసులు తీసుకోవడం మానేయండి. మావాళ్లవలన మీకేమైనా ఆపద కలిగితే...''

''మీ వాళ్లకి అసలు నిజం ఏమిటో చెబుతాను. మన ఇద్దరిమీద ఉన్న అనుమానాన్ని తొలగిస్తాను''

''భారతీ... ఇక వెళ్దామా...'' సుమలత అంది.

''విఠల్ మిమ్మల్ని మళ్లీ కలుస్తాను'' అంటూ భారతి సుమలత వెనుక నడిచింది.

భారతి సుమలతలు ఇంటికి వచ్చారు.

''భారతీ! నేను ముందే చెప్పానుకదే... ఈ దేశదిమ్మరుల గొడవ మనకెందుకని...''

''ఇప్పుడేమయిందని?''

''ఇంకా ఏంకావాలి వాళ్లందరికి చూడు నీమీద ఎంత కోపంగా ఉందో...''

''లతా! కొన్ని పనులను సాధించాలంటే కొన్ని భరించక తప్పదు''

''వాళ్లు ఇంతటితో ఆగిపోయారు కనక కొంతవరకు ఫరవాలేదు. ఇంకా ఏమైనా నిందలు మోపితే అప్పుడు నీ బతుకేం కావాలి?''

''నాకు ఎటువంటి హానికలగదు అన్న నమ్మకం నాకు ఉంది. అన్యాయానికి విరుద్ధంగా పోరాడమని వాళ్లకి తెలియచెప్పాలనుకున్నాను. ఓ ప్రయత్నం చేశాను. తప్పేమీ లేదుగా... ఇట్లా ఇంకా ఎన్నో ప్రయత్నాలు చేస్తే తప్పకుండా నాకు జయం కలుగుతుంది''

''నీకో దండం... నువ్వు మహామొండిదానివి. ఇహ వీటన్నింటిని ఒదిలేయ్... అదే నా సలహా... లేకపోతే నీ ఖర్మ...''

★ ★ ★

భారతి క్లాసులు తీసుకునేటప్పుడు రెండు మూడుసార్లు లక్ష్మప్ప, ఎల్లవ్వ వచ్చారు. తమ జాతివాళ్లకు చదువు చెప్పడం మానేయాల్సిందని, స్కూల్ మూసేయాలని చెప్పారు.

హైదరాబాద్నుండి భారతికి ఒక ఉత్తరం వచ్చింది. ఆమె తండ్రి హైదరాబాద్లో భారతి లెక్చరర్ పోస్ట్కి సెలెక్ట్ అయినట్లు, ఆమెను హైదరాబాద్కి రమ్మనమని వ్రాశాడు. భారతికి వెళ్లడం తప్పడంలేదు.

బయలుదేరేముందు విఠల్ని కలవడానికి హాస్పిటల్కి వెళ్ళి ఈ సంగతి చెప్పింది.

''ఒకవైపు బాధ కలుగుతున్నా మరొకవైపు సంతోషంగా కూడా వుంది''

''విఠల్ మీరు అప్పుడప్పుడు నాకు లెటర్లు వ్రాస్తూ ఉండండి''

''తప్పకుండా వ్రాస్తాను భారతిగారూ. మీరు



ఇక్కడే ఉండండి అని చెప్పే ధైర్యం నాకు లేదు. నాకు ఎంతో సహాయం చేశారు. ముఖ్యంగా నా బుర్రకి పదును పెట్టారు. మీవల్ల నేను ఎన్నో పాఠాలు నేర్చుకున్నాను. మన గురుశిష్యుల సంబంధాన్ని గుర్తుపెట్టుకోండి. నా మనస్సులో మీకు ఎప్పుడూ ఉన్నతస్థానం ఉంటుంది'' అతడి కళ్లలో నీళ్లు తిరిగాయి.

''వెళ్లడానికి నాకు చాలా బాధగా ఉంది. కాని తప్పదు. మీరు మాత్రం మిమ్మల్ని మోసం చేసిన వాళ్లకి గుణపాఠం నేర్పించండి. మీ దేశదిమ్మరుల విముక్తికోసం పోరాటం సాగించండి. ఈ పోరాటం మాత్రం ఆగకూడదు. ఆ భగవంతుడు మీకు అన్నివిధాల సహాయం చేస్తాడు''

''మీలాంటివాళ్ల సహాయం మాకు ఎప్పుడూ కావాలి భారతిగారూ''

''నా సహాయం మీకు ఎప్పుడూ లభిస్తుంది. మరి వస్తా...'' అంటూ అతడికి హైదరాబాద్ అడ్రస్ ఇచ్చి బయటికి వచ్చేసింది భారతి.

★ ★ ★

ఎల్లవ్వ చెత్తకుండీ పక్కనుంచి నడుస్తోంది. అక్కడ ఒకకుక్క భౌ... భౌమంటూ మొరుగుతోంది. ఆ అరుపు ఆగిపోగానే ఎవరో ఏడుస్తున్నట్లుగా అనిపించింది. ఆమె చెత్తకుండీ దాటి పది అడుగులు వేసింది. మళ్లీ ఏడుపు వినిపించింది. ఆమె వెనక్కి వచ్చింది. అక్కడంతా చెత్త కుప్పలు కుప్పలుగా పడివుంది. కుక్క చెత్తకుండీ చుట్టూ అటు ఇటు తిరుగుతోంది. చెత్తకుండీలోకి మాటిమాటికి తొంగిచూస్తోంది. ఎల్లవ్వకి ఏమీ అర్థం కాలేదు. ఆమె కుండిలో తొంగిచూసింది. ఏమీ కనిపించలేదు. ఎల్లవ్వ కుండీలో ఉన్న చెత్తని కెలికింది. మళ్లీ ఏడుపు వినిపించింది. అటునుండి వెళ్తున్న రామప్ప ఎల్లవ్వని చూసి ఆగిపోయాడు.

''ఓ ఎల్లా... ఏమిటే కుండీ దగ్గర ఏం చేస్తున్నావు'' అని అడిగాడు.

''రామప్పా... ఇక్కడ చిన్నపిల్లల ఏడుపు వినిపిస్తోంది''

ఇంతలో కుక్క భౌ భౌమంటూ పెద్దగా మొరగడం మొదలుపెట్టింది.

''చెత్తకుండీ దగ్గర పిల్లల ఏడుపా... నీకేమైనా పిచ్చిపట్టిందా... పద... పద... ఇంటికి పోదాం...''

''ఇక్కడే ఎక్కడో పిల్లో పిల్లవాడో ఉండాలి... వెతుకు...'' అని అంటూ ఎల్లవ్వ కుండీ లోపలికి తొంగిచూసింది.

రామప్ప కుండీలోపల చెయ్యిపెట్టి చెత్తను అటూ ఇటూ చేత్తో తోశాడు.

లోపలనుండి ఏడుపు పెద్దగా వినిపించసాగింది. కుక్క భౌభౌమంటూ మొరుగుతూ అటూ ఇటూ తిరగసాగింది. ఇంతలో ఎల్లవ్వ పాదంలో ఇనుపమేకు గుచ్చుకుంది. ''అబ్బా... అమ్మా....'' అంటూ అరవసాగింది ఎల్లవ్వ.

''ఏం జరిగింది ఎల్లా...'' అంటూ రామప్ప ఆమె దగ్గరగా వచ్చాడు. పాదంనుంచి కొంచెం రక్తం కారసాగింది. ఎల్లవ్వ తన కొంగును చింపి బట్టను పాదానికి గట్టిగా చుట్టేసింది.

మళ్లీ ఏడుపు వినిపించింది. ఎల్లవ్వ చెత్త కుండీ దగ్గర కూర్చుండిపోయింది. అక్కడ దుర్గంధం విపరీతంగా రాసాగింది. పాదానికి కట్టిన బట్ట వదులుకావడంవలన ఎల్లవ్వ బట్టను తీసేసింది. రామప్ప తన భుజంమీద ఉన్న తువాలుని తీశాడు. గబగబా చించాడు. ఎల్లవ్వ పాదంకి గట్టిగా కట్టాడు.

''రామప్పా! కుండీలో వెతుకు'' అని అంది ఎల్లవ్వ.

''ఎల్లవ్వా... చూడు ఎంత రక్తం వస్తోందో... పద ఇంటికి... మన వైద్యున్ని పిలుచుకువస్తాను...''

''నా సంగతి తరువాత... ముందు చెత్త కుండీలో వెతుకు...''

''మళ్లీ వచ్చి వెతుకుదాం... ముందు ఇంటికి పద...''

ఎల్లవ్వ కోపంగా లేచింది. ''నాకేం కాదుకాని ముందు వెతుకు. మనం ఇంటికి వెళ్ళివచ్చేసరికి ఆలస్యం అవుతుంది. అప్పటికి పిల్లవాడు చచ్చిపోవచ్చు... అసలు ఎవరున్నారో చూడు''

రామప్ప వెతకటం మొదలుపెట్టాడు. పైన చెత్త అంతా తీశాడు. లోపల కనిపించిన దృశ్యం చూసి అతడు ఆశ్చర్యపోయాడు. లోపల చిన్నపిల్లవాడు కనిపించాడు. వాడి ఒంటిమీద లంగోటి తప్పితే మరేమీ లేదు. వాడి కళ్లు ఇంకా పూర్తిగా తెరుచుకోలేదు.




పిడికిళ్లు బిగించి వున్నాయి. రామప్ప వాడిని చేతిలోకి తీసుకున్నాడు.

"ప్చ్... వీడిని ఈ కుండీలో పడేయడానికి ఎవరికి మనసొప్పిందో..." బాధగా అన్నాడు రామప్ప.

కుక్క రామప్ప చుట్టూ తిరగసాగింది. ఎల్లవ్వ పిల్లవాడిని ఒళ్లోకి తీసుకుంది. పిల్లవాడు పెద్దగా ఏడువసాగాడు.

"ఎవరి పిల్లవాడో ఏమో... ఇంత నిర్దయగా ఆ తల్లి ఎట్లా పడేసిందో... రామప్పా... ఈ పసిపిల్లవాడిని ఏం చేద్దాం..."

"మనం పెంచుకుందాం... మన దగ్గరే పెరుగుతాడు"

"వీడు ఏ కులంవాడో ఏమో..."

"ఏకులం అయితే మనకెందుకు. పెంటలో దొరికాడు. పెంటయ్య అని పేరు పెడదాం... మనం పెంచుదాం..."

"మన జాతివాళ్లు ఏమంటారో..."

"వీడు పెద్ద అయితే మనవాళ్లకి ఎంతో లాభం..."

"కాని ఇప్పుడు మనకే తిండితిప్పలు లేవు. వీడిని ఎట్లా పెంచుదాం...?"

"మనతోపాటే ఇంత కలోగంజో తాగి బతుకుతాడు. పదేళ్ల పిల్లవాడైతే చాలు వాడికి దొంగతనాలు చేయడం నేర్పిస్తే... బోలెడు సంపాయిస్తాడు. ఎల్లవ్వా ఎటూ నువ్వు ఇక ముందు దొంగతనాలు ఎక్కువ చేయలేవు. నీ కొడుకులు సంపాదించినా నీ కోడళ్లు పెట్టనివ్వరు. ఓ పదేళ్లు కష్టపడి వీడిని పెంచు"

"కాని... కాని... మన జాతివాళ్లకు చెప్పకుండా ఈ పని చేయలేం... మన కులంకాదు. మన జాతికాదు వీడిని పెంచడానికి వీల్లేదు అంటే ఏం చేద్దాం... వాళ్లని ఎదిరించి పెంచామో... అమ్మో... ఇంకేమైనా ఉందా..."

"వీడివలన మన జాతివాళ్లందరికి లాభమే. రేపు వీడు దొంగతనాలు చేసి ధనం బంగారం తెచ్చి అందరికి పంచుతాడు. వీడికి మనం బాగా శిక్షణ ఇవ్వాలి. చెప్పులతో కొట్టి, కాళ్లతో తన్ని కారం కళ్లలోపోసి బాగా రాటుతేలేలా తయారుచెయ్యాలి. పోలీసులు పెట్టే బాధలు భరించేలా వీడిని తయారుచేద్దాం. మనం వీడిని బాగా హింసించుదాం... పెద్దవాడయ్యాక వాడికి బాధలు భరించేశక్తి వస్తుంది"

"నువ్వు చెప్పింది బాగానే వుంది. కాని రేపు ఎప్పుడైనా వీళ్ల అమ్మో... అయ్యో వచ్చి మా పిల్లవాడిని మాకిచ్చేయండి అని అంటే ఏం చేద్దాం. మనం వీడిని దొంగగా తయారుచేశామని వాళ్లు మనమీద కేసు పెడితే..."

"ఇవన్నీ నువ్వు ఊహించుకుంటున్నావు. వీడి తల్లిదండ్రికి పిల్లవాడు కావాలి అని అనుకుని ఉంటే ఈ చెత్తకుండీలో ఎందుకు పడేస్తారు. ఎవడూ రాడు. మనకేం భయంలేదు"

"వీడిని మన కులంలో కలుపుకోవాలంటే శుద్ధిచేయాలిగా... మన జాతివాళ్లు ఏమంటారో ఏమో..."

"శుద్ధి చేయిద్దాం... జాతి పంచాయతీవాళ్లకి ఇంత డబ్బు పడేస్తే సరి అన్ని పనులు జరుగుతాయి"

అటువైపునుండి వెళ్తున్న కొండప్ప ఆగిపోయాడు. "ఎల్లా... ఈ పిల్లవాడు ఎవడు?"

"ఈ చెత్తకుండీ దగ్గర దొరికాడు"

పిల్లవాడు గుక్కపట్టి ఏడవడం మొదలుపెట్టాడు.

"ఇంటికి పోదాం పద... వీడికి పాలు పట్టాలి"

"ఎల్లా... మనకెందుకు వచ్చిన గొడవ... జాతీ పంచాయతివాళ్లు గొడవ పెడతారు. వీడు ఏముండ సంతానమో... ఏమో..." అన్నాడు కొండప్ప పిల్లవాడి ముఖంలోకి చూస్తూ.

పిల్లవాడు ఏడుస్తూ ఉండటంవలన ఎల్లవ్వ వాడిని సముదాయించడం మొదలుపెట్టింది.

రామప్ప వెళ్లి ఒక చిన్న ప్లాస్టిక్ గ్లాసు తీసుకుని పాలు తీసుకువచ్చాడు. ఎల్లవ్వ తన కొంగును పాలల్లో తడిపి పిల్లవాడి నోట్లో పిండటం మొదలుపెట్టింది. పిల్లవాడు పాలు చప్పరిస్తూ మధ్య మధ్యలో ఏడుస్తున్నాడు.

"ఎల్లవ్వా... గబగబా పాలు పట్టేయి. పోలీసులు వస్తే గోల అవుతుంది. ఇంటికి పోదాం..." అన్నాడు రామప్ప.

కొండప్పకి పిల్లవాడిని ఇంటికి తీసుకువె



ళ్లడం ఎంత మాత్రం ఇష్టంలేదు.

''మావా చెబితే విను... మన జాతి పంచాయతీవాళ్లు అసలే క్రూరులు. వాళ్లకి ఇష్టం లేకపోతే కులంనుండి వెలివేస్తారు. ఎల్లవ్వ



తల గొరిగిస్తారు. బోలెడంత డబ్బు జరిమానా వేస్తారు''

ఎల్లవ్వ కూనిరాగాలు తీస్తూ గ్లాసును ఎత్తి నెమ్మది నెమ్మదిగా ఒక్కొక్క చుక్క పిల్లవాడి నోట్లో పోస్తోంది.

రామప్ప కొండవ్వల మధ్య మాటామాటా పెరిగింది. ఇద్దరు పెద్దగా అరుచుకోవడం మొదలుపెట్టారు.

''పాపం పిల్లవాడిమీద జాలి వేస్తోంది. కొండప్పా.... నువ్వు మనిషివేనా? మనం కాకపోతే వీడిని ఎవరు పెంచుతారు చెప్పు''

''మావా... వీడిని ఇంటికి తీసుకురావడానికి వీల్లేదు... వీల్లేదు... ఎల్లా... వీడిని ఇక్కడే పడేయి...''

వీళ్ల అరుపులు విని కొంతమంది అక్కడ గుమిగూడారు. నెమ్మది నెమ్మదిగా ఈ విషయం ఊరంతా పాకిపోయింది. భారతి వచ్చింది. ''ఎల్లవ్వా... పిల్లవాడిని పోలీసులకి ఇచ్చేసేయి. కాకపోతే వాళ్లు గొడవ పెడతారు. వాళ్లు ఎంక్వయిరీ చేసి పిల్లవాడి తల్లిదండ్రుల ఆచూకీ తెలియకపోతే అనాథ శరణాలయంలో ఇచ్చేస్తారు'' అన్నది భారతి.

''ఓ టీచరమ్మా... మా విషయంలో జోక్యం కలిగించుకోకు. నువ్వు ఆ విఠల్ కలిసి మమ్మల్ని మోసం చేశారు'' అన్నాడు రామప్ప కోపంగా.

''మీరు ఈ పిల్లవాడిని తీసుకువెళ్లడానికి వీల్లేదు. మీరు దొంగతనాలు చేయడం మానేయరు. ఈ పిల్లవాడు మీ దగ్గర పెరిగితే దొంగే అవుతాడు. అనాథాశ్రమంలో అయితే వాళ్లు చదువు చెప్పిస్తారు. వీడి భవిష్యత్తు బాగుపడుతుంది'' అంటూ భారతి పిల్లవాడిని చూసి చాలా బాధపడ్డది. పిల్లవాడి భవిష్యత్తు నాశనం కావడం ఆమెకు ఎంతమాత్రం ఇష్టంలేదు. సంతముచ్చులు అమాయకులు.

అనిపిస్తున్నావు. చెప్పు నువ్వే ఈ పిల్లవాడిని ఈ కుండీలో పడేశావా ఏమిటి?"

భారతికి చాలా అవమానం అనిపించింది.



చెత్తకుండీలో పడిఉన్న పిల్లవాడిని తీసుకు వెళ్తే ఎన్ని గొడవలు తనకి చుట్టుకుంటాయో వీళ్లకి తెలియదు. పోలీసులు వీళ్ళమీద కేసు పెట్టి వీళ్లని దోపిడీ చేస్తారు అన్న బాధకూడా ఆమెలో ఉంది.

"నువ్వెవరివి మాకు చెప్పడానికి?" పెద్దగా అరిచాడు రామప్ప.

"మీ మంచికే చెబుతున్నాను. పోలీసులు కేసుపెడతారు. పోనీ మీరు వీడిని పెంచి చదివించి వాడి భవిష్యత్తు బాగుచేస్తారా అంటే అదీ లేదు. అనవసరంగా వాడిని దొంగను ఎందుకు చేస్తారు?"

"అసలు ఈ పిల్లవాడికి నీకు ఏమిటి సంబంధం, నీ కొడుకు కాదుగా..." అన్నాడు రామప్ప పెద్దగా నవ్వుతూ.

అక్కడున్నవాళ్లందరు పెద్దగా నవ్వడం మొదలుపెట్టారు.

"చూస్తూఉంటే నువ్వు కాలు జారినదానిలా

"పిచ్చిపిచ్చిగా వాగకండి"

"మరి నీకెందుకు ఈ గొడవ? చదువు చదువు అంటూ మావాళ్లని పాడుచేస్తున్నావు. మమ్మల్ని ఉద్ధరిస్తాం అంటూ విఠల్ ఎలక్షన్లలో నిల్చున్నాడు. లక్ష రూపాయలు తీసుకుని నిల్చోవడం మానేశాడు. ఆ డబ్బును మీరిద్దరు పంచుకుతిన్నారు, మీరు మమ్మల్ని మోసంచేశారు"

"మీరు పొరపాటు పడుతున్నారు. విఠల్

డబ్బు తీసుకోలేదు. నా స్వంత డబ్బు మీ కోసం ఖర్చుపెట్టడానికి కూడా నేను వెనుకాడను. మి మ్మల్ని బాగుచేయాలని నేనూ కొంత ఖర్చు పెట్టాను. మీ బీదవాళ్ల పైసలు నాకెందుకు? మీ లాంటి బీదవాళ్లను మోసంచేస్తే నాకేం ఒరుగుతుంది, నేను అంత దుర్మార్గురాలిని కాను''

పిల్లవాడు పెద్దగా ఏడవడం మొదలుపె ట్టాడు. పాపం పిచ్చి తండ్రి... ఎవరు పడేశారో... వీడి భవిష్యత్తు అంధకారం కాకూడదు... ఎట్లా గైనా సరే వీడిని వీళ్ల చేతుల్లో పడకుండా రక్షించాలి... అని అనుకుంది భారతి.

ఈ వార్త తెలియడంవలన జగన్నాథరావు, మాధవరావు, ఇన్స్పెక్టర్, పోలీసులు వచ్చారు.

''ఇన్స్పెక్టర్గారూ... ఈ పిల్లవాడిని తీసుకు వెళ్ళి అనాథాశ్రమంలో చేర్పించండి. ఎవరైనా దయామయులు వచ్చి తీసుకువెళ్ళి పెంచితే వాడి భవిష్యత్తు బాగుపడుతుంది. అనాథాశ్ర యంలో పెరిగినా కొంతవరకు వాడి జీవితం బాగానే ఉంటుంది- కాని వీళ్ల దగ్గర...''

''భారతిగారూ... ఈ గొడవలు మీకెందుకు చెప్పండి. కాలేజీలో పిల్లలకి పాఠాలు చెప్పి పొట్టపోసుకునే మీకు ఈ తల నొప్పి ఎందుకు?'' అన్నాడు జగన్నాథరావు నవ్వు తూ.

''నిజమే భారతిగారూ... ఆడవాళ్లకి ఇటు వంటి విషయాలలో జోక్యం అనవసరం. మేం అందరం ఉన్నాంగా...'' అన్నాడు మాధవ రావు.

''ఒరేయ్ రామప్పా... అసలు ఏం జరి గింది? ఈ పిల్లవాడు ఎవడు ఈ గొడ వఏమిటి?'' అడిగాడు ఇన్స్పెక్టర్ ఎల్లవ్వకి దగ్గరిగా వస్తూ.

''మీకు ఇక్కడ ఏంపని? పొండి...'' అన్నా రు కానిస్టేబుల్ గుంపును చూస్తూ.

అయినా గుంపు కదలలేదు. ఒకరి చెవుల ను ఒకరు కొరుక్కోసాగారు. కలకలం మొదల యింది ''ఎవరూ మాట్లాడకండి...'' పెద్దగా అరిచాడు ఇన్స్పెక్టర్.

కాన్స్టేబుల్ గుంపును చెల్లాచెదురు చేశా డు.

''ఆ... చెప్పు... ఎల్లవ్వా...'' అన్నాడు ఇన్ స్పెక్టర్.

''సాహెబ్... ఈ పిల్లవాడు మాకు చెత్త కుండీ దగ్గర దొరికాడు. మేం తీసుకువెళ్ళి పెంచుకోవాలని అనుకుంటున్నాము. ఈ అమ్మ తీసుకువెళ్లడానికి వీల్లేదని మాతో పోట్లా డుతోంది''

''మరి ఆవిడగారు తీసుకువెళ్ళి పెంచు తుందిట. వాహ్... ఎంత కరుణామయి. పెళ్ళి కాకుండానే ఇంతగా ధైర్యం చేసే ఆడవాళ్ళున్న భారతదేశంలో.పుట్టడం మన భాగ్యం'' అన్నా డు జగన్నాథరావు మాధవరావుని చూస్తూ.

''దేశదిమ్మరులను ఉద్ధరించాలంటూ విఠ ల్తో చేయికలిపి స్కూల్ తెరిచినప్పుడే నేను అనుకున్నాను. ఈమెలో ఓ ఝాన్సీరాణి ఉందని, ఒక పూలన్దేవి ఉందని'' అన్నాడు మాధవరావు.

''అంతవరకు ఫరవాలేదు. పెళ్ళికా కుండానే ఏ ఆడపిల్ల అయినా ఒక అనాథను పెంచడం... బాప్...రే... రేపు పెళ్ళికొడుకు పెళ్ళికూతురునే కాదు ఆవిడతోపాటు కొడుకు ను కూడా స్వీకరించాలి. రోజులు ఎంత మారాయి...''

''ఏ పెళ్ళికొడుకైనా ముందుకు వస్తా రంటారా...''

''ఏమో వచ్చినా రావచ్చు... ఇది కలికాలం మాధవరావుగారూ...'' భారతికి ఈ మాటలు వినంగానే అరికాలిమంట నెత్తికెక్కింది.

''మీరు అసలు విషయం తెలుసుకోకుండా ఏవేవో వాగుతున్నారు. అయినా ఇవన్నీ మీ కెందుకు పోలీసులు చూసుకోవాల్సిన విషయా లు. ఇవి'' అంది కోపంగా భారతి.

''మేం ఈ ఊరి పెద్దలం... మా తరువాతే పోలీసులు''

''ఆరోజులు పోయాయి. మీరు ఈ అమాయ కులని ఎక్కువకాలం మోసం చేయలేరు''

''దయచేసి మీరు కొంచెంసేపు మాట్లాడ కుండా ఊరుకోండి నన్ను ఎన్క్వయిరీ చేయనీ యండి''

''సాహెబ్... మేం ఈ పిల్లవాడిని పెంచు తాం. మాకు ఈ పిల్లవాడిని ఇచ్చేయండి''




"రామప్పా... ముందు ఈ పిల్లవాడిని మాకు అప్పగించేయండి. ఆ తరువాత మీరు చెప్పే విషయం గురించి ఆలోచిస్తాను. ముందు ఈ పిల్లవాడు ఎవరి పిల్లవాడో ఎన్క్వయిరీ చెయ్యాలి"

"ఇన్స్పెక్టర్‌గారూ...మీరు ఎంత ఎన్క్వయిరీ చేయించినా ఈ పిల్లవాడు ఎవరి పిల్లవాడో తెలుసుకోవడం కష్టం. ఒకసారి కుండీలో పడేశాక వీడు నా పిల్లవాడు అని చెప్పడానికి ఎవరూ ముందుకు రారు..."

"సాహెబ్... వీడిని చూడంగానే నేను ఎత్తుకున్నాను. రామప్ప పాలు తెచ్చాడు. పాలు పట్టాను. ఇక నేను ఈ పిల్లవాడిని ఎవరికీ ఇవ్వను" అంది ఎల్లవ్వ వాడినుదిటిన ముద్దు పెడుతూ.

"ఇవ్వనంటే ఎట్లా? ముందు మాకిచ్చేసేయి. ఆ తరువాత నీ సంగతి..."

"ఇన్స్పెక్టర్‌గారూ... ఎల్లవ్వ, రామప్పలు మంచి మనసుతో పిల్లవాడిని పెంచుదాం అని అంటున్నారు. గుట్టుచప్పుడు కాకుండా వాళ్లకి పిల్లవాడిని ఇచ్చేయండి"

"పాటిల్ దొర ఎంత మంచివాడు. మేం పెంచుతాం అని అనగానే తీసుకోమని చెబుతున్నాడు" అన్నాడు ఆనందంగా రామప్ప.

"పాటిల్‌గారూ... పిల్లవాడిని మా కప్పగించండి"

"ఇన్స్పెక్టర్‌గారూ... వాడి భవిష్యత్తును ఆలోచించండి. వీళ్లలో పెరిగితే వాడికి చదువు రాదు. మంచి సంస్కారం అబ్బదు మన చేతులలో ఒకడి జీవితం చూస్తూచూస్తూ నాశనం చేసినట్లు అవుతుంది" అన్నది భారతి.

"ఈ టీచరమ్మ చదువు చదువు అంటుంది. చదువు లేకపోయినా మేం బతకడం లేదా! ఆ విఠల్‌గాడు, ఈమె కలిసి మమ్మల్ని మోసం చేస్తున్నారు, మానోటిదగ్గర కూడు లేకుండా చేస్తున్నారు" అన్నాడు రామప్ప కోపంగా.

"రామప్పా... మీ జాతి వాళ్లందరికి జ్ఞానం కలిగించాలని ప్రయత్నిస్తున్నాను. మా ఇద్దరిని మీరు అపార్థం చేసుకుంటున్నారు"

"కానిస్టేబుల్ పిల్లవాడిని తీసుకో"

కానిస్టేబుల్ ఎల్లవ్వ దగ్గరికి వచ్చాడు "సాహెబ్ నేను ఇవ్వను" అంటున్నా కానిస్టేబుల్ పిల్లవాడిని బలవంతంగా తీసుకున్నాడు.

"మీరిద్దరు స్టేషన్‌కి రండి, మీ కులంలో వాళ్ళు... మీ బంధువులెవరయినా బయట తిరగమరిగి ఈ పాపాన్ని ఇక్కడ వదిలేసిందా... కులంవాళ్ళు వెలివేస్తారన్న భయంతో ఈ చెత్తకుండీలో పడేస్తే మీరు ఇక్కడ దొరికినట్లుగా నటిస్తున్నారా... ఎవరు చేసిందో... దాని పాపాన్ని దాచాలని చూస్తున్నారు. నాకెందుకో అనుమానంగా ఉంది" అన్నాడు ఇన్స్పెక్టర్.

రామప్ప, ఎల్లవ్వ, కొండప్పలు ఈ మాటలు వినగానే లెంపలు వేసుకున్నారు.

"సాహెబ్... మాకే పాపం తెలియదు"

కథను మరో మలుపు తిప్పి ఇన్స్పెక్టర్ వీళ్లను బెదిరించి కొంత డబ్బు గుంజాలని చూస్తున్నాడని భారతికి అనిపించింది.

"ఏయ్ రామప్పా నిజం చెప్పు...కేసు పెడతాను" బెదిరిస్తూ అన్నాడు ఇన్స్పెక్టర్.

"సాహెబ్ మాకేమీ తెలియదు" రామప్పకి ఇప్పుడు అసలు సత్యం బోధపడ్డది. ఇన్స్పెక్టర్ ఈ విధంగా తమని బెదిరించి డబ్బు గుంజాలని చూస్తున్నాడని అతడికి అర్థం అయింది.

"ఎల్లా పదపోదాం... మనకెందుకు వచ్చిన గొడవ... మంచికి పోతే చెడు ఎదురవుతోంది"

"మనం ఏంపాపం ఎరుగం... మనం ఎందుకు భయపడాలి. పిల్లవాడిని చూడంగానే ప్రేమ కలిగింది. పెంచుకుందామనుకున్నాం" అన్నది ఎల్లవ్వ లేస్తూ.

"నాకు మీ ఇద్దరి మీద అనుమానంగా ఉంది. మీరు ఈ పిల్లవాడిని దొంగతనంగా ఎత్తుకొచ్చారా... లం... కొడుకుల్లారా... పదండి పోలీస్‌స్టేషన్‌కి..."

"ఇన్స్పెక్టర్‌గారూ... వాళ్ళు ఏ పాపం ఎరుగరని అంటున్నారుగా... వాళ్లని వదిలేయండి. ఎంతయినా మా ఊరివాళ్ళు...." అన్నాడు జగన్నాథరావు వాళ్లమీద సానుభూతి నటిస్తూ. రామప్ప, ఎల్లవ్వలకు ఇన్స్పెక్టర్ కేసు పెడతాడని లంచం ఇస్తే కాని వదిలేయడని అనిపించింది. లంచాలు ఇవ్వడం వాళ్ళకు మామూలే. దొంగతనాలు చేసినప్పుడు కేసులు

కొట్టివేయడానికని లంచం ఇవ్వక తప్పదు. ముందే బోలెడంత డబ్బు ఇస్తే కేసు పెట్టరు. కాని ఇటువంటి సందర్భంలో డబ్బు ఎందుకు ఇవ్వడం అని ఆమెకు అనిపించింది.

"పిల్లవాడితో మాకు సంబంధంలేదు. సాహెబ్ మమ్మల్ని వదిలిపెట్టండి" అంది ఎల్లవ్వ భయపడుతూ.

"మిమ్మల్ని వదిలి పెట్టను, పదండి స్టేషన్ కి వెధవల్లారా..."

"సాహెబ్... మమ్మల్ని వదిలేయండి..." అంటూ ఎల్లవ్వ ఇన్‌స్పెక్టర్ కాళ్ళు పట్టుకుంది.

"పాటిల్ దొరా... మీరైనా చెప్పండి మమ్మల్ని వదిలేయమని. మేం ఏ పాపం ఎరగం" అన్నాడు రామప్ప జగన్నాథరావు కాళ్ళు పట్టుకుంటూ.

"ఇన్‌స్పెక్టర్‌గారూ...వీళ్లను వదిలేయండి"

"ముందు పోలీస్ స్టేషన్‌కి తీసుకువెళ్తాను. ఆ తరువాత చూద్దాం" నెమ్మది నెమ్మదిగా సంతముచ్చులందరు అక్కడ చేరారు. రామప్పను ఎల్లవ్వను ఇన్‌స్పెక్టర్ పోలీస్‌స్టేషన్‌కి తీసుకువెళ్లాడు.

భారతి ఇంటికి బయలుదేరింది. ఆమె మనస్సు బాధతో బరువెక్కింది. మరునాడు హైదరాబాద్‌కి వెళ్ళిపోదాం అనుకున్న భారతికి ఎందుకో వెళ్ళబుద్ధికాలేదు. అటునుండి అటే బస్‌స్టాండ్‌కి వెళ్ళి టికెట్ కాన్సిల్ చేసింది. తను వీలు చూసుకుని వస్తానని తండ్రికి ఉత్తరం వ్రాసింది.

జగన్నాథరావు పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళి జామీను మీద ఎల్లవ్వ, రామప్పలను విడిపించాడు. ఆ తరువాత ఇన్‌స్పెక్టర్,జగన్నాథరావు కాసేపు మాట్లాడుకున్నారు. ఎల్లవ్వ రామప్పలకు జగన్నాథరావు దేవుడిలా కనిపించాడు. స్టేషన్ నుండి ముగ్గురు బయటికి వచ్చారు.

"ఒరేయ్ రామప్పా... ఇప్పటికి విడిపించాను కాని ఇన్‌స్పెక్టర్ మిమ్మల్ని జైల్లో తోయకుండా ఊరుకోడు"

"దొరా... మరి... మరి..." నసిగాడు రామప్ప.

"ఇన్‌స్పెక్టర్‌కి ఐదొందలో ఆరొందలో లంచం పడేయండి నోరు మూసుకుని ఊరుకుంటాడు"

"అంత డబ్బు మా దగ్గర లేదు..." అన్నది ఎల్లవ్వ.

"నేను ఇస్తాను- తరువాత వడ్డీతోసహా ఇచ్చేసేయి" అంటూ జగన్నాథరావు వెళ్ళిపోయాడు. జగన్నాథరావు రామప్ప, ఎల్లవ్వలలో విఠల్ భారతిలమీద ఇంకా ద్వేషం కలిగించడానికి తను వాళ్లను రక్షించినట్లుగా, వాళ్ళు అనుకోవాలని జగన్నాథరావు ఇంత నాటకం ఆడాడని వాళ్ళకేం తెలుసు.

రామప్ప ఎల్లవ్వను తిట్టడం మొదలు పెట్టాడు. 'ఎల్లవ్వా... అసలు నువ్వెందుకు ఆ కుండీ దగ్గరరికి వెళ్లావే... ఆ పిల్లవాడిని ఎందుకు బయటకి తీశావు, లేనిపోని గోల మన నెత్తికి చుట్టుకుంది"

ఇంటికి రాగానే సంతముచ్చులందరు వీళ్ల చుట్టూ చేరారు.

"రామప్పా... ఎటూ ఇన్‌స్పెక్టర్‌కి లంచం ఇవ్వాలిగా... లంచం ఇచ్చి పిల్లవాడిని తెద్దాం" అన్నది ఎల్లవ్వ.

"పిల్లవాడిని ఇన్‌స్పెక్టర్ ఇస్తే తెచ్చి పెంచుదాం"

"ఆ పిల్లవాడు ఎవడో ఏకులంవాడో తెలియదు. మన జాతిలో వాడిని ఎట్లా కలుపుకుంటాం" అన్నాడు కొండప్ప.

"కొండప్పా! వాడి కులం మనకెందుకు వాడిని శుద్ధిచేసి మనలో కలుపుకుందాం, వాడు పెరిగి పెద్దవాడైతే దొంగతనాలు చేసి బోలెడు సంపాయిస్తాడు"

"దొంగతనాలు వాడు చేయాలిగా... అదే మన రక్తం పంచుకుని పుట్టిన బిడ్డ అయితే మన బుద్ధులు వస్తాయి. ఎంతైనా వాడు పరాయి వాడు కదా... వాడు పెద్ద అయ్యాక నేను దొంగతనాలు చేయనుపో అన్నాడనుకో అప్పుడు ఏం చేస్తావు?"

"చిన్నప్పటినుండి తన్ని కొట్టి శిక్షణ ఇస్తే ఎందుకు చెయ్యడు. వాడి బాబు కూడా చేస్తాడు. మనం బూట్లతో ఎట్లా తంతామో నీకు తెలిసిందేగా. కళ్లలో కారం చల్లుతాము. చర్మం కొంచెం కొంచెం వలిచివేస్తాము. ఇనప చైన్లతో కొడతాము. కాలుతున్న కట్టెలను కళ్లలో గుచ్చు





# ఏరిన ముత్యాలు

★ అవమానం పొందుతామేమోననే భయం చట్టభయం కంటే తక్కువేమీకాదు.

— ప్రేంచంద్

★ అవసరం లేనప్పుడు ఇచ్చిన బంగారు కాసులకంటే అవసరమైనప్పుడు ఇచ్చిన చిల్లర నాణాలే విలువైనవి.

— పర్షియన్ సామెత

★ అధికార దుర్వినియోగాన్ని అరికట్టే శక్తి జనులందరికీ అబ్బినప్పుడే నిజమైన స్వరాజ్యం వచ్చినట్లు.

— గాంధీజీ

★ అదృష్టం, పేరును, అధికారాన్ని ఆనందాన్ని పెంచవచ్చునుగాని పుట్టించలేవు.

— డిజ్రాయిలి

★ ఒక వ్యక్తి గుణగణాలను పరీక్షించాలనుకుంటే ఆ వ్యక్తికి అధికారం ఇచ్చిచూడు.

— లింకన్

★ కిరీటాన్ని ధరించే శిరస్సు సుఖానికి దూరమవుతుంది.

— షేక్స్పియర్

★ అధికారానికి కూడా కొన్ని హద్దులున్నాయి. ఇవి గుర్తించలేకపోవడం వల్లనే గొప్ప సామ్రాజ్యాలు నాశనమయ్యాయి.

— బెర్ట్రండ్ రస్సెల్

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

తామని బెదిరిస్తే ఎవడు మాత్రం దొంగతనం చేయడు"

"వాడు పోలీసులు పెట్టే బాధలు భరించా లిగా... లేకపోతే మన టోలీవాళ్ళు పేర్లన్నీ చెప్పేస్తాడు"

విఠల్ ఆరోగ్యం కొంత బాగుపడ్డది. కాని గాయాలు పూర్తిగా మానలేదు. అతడు వీళ్ల మాటలు విన్నాడు. నెమ్మదిగా బయటికి వచ్చా డు.

"మావా... మీకెన్నిసార్లు చెప్పినా ఈ దొంగ తనాలు చేయడం మానేయరుకదా... పైగా ఇప్పుడు ఆ చిన్నపిల్లవాడిని తెచ్చి పెంచి పెద్ద చేసి దొంగగా తయారు చేస్తారా... వాడి జీవితాన్ని ఎందుకు పాడుచేస్తారు. మీరు వాడిని తీసుకురావడానికి వీల్లేదు" కోపంగా అన్నాడు విఠల్.

"వాడి జీవితం గురించి నీకెందుకురా..."

"మనవాళ్ల జీవితాలని ఎటూ పాడుచేస్తు న్నారు. పిల్లలని చదివించమంటే చదివించ రు. ఇంత వయస్సువచ్చాక అయినా బయట ప్రపంచాన్ని చూసి నాగరిక ప్రపంచాన్ని చూసి మారమంటే మీరు మారరు"

"విఠలియా... నీవు ఆ మాస్టరమ్మ కలిసి మా జీవితాలని పాడుచేస్తున్నారు. మన కులపు కట్టుబాట్లను వదిలివేయమని చెప్పడానికి మీ రిద్దరికి ఎంత ధైర్యం. ఇక ఆమె ఇక్కడ ఉండడానికి వీల్లేదు"

"మీరెంత మూర్ఖులు. ఎంత చెప్పినా విన రుకదా... ఏమైనా సరే ఆ పిల్లవాడిని మాత్రం తీసుకురావడానికి వీల్లేదు. వాడు మన వాళ్లద గ్గర కాకుండా వేరేవాళ్లదగ్గర పెరిగితే చదువు కుని సంస్కారవంతుడిగా బతుకుతాడు"

"ఒరేయ్... విఠలయా నీవు పెద్దవాళ్ళని ఎదిరిస్తున్నావా? ఆ పిల్లవాడిని నేను చస్తే వదలను. ఎర్రగా బుర్రగా అందంగా ఉన్నా డు. నాకు వాడిని చూసినప్పటినుండి వాడిని వదిలిరాబుద్ధికాలేదు. జగన్నాథరావు దొర మంచివాడు, మమ్మల్ని విడిపించాడు"

"ఇదంతా వాళ్ళు ఆడుతున్న నాటకం... రేపు ఇన్స్పెక్టర్ బోలెడంత డబ్బు అడుగుతా డు"

"డబ్బు ఎటూ ఇస్తూనే ఉన్నాం"

"ఎంత?"

"ఐదువందలు"

"మావా... అనవసరంగా ఎందుకు ఈ గొ డవ. ఇప్పుడు నువ్వు ఐదొందలు ఎక్కడి నుండి తెస్తావు?"

"జగన్నాథరావు దొర ఇస్తానన్నాడు"

"బోలెడు వడ్డీ గుంజుతాడు, పిల్లవాడిని ఇవ్వడానికి మరో ఐదొందలు అడిగితే"

"ఇచ్చినా మనకేమీ నష్టంలేదు. రేపు వాడు వేలవేల రూపాయలు సంపాదిస్తాడు"

"మావా... ఈ ఆలోచన మంచిది కాదు"

"ఎల్లమ్మదేవి దయవలన పిల్లవాడు దొరికా డు. పిల్లవాడిని ఇంటికి తీసుకురాంగానే అమ్మ వారికి మేకను బలిస్తాను" అన్నది ఎల్లవ్వ లెంపలు వేసుకుని దండంపెడుతూ.

"ఒక పిల్లవాడిని తీసుకువచ్చి వాడి జీవితం నాశనం చేస్తే అమ్మవారికి దయ కలుగుతుందా? అమ్మకి కోపం వస్తుంది"

దేశదిమ్మరులందరు నెమ్మది నెమ్మదిగా అక్కడికి చేరారు.

"మావా... వాడి కులం తెలియదు. వాడిని మనలో కలుపుకోవడానికి వీల్లేదు" అన్నాడు లక్ష్మప్ప.

"ఒరేయ్... లక్ష్మప్పా... ఒక పదేళ్ళు కళ్ళు మూసుకుంటే చాలు. ఈ పిల్లవాడు వేలువేలు సంపాదిస్తాడు"

"మావా... పిల్లవాడిని తీసుకురావడం నాకు ఇష్టంలేదు..." దేశదిమ్మరులందరు అక్కడ చేరారు. వాళ్లందరు అరవడం మొదలు పెట్టా రు.

మరునాడు ఉద్గిర్‌లో జరిగే జాతరకు రామప్ప, ఎల్లవ్వ, కొండప్ప, లక్ష్మప్ప తక్కిన ముచ్చులందరు బయలుదేరారు.

బయలుదేరేముందు ఎల్లవ్వ కొత్త బ్లేడ్ తీసుకువచ్చింది. బ్లేడుని, దాఖలా పత్రాన్ని ఒక చోట పెట్టారు.

రామప్ప ఒక కోడిని కొనుక్కుని వచ్చాడు. ఎల్లవ్వ బ్లేడ్‌ని దాఖలా పత్రానికి పసుపు




కుంకుమ వేసి పూజ చేసింది, పాటలు పాడింది. రామప్ప కోడిని ఒక్క వేటులో నరికేశాడు. రక్తం చిందింది. ఆ రక్తాన్ని వేలితో బ్లేడు మీద చిలకరించాడు. రెండుమూడు బొట్లు రక్తం బ్లేడుమీద పడ్డది.

"దేవి... మాకు జాతరలో బాగా సొమ్ము దొరికేటట్లు చెయ్యి" అంది ఎల్లవ్వ కళ్ళు మూసుకుని.

"మాకు మూటలు, ముల్లెలు, చెప్పులు బాగా దొరికేట్లు చేయి తల్లీ" అన్నాడు రామప్ప.

"అమ్మ తల్లీ! బాగా బంగారం దొరికేట్లు చేయి..." అంటూ దండం పెట్టుకున్నాడు కొండప్ప.

ఎల్లవ్వ జొన్న పిండి కలిపి రొట్టెలు చేసింది. పచ్చిమిరపకాయలతో పచ్చడి చేసింది. మూటలు కట్టింది. సంచులలో ఈ మూటలు పెట్టింది.

నారియా పలకమీద అక్షరాలు వ్రాస్తున్నాడు. రామప్ప పలక బలపంలాగి అవతల విసిరేశాడు. నారియా పెద్దగా ఏడవడం మొదలుపెట్టాడు.

"వ... ల.... క... బల... పం..." అంటూ బలపం ముక్కలని ఏరుకోవడం మొదలుపెట్టాడు.

"ఒరేయ్... నారియా... మాతో పద... జాతరకి... ఈ పలక బలపం పట్టుకుంటే ఏమొస్తుంది..." అన్నాడు రామప్ప నారియా చెంప మీద కొడుతూ.

"నేను దొంగతనం చేయను... చేయను... చదువుకుంటాను..." అన్నాడు నారియా.

నారియా చేయిని కొండప్ప గట్టిగా పట్టుకున్నాడు "ఒరేయ్... దొంగతనం చేయకుండా కడుపు ఎట్లా నిండుతుంది. మన కులం వాళ్ళు దొంగతనాలు చేసి బతకాలి లేకపోతే ఎల్లమ్మదేవికి కోపం వస్తుంది"

"విఠల్ అన్న నన్ను చదువుకోమని చెప్పాడు. మాస్టరమ్మ నాలుగో క్లాసు చదివినా సరే చప్రాసీ నౌకరీ దొరుకుతుందని చెప్పింది"

"ఈ విఠల్‌గాడు, ఆ మాస్టరమ్మ కలిసి మనవాళ్లందరిని పాడుచేస్తున్నారు" అంటూ కోపంగా నారియాని కొట్టడం మొదలుపెట్టాడు కొండప్ప.

"చేస్తాను అని చెప్పు..." అంటూ రామప్ప నారియాని బూట్లతో కొట్టడం మొదలుపెట్టాడు.

"నేను చెయ్యను... నేను చెయ్యను..." అంటూ రామప్పని ఒక్కతోపు తోశాడు నారియా.

"నారియా నీకు బాగా పొగరెక్కింది. పెద్దవాళ్లని ఎదిరిస్తావా... నారియా నువ్వు రోజూ స్నానం చేస్తానని ఏడుస్తున్నావట... మన కులంలో పదిరోజులకో నెలకో స్నానం చేయాలి"

"రోజూ స్నానం చేయాలి. స్నానం చేయకపోవడం వలనే మన దగ్గర కంపు వస్తుంది"

"ఒరేయ్... ఒరేయ్... నారియా నీ బుర్ర పాడైందిరా... మాతో జాతరకి రా..."

"మావా... చూడు నీదగ్గర ఎంత కంపు కొడుతోందో... నా దగ్గరికి రాకు....రాకు ..." అంటూ నారియా పరిగెత్తసాగాడు.

కొండప్ప వాడి వెనక పరుగెత్తుకుంటూ వెళ్ళి వాడిని పట్టుకున్నాడు. నారియా వదిలించుకోవడానికి ప్రయత్నించాడు. రామప్ప ఇంటిలోపలికి వెళ్ళి కారంపొడి తెచ్చాడు.

"నారియా... దొంగతనాలు చేస్తానని చెప్పు. మూటలు ఎత్తుకువస్తానని చెప్పు... లేకపోతే కళ్లలో కారం పోస్తాను"

నారియా పెద్దగా ఏడవడం మొదలు పెట్టాడు.

కొండప్ప పొయ్యిలోంచి రెండు మండుతున్న కట్టెలు తెచ్చాడు. ఆ రెండు కట్టెలను నారియా కళ్ల ఎదురుగుండా తీసుకువచ్చాడు. వామనప్ప తులసీబాయి గుండెలు కొట్టుకుంటూ వచ్చారు "ఓరి...నాయనో... నా కొడుకును చంపేస్తున్నారురో..." అంటూ పెద్దగా ఏడవటం మొదలుపెట్టింది తులసీబాయి.

"నువ్వు దొంగతనాలు చేయడం మానేశావు. నీ ఆరోగ్యం బాగా లేదు కదా అని ఊరుకున్నాం. మీ ముగ్గురు కలిసి చదువుకోవడంకోసం మాస్టరమ్మ దగ్గరికి వెళ్తున్నా చూసీ చూడకుండా ఊరుకున్నాం, ఇంకా ఎన్నాళ్ళు దొంగతనాలు చెయ్యకుండా ఉంటారు. మన టోలీవాళ్లందరు మొత్తుకుంటున్నారు"

"వీడు చెత్తకుండీల దగ్గరి కాగితాలు ఏరుకువచ్చి వాటిలో వ్రాస్తున్నాడట. వీడికి పిచ్చిపట్టింది" అన్నాడు కొండప్ప నారియాను చూస్తూ కోపంగా.

"మరి పుస్తకాలు కొనడానికి పైసలు లేవు. అక్కడికీ ఆ టీచరమ్మ పుస్తకాలు ఇచ్చింది. పలక బలపం ఇచ్చింది" అన్నది తులసీబాయి.

"ఇక ఆ మాస్టరమ్మ ఇక్కడ ఉండదు. ఇక చదువు లేదు గిదువులేదు" అన్నాడు రామప్ప.

కొండప్ప కాలుతున్న కట్టెలను అక్కడ పడేసి వామనప్ప ఇంట్లోకి వెళ్ళి ఒక గోనె సంచిని తెచ్చాడు. సంచిని విదిలించాడు. అవన్నీ నలిగిపోయిన కాగితాలు. ఆకాగితాలలో అక్షరాలు శబ్దాలు వ్రాసిఉన్నాయి. రామప్ప కాగితాలను చేతుల్లోకి తీసుకున్నాడు. "ఈ కాగితాలను అమ్మితే డబ్బులు వస్తాయి. వీటిల్లో రాసి ఇంట్లో ఉంచుకుంటే ఏమొస్తుంది"

"మావా... వాడు చదువుకుంటానంటున్నాడుగా... ఎంత చక్కగా కాగితాలమీద వ్రాశాడో చూడు" అన్నాడు విఠల్.

"నారియా ఎంతో కష్టపడి కాగితాలు జమచేసి వాటన్నింటిని సరిగ్గా పెట్టి వాటిమీద రాశాడు. వాటిని ఎందుకిట్లా వెదజల్లావు?" అన్నాడు వామనప్ప.

గాలికి కొన్ని కాగితాలు ఎగిరిపోయాయి. కొండప్ప మండుతున్న కట్టెలతో కాగితాలని కాల్చేశాడు. విఠల్ గబగబా కొన్ని కాగితాలని లాగేశాడు. నారియా మంటను ఆర్పేయాలన్నా ఉద్దేశంతో కాలుతున్న కాగితాలను చేత్తో అటూ ఇటూ తోశాడు. నారియా చేతులు కొంతమేర కాలాయి. విఠల్ కాగితాలను లాగడానికి ప్రయత్నించాడు. విఠల్ వేళ్ళు కాలాయి. నారియా పెద్దగా ఏడవడం మొదలు పెట్టాడు. వామనప్ప తులసీబాయి వాడి దగ్గరికి వచ్చారు. విఠల్ బాధతో నిట్టూర్చాడు.

కొండప్ప మళ్లీ కాలుతున్న కట్టెలను నారి




యా దగ్గరికి తీసుకువచ్చాడు.

నారియా భయపడిపోయాడు. విఠల్ కట్టెల ను లాగబోయాడు. కొండప్ప గట్టిగా పట్టుకో వడం వలన లాగలేకపోయాడు.

"మావా... నారియా దొంగతనాలు చేయ నంటున్నాడుగా... ఎందుకు వాడిని ఇంతగా హింసిస్తున్నావు"

"ఒరేయ్... విఠలియా... నీకెందుకు... తగి లిన దెబ్బలు చాలలేదా? మరొకసారి దేహశుద్ధి చేయమంటావా..." కళ్లు పెద్దవి చేస్తూ అడిగా డు రామప్ప.

విఠల్ నారియాని గబగబా ఇంట్లోకి లాక్కె ళ్లాడు. వాడిని లోపల పడేసి బయట తలుపుకి గడియపెట్టేశాడు. విఠల్ తలుపు దగ్గర నిలబ డ్డాడు. రామప్ప కొండప్ప విఠల్ హఠాత్తుగా ఇట్లా చేస్తాడని అనుకోలేదు.

"ఒరేయ్ విఠలియా... పక్కకి జరుగు... నారియాగాడిని మాతో జాతరకి తీసుకు వెళ్లా ల్సిందే..."

"నా ప్రాణం పోయినా జరగను..." విఠల్ పట్టుదలగా అన్నాడు.

"విఠల్ జరుగు... నారియాని మాతోరాని..." అన్నది ఎల్లవ్వ.

"నేను రానీయను..."

కొండప్ప కాలుతున్న కట్టెలను కిందపడేశా డు. అతడు విఠల్‌ని తోయబోయాడు. విఠల్ కొండప్ప చేయిని పట్టుకున్నాడు. రామప్ప విఠల్ వీపుమీద ఒక గుద్దు గుద్దాడు. అసలే బలహీనంగా ఉన్న విఠల్ కిందపడిపోయాడు. రామప్ప గడియను తీశాడు. నారియాని లోపలి నుండి లాక్కుంటూ బయటకి తీసుకు వచ్చా డు. కొండప్ప కాలుతున్న కట్టెలను మళ్లీ చేతిలో కి తీసుకున్నాడు. "నారియా... జాతరకి వస్తు న్నావుకదూ... దొంగతనాలు చేయనని ఇక అనవుకదూ... పదమాతో దొంగతనాలకి..."

"దొంగతనాలు చెయ్యకపోతే మీరు హింస లు పెడతారు. చేస్తున్నప్పుడు పట్టుబడితే పోలీసులు హింసిస్తారు..." అన్నాడు నారియా మంటపుడుతున్న చేతులమీద ఊదుకుంటూ.

"పట్టుబడకుండా చెయ్యి... తక్కిన పిల్లలు చేయడం లేదూ... వాళ్లు దొంగతనాలు చే యడం బాగా నేర్చుకున్నారు. అందుకే నీకు చదువుకోవద్దురా అని చెప్పాను"

"నేను చెయ్యను... చెయ్యను..." పెద్దగా అరవడం మొదలుపెట్టాడు నారియా.

కొండప్ప కాలుతున్న కట్టెలను నారియా కళ్ల దగ్గరిగా తెచ్చాడు.

"కళ్ళల్లో కట్టెలను గుచ్చు... గుచ్చు..." అంటూ రామప్ప నారియా రెండు చేతులను గట్టిగా పట్టుకున్నాడు.

నారియా భయపడ్డాడు. మూత్రం విస ర్జించాడు. "చేస్తాను... చేస్తాను" అంటూ అర వడం మొదలుపెట్టాడు.

"పోలీసులు పట్టుకున్నా మేం నిన్ను విడి పిస్తాం..."

"ఆ కుక్కలకు ఇన్ని పైసలు పడేస్తే వాళ్ళే వదిలేస్తారు..."

రామప్ప నారియా బుగ్గమీద ముద్దు పెట్టు కున్నాడు. కొండప్పవాడి చేతులను ముద్దు పెట్టుకున్నాడు. "ఒరేయ్ నారియా... ఈ చేతు ల్లో బ్లేడు ఉండాలి కాని పలకబలపం ఎందు కురా..."

"ఒరే విఠలియా... చూశావా... నారియా ఎంతమంచి పిల్లవాడు అయ్యాడో..." అన్నా డు కొండప్ప సంతోషంగా.

"రేపు ఆ కుక్కలకు పైసలు పడేసి తీసుకు రాబోతున్నామే... ఆ పిల్లవాడు... వాడు... వాడు పెంటలో దొరికాడు కనుక పెంటయ్యా అని పేరు పెడుతున్నాను. వాడు కూడా ఇట్లాగే దొంగతనాలు చేస్తాడు. మనకు బోలెడు సంపా దించి పెడతాడు" అన్నాడు రామప్ప.

విఠల్‌కి ఈ మాటలన్నీ విన్నాక చాలా బాధ కలిగింది. తమ జాతి వాళ్లు మరో పిల్లవాడి భవిష్యత్తును నాశనం చేయబోతున్నారు. ఆ పిల్లవాడిని రక్షించాలి... ఎట్లా? ఎట్లా? తను ఇన్‌స్పెక్టర్‌కి చెప్పాలి పిల్లవాడిని రామప్పకి ఇవ్వవద్దని. కాని రామప్ప లంచం ఇస్తాడు. ఇన్‌స్పెక్టర్ నోరు మూసుకుంటాడు. నారియాని ఎక్కడైనా బీదవాళ్ల బోర్డింగ్ స్కూల్లో వెయ్యాలి. అప్పుడు ఇకవీళ్ళు వాడి వెంట పడరు. తమ సంతముచ్చుల పిల్లలందరిని బోర్డింగ్‌లో పడే

యాలి. కాని తమ జాతివాళ్లు అక్కడికి వెళ్ళి వీళ్ళని లాక్కొస్తారు. వీళ్లలో మార్పుతీసుకు రావడం ఎట్లా? ఎట్లా?...

సంత ముచ్చులందరు ఉద్‌గిర్‌లో జరుగుతున్న జాతరకి వెళ్లారు. రామప్ప ఎల్లవ్వ కొండప్పలు బోలెడు డబ్బు సొమ్ములు సంపాయించారు. మూటలు ముల్లెలు ఎత్తుకు వచ్చారు.

ఇన్‌స్పెక్టర్ దగ్గరికి వెళ్లారు రామప్ప ఎల్లవ్వ. కొంత డబ్బు ఇచ్చి పిల్లవాడిని ఇచ్చేయమన్నారు. రెండు రోజుల్లో ఇస్తానని చెప్పాడు ఇన్‌స్పెక్టర్. ఎల్లవ్వ రామప్పలు వెనక్కి వచ్చే టప్పుడు జగన్నాథరావు ఇంటికి వెళ్లి ఆయనకి కొంత డబ్బు ఇచ్చి ఎట్లాగయినా సరే ఇన్‌స్పెక్టర్ చేత పిల్లవాడిని ఇప్పించమని అడిగారు. మెల్లిమెల్లిగా దేశ దిమ్మరులందరికి ఎల్లవ్వ రామప్పలు పిల్లవాడిని తీసుకురాబోతున్నారని తెలిసిపోయింది. తమ కులంవాడు కాదు కాబట్టి తీసుకురావడానికి వీల్లేదని వాళ్లు పోట్లాడారు. కవతా నుండి పంచాయితీ పెద్దలు వచ్చారు. విఠల్‌కూడా అక్కడికి వచ్చాడు. కొండప్ప పంచాయితీ పెద్దల్లో ఒకడిగా ఉన్నాడు.

"రామప్పా... ఆ పిల్లవాడిని తీసుకువస్తే కులం నుండి వెలివేస్తాం" అన్నాడు పంచాయితీ పెద్దల్లో ఒకడు.

పిల్లవాడిని తీసుకు రావడంవల్ల నష్టమేముంది? పెంచడానికి ఇప్పుడు కష్టపడ్డా, రేపు పెద్ద అయ్యాక బోలెడు సంపాదిస్తాడు"

"వాడి కులగోత్రాలు మనకి తెలియదు" అన్నాడు పంచాయితీ పెద్దలలోని రెండోవాడు.

"ఏ కులమైనా మన జాతిలోకి వస్తున్నప్పుడు మన కులంవాడే..."

"వాడిని శుద్ధీకరణ చేయాలి. లేకపోతే మన జాతిలోకి తీసుకోం..." అన్నాడు మొదటివాడు.

"శుద్ధీకరణ చేయిస్తాను..."

"దండన క్రింద వెయ్యిరూపాయిలు కట్టాలి"

"కడతాను..."

"ఇవాళ వీళ్ళని వదిలివేస్తే రేపు మరొకడు... మరొకడు... పిల్లలని తీసుకువస్తారు. అందుకని పిల్లవాడిని తీసుకురావడానికి వీల్లేదు" అన్నాడు మూడోవాడు.

"ఇంకా కఠినమైన శిక్షవేద్దాం..." అన్నాడు మొదటివాడు.

"పిల్లవాడి ఉచ్చలో రామప్ప మీసాలు కడుక్కోవాలి..." అన్నాడు రెండోవాడు.

"చేస్తాను..."

"ఎల్లవ్వ తల గొరిగించాలి..."

"ఎల్లవ్వా చెబితే విన్నావా... ఈ గొడవ మనకెందుకని నేను ఎన్నిసార్లు చెప్పాను..." అన్నాడు కొండప్ప విసుగ్గా.

"ఈ వయస్సులో నాకు జుట్టు ఉంటే ఎంత లేకపోతే ఎంత? జుట్టు గొరిగించుకుంటాను..."

"అయినా పిల్లవాడిని తీసుకురావడం నాకు ఇష్టంలేదు" అన్నాడు కొండప్ప.

"పిల్లవాడికి శుద్ధీకరణ కార్యక్రమం ఎప్పుడు చేస్తావు?" అడిగాడు మొదటివాడు.

"పిల్లవాడిని తేగానే చేస్తాను..."

"పిల్లవాడి పొట్టమీద నాలికమీద వాతలు పెట్టాలి..." అన్నాడు పంచాయితీ పెద్దల్లోని నాలుగోవాడు.

"ఎల్లమ్మదేవికి మేకను బలి ఇవ్వాలి..." అన్నాడు రెండోవాడు.

"మన వాళ్లందరికి భోజనం పెట్టాలి..."

విఠల్‌కి ఈ మాటలు వింటుంటే విపరీతమైన కోపం వచ్చింది. వాళ్ళందరితో చాలాసేపు వాదించాడు. కాని లాభం లేకపోయింది. ఎల్లవ్వ రామప్పలు పంచాయితీ పెద్దలు పెట్టిన అన్ని షరతులకు ఒప్పుకున్నారు. పంచాయితీ పెద్దలకు రానుపోను ఖర్చులు ఇచ్చారు. వాళ్లకి విందు భోజనం పెట్టారు.

విఠల్ పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి పిల్లవాడిని తమ జాతి వాళ్ళకు ఇవ్వవద్దని ఇన్‌స్పెక్టర్‌కి చెప్పాడు. బతిమిలాడాడు. కాని ఇన్‌స్పెక్టర్ వినిపించుకోలేదు.

రెండురోజుల తరువాత మరికొంత డబ్బు ఇచ్చి ఇన్‌స్పెక్టర్ దగ్గర నుండి పిల్లవాడిని తెచ్చుకున్నాడు రామప్ప.

ఎల్లవ్వ సంతోషంతో మురిసిపోయింది. పిల్ల




వాడిని తేగానే పంచాయితీ పెద్దల షరతుల ప్రకారం చేయవలసిన కార్యక్రమాలన్నీ చేశారు.



అతడి పేరు నరసింహ. అతడు వేగంగా నడుస్తున్నాడు. అతడి కళ్లు చింత నిప్పుల్లా ఉన్నాయి. అతడి బట్టలన్నీ మాసి పోయిఉన్నాయి. అతడు పళ్ళు పటపట కొరుకుతున్నాడు. బహుశా ఇప్పుడు అతడి ఎదురుగుండా ఏ క్రూర జంతువులు వచ్చినా అతడిని ఏమీ చేయలేవు. వాటిని చీల్చిచెండాడే శక్తి అతడిలో ఉంది. ధైర్యం ఉంది. అతడికళ్లు ఎవరినో వెతుకుతున్నాయి... ఆ రూపం అతడి ఎదురుకుండా కదలాడుతోంది. అతడిని... ఆ నర రూప రాక్షసుడిని... ఏం చేసినా పాపం లేదు. తను వాడిని వదలడు... ఊరి పొలిమేరలలో అడుగుపెట్టగానే నరసింహ మనస్సు బాధగా మూల్గింది. తను... తను... ఎంత పాపం చేశాడు. ఆ పాపానికి శిక్ష... కాని తను ఈ పాపం చేయడానికి కారణం ఎవరు? అక్కడ ఉన్న చెరువు దగ్గర కూర్చున్నాడు. దోసిట్లో నీళ్లు తీసుకొని తాగాడు. అతడికి అమృతం తాగినంత ఆనందం కలిగింది. నీళ్ళను చేతులతో అటు ఇటు కొట్టాడు. అతడికి అనిర్వచనీయమైన ఆనందం కలిగింది. కొంచెం సేపయ్యాక అక్కడి నుండి లేచివచ్చి మర్రిచెట్టుకింద కూర్చున్నాడు. చల్లటిగాలి అతడి శరీరానికి తగిలింది. అబ్బ ఈ గాలి ఎంత చల్లగా ఉంది. తను ఇన్నేళ్ళూ ఆ జైల్‌లో మగ్గిపోయాడు. ఈ చెరువు... ఈ చెట్టు... ఈ గాలి తనకు ఎన్నో ఏళ్ల నుండి పరిచయం. తను చిన్నప్పుడు ఇక్కడికి వచ్చి చెఱువులో స్నానం చేసేవాడు. చెట్టుకింద ఆడుకునేవాడు. తన తల్లి చీపురుకట్టపట్టుకుని వచ్చేది. పనికిపోరా... ఇక్కడ ఆడుతూ కూర్చుంటే కడు పెట్టా నిండుతుంది, అని అంటూ తనను కొట్టేది. తనకి పనికిపోవాలంటే ఏడుపువచ్చేది. ఎందుకంటే యజమాని బండచాకిరీ చేయించుకునేవాడు. తన తండ్రి తాతలుతరతరాల నుండి శివరావు పాటిల్ ఇంట్లో పనిచేస్తూ ఉండేవాళ్ళు. తను శివరావు, జగన్నాథరావు ఏ పని చెబితే ఆ పని చేసేవాడు. తమ కుటుంబం ఇంత కష్టపడ్డా గంజి తప్పితే అన్నం తిని ఎరుగరు.

నరసింహ వేగంగా అడుగులు వేశాడు. దూరంలో ఉన్న మల్లమ్మ దేవి గుడిపై అతడి దృష్టి పడ్డది. అంతే... అతడిలో ఒణుకు బయలుదేరింది. గజగజా వణకడం మొదలు పెట్టాడు. ఆనాడు... ఆనాడు తను ఈ గుడి దగ్గర.. అమ్మా మల్లమ్మదేవీ నేను అటువంటి ఘోరమైన పనిచేసే టప్పుడు నన్ను ఎందుకు ఆపలేదు తల్లీ... నీవు ప్రత్యక్షమై నా చేయి ఎందుకు పట్టుకోలేదు తల్లీ... ఈ చేతులు ఈ చేతులు ఎంత ఘోరాతి ఘోరమైన పని చేశాయి... నన్ను ఏదేవుడూ క్షమించడు. నేను క్షమించరాని నేరం చేశాను''

అతడి కళ్లలోంచి కన్నీళ్లు జలజలారాలాయి... అతడి కళ్ల ఎదురుకుండా రక్తం పంచుకుని పుట్టిన బిడ్డ కదలాడసాగింది... ఒక్కసారిగా వాతావరణం మారిపోయింది. దుమ్ము లేవసాగింది. గాలి విపరీతంగా వీచసాగింది. అతడి కళ్లల్లో దుమ్ము పడటం వలన కళ్ళు గరగర మనసాగాయి. మండసాగాయి. కొంచెం సేపు అతడు కళ్లు మూసుకున్నాడు.

ఇంతలో ఇద్దరు వ్యక్తులు అటువచ్చారు. వాళ్ళు ఇతడిని చూసి ఆశ్చర్యచకితులయ్యారు. భయం భయంగా అతడివంక చూశారు. గడ్డం బాగా పెరిగి ఉండటం వలన వెంటనే వాళ్లు అతడిని గుర్తు పట్టలేకపోయారు. తరువాత వాళ్లకు అతడెవడో గుర్తుకు వచ్చాడు. ఇతడు నరసింహకదూ... తమ ఊరివాడు నరసింహకదూ... వాళ్లిద్దరు ఒకరివంక ఒకరు చూస్తూ కళ్లతోనే మాట్లాడుకున్నారు తప్ప వాళ్లకు నోటమాట రావటం లేదు. హఠాత్తుగా

వాళ్లల్లో ఒక వ్యక్తి పరుగెత్తసాగాడు. అతడి వెనక రెండో వ్యక్తి పరుగెత్త సాగాడు. ఇంతలో కళ్లు తెరిచాడు నరసింహ. పరుగెత్తుతున్న ఆ ఇద్దరి వంక చూశాడు. అప్పటికే వాళ్లు చాలా దూరం వెళ్లిపోయారు.

ఇంతలో అటువైపు నుండి కారులో మాధవ రావు బొసేకర్ వచ్చాడు. మల్లమ్మదేవి గుడికి కొంచెందూరంలో కూర్చుని ఉన్న నరసింహపై అతడి దృష్టి పడ్డది. అతడు ఆశ్చర్యపోయాడు. అతడి మనస్సులో ఒక రూపం మెదిలింది. కాని అతడేనా! అన్న అనుమానం వచ్చింది. కారుని దగ్గరగా తీసుకువెళ్లాడు. కిందకు దిగ గానే అతడి దృష్టి మల్లమ్మదేవి గుడిపై పడ్డది. ఆ గుడి దగ్గర... ఆ గుడి దగ్గర... ఎంత ఘోరం జరిగిపోయింది... అతడి బుర్రలో ఒక ఆలోచన వచ్చింది. మాధవరావు వెంటనే నర సింహా అని పెద్దగా అరిచాడు.

ఎదురుగుండా మాధవరావుని చూడగానే నరసింహ కోపంగా తన జుట్టు పీక్కున్నాడు. ''నరసింహా నాతో పద ఇంటికివెళ్దాం'' అని మాధవరావు మృదువుగా అన్నాడు.

''నేను... నేను మీ ఇంటికా...'' నరసింహ తడబడ్డాడు.

''నరసింహా నాకు తెలుసు... నీకు ఎంత కచ్చగా ఉందో... ఎంత కోపంగా ఉందో...''

''నా కోపం... నా కోపం...''

''నరసింహా... నువ్వు ఇప్పుడు చాలా ఆవే శంలో ఉన్నావు... నాతోరా....'' నరసింహ సందే హంగా మాధవరావు వంక చూశాడు.

''నేను మొదటి నుండి నీ మంచి కోరేవా డిని. నీకు తెలుసుగా... నీవు ఇప్పుడు ఏం చేయాలనుకుంటున్నావో నాకు తెలుసు...''

''మీకు... మీకు...'' నరసింహ మధ్యలో ఆపేశాడు.

''నీవు చేయాలనుకుంటున్న పని అంత తేలిక అయినది కాదు. నీ ఒక్కడివలన అయ్యే పనికాదు...''

''నేను... నేను...''

''ముందు కారెక్కు... ఎవరికంట పడ కుండా వెళ్దాం...''

నరసింహ కారు ఎక్కాడు.

కారుని స్పీడ్‌గా నడపడం మొదలు పెట్టా డు మాధవరావు. వెనక సీట్లో నరసింహ మౌనంగా కూర్చున్నాడు. మాధవరావు తను ఏం చేయబోతున్నాడో పసికట్టాడనీ, తను అత ను చెప్పినట్లుగా వినడమే మంచిదనీ నర సింహకి అనిపించింది.

మాధవరావు తన ఆలోచనలలో తను ఉన్నాడు. నరసింహను తన చదరంగంలో పావులాగా ఎట్లా వాడుకోవాలో అతడు ఆలోచి స్తున్నాడు. తను ఈ పావును తెలివిగా ఉపయో గించుకోవాలి. కారు ఒక బంగళా దగ్గర ఆగింది. ఆ బంగళా చుట్టుపక్కల ఎక్కడా జనసంచారం లేదు. మాధవరావు కారుదిగా డు. అతడి వెనక నరసింహ దిగాడు. మాధవ రావు జేబులోని తాళం చెవులు తీసి తాళం తెరిచాడు. అతడు లోపలికి వెళ్లాడు. నర సింహకి ఎందుకో భయంగా అనిపించింది. అంతే అతడు పరుగెత్తడం మొదలుపెట్టాడు. మాధవరావు''నరసింహా... నరసింహా...'' అని అరిచాడు ''నేను. నిన్ను రక్షిస్తాను. నువ్వు అనుకున్న పని అవుతుంది'' అని అంటూ మాధవరావు కొంతదూరం అతడి వెనక నడి చాడు. నరసింహ వెనక్కి వచ్చాడు.

''నరసింహా భయపడకు... నా వలన నీకు ఎటువంటి ప్రమాదమూ జరగదు...''

ఇద్దరు ఇంట్లోకి వెళ్ళారు.

''నరసింహా... నీకు ఇక్కడ అన్ని సదుపా యాలు ఉన్నాయి. ఇక్కడికి ఎవరూరారు... నువ్వు ఎన్నిరోజులు ఉండదలుచుకుంటే అన్నిరోజులు ఉండు.''

''నేను వెంటనే పని పూర్తి చేసుకోవాలి''

''నరసింహా... నేను నీకు ప్లాన్ చెబుతాను. నీకు కావలసిన ఇన్ఫర్మేషన్ ఇస్తాను. నేను చెప్పిన ప్రకారం చెయ్యి నిన్నెవరు అనుమా నించరు''

''అనుమానించినా నష్టం ఏమీలేదు. మళ్లీ ఒకసారి జైల్‌కి పోతాను అంతేగా...''

''నువ్వు జైల్‌నుండి విడుదల అయ్యావా...''

''అవును విడుదల అయ్యాను. నాకు కొంత





శిక్ష తగ్గించారు. జైల్లో నేను చాలా పనిచేసేవా డిని. ఒకసారి జైల్‌కి నిప్పంటుకుంది. నేను నా ప్రాణాల సైతం తెగించి కొంతమంది పెద్ద ఆఫీసర్లని కాపాడాను. అందుకే చాలావరకు శిక్ష తగ్గింది. ఇన్నేళ్ళూ నేను ఎప్పుడు విడుదల అవుతానా అని ప్రతిక్షణం ఎదురు చూస్తున్నాను. నేను వాడిని... నేను వాడిని....''

''ఏం చేస్తావో నాకు తెలుసు. కాని ఆనాలోచితంగా చేసి మళ్ళీ నెత్తి మీదకి తెచ్చుకోకు. నేను రేపు ప్రొద్దున్న వస్తాను. నీవు ఇక్కడ హాయిగా ఉండు. బయటతాళం వేసి వెళ్తాను. లోపల ఎవరో ఉన్నారన్న అనుమానం ఎవరికీ రాదు. తిండి ఇతర వస్తువులు కూడా ఉన్నాయి ఇక్కడ''

''బయట బయట... తాళం వేస్తారా...'' నరసింహ అనుమానంగా అడిగాడు.

''భయపడకు నేను చేసేదంతా నీ మంచికే చేస్తున్నాను''

కొంచెంసేపు కూర్చుని మాధవరావు వెళ్లిపోయాడు. నరసింహ అశాంతిగా అటు ఇటూ తిరగసాగాడు. అతడికి మనశ్శాంతి లేకుండా పోయింది. లోపలికి వెళ్ళాడు. అక్కడ తినుబండారాలు కనిపించాయి. తీసుకుని తిన్నాడు. ఆ తరువాత అక్కడ ఉన్న బల్లమీద నడుం వాల్చాడు. అతడి కళ్ల ఎదురుకుండా మల్లమ్మదేవి గుడి కనిపించసాగింది. నెమ్మదిగా అతడు నిద్రలోకి జారుకున్నాడు. మల్లమ్మదేవి అతడికలలోకి వచ్చింది. ఆమె అతడికి నీతి బోధలు చేయసాగింది... నీవు చేయబోయే పని నీచమైన పని. జరిగిందేదో జరిగిపోయింది... నీవు అంతా మరచిపో... మళ్లీ కొత్త జీవితం ప్రారంభించు. మరో హత్య చేయడం వలన నీకు వచ్చే లాభం ఏమీలేదు. నీ భార్యాబిడ్డలు మళ్లీ జీవించరు... నిన్నీ స్థితికి తెచ్చిన వాడు ఈరోజు కాకపోతే రేపైనా తన తప్పు తెలుసుకుంటాడు. పశ్చాత్తాప పడతాడు...

మొదటి నుండి అతడిలో మూఢనమ్మకాలు ఎక్కువగా ఉండటం వలన మల్లమ్మదేవినే నమ్ముకున్నాడు. అతడిలో మానసిక సంఘర్షణ మొదలయింది. మల్లమ్మదేవి చెప్పినట్లే తను చేయాలి అని నిర్ణయించుకున్నాడు. కాని మనస్సులో మరో వైపు తనను నాశనం చేసిన వాడి జీవితాన్ని తను మాత్రం ఎందుకు నాశనం చేయకూడదు అని అనిపించింది... అతడికళ్ల ఎదురుకుండా చాలాఏళ్ల క్రితం జరిగిన దృశ్యాలు కదలాడసాగాయి.

శివరావు పాటిల్ ఇంట్లో తన అమ్మ అయ్యాలు పని చేసి పని చేసి మునలి వాళ్లయ్యారు. పాటిల్ దగ్గర తన తండ్రి మందుమాకుకి తిండికి కొంత అప్పుచేశాడు. కాని ఆ అప్పు తీర్చలేకపోయాడు. అప్పు తీరేవరకు నీ కొడుకుని నా ఇంట్లోనే చాకిరీకి ఉంచు అన్నాడు శివరావు. తను చిన్నప్పటినుండి శివరావు ఇంట్లో జీతం భత్యం లేకుండా పని చేస్తూ ఉండేవాడు. తన తల్లితండ్రులకు తను ఒక్కడే... తను గంజి తాగుతూ ఎండిపోయిన రొట్టెలు తింటూ పెరిగాడు. తన తల్లితండ్రులు తనకు చిన్నప్పుడే పెళ్లిచేశారు. వయస్సులో చాలా చిన్నది కాపడంవలన కొన్ని సంవత్సరాలు తన భార్యను తన అత్తమామలు తమ దగ్గరే ఉంచుకున్నారు. ఆ తరువాత కొన్నేళ్ళకు తామిద్దరు కాపురం చేయడం మొదలుపెట్టారు. తన చెన్నమ్మ ఎంతో అందంగా ఉండేది. అప్పుడప్పుడు శివరావు పాటిల్ దగ్గరకి తను చెన్నమ్మని తీసుకువచ్చేవాడు. కొన్ని పనులలో చెన్నమ్మ సహాయం చేస్తూ ఉండేది. జగన్నాథరావు పాటిల్ ఆమె వెనకాలే తిరుగుతూ పరిహాసాలాడుతూ ఉండేవాడు. కాలచక్రం తిరుగుతోంది. చెన్నమ్మకి పిల్లలు పుట్టలేదు. తన తల్లితండ్రులు వంశోద్ధారకుడు లేడే అని విలవిలలాడిపోయేవారు. తనూ చాలా బాధపడుతూ ఉండేవాడు. తమ జాతి వాళ్లలో మూఢనమ్మకాలు ఎక్కువ. కనిపించిన ప్రతీరాయికి, ప్రతీ మొక్కకి తామిద్దరు పూజలు చేసేవాళ్ళు. తన తల్లితండ్రులు మంగళవారాలు, శుక్రవారాలు ఉపవాసం ఉండేవాళ్లు. కాని చాలా సంవత్సరాలు తమకి పిల్లలు పుట్టలేదు. తన తల్లితండ్రులు పిల్లలకోసం ఎదురు చూసి చూసి చనిపోయారు.

ఆరోజు తనను, చెన్నమ్మని కూర్చోపెట్టి తామిద్దరికి జగన్నాథరావుపాటిల్ ఒక సలహా ఇచ్చాడు.

''ఒరేయ్... నరసింహా... చెన్నమ్మా... నే

చెప్పేది చేస్తే మీకుతప్పకుండా పిల్లలు పుడతారు''

"చెప్పండి దొరా... మీరెట్లా చెబితే అట్లా చేస్తాం. పిల్లలకోసం మేం చేయని పూజలేదు. మొక్కని రాయిలేదు. త్వరగా చెప్పండి'' అడిగాడు నరసింహ. అక్కడ వీళ్ళు ముగ్గురు తప్పితే మరో మనిషిలేడు. చెన్నమ్మ ఆత్రుతతో జగన్నాథరావు ఏంచెబుతాడా అని ఎదురుచూస్తోంది.

"మీకుమల్లమ్మదేవి మీద నమ్మకం ఎక్కువ కదా...''

"అవును దొరా...ఎల్లమా మల్లమ్మ అని మేము పూజిస్తాం''

'మల్లమ్మదేవి మా కులదైవం దొరా...''

"సంతానం కలిగించమని కలగంగానే మొదటి సంతానాన్ని ఆమెకు బలి ఇస్తానని మొక్కుకోండి...''

"బలి.. బలి...'' ఒక్కసారిగా అన్నారు.

"అవును నేను చెప్పినట్లుగా మొక్కుకోండి... జబ్బులు నయం చేస్తే కోరికలు తీరిస్తే మేకనో కోడినో బలి ఇస్తాం అంటూ మొక్కుకుంటారుగా''

"మేకను,కోడిని బలి ఇస్తూనే ఉంటాం...''

"ఈ బలి వలన మనం అనుకున్నది నెరవేరుతుంది. ఇన్నేళ్ళ బట్టీ మీరు సంతానం కోసం తపిస్తున్నారుగా... తప్పకుండా మీ కోరిక నెరవేరుతుంది''

"పాటిల్ దొరా... అమ్మో ఇట్లాంటి పని...'' చెన్నమ్మ భయం భయంగా అంది.

"చెన్నమ్మా... ఇంతకుముందు ఇట్లాంటివి ఎన్నో జరిగాయి. మన తాతముత్తాతలు ఇటువంటి సంఘటనల గురించి చెబుతూ ఉంటారు. ఇది మన దేవీ దేవతలకు కూడా ఇష్టమైన పనే...''

"అంటే మల్లమ్మదేవికి కోపం రాదా దొరా...'' అమాయకంగా అడిగాడు నరసింహ.

"ఆ దేవి ఇంకా ఎంతో సంతోషిస్తుంది. మీకు సంతానం కలిగితే నేను ఎంతో సంతోషపడతాను. మీ అమ్మ అయ్యలు ఈ దిగులుతో నేగా చచ్చిపోయారు. మీకు పిల్లలు పుడితే స్వర్గంలో ఉన్న వాళ్ల ఆత్మలు శాంతిస్తాయి''

"మొదటి సంతానాన్ని బలి ఇస్తే... మరి ఆ తరువాత...''

"మొదటి సంతానాన్ని బలి ఇవ్వంగానే ఆ దేవికి మీ మీద కరుణ కలుగుతుంది. తరువాత వెంటవెంటనే పిల్లలు పుడతారు. అంతెందుకు మనం మొదటి పంట రాంగానే దేవుడికి పూజ చేసి నైవేద్యం పెడతాం. ఎందుకూ? దేవతలు ప్రసన్నులయితే ఈ భూమిమీద పంటలు బాగా పండుతాయని నమ్మకం. మనం ఇళ్ళలో పూజ చేసేటప్పుడు మనం వండిన పదార్థాలన్నింటిని ఒక పళ్ళెంలో కొంచెం కొంచెం పెట్టి దేవుడికి నైవేద్యం పెడతామా లేదా...''

మూఢనమ్మకాలు మనిషిని ఎంతకైనా దిగజారుస్తాయి. పాటిల్ చెప్పిందే వేదం అని అనుకునే నరసింహ చెన్నమ్మలమీద అతడి మాటల ప్రభావం చాలా పడ్డది.

"దొరా! నీవు మా మంచిని కోరుకునేవాడివి. నీవేగా మా అన్నదాతవి. నేను గొడ్రాలిగానే చనిపోకుండా మంచి ఉపాయం చెప్పావు'' చెన్నమ్మ కళ్ళల్లో నీళ్ళు నిండాయి.

"చెన్నమ్మా... రేపు వెళ్ళి మీ ఇద్దరు గుళ్ళో మొక్కుకోండి. నేను నీవు ఆరోగ్యంగా ఉండటానికి, నీ కడుపులో బిడ్డ ఆరోగ్యంగా ఉండటానికి మందు, మాకు ఇప్పిస్తాను. కాని ఈ విషయం ఎవరికీ చెప్పకండి''

"దొరా... నువ్వు దేవుడివి...'' అన్నాడు నరసింహ.

జగన్నాథరావు చిరునవ్వు నవ్వాడు.

నరసింహ చెన్నమ్మలు నవ్వుకుంటూ పరిహాసాలాడుకుంటూ ఇంటికి వచ్చారు.

★ ★ ★

చెన్నమ్మ నరసింహలు కలలు కన్నరోజు రానేవచ్చింది. చెన్నమ్మకి కొడుకు పుట్టాడు. వాళ్ళిద్దరి ఆనందానికి హద్దులు లేవు. ఒకవైపు ఎంతో ఆనందంగా ఉన్నా వాళ్లకి తమ మొక్కు గుర్తుకువచ్చేసరికి బాధ కలగసాగింది. పండులాంటి కొడుకు పుట్టాడు. వీడిని... వీడిని బలి ఇవ్వడమా... వంశోద్ధారకుడు వీడిని ఆ తల్లికి బలి ఇవ్వడమా... రాత్రింబవళ్ళు వాళ్ళిద్దరికి





నిద్ర లేకుండాపోయింది. చెన్నమ్మ పిల్లవాడికి పాలు పడుతున్నప్పుడల్లా ఏడవడం మొదలు పెట్టింది. ఇంతకుముందు తనకి సంతానం కలుగుతుందని ఊహించుకుని, ఊహించుకుని తీయటి కలలో తేలిఆడిన చెన్నమ్మ ఇప్పుడు భూమిమీదకు వచ్చింది. కళ్ళు తెరిచింది. అసలు సత్యాన్ని తెలుసుకుంది. రాత్రి వెంట పగలు వస్తూనే ఉన్నాయి. చెన్నమ్మ నరసింహలకు బాధ రోజురోజుకీ ఎక్కువ కాసాగింది.

"మనం ఈ పిల్లవాడిని కాకుండా రెండోసారి ఎవరు పుడితే వాళ్ళని బలి ఇద్దాం. మల్లమ్మదేవి మొక్కు తీర్చినట్టవుతుంది. వంశాంకురం బతికి ఉంటాడు" అన్నది ఒకరోజు చెన్నమ్మ నరసింహతో.

"చెన్నూ... మనం ఆ అమ్మకు మొదటి సంతానాన్ని ఇస్తాం అని మొక్కుకున్నాం..."

"అవును నిజమే... కాని... కాని..." ఆమె వెక్కి వెక్కి ఏడవడం మొదలుపెట్టింది.

"చెన్నూ... ఏడవకు" నరసింహ ఆమె కన్నీళ్ళు తుడిచాడు.

"ఆ అమ్మకి మళ్ళీ మొక్కుకుందాం... ఈసారి కలిగే సంతానాన్ని..."

"అమ్మో.... ఇంకేమైనా ఉందా... మల్లమ్మదేవికి కోపం వస్తుంది. కోపం వస్తే ఊరు ఊరు నాశనం అయిపోతుంది.

"ఈ ఒక్క తప్పును మల్లమ్మదేవి క్షమిస్తుంది"

"మనలని మల్లమ్మదేవి క్షమిస్తుందంటావా..."

"తప్పకుండా..."

ఇద్దరు ఎంతోసేపు ఈ విషయం గురించి మాట్లాడుకున్నారు. వాళ్ళిద్దరి మనస్సులో భయం ఉంది. అయినా పిల్లవాడిని బలి ఇవ్వాలంటే వాళ్లకి మనస్సు ఒప్పలేదు. అందుకే ఇద్దరు మనస్సు గట్టిపరచుకుని జగన్నాథరావు దగ్గరికి వచ్చారు.

"ఒరేయ్ నరసింహా... పిల్లవాడు పుట్టాడుగా... మొక్కుబడి..."

"దొరా... బిడ్డ పుట్టాడు... కాని... కాని..."

"ఏమిటిరా, చెప్పరా...."

"దొరా... వంశం నిలిపే మొగపిల్లవాడిని..." చెన్నమ్మ తల ఎత్తకుండా అన్నది.

"అయితే మీ ఉద్దేశ్యం ఏమిటి? మొగపిల్లవాడు కాబట్టి ఇప్పుడు బలి ఇవ్వం అంటారా..."

"ఇవ్వం... ఇవ్వం" అన్నది కోపంగా.

"ఇవ్వకపోతే మల్లమ్మదేవికి కోపం వస్తుంది. ఆమె రౌద్రరూపం మీకు తెలిసిందేగా"

"తెలుసు, తెలుసు... కాని దొరా... ఈసారి పుట్టిన సంతానాన్ని బలి ఇస్తాం... అని మళ్ళీ మొక్కుకుంటాం" అన్నాడు నరసింహ.

"నరసింహా... బాగా ఆలోచించుకో"

"దొరా... ఈసారి పుట్టే సంతానాన్ని తప్పకుండా ఇస్తాను"

"ఒకవేళ పుట్టకపోతే..."

"నాలుగైదు సంవత్సరాలు చూస్తాను. పుట్టకపోతే ఈ పిల్లవాడినే బలి ఇస్తాం" ధృఢంగా అన్నాడు నరసింహ.

"సరే... మళ్ళీ మల్లమ్మదేవికి పూజ చేసి మొక్కుకోండి. కాని ఈ విషయం ఎవరికీ తెలీకూడదు"

"మంచిది దొరా..."

ఇద్దరు ఇంటికి వచ్చారు. ఆ రాత్రంతా వాళ్ళిద్దరికి కంటిమీద కునుకు లేదు. మరునాడు గుడికి వెళ్ళి పూజ చేసి రెండో సంతానాన్ని బలిఇస్తాం అని మల్లమ్మదేవికి మొక్కుకున్నారు.

రోజులు గడుస్తున్నాయి. ఇద్దరు పిల్లవాడి ఆలన పాలనలో కొంత బాధను మరిచిపోయారు. చెన్నమ్మ మళ్ళీ గర్భిణి అయింది. నరసింహ చెన్నమ్మలు ఎంతో సంతోషపడ్డారు. జగన్నాథరావుపాటిల్‌కి ఈ విషయం చెప్పారు.

"చూశావా నరసింహా... మల్లమ్మదేవికి నీమీద ఎంత కటాక్షం కలిగిందో... ఇన్నేళ్ళు పిల్లలు లేరో అని ఏడిచారుగా.. మొక్కుకున్నాక వెంటవెంటనే ఆ మల్లమ్మదేవి మీకు సంతానం ఇస్తోంది"

"దొరా... ఈసారిమాత్రం మేము మొక్కు తీరుస్తాం"

"తప్పకుండా తీర్చాలి. లేకపోతే ఆ తల్లే నీ పిల్లలను తన దగ్గరికి తీసుకుపోతుంది. మీ బతుకులను నాశనం చేస్తుంది. ఈసారి మొక్కు తీర్చకపోతే నేను ఊరుకోను తెలిసిందా? ఆ తల్లి కోపం మీకు తెలిసిందేగా... మొక్కుబడి తీర్చకపోతే ఎంతో నష్టం జరుగుతుంది. ఊళ్ళు ఊళ్ళు నాశనం అయిపోతాయి"

"తప్పకుండా తీరుస్తాం" ఇద్దరూ ఒకేసారి అన్నారు.

పాటిల్ చెన్నమ్మవంక తదేకంగా చూడసాగాడు. చెన్నమ్మ తల వంచుకుంది.

"మళ్ళీ వస్తాను దొరా..." అన్నాడు నరసింహ.

"ఒరేయ్ నరసింహా... ఇవాళ నువ్వు మన తోట బాగుచెయ్యి. కటింగ్ చెయ్యి. మట్టి తెచ్చిపొయ్యి. ఎరువులు అమ్మే దుకాణం తెలుసుగా... నేను దుకాణంవాడికి చెప్పిపెడతాను. నువ్వు వెళ్ళి ఎరువులు తీసుకురా.. మొక్కలకి వెయ్యి"

"సరే దొరా..."

నరసింహ చెన్నమ్మలకు ఒకవైపు సంతోషంగా ఉన్నా మరోవైపు దిగులుగా కూడా ఉంది. చెన్నమ్మ తన గర్భంలో ఉన్న బిడ్డ గురించి అహర్నిశలూ ఆలోచిస్తూ ఉండేది. మల్లమ్మదేవి బలి తీసుకోవడానికే తనకు గర్భం ఇచ్చిందా... ఆ తల్లికి ఆ అమ్మకి... ఆమెకు తెలియదా... తల్లి హృదయం... కాని ఆ అమ్మ తమని మొక్కు మొక్కుకోమని చెప్పలేదుకదా... ఆ అమ్మ గురించిన కథలు తను ఎన్నో విన్నది. ఆమెకి కోపం వస్తే ఊరూ వాడా అంతా నాశనం అయిపోతుంది. ఇక్కడి వాళ్లందరూ మట్టిపాలయిపోతారు. జంతువులు, పక్షులు... అన్నీ అన్నీ చచ్చిపోతాయి. అంటే అంటే తాము తమ బిడ్డను బలి ఇవ్వక తప్పదు.

చెన్నమ్మకి ఆడపిల్ల పుట్టింది. ఈసారి మొగపిల్లవాడు పుట్టలేదు. మొగ పిల్లవాడైతే బలి ఇవ్వాలంటే వాళ్ళిద్దరిలో ఉన్న మన సంప్రదాయాలు, సంస్కారాలు, ఆచారాలు అడ్డుపడేవి.





అయినా ఆడపిల్లను బలి ఇవ్వడానికి ప్రకృతి సహజంగా నరసింహలో ఉండే తండ్రి హృదయం చెన్నమ్మలో ఉండే తల్లి హృదయం అడ్డుపడుతూనే ఉన్నాయి. "దీన్ని మనం బలి ఇవ్వగలమా..." ఏడుస్తూ అంది చెన్నమ్మ.

నరసింహకి పాటిల్ అన్న మాటలు గుర్తుకు రాసాగాయి. అందరినీ చంపినవాళ్ళు మీరవుతారు. మీరు హంతకులవుతారు. ఒక బిడ్డ కోసం మీరు ఇంతమందిని చంపుతారా... మహాపాపం... మహా పాపం...

"చెన్నూ... ఇవ్వక తప్పదు. మనకు వంశాన్ని నిలబట్టే పిల్లవాడు ఉన్నాడుగా. ఇది ఆడపిల్లేగా... ఫరవాలేదులే. కాని.. కాని ఎంతైనా కడుపున పుట్టిన బిడ్డ. చెన్నూ ఇదివరకు ఆడపిల్లలు పుట్టగానే చంపే ఆచారం అక్కడక్కడా ఉండేదని ఎన్నో కథలు విన్నాం. మనం మొక్కుబడి కాబట్టి బలి ఇస్తున్నాం. మనస్సు గట్టి చేసుకో... గట్టి చేసుకో..."

జగన్నాథరావుకి నరసింహ తనకు ఆడపిల్ల పుట్టిందని చెప్పాడు. జగన్నాథరావు ఏం చేయాలో, ఎట్లా బలి ఇవ్వాలో చెప్పాడు. దంపతులిద్దరూ మనస్సును రాయిచేసుకున్నారు.

ఆరాత్రి వాళ్ల జీవితాలలో భయంకరమైన రాత్రిగా మారింది. పిల్లను తీసుకుని ఇద్దరు బయలుదేరారు. గుడి ఊరికి దూరంగా ఉంది. నడుచుకుంటూ ఇద్దరు గుడికి వచ్చారు. గుడి వెనుకభాగం అంతా రాళ్ళు రప్పలు ఉన్నాయి. కొన్ని వృక్షాలు ఉన్నాయి. పిచ్చి మొక్కలతో ఆ ప్రదేశం అంతా నిండిఉంది. నరసింహ గుడిముందు పిల్లని పడుకోబెట్టాడు. "తల్లీ! నీమొక్కును తీరుస్తున్నాం... దీన్ని స్వీకరించు" అన్నాడు.

చుట్టువక్కల ఎక్కడా జనసంచారం లేదు. నరసింహ అటు ఇటు చూశాడు. అక్కడ తామిద్దరు తప్ప మరెవరు లేరని నిశ్చయించుకున్నాడు.

"చెన్నూ పిల్ల కాళ్లూ చేతులు గట్టిగా పట్టుకో..." అని నరసింహ అన్నాడు.

చెన్నమ్మ వెక్కి వెక్కి ఏడవడం మొదలుపెట్టింది. నరసింహ హృదయం కరిగిపోయింది. అతడు కాసేపు అట్లాగే కూర్చున్నాడు. కాని వాళ్లలో నాటుకుపోయిన మూఢనమ్మకాలు వాళ్లకి ధైర్యాన్నిచ్చాయి. అమ్మకి నీ మొక్కు తీర్చు అని చెప్పాయి.

"చెన్నూ... పట్టుకో..."

చెన్నమ్మ పిల్లవంక చూసింది. పిల్ల నిద్రపోయింది. ఆమె పిల్లకాళ్లు చేతులు గట్టిగా పట్టుకుంది.

నరసింహ చేత్తో పిల్లముక్కును గట్టిగా నొక్కాడు. ఊపిరి ఆడక పిల్లకాళ్లు చేతులు విదిలించడం మొదలుపెట్టింది. రెండో చేత్తో గొంతును నులిమాడు. చిన్న ప్రాణం పోవడం ఎంతసేపు... పిల్ల ప్రాణం పోయింది. నరసింహ పిల్లముక్కు దగ్గర చేయిపెట్టి చూశాడు. శ్వాస ఆడటంలేదు.

"చెన్నూ పిల్ల చచ్చిపోయింది. ఆ తల్లి ఆనందించింది. మన మొక్కు తీరింది. ఆమె మనలని చల్లగా కాపాడుతుంది" నరసింహ పిచ్చివాడిలా అన్నాడు.

చెన్నమ్మ పిల్లను గుండెలకి అదుముకుని వెక్కి వెక్కి ఏడ్చింది. నరసింహ పిల్లను ఆమె చేతులలోనుండి తీసుకుని గుడివెనక కొంత దూరం నడిచాడు. చెన్నమ్మ కూడా అతడి వెనక నడిచింది. అక్కడంతా చీకటిగా ఉంది. "చెన్నూ... అగ్గిపుల్ల వెలిగించు" అని అన్నాడు నరసింహ.

చెన్నమ్మ ఇంటినుండి వచ్చేటప్పుడు చెంగున మూడు నాలుగు అగ్గిపెట్టెలు కట్టుకుంది. అగ్గిపుల్ల వెలిగించింది. కొంత వెలుతురు పడ్డది. చెన్ను అతడి జేబులో ఉన్న కొవ్వొత్తులను తీసింది. ఒక కొవ్వొత్తిని వెలిగించింది.

"ఇక్కడ కాదు... ఇంకొంచెం దూరం పోదాం..." అని అన్నాడు నరసింహ. ఇంకొంచెం దూరం వెళ్లాక అక్కడ పిల్లని పడుకోబెట్టాడు. చెన్నమ్మ తన సంచిలోంచి గునపం తీసి నరసింహకి ఇచ్చింది.

నరసింహ నేలను గబగబా తవ్వడం మొదలు పెట్టాడు. రాళ్లు రప్పలూ తీసేశాడు. కొంచెం తవ్వగానే అతడు ఆయాసపడసాగాడు.

"నేను తవ్వుతాను... ఇటు ఇవ్వు..." అని



అన్నది చెన్నమ్మ.

ఏడుస్తూ గునపంతో తవ్వడం మొదలుపెట్టింది. ఇద్దరి హృదయాలు లోలోపల బద్దలవుతున్నాయి. అయినా వాళ్లలోని మూఢనమ్మకం ధైర్యంతో మొత్తం పనిపూర్తి అయ్యేలా చేయించింది.

చెన్నమ్మ అలసిపోయి కూర్చుంది. నరసింహ తవ్వడం మొదలు పెట్టాడు. కొవ్వొత్తి గాలికి ఆరిపోవడం మొదలుపెట్టింది. చెన్నమ్మ తన చేతులు అడ్డం పెట్టింది. పక్కన అన్నెం పుణ్యం ఎరుగని పసిపాప దీర్ఘ నిద్రలో ఉంది. గొయ్యి తవ్వడం పూర్తయింది. నరసింహ రెండు చేతులతో ఎత్తి పాపని అందులో పడుకోబెట్టాడు. ఇద్దరూతమ రక్తం పంచుకుని పుట్టిన పిల్లని కన్నీటితో వీడ్కోలు ఇచ్చారు. ఆ కన్నీళ్లు పాపమీద పడ్డాయి. తను నవమాసాలు గర్భంలో ఈ పిల్లని ఇందుకేనా మోసింది. పేగులు తెంచుకుని ఈ ప్రాణి ఇందుకేనా బయటికి వచ్చింది. చెన్నమ్మకి కళ్లు తిరిగినట్లుగా అయింది. వెంటనే తనను తను సంభాళించుకుంది.

"ఇంకా నయం ఆడపిల్ల కాబట్టి సరిపోయింది. ఈ చేతులతో మగపిల్లవాడిని ఇట్లా గొయ్యి తవ్వి పాతిపెట్టకలమా... బలి ఇవ్వకలమా... ఊహు... నాకు చేతులు వచ్చేవి కావు..." అన్నాడు నరసింహ. తను తప్పు చేసినా ఎంతో పెద్ద తప్పు చేయలేదు అన్న ధోరణిలో. ఈ పురుష ప్రధాన వ్యవస్థలోని ప్రతివ్యక్తి దృష్టిలో మొగపిల్లవాడికున్న విలువ ఆడపిల్లకి లేదు.

గొయ్యిని ఇద్దరు కలిసి మొత్తం పూడ్చేశారు. ఆ రాత్రి చంద్రుడు నక్షత్రాలు ఆకాశం ఈ ఘోరకృత్యాన్ని చూశాయి. వీటికే భావ వస్తే, ఇవన్నీ మాట్లాడకలిగితే ఇటువంటి ఘోరకృత్యం చెయ్యవద్దు... చెయ్యవద్దు అని అరిచేవేమో... ఓ మనుమల్లారా మీరెందుకు ఇంతగా దిగజారిపోతున్నారు. అని అరిచేవేమో... ప్రకృతి మూగవేదనతో ఈ ఘోరకృత్యాన్ని చూస్తూ ఉండిపోయింది. ఆకులు, కొమ్మలు... పూవులు... అన్నీ అన్నీ చూస్తూ ఉండిపోయాయి.





చెన్నమ్మ, నరసింహ ఇంటికి బయలుదేరారు. "తెల్లవారగానే మన ఊరివాళ్లందరితో పిల్ల కనిపించడంలేదని చెప్పి ఏడ్వు చెన్నమ్మా" అన్నాడు నరసింహ.

"ఈ సంగతి ఎవరికైనా తెలిస్తే..." భయం భయంగా అన్నది చెన్నమ్మ.

"నీకు నాకు దొరకి తప్ప మరెవరికి తెలీదు. భయం లేదులే"

ఇద్దరూ ఇంటికి వెళ్లిపడుకున్నారు. పిల్లవాడు నిద్రలో మునిగివున్నాడు. బాగా తెల్లవారాక ఇద్దరూ లేచారు. చెన్నమ్మ పెద్దగా అరవడం మొదలుపెట్టింది. గుడిసెలవాళ్లందరు అక్కడికి చేరారు. అందరు ఈ విషయం వినగానే ఆశ్చర్యపోయారు. చెన్నమ్మను ఓదార్చడం మొదలుపెట్టారు. దాంతో ఆమెలోని దుఃఖం ఒక్కసారిగా ఉప్పొంగింది. వెక్కి వెక్కి ఏడవడం మొదలుపెట్టింది. "పోలీసులకి చెబుదాం..." అన్నాడొకడు.

ఇంతలో జగన్నాథరావు పాటిల్ అదే రోడ్డు మీద కారులో వెళ్తూ అందరు గుమిగూడి ఉండటం చూసి ఆగాడు.

"పాటిల్ దొరా... పాటిల్ దొరా... నరసింహ పిల్లని ఎవరో ఎత్తుకుపోయారు..." అన్నాడు మరొకడు.

"అరె... రె... ఎవడు ఎత్తుకుపోయాడు?" అన్నాడు జగన్నాథరావు. నరసింహ ఏడవడం జగన్నాథరావు అతడిని ఓదార్చడం మొదలయింది. "నరసింహా... నువ్వేమీ బాధపడకు. నేను వెతికి తెస్తాను... పాటిల్ అనుకుంటే ఏదైనా చేస్తాడు?"

అక్కడున్న వాళ్లందరికి పాటిల్ యెడల గౌరవం కలగసాగింది. శివరావుపాటిల్ తమ యెడల క్రూరంగా ప్రవర్తించేవాడు. కాని ఆయన కొడుకు జగన్నాథరావుకి పేదలయెడల కాస్తో కూస్తో ప్రేమ వుంది అని వాళ్లకి అనిపించింది.

"చెన్నమ్మా... ఏడవకు... నేను పిల్లను వెతికి స్తాను. నువ్వూ నరసింహ నీ చెల్లెలింటికి వెళ్లండి. నీవు కొంత దుఃఖం మరచిపోతావు. నేను ఆ ఊరికే వెళ్తున్నాను. మిమ్మల్ని వదిలేస్తాను. రండి" అని అన్నాడు జగన్నాథరావు.

ఈ మాటలు వినగానే నరసింహ చెన్నమ్మ ఒకరివంక ఒకరు చూసుకున్నారు. జగన్నాథ

రావు ఎందుకు ఈవిధంగా అంటున్నాడో వాళ్ల కి అర్థం కాలేదు. కాని వెంటనే వాళ్లకో ఆలోచన వచ్చింది. కొంతకాలం తామిద్దరు దూరంగా ఉంటే అందరు ఈ సంగతి మరిచిపోతారని పాటిల్ అనుకొని ఉంటాడు... అందుకే తామి ద్దరిని అక్కడికి తీసుకువెళ్తానంటున్నాడు. పాటిల్ ఎంత మంచివాడు అని వాళ్లిద్దరు అనుకుంటున్నారు. "నరసింహా నేను ఈ రోడ్డు చివర ఉంటాను. మీరిద్దరు వచ్చేయండి" అని అన్నాడు పాటిల్.

చెన్నమ్మ నరసింహాలు గబగబా నాలుగు బట్టలు మూటకట్టుకుని బయలుదేరారు. నర సింహ మూట నెత్తిన పెట్టుకున్నాడు. చెన్నమ్మ పిల్లవాడిని ఎత్తుకుంది.

వాళ్లిద్దరూ కార్లో కూర్చున్నారు. పాటిల్ కారు స్పీడ్‌గా పోనిచ్చాడు.

"దొరా... దీని చెల్లెలు భర్త ఊళ్లో లేరు. వాళ్లు వాళ్ల చుట్టాల ఇంటికి వెళ్తున్నారని తెలిసింది... మరి ఇప్పుడు..."

"ఆ ఊరికి కొంచెం దూరంలో నా రెండో చెల్లెలు ఉందిగా... అక్కడికి వెళ్దాం..." అన్నది చెన్నమ్మ.

"మీకెందుకు మీరు హాయిగా కూర్చోండి. మిమ్మల్నిద్దరిని నేను సురక్షితమైనచోటుకి తీసుకువెళ్తాను.

కారు ఊరి పొలిమేరలు దాటింది. జగన్నా థరావు కారు స్పీడ్‌గా నడుపుతున్నాడు. చెన్న మ్మకి బాధ భయం రెండు కలగసాగాయి. కారు ఒక బంగళాముందు ఆగింది. అక్కడ చుట్టుపక్కల ఎక్కడా ఇళ్లులేవు. కనుచూపుమే రలో ఎక్కడా మనుష్యసంచారం లేదు. అది చాలా పాతబంగళా. రంగులు వెలిసిపో యాయి. జగన్నాథరావు కారు దిగాడు. వచ్చేట ప్పుడు తనతో రెండు పెద్ద పెద్ద ప్లాస్టిక్ కాన్‌లతో నీళ్లు తెచ్చాడు. కొన్ని తినుబండారా లు బియ్యం నరుకులు కూడా తెచ్చాడు. వాటిని కిందకి దింపమని నరసింహాతో చెప్పా డు. తాళంతీసి ఇంటి లోపలికి వెళ్లాడు జగ న్నాథరావు.

"నరసింహా... లోపల గదిలో చీపురు వుంది. గదులన్నీ ఊడ్చేసేయి" జగన్నాథరావు చెన్న మ్మ దగ్గరగా వచ్చాడు. "నిన్న పిల్లని చంపే సినప్పుడు ఎవరు చూడలేదుకదూ..."

"చూడలేదు దొరా..." చెన్నమ్మ కళ్లలో నుండి కన్నీళ్లు జలజల రాలాయి.

"దానిని ఎక్కడ పాతిపెట్టారు?"

"గుడివెనక కొంచెం దూరంలో..."

ఇంతలో పిల్లవాడు పెద్దగా ఏడవడం మొ దలుపెట్టాడు. చెన్నమ్మ వాడిని ఓదార్చడం మొదలుపెట్టింది.

చెన్నమ్మ నరసింహాలకు అక్కడి ప్రతి నిమిషం ఒక యుగంగా కనపడసాగింది. మధ్యాహ్నం గడిచిపోయింది. సాయంత్రం గడిచిపోయింది. రాత్రయింది.

నరసింహ చెన్నమ్మలు పక్కగదిలోకి వెళ్లి పడుకోబోయారు. ఆ అమాయకులకేం తెలుసు తమ జీవితాలలో ఈ-రాత్రి మరో భయంకర మైన రాత్రిగా మారుతుందని? జగన్నాథరావు తమని కాపాడే దేవుడని అనుకున్నారు. అంతే!

జగన్నాథరావు బాటిల్‌లోని విస్కీని పోసు కుని తాగడం మొదలుపెట్టాడు.

"ఒరేయ్ నరసింహ! తాగుతావా... గ్లాసు పట్టుకురా... పోస్తా..." అన్నాడు పాటిల్.

"ఒద్దు దొరా... నేను తాగను"

"కాస్త తాగు... హాయిగా నిద్రపడుతుంది..."

"చెన్నూ ఇక్కడికిరా... ఈ గ్లాసు నింపు..." అని అన్నాడు పాటిల్ మత్తుగా.

"దొరా... దొరా..." అంటూ ఆమె అక్కడే నిల్చుండిపోయింది. ఆమెకి ఈపని చేయడం ఎంతమాత్రం ఇష్టంలేదు.

"రా... అట్లా నిల్చుంటావేం... రా...!" పె ద్దగా అరిచాడు పాటిల్. చెన్నమ్మ భయంతో గజగజ వణకసాగింది. "పిల్లవాడిని, నర సింహను, గదిలో ఉండనీ వద నాతో ఆ గదిలోకి..."

చెన్నమ్మ నరసింహాలకు నోటమాట రావ డంలేదు.

"ఊ... పద..." అంటూ పాటిల్ చెన్నమ్మ చేయిపట్టుకున్నాడు.

చెన్నమ్మ చేయి విదిలించికొట్టింది.

"ఏమే... నీకు పొగరెక్కువయింది. గదిలోకి రా... నీకు కావల్సినంత డబ్బు ఇస్తాను"



"దొరా... దొరా... మీరేమనుకుంటున్నారో మీకు తెలుస్తోందా? దొరా... మమ్మల్ని వదిలివేయండి..."

"నేను చేసిన సహాయాన్ని అప్పుడే మరచిపోయారుట్రా... నేను చెబితేనేగా మీకు పిల్లలు పుట్టింది..."

"నిజమే దొరా... కాని... కాని..."

"ఈపనికి రానివాడిని కట్టుకుని నువ్వేం సుఖపడ్డావని? నా కోరిక తీర్చు. నీకు స్వర్గసుఖాలు చూపిస్తాను..."

"దొరా... దొరా... నేను అట్లాంటి మనిషిని కాదు... నేను రాను..."

"నన్నే ఎదిరిస్తావుటే..." అంటూ ఆమె జుట్టు పట్టుకున్నాడు పాటిల్.

"దొరా... దొరా... మీ కాళ్లు పట్టుకుంటాను... మమ్మల్ని వదిలివేయండి" అంటూ నరసింహ పాటిల్ కాళ్లు పట్టుకున్నాడు.

పాటిల్ కాళ్లు వెనక్కి లాక్కున్నాడు. "ఇదిగో మర్యాదగా లొంగిపో... లేకపోతే నీ బండారం బయటపెడతాను... మీరిద్దరు పిల్లను బలిఇచ్చిన సంగతి బయటపెడతాను... పోలీసులు ఇద్దరిని పట్టుకుపోయి జైల్లో తోస్తారు. నీ కొడుకు జీవితం ఏమవుతుందో ఆలోచించుకో..."

నరసింహ చెన్నమ్మలకి ఇప్పుడు అర్థం అయింది. జగన్నాథరావు తమకు వెలుగు చూపిస్తానని అంధకారంలో తోసేశాడని. పోలీసులు సంకెళ్లు వేయకుండానే వాళ్లకు బేడీలు పడిపోయాయి. నిస్సహాయంగా నరసింహ అతడివంక చూశాడు.

చెన్నమ్మ ఏడవడం మొదలుపెట్టింది. జగన్నాథరావు ఆమెను గుంజుకుంటూ మరో గదిలోకి తీసుకువెళ్లాడు. "నేను రాను... రాను.." అని ఆమె అరిచింది.

"దొరా... దొరా... చెన్నూను వదిలేయండి. వదిలేయండి..." అంటూ నరసింహ అతడి వెంటబడ్డాడు. పిల్లవాడు ఏడ్చాడు.

జగన్నాథరావు గదిలోపలికి చెన్నూను లాక్కుంటూ తీసుకుపోయాడు. తలుపులు మూసేశాడు. మూయబడివున్న తలుపులవంక చూస్తూ నిల్చున్నాడు నరసింహ. అతడిలో ఆవేశం వచ్చింది. తలుపులు బద్దలు కొట్టాలనిపించింది. చెన్నూని రక్షించాలనిపించింది... కాని....కాని... పాటిల్ గుడిసంగతి అందరికి చెప్పేస్తాడు... తమ బతుకులు నాశనం అవుతాయి అన్న ఆలోచన అతనికి కలిగింది.

గది లోపలనుండి అరుపులు వినిపిస్తున్నాయి. "వదులు.. వదులు" భర్త గదిబయటే ఉన్నాడు. భార్య గది లోపల ఆ రాక్షసుడి చేతిలో ఉన్నది. భర్త భార్యను రక్షించలేడు. ఎంత అసహాయత... చెన్నూ ఉన్న గది గోడలకు చెవులుంటే కిటికీలకు కళ్ళుంటే అవి ధనధనమని కూలి జగన్నాథరావుని చంపి చెన్నూని రక్షించేవి. లోపల జరుగుతున్న ఘోరకృత్యాన్ని చూస్తే క్రూరజంతువులుసైతం సిగ్గుపడకుండా ఉండలేవు. దూరంగా ఎక్కడో నక్కల ఊళలు వినిపిస్తున్నాయి. మనుమల్లో మనకన్నా పెద్ద గుంటనక్కలు ఎన్నో ఉన్నాయని అవి బహుశా చెప్పుకుంటున్నాయేమో... మనం జంతువులం అని అడవుల్లో ఉంటున్నాం కాని ఈ మానవమృగాలు మనకన్నా ఏం తీసిపోయాయి? అనుకుంటున్నాయేమో అడవి మృగాలు. కాని మానవుడైన జగన్నాథరావుకి మాత్రం కించిత్ అయినా సిగ్గనిపించలేదు. ఆమె జీవితాన్ని నాశనం చేశాడు. ఆ రాత్రంతా చెన్నమ్మ ఏడుస్తూనే ఉంది. తెల్లవారింది. చెన్నమ్మ నరసింహ ముఖం చూడలేకపోయింది. నరసింహ తన నిస్సహాయ స్థితికి జుట్టు పీక్కుంటూ బాధపడసాగాడు. అట్లా నాలుగు రోజులు గడిచిపోయాయి. అక్కడ ఉన్నన్నిరోజులూ చెన్నమ్మ జగన్నాథరావు నోటి ముందు ముద్దే అయింది.

"ఈ విషయం ఎవరికన్నా చెప్పారో చూసుకోండి ఏం చేస్తానో..." అని బెదిరించాడు జగన్నాథరావు, వాళ్లను ఊరికి తీసుకువచ్చి దింపుతూ. నరసింహ చెన్నమ్మలు మౌనంగా ఉండిపోయారు.

వీళ్ళ దిగులు ముఖాలను చూసి పిల్లను ఎవరో ఎత్తుకుపోయారు కనుక విచారంగా ఉన్నారని ఊరివాళ్లందరూ అనుకున్నారు. వాళ్లను ఓదార్చారు.

చెన్నమ్మ దిగులుతో మంచంపట్టింది. మానసికంగా శారీరకంగా చాలా కుంగిపోయింది




జగన్నాథరావుదగ్గరికి పనికి వెళ్ళినప్పుడ ల్లా నరసింహకి కోపం వచ్చేది. కాని ఆ కోపాన్ని దిగమింగేవాడు.

బలి విషయం బయటపెడతానని బెదిరి స్తూ నరసింహ కుటుంబాన్ని అయినదానికి కానిదానికి ఉపయోగించుకోవడం మొదలుపె ట్టాడు జగన్నాథరావు.

ఒకరోజు చెన్నమ్మకి విపరీతంగా వెక్కిళ్ళు వచ్చి శ్వాస ఆగిపోయింది. నరసింహ తలని గోడకేసి కొట్టుకుని కొట్టుకుని ఏడ్చాడు. చుట్టు పక్కలవాళ్లందరు 'అయ్యో... నరసింహ తల్లి లేని పిల్లవాడిని ఎట్లా పెంచుతాడు' అంటూ బాధపడ్డారు. కాని తల్లి చనిపోయాక పిల్లవాడు ఎక్కువకాలం బతకలేదు.

నరసింహ ఒంటరివాడైపోయాడు. పిచ్చివా డిలా తయారయ్యాడు. బాధను మరచిపోవడా నికి తాగడం మొదలుపెట్టాడు. ప్రతిరోజు తాగి భార్యను, పిల్లవాడిని గుర్తుచేసుకుని ఏడుస్తూ కూర్చునేవాడు. ఒకరోజు విపరీతంగా తాగాడు. ఆ మత్తులో ఆవేశంగా మాట్లాడటం మొదలు పెట్టాడు. పాటిల్... పాటిల్... నిన్ను ప్రాణాలతో వదలను. చెన్నూ వెళ్ళిపోయింది. నా పిల్లవా డు చచ్చిపోయాడు. నా ఇంటి దీపం ఆరిపో యింది. నీ మాటలు విని నేను నా పిల్లని బలి ఇచ్చాను... బలి ఇచ్చాను... అంటూ పెద్దగా అరవసాగాడు. పిచ్చిగా గెంతులు వేస్తూ అటు ఇటూ తిరగసాగాడు. చుట్టుపక్కలవాళ్ళు అత డిని పట్టుకుని ఒకచోట కూర్చోబెట్టారు. అతడు - "నేను... నేను... నా పిల్లని బలి ఇచ్చాను... ఎంత పాపం చేశాను... ఈ పాపం నాచేత చేయించింది ఎవరు... ఎవరు... ఆ పాటిల్... జగన్నాథరావు... వాడిని... వాడిని వదలను" అని అంటూ జట్టు పీక్కుంటూ అరవసాగాడు.

"పిల్లను బలి ఇవ్వడానికి నీకు చేతులు ఎట్లా వచ్చాయిరా..." అంటూ అందులో ఒక డు నరసింహ చెంపమీద ఛెళ్ళున వేశాడు.

అందరు అక్కడ గుమిగూడారు. అరుపు లు, కేకలు మొదలయ్యాయి. దొంగతనాలని, అనవసరమైన గొడవలని అరికట్టాలన్న ఉద్దే శ్యంతో పోలీసులు మామూలుగా ప్రతీ రాత్రి రెండుమూడుసార్లు ఊరంతా తిరుగుతూ వుంటారు. ఆరోజు కూడా పోలీసు జీపు అక్కడి కి వచ్చింది. నరసింహ కేకలను విని, అక్కడి గుంపును చూసి పోలీసులు జీపు ఆపారు.

"ఏమిటీ గొడవ?... ఏం జరిగింది?" అని అంటూ కానిస్టేబుల్ గుంపులోకి వచ్చాడు.

పోలీసు జీపు చూడంగానే గుంపు చెల్లాచెద రు అయింది. నరసింహ అరుస్తూనే ఉన్నాడు. చివరికి పోలీసులు నరసింహను పట్టుకుపో యారు. నరసింహ జరిగిన సంగతంతా చెప్పా డు.

మరునాడు ఎంక్వయిరీ జరిగింది. గుడి వెనక పిల్లను పాతిపెట్టినచోట బొమికలు దొరి కాయి. ఇదంతా జగన్నాథరావువల్లనే జరి గిందని నరసింహ చెప్పాడు. సాక్ష్యాలను చూ పెట్టమని పోలీసులు అడిగారు. నరసింహ ఏమీ చెప్పలేకపోయాడు. అతనికి శిక్ష పడ్డది.



రాత్రి పదకొండు గంటలు దాటింది. సుమ లత ఇంకా ఇంటికి రాలేదని భారతి కిటికీ లోంచి చూస్తోంది. ఇంతలో ఇంటిముందు కారు ఆగింది. కారులోనుండి సుమలత దిగింది. లోపల ఉన్న వ్యక్తి చేయి ఊపాడు. భారతి ఆ వ్యక్తిని గుర్తుపట్టింది. అతడు జగ న్నాథరావు రెండో కొడుకు, అజయ్‌కుమార్.

భారతి తలుపు తెరిచింది. సుమలత లోప లికి వచ్చింది. "లతా... నీకు నేను ఎన్నోసార్లు చెప్పాను ఇట్లా ఆలస్యంగా ఇంటికి రావద్దని" అంది భారతి.

"వస్తాను... నా ఇష్టం" అన్నది సుమలత కోపంగా.

"లతా... జగన్నాథరావు వాళ్ల కుటుంబం

సంగతి తెలిసి ఉండి కూడా నీవు వాళ్లతో అనుబంధం పెంచుకుంటున్నావు. వాళ్ల కోడలు లలిత వాళ్ళెంత సంస్కారహీనులో చెప్పిందిగా... వాళ్ళు మంచివాళ్ళు కాదని ఆమె ఎన్నోసార్లు చెప్పింది.

"మీ ఇద్దరికి అసలు బతకటం చేతకాదు. హాయిగా జీవితాన్ని అనుభవించడం చేతకాదు. వీళ్ళు విఠల్‌జాతిలాంటివాళ్లని అనుకుంటున్నావా? ఎంతైనా స్టాండర్డ్ పీపుల్... నీవు ఆ దేశదిమ్మరులకు మంచి చేయాలని, వాళ్లలో జాగృతి తేవాలని రాత్రింబవళ్ళు కష్టపడ్డావు. కాని వాళ్ళు నీమీద లేనిపోని అభాండాలు వేశారు. వీళ్ళు నన్నెంత గౌరవిస్తారో నీకేంతెలుసు... అజయ్ నన్ను ఎంతో ప్రేమగా చూస్తాడు. నేను అతడిని పెళ్ళిచేసుకోవాలని అనుకుంటున్నాను"

"లతా... ప్రేమ గీమ అంటూ వాళ్ల వలలో చిక్కుకోకు. ఎప్పటికైనా ముప్పే. ముందే కళ్ళు తెరు..."

"నాకు ఏది చేయాలో ఏది చేయవద్దో బాగా తెలును. నువ్వేమీ చెప్పనక్కరలేదు" సుమలత కోపంగా అన్నది.

సుమలత ప్రవర్తన భారతికి చాలా బాధ కలిగించింది.

"రేపు అతడి బర్త్‌డే... పెద్ద పార్టీ ఇస్తున్నాడు. రేపు అందరిముందూ మా పెళ్ళి విషయం చెబుతానన్నాడు. వాళ్ల ఇంట్లో ఎటూ ఈ విషయం తెలుసు"

"లతా... నీవు తొందరపడుతున్నావు. బాగా ఆలోచించుకో... మీ ఇంట్లోవాళ్లకి తెలియకుండా..."

"నాకు అమ్మ నాన్న ఎటూ లేరు. ఉన్నది ఇద్దరన్నయ్యలు, ఇద్దరక్కయ్యలు. అయినా నా జీవితం నా చేతిలో ఉంది. వీళ్లందరి అనుమతి నాకెందుకు? వీళ్ళేం నన్ను ఉద్ధరిస్తారా..."

"నీవు ఇంత చదువుకుని ఈ విధంగా మాట్లాడటం ఏమీ బాగాలేదు. ఎంతైనా రక్త సంబంధం... ఈ సంబంధాన్ని నువ్వు కాదనగలవా... వాళ్లందరు నీ మంచి కోరుకునేవాళ్ళే..."

"నా మంచి కోరుకునేవాడు నా అజయ్ ఒక్కడే... అతడే నా జీవిత భాగస్వామి. నా పెళ్ళి విషయంలో పరాయివాళ్ళు జోక్యం కలిగించుకోవడం నాకిష్టంలేదు" అని అంటూ పర్సుని టేబుల్‌మీద పెట్టబోయింది లత. కాని పర్స్ కిందపడిపోయింది. పర్స్‌లోనుండి దాదాపు ఇరవై ఫొటోలు అటూ ఇటూ చెల్లాచెదరై పడిపోయాయి. భారతి వంగి రెండింటిని చేతిలోకి తీసుకుంది. ఆ ఫొటోలు సుమలత అజయ్‌లు కలిసి దిగినవి.

"లతా... పెళ్ళి కాకుండానే ఇట్లా ఒక మొగాడితో ఫొటోలు దిగడం ఎంత అపాయమో తెలుసా... లతా... లతా... అతడు ఎంత మంచివాడైనా పెళ్ళికాకముందు ఆడది తన హద్దులో తను ఉంటేనే మంచిది. అరిటాకు ముల్లుమీద పడ్డా, ముల్లు అరిటాకుమీద పడ్డా నష్టం అరిటాకుకే లతా... ప్లీజ్ నే చెప్పింది అర్థంచేసుకో..."

"ఈ సామెతలన్నీ పాతచింతకాయ పచ్చడిలాంటివి. నీవన్నీ అమ్మమ్మ మాటలు. ఆడది... హద్దులు అంటూ ఈ గదిలో మగ్గుతున్నావు. నిన్ను ఎవరూ బాగుచేయలేరు తల్లీ... నేను ధనవంతుల ఇంట్లో పేరుప్రతిష్టలు ఉన్న ఇంట్లో కాలుపెట్టబోతున్నానని, ఆ ఇంటి కోడలు కాబోతున్నానని నీవు జెలసీ ఫీలవుతున్నావు" అన్నది విసురుగా లత.

"నువ్వు నన్ను చాలా తప్పుగా అర్థంచేసుకుంటున్నావు. నా ప్రాణస్నేహితురాలు జీవితంలో పైమెట్లు ఎక్కాలనే నేను ఎప్పుడూ అనుకుంటాను. జీవనసోపానికి జారుడుమెట్లు ఉంటాయి. అందువలన ఎక్కేటప్పుడు జాగ్రత్తగా ఎక్కాలి. నువ్వు మోసపోకూడదని. నా కోరిక"

"నన్ను మోసంచేసేవాళ్ళు ఈ ప్రపంచంలోనే పుట్టిఉండరు" గర్వంగా అన్నది లత.

"అంత గర్వం పనికిరాదు లతా... ఆత్మాభిమానం ఉండాలి కాని గర్వం కాదు"

"నీ నీతులు వినే ఓపిక నాకు లేదు" అంటూ మంచంమీద వాలింది లత.

భారతికి ఆ రాత్రంతా నిద్రపట్టలేదు. లత జీవితం ఏమౌతుందో ఏమో... లతకు ఆవేశం




ఎక్కువ ఆలోచన తక్కువ. అజయ్‌కుమార్ మంచివాడేనా. అతడి తండ్రి తాతలయితే పరమ దుష్టులని తను విన్నది. మరి ఈ కొడుకు కూడా ఆ తానులో గుడ్డేగా. ఏమో! వాళ్ళు చెడ్డవాళ్లయినంతమాత్రాన ఇతడూ చెడ్డవాడే అయివుంటాడని ఎందుకనుకోవాలి? అతడు నిజంగానే మనఃస్ఫూర్తిగా లతని ప్రేమిస్తున్నాడేమో... కాని... కాని... తను ఈ ధనవంతుల గురించి ఎన్నో కథలు విన్నది. ఆడవాళ్లను మోసంచేసి తమ స్వార్థాలకు ఉపయోగించుకుంటారని విన్నది. లత వీళ్ల ఉచ్చులో పడుతోందా. ఏమైనా తను లతను రక్షించాలి. ఆమె తన స్నేహితురాలు. ఆమె జీవితం ముళ్ళ బాట కాకూడదు. గులాబీల బాట కావాలి. అదే తను కోరుకునేది. తన మరిది సుమలతను పెళ్ళి చేసుకోబోతున్నాడని మరి లలిత తనతో చెప్పలేదు. ఆమెకీ విషయం తెలియదా... కాని తెలియకుండా ఎట్లా ఉంటుంది? తను లలితను కలవాలి. లలితద్వారా కొంత విషయం రాబట్టవచ్చు. కాని ఆమెను కలిసేదెట్లా... వాళ్ల ఇంటికి పోవడం తనకు ఎంతమాత్రం ఇష్టంలేదు. ఆలోచిస్తూ ఆలోచిస్తూ భారతి నిద్రలోకి జారుకుంది.

★ ★ ★

కొద్దివారాలు గడిచాయి.

సుమలత ఈమధ్య దిగులుగా, ముభావంగా ఉంటోందని భారతికి అనుమానం కలిగింది. ఆరోజు అజయ్ పార్టీలో తమ పెళ్ళి గురించిన విషయం అందరికీ తెలియపరుస్తాడని లత భారతికి చెప్పింది. కాని ఆ తరువాత భారతి ఆ విషయం గురించి అడగనూలేదు, సుమలత చెప్పనూలేదు.

ఈరోజు భారతి సుమలతను పెళ్ళిగురించి అడిగింది, అంతే! సుమలత బావురుమని ఏడ్చింది.

భారతి ఆశ్చర్యపోయింది. ఎంతో గర్వంగా పొగరుగా ఉండే సుమలతేనా ఇంతగా బాధపడుతోంది. భారతి ఆమె వీపుమీద చేతితో నిమురుతూ ఓదార్చింది.

"లతా... అసలు ఏం జరిగిందో చెప్పు..."

"భారతీ... నీవు చెప్పిందంతా నిజమే... అజయ్... అజయ్..."

"ఆ... అజయ్ చెప్పు లతా చెప్పు..."

"అతడు నన్ను మోసం చేశాడు. భారతీ నిన్ను అపార్థంచేసుకున్నాను. ఇప్పుడు నాకళ్లు తెరుచుకున్నాయి"

"లతా... అయితే ఆరోజు పార్టీలో..."

"పార్టీలో అందరి సమక్షంలో మన విషయం చెబుతాను... చెబుతాను అంటూ నాకు ఆశచూపించాడు. నేను అతడు నన్ను పెళ్లి చేసుకుంటాడనే నమ్మకంతోనే ఉన్నాను. కాని నా నమ్మకం వమ్ము అయింది" లత కళ్ళ నుండి నీళ్ళు జలజలారాలాయి.

"మరునాడు నేను అజయ్ పార్కుకి వెళ్ళాము. అక్కడ అతడి అసలు సిసలైన నిజస్వరూపం బయటపడ్డది. నన్ను పెళ్లి చేసుకుంటావా లేదా అని నిలదీసి అడిగాను. అందంగా ఉన్నావుకాబట్టి ఏదో సరదాగా నీతో తిరిగాను. నిన్ను పెళ్ళి చేసుకుంటానని నేనెప్పుడైనా అన్నానా... నీలాంటివాళ్ళు మా ధనవంతుల వర్గంలో చేరడానికి నానా పాట్లు పడుతూ ఉంటారు. నీవే నా ఇంటి చుట్టూ తిరిగావు. నేను నీ దగ్గరికి రాలేదుగా అన్నాడు"

భారతి పళ్లు పటపటా కొరికింది "రాస్కెల్ నిన్ను ఎంత అవమాన పరిచాడు"

"నేనూ ఊరుకోలేదు. బెదిరించాను. మర్యాదగా పెళ్లికి ఒప్పుకో లేకపోతే ఈ ఫొటోలు చూపిస్తాను. మీ నాన్న తాతయ్యలకు చెబుతాను" అని అన్నాను.

"వాళ్లు నీ మాటలు నమ్మి నాకు నీతో పెళ్ళి చేస్తారనుకుంటున్నావా... కలలో కూడా అనుకోకు. నీవు గోల చేస్తూ ఉంటే మా తాతయ్య నాన్నలు నోట్లో వేలువేసుకుని చూస్తూ కూర్చుంటారనుకున్నావా... నీవు మరీ ముల్లువై గుచ్చుకుంటాననుకుంటే నిన్ను తీసి అవతల పారేయడానికికూడా వెనుకాడరు. అవసరం అయితే ఏమైనా చేస్తారు" అన్నాడు. వాడి మాటల ధోరణి చూస్తే నా ప్రాణాలకు కూడా అపాయం అని నాకనిపించింది"

"నువ్వు ధైర్యంగా ఉండు. నేను వెళ్ళి ఏ సంగతీ తేలుస్తాను. కాని లతా! వాడంత దుర్మార్గుడైనప్పుడు ఈ పెళ్ళి చేసుకుని

మాత్రం ఏం సుఖపడతావు''

''నిజమే భారతీ! నేను ఇక వాడికి దూరంగా ఉండాలనుకుంటున్నాను...''

''ఇదంతా ఒకకలగా మరచిపో లతా... మళ్ళీ కొత్త జీవితం ప్రారంభించు. ఇదంతా మరచిపోడానికి ప్రయత్నం చెయ్యి''

''ట్రైచేస్తాను....'' ఉదాసీనంగా మారిపోయింది లత.

అనుకోకుండా అప్పుడే లలిత అక్కడికి వచ్చింది. లలితను చూడగానే భారతి రండి అంటూ ఆహ్వానించింది. ఎప్పుడూ హుషారుగా ఉండే సుమలత ఇవాళ ఇంత ఉదాసీనంగా ఉండటం ఆమెకు ఆశ్చర్యాన్ని కలిగించింది.

''లతగారూ... అట్లా ఉన్నారేం ఆరోగ్యం బాగాలేదా?''

భారతి లతవంక చూసింది. ''లలితగారూ! మీ అజయ్‌కుమార్ నన్ను చాలా మోసం చేశాడు''

''అది వాళ్ల స్వభావం... నేను మిమ్మల్ని రెండుమూడు సార్లు హెచ్చరించాను. కాని మీరు సీరియస్‌గా తీసుకోలేదు. మీరు మా వర్గంలో చేరాలని తహతహలాడారు. మా వర్గం వాళ్లు నకిలీ ముఖాలను తొడుక్కుంటారు. ఇప్పుడు మీరు వాళ్ళ అసలైన స్వరూపాలని చూశారుకదా.... నాకు మా ఇంటి వాతావరణమే నచ్చదు. మిమ్మల్ని కేవలం తన సరదా కోసం తనతో తిప్పాడు. అంతే కాని పెళ్లి చేసుకోవడానికి కాదు. నేను ఈ విషయం భారతిగారికి చెబుదామనే అనుకుంటున్నాను. కాని సమయం సందర్భంరాలేదు. నాకు చాలా బాధగా ఉంది. అయినా లతగారూ... ఇదీ ఒకందుకు మంచికే అయింది. మీరు మా ఇంట్లో ఉండలేరు. ఆ ఇంట్లో మనకు ఊపిరి ఆడదు.

''లలితగారూ! కాకుల గూట్లో కోకిలకి ఊపిరి ఆడదు. కాకులలో ఆ కోయిల కలవలేదు. ప్రస్తుతం మీ పరిస్థితి ఈ విధంగానే ఉంది'' అన్నది భారతి.

''భారతిగారూ! విఠల్ ఆరోగ్యం ఎట్లా ఉంది?''

''ఇప్పుడిప్పుడే కోలుకుంటున్నాడు''

తనకి అతడికి మధ్య జరిగిన సంభాషణ గురించి చెబుదామని అనుకున్నది భారతి. కాని ఇంతలో లలిత వెళ్లడానికని లేచింది.

''మిమ్మల్ని మళ్ళీ కలుస్తా...'' అంటూ లలిత వెళ్ళిపోయింది.

భారతి, సుమలతలు మాట్లాడుకుంటూ కూర్చున్నారు.

★ ★ ★

కారు స్పీడుగా వెళ్తోంది. కారులో శివరావు, జగన్నాథరావు, అజయ్‌లు ఉన్నారు. మరునాడు ఉదయం ఎనిమిది గంటలకు జరగబోయే తమ బంధువుల పెళ్ళికి వాళ్ళు వెళ్తున్నారు. దారిమధ్యలో బాగా చీకటిగా ఉంది. వెనక రెండు మోటర్ సైకిళ్లమీద నలుగురు వ్యక్తులు వీళ్లవెనకే వస్తున్నారు. వాళ్లల్లో నరసింహ ఉన్నాడు.

''నాన్నగారూ... వెనక మనలని ఎవరో ఫాలో అవుతున్నారని నాకు అనుమానంగా ఉంది'' అని అన్నాడు అజయ్ స్టీరింగ్ తిప్పుతూ. జగన్నాథరావు, శివరావు వెనక్కి తిరిగి చూశారు. వెనక మోటర్ సైకిళ్ళు స్పీడ్‌గా వస్తున్నాయి. చూస్తూ చూస్తూ ఉండగానే మోటర్ సైకిళ్ళు కారుకి ఇరువైపులా వచ్చాయి. అందులో ఒక వ్యక్తి రాయి విసిరాడు. తెరచి ఉన్న కారు కిటికీలో నుండి రాయి స్పీడ్‌గా అజయ్ పక్కనుండి వెళ్ళి కింద పడ్డది. రెండో వ్యక్తి మరొక రాయి విసిరాడు. ఈసారి అజయ్ కంటికి రాయి తగిలింది.

''అబ్బా!'' అన్నాడు అజయ్.

ఒక మోటర్ సైకిల్ కారు ఎదురుగుండా వచ్చింది. అజయ్ కారుని పక్కకి తిప్పడానికి ప్రయత్నం చేశాడు. ఇంతలో రెండో మోటర్ సైకిల్ కారు ఎదురుగుండా వచ్చింది. అజయ్‌కి కన్ను విపరీతంగా నెప్పి పుట్టసాగింది. అతడు భయపడిపోయాడు. అయినా కారుని అటు ఇటు మలుపులు తిప్పాడు. కాని రెండు మోటరు సైకిళ్ళు ఎదురెదుగా వచ్చి కారుని ముందుకు పోనీయలేదు. కారు ఆగిపోయింది. మోటర్‌సైకిళ్ళ మీది వ్యక్తులు కిందకి దిగారు. అందులో ఒక వ్యక్తి తెరిచి ఉన్న కిటికీలోంచి చేయిపెట్టి అజయ్ తలమీద కొట్టాడు.





వెంటనే మరొక వ్యక్తి కొట్టాడు. శివరావు, జగన్నాథరావు కారులోనే ఉంటే తమకి ప్రమాదం అన్న ఉద్దేశ్యంతో డోర్ తెరుచుకుని బయటికి వచ్చేశారు. అనుకోకుండా జరిగిన ఈ సంఘటనకు వాళ్ళు ఆశ్చర్యపోయారు. నరసింహ, జగన్నాథరావు వెనక పరుగెత్తాడు. జగన్నాథరావు పరుగెత్తి పరుగెత్తి అలసిపోయాడు. శివరావు మరోవైపు పరుగెత్తాడు. జగన్నాథరావు వెనక్కి తిరిగి చూశాడు. వెనక నరసింహ వస్తున్నాడు. మళ్ళీ పరుగెత్తాడు. నరసింహ వేగంగా పరుగెత్తుకుంటూ వచ్చి జగన్నాథరావుని పట్టుకున్నాడు. "వదులు... వదులు" అంటూ జగన్నాథరావు గింజుకున్నాడు.

"నిన్ను నేను వదులుతానా... చస్తేవదలను... నిన్ను చంపితే కాని నేను నిద్రపోను"

జగన్నాథరావు అతడిని గుర్తుపట్టలేకపోయాడు. కాని గొంతు విన్నట్లుగా అతడికి అనిపించింది. అతడు ఎవరు? ఎవరు? జగన్నాథరావు, నరసింహ మెడమీద కొట్టాడు. నరసింహ అతడిని కిందికి పడతోశాడు. అక్కడ రాళ్ళు రప్పలు ఉండటంవలన జగన్నాథరావు కిందపడగానే దెబ్బలు తగిలాయి.

"నేను... నరసింహను... గుర్తుపట్టలేదా?"

"నరసింహా... నరసింహా... వదుల్తావా లేదా... చూసుకో నిన్నేం చేస్తానో..." అని కోపంగా అన్నాడు జగన్నాథరావు.

"మీ బెదిరింపులకు బెదిరిపోవడానికి ఆనాటి నరసింహను కాను..." అంటూ అతడి వీపుమీద గుద్దాడు.

ఇంతలో నరసింహ మెడమీద ఎవరిదో చేయి పడ్డది.

అజయ్‌ని మోటర్ సైకిళ్లమీద వచ్చిన వ్యక్తులలో ఒక వ్యక్తి బాగా తన్నాడు.

అజయ్ నెమ్మదిగా లేచి ఆ వ్యక్తిని కొట్టాడు. కాని ఆ వ్యక్తి బలంముందు అజయ్ ఆగలేకపోయాడు.

మరోవ్యక్తి శివరావుపాటిల్‌ని కొట్టాడు. అతడికి బాగా దెబ్బలు తగిలాయి. అతడు ఆగలేకపోయాడు.

మరోవ్యక్తి శివరావుపాటిల్‌ను కొట్టాడు. అతడికి బాగా దెబ్బలు తగిలాయి. అతడు లేవలేకపోయాడు.

నరసింహ తన మెడమీద పడ్డ చేయిని విదిలించి జగన్నాథరావుని కొట్టాడు. జగన్నాథరావు చూశాడు, ఎదురుగుండా రామప్ప, కొండప్పలు ఉన్నారు. రామప్ప నరసింహను లాగాడు. కొండప్ప నరసింహని కిందకి తోశాడు. చాలాసేపటివరకు ఇద్దరు ఒకరితో ఒకరు కలియబడ్డారు. నరసింహకి బాగా దెబ్బలు తగిలాయి. "చెప్పు... దొరని ఎందుకు కొడుతున్నావు?" అడిగాడు కొండప్ప.

"వాడిని చంపేస్తాను... పగ తీర్చుకుంటాను" పళ్లు పటపట కొరుకుతూ అన్నాడు నరసింహ.

ఇంతలో జగన్నాథరావు లేచాడు. నరసింహ చెంపలను టపటపా వాయించాడు. కొండప్ప నరసింహని తన్నాడు. రామప్ప కొండప్పలు కలిసి నరసింహను మళ్లీ లేవకుండా తన్నారు. నరసింహ నేలమీద పడిపోయాడు. అతడి తలకి గాయం తగలడంవలన రక్తం కారసాగింది. ఆ తరువాత అతడు స్పృహ తప్పాడు.

తక్కిన వ్యక్తులను రామప్ప కొండప్పలు బాగా కొట్టారు. "మిమ్మల్ని ఎవరు పంపించారో చెప్పండి... లేకపోతే ప్రాణాలతో వదలం" అన్నాడు జగన్నాథరావు. వాళ్లు ఎంతసేపటికి చెప్పలేదు. రామప్ప కొండప్పలు ఆ వ్యక్తులను ఎత్తి కిందపడేశారు. తలలను నేలకేసి కొట్టారు. చివరికి వీళ్లు పెట్టే బాధలను ఓర్చుకోలేక అందులో ఒకవ్యక్తి "మాధవరావు..." అని అన్నాడు.

"రాస్కెల్... మాధవరావా..." కోపంగా అన్నాడు జగన్నాథరావు.

"వాడిని పాతేస్తాను..." శివరావుపాటిల్ పెద్దగా అరిచాడు. రామప్ప, కొండప్పలు అజయ్‌ని ఎత్తుకొచ్చి కారులో పడుకోపెట్టారు.

శివరావుపాటిల్ లేవడానికి ప్రయత్నించాడు. కాని లేవలేకపోయాడు. జగన్నాథరావుకి తన తండ్రి, కొడుకులను చూడగానే చాలా బాధ కలిగింది. రామప్ప కొండప్పలు శివరావుని ఎత్తుకొచ్చి కారులో పడుకోపెట్టారు. జగన్నాథరావు కారు ఎక్కాడు. రామప్ప, కొండప్పలని కూడా ఎక్కమన్నాడు.

"మేం మన ఊరు రావడంలేదు. వేరే ఊరువెళ్లాలి" అన్నాడు కొండప్ప.

"ఏ పనిమీద?" అడిగాడు జగన్నాథరావు.

"మా దగ్గర బంధువు చచ్చిపోయాడు"

"రామప్పా... కొండప్పా మీరు కనక ఇవాళ అక్కడ లేకపోతే మా కుటుంబం అంతా మట్టిపాలయ్యేది. మీరిద్దరూ మమ్మల్ని రక్షించారు" అంటూ కారు స్టార్ట్ చేశాడు.

కొండప్ప, రామప్పలు నడక ప్రారంభించారు.

జగన్నాథరావు కారుని ఇంటి దగ్గర ఆపాడు. అజయ్ తను లేవలేకపోతున్నానని అన్నాడు. అప్పటికే అతడికి చాలా రక్తం పోయింది. అందరు కలిసి అజయ్‌ని ఇంట్లోకి చేర్చారు. శివరావుని నెమ్మదిగా నడిపించుకుంటూ తీసుకువచ్చారు. ఇంటి నౌకరు వెళ్లి డాక్టర్‌ని పిలుచుకువచ్చాడు. డాక్టరు వచ్చి ముగ్గురికి కట్టుకట్టాడు. మాధవరావుని పిలుచుకురమ్మనమని మనిషిని పంపించాడు జగన్నాథరావు. మాధవరావు ఊరిలో లేడని బాంబేకి వెళ్లాడని తెలిసింది. కారు చెట్టుకి గుద్దుకోవటంవలన యాక్సిడెంట్ అయిందని అందువలన ముగ్గురికి దెబ్బలు తగిలాయని అందరికి చెప్పారు.

అజయ్ నాలుగురోజులు మంచంమీద ఉండి చచ్చిపోయాడు. శవంమీద వడివడి ఏడవడం మొదలుపెట్టారు జగన్నాథరావు శివరావు. "నాన్నా... చిట్టీతండ్రీ... ఈ వయస్సులో మాకెంత దుఃఖం కలిగించావురా... ఈ ముసలితనంలో ఎటువంటి కష్టాన్ని చూస్తున్నానురా... కాటికి నేను పోవాల్సిందిరా! నేను పండుటాకుని... రాలిపోయినా ఫర్వాలేదురా... నాన్నా... అజయ్" నెత్తిమీద చేత్తో కొట్టుకుంటూ ఏడ్వసాగాడు శివరావుపాటిల్.

"అజయ్... అజయ్... ఏ పాపానికి నాకు దేవుడింత శిక్ష వేశాడురా నాన్నా... నా ఎదురుగుండా చెట్టంత కొడుకుని పోగొట్టుకున్నాను... పైవాడు నన్ను తీసుకుపోకుండా నిన్నెందుకు తీసుకుపోయాడురా..." అంటూ వలవలా ఏడ్వసాగాడు జగన్నాథరావు.

కుటుంబంలోని సభ్యులందరు కంటికి మంటికి ఏకధారగా ఏడ్వసాగారు.

మాధవరావు తను పంపిన మనుష్యులు జగన్నాథరావుని తప్పకుండా చంపేస్తారని ఇద్దరు కలిసి సంపాదించిన డబ్బంతా తను





పెంచిన మనవడిని పోగొట్టుకున్న ఆ తాత బాధను ఎవరూ తీర్చలేరు. ఈ దుఃఖం ఈ బాధలు వాళ్లలో హృదయ పరివర్తనకు కారణాలయ్యాయి.

★ ★ ★

భారతిని దేశదిమ్మరులు మళ్లీ బెదిరించడంతో ఆమె వదిలి వెళ్లిపోదామని నిర్ణయించుకుంది.

ఆమెలో ఆలోచనాతరంగాలు ఉవ్వెత్తున్న లేస్తున్నాయి. తను పరాజితురాలా... కాదు... కాదు. తను విజేతే. దేశదిమ్మరులను కొంతవరకు ముందుకు నడిపించింది. కొంత తెలివితేటలు వచ్చేలా చేసింది. వితల్‌కి ఒకదారి చూపెట్టింది. పోరాటం ఎట్లా సాగించాలో నేర్పించింది. అతడికి ధైర్యాన్ని ఇచ్చింది. తను ఓ ప్రయత్నం చేసింది. తను మధ్యతరగతి నుండి వచ్చింది. తను విద్యావంతురాలు... తను వీళ్లకు చదువు చెప్పగలదు... వీళ్లలో ఆలోచన రేపగలదు. కాని... కాని వాళ్ల ఆర్థికస్థితిని తను ఒక్కతే బాగుచేయలేదు. వాళ్ల ఆర్థికస్థితి బాగుపడనంతవరకు వాళ్లని దొంగతనాలు చేయడం మానేయమంటే మానేస్తారా? ముందు వాళ్ల కడుపులు నింపాలి. వాళ్లకి పనులు ఇప్పించాలి... రాజకీయనాయకులు, ధనికవర్గాలు కూడా చేయూతనిస్తేనే ఈ సమస్యకు పరిష్కారమార్గం దొరుకుతుంది. రాజకీయ చదరంగంలో దళితులైన దేశదిమ్మరులను పావులుగా ఉపయోగించుకుంటున్న ఈ రాజకీయ నాయకులలో మార్పు రావాలి. వాళ్లలో కరుణ, ప్రేమ పుట్టాలి. మేధావివర్గం వీళ్ల విముక్తికోసం ప్రయత్నాలు చేయాలి. తను ఇక్కడినుండి వెళ్లిపోయినా తన పట్టుదల వదలదు. ఏదోవిధంగా దళితజాగృతి కార్యక్రమాన్ని కొనసాగిస్తుంది. వాళ్లయెడల ప్రజల దృష్టి మారాలి.

ఆరోజు... ఆరోజు ఎప్పుడు వస్తుంది? ఎప్పుడు... ఎప్పుడు... ఈ అహల్యలకు శాపవిమోచనం కలిగించాలంటే మరో రాముడు పుట్టాలి. నైజాం ప్రభుత్వం వీరి నొసటన మీరు దొంగలు అన్న ముద్ర వేయటం వీళ్లకు శాపం కాకపోతే మరేమిటి?



ఒక్కడే అనుభవించవచ్చునని అనుకున్నాడు. తనకు ఏమీ తెలియదన్నట్లుగా అందరు అనుకోవాలని బొంబాయి వెళ్లిపోయాడు. ఆరోజు తను ఉన్న హెూటలునుండి మరో హెూటల్‌కి కాబరే డాన్స్ చూడాలని వెళ్లాడు. అక్కడ విపరీతంగా తాగాడు. వెనక్కి వచ్చేటప్పుడు బాగా తాగి కారు డ్రైవ్ చేయడంవలన కారు అనుకోకుండా లోయలో పడిపోయింది. వెంటనే అక్కడికక్కడే అతడు చనిపోయాడు. అతడి జేబులో ఉన్న అడ్రస్‌ను బట్టి పోలీసులు ఇంటికి ఫోన్ చేశారు. ఇంటివాళ్లు వెళ్లి అతడి శవాన్ని ఊరికి తీసుకువచ్చారు. ఈ వార్త విన్న జగన్నాథరావు, శివరావులకు నోటమాట రాలేదు. అనుకోకుండా ఒకటి తరువాత ఒకటి జరిగిన ఈ సంఘటనలు వాళ్లమీద చాలా ప్రభావం చూపించాయి. ఎదిగిన కొడుకును పోగొట్టుకున్న ఆ తండ్రి దుఃఖం వర్ణనాతీతం. చిన్నప్పటినుండి బొమ్మలతో ఆడించి ముద్దాడి



అంగుళిమాలునిలాంటి దొంగలలో హృదయ పరివర్తన కలిగించి తన మతంలో చేర్చుకుని వాళ్లని ఉద్ధరించిన మరో బుద్ధుడు పుట్టాలి. బాధితుల యెడల కరుణ చూపి వాళ్లకోసం శిలువను స్వీకరించిన కరుణామయుడు మరో క్రీస్తు పుట్టాలి.

అస్పృశ్యుడి నోటివెంటనుండి వేదం విన్న తరువాత వాళ్లకి విద్యాభ్యాసం చేసే హక్కు కలగాలి. వాళ్లను మనం ఉద్ధరించాలి అని గొంతెత్తి చెప్పిన మరో శంకరాచార్యుడు పుట్టాలి.

నిమ్నజాతులవారికోసం జీవితాంతం పోరాడిన మరో అంబేడ్కర్ పుట్టాలి.

రక్తంచేత రాగాలాపన చేయించగలను, మంటలచేత మాట్లాడించగలను అన్న నమ్మకంతో, ఇది కుళ్లిన సంఘం, వయస్సు మళ్లిన సంఘం దీన్ని వేళ్లతో పెకిలివేయాలి అని పాడుతూ మనిషి మనిషికి మధ్య భేదభావం లేని మరో ప్రపంచాన్ని సృష్టించాలి. పీడితులు, తాడితుల కోసం ఈవ్యవస్థను మార్చాలి అని శ్వాస ఆగిపోయేంతవరకు పోరాడిన మరో శ్రీశ్రీ పుట్టాలి.

దళితుల గుడిసెలలోకి తొంగిచూసి వాళ్ల దుఃఖాలను, వాళ్ల కడుపుమంటలను చిత్రీకరించిన కలం పట్టిన వీరుడు మరో ప్రేమ్ చంద్ పుట్టాలి.

హరిజనులకోసం పోరాడిన మరో కరమ్ చంద్‌గాంధీ పుట్టాలి... అలహాబాద్ రోడ్లలో మండుటెండలో రాళ్లు కొడుతున్న పడతిని చూసి 'వహ్ తోడతీ పథర్' అనే కవిత వ్రాసి వాళ్లకోసం కన్నీళ్లు కార్చిన మరో సూర్యకాంత్ త్రిపాఠీ నిరాలా జన్మించాలి... ఆమె కళ్ల ఎదురుగుండా ఎందరో ఎందరో రాముళ్లు, బుద్ధులు, క్రీస్తులు, శంకరాచార్యులు, అంబేడ్కర్‌లు, శ్రీశ్రీలు, ప్రేమ్‌చంద్‌లు, నిరాలాలు కనిపించసాగారు... జనకళ్యాణ్ పార్టీవాళ్లు విఠల్‌కి ఎంత ద్రోహం చేశారు. దేశదిమ్మరులకు తమ ఇద్దరిమీద ఎంత చెడు అభిప్రాయం ఏర్పడ్డది. వాళ్లు తమిద్దరిని అపార్థం చేసుకున్నారు. తామిద్దరు నిర్దోషులని వాళ్లకి నిరూపించి చూపించాలి. కాని ఎట్లా ఏవిధంగా....





హఠాత్తుగా ఓ కారు ఆమె పక్కన ఆగడంతో భారతి ఈ లోకంలోకి వచ్చింది. లోపల కూర్చుని ఉన్న లలిత- భారతీ అని పిలిచింది.

"రండి... కారెక్కండి... ఇంటికి వెళ్దాం" అన్నది లలిత కారుడోర్ తెరుస్తూ.

"ఇప్పుడు నేను రాలేను... సారీ..." అన్నది భారతి.

"మీతో మాట్లాడాలి... ప్లీజ్ కారు ఎక్కండి"

ఇక మర్యాదగా ఉండదని భారతి కారు ఎక్కింది. "మీకు అజయ్ చావు గురించి తెలుసుకదూ..."

"అవును... తెలుసు... యాక్సిడెంట్ గురించి విన్నాక నేనూ లత చాలా బాధపడ్డాం"

"భారతిగారూ... అది యాక్సిడెంట్ కాదు"

"మరి..." ఆశ్చర్యంగా అడిగింది భారతి.

"శివరావుగారూ, మామగారు, అజయ్ కారులో వెళ్తున్నారు. వీళ్లమీద హత్యాప్రయత్నం జరిగింది"

"హత్యా ప్రయత్నమా! ఎవరు చేశారు"

"ఆయన ఎంతగానో నమ్మిన మాధవరావు జొసేకర్. మావాళ్ల వెనక గొయ్యి తవ్వాడు. చంపడానికి ప్రయత్నించాడు"

"జగన్నాథరావుగారు గెలవడానికి ఆయన ఎంతో సహాయం చేశారని విన్నాను"

"సహాయం చేసిన మాట నిజమే కాని దుర్బుద్ధి పుట్టడం ఎంతసేపు?"

"అయితే ఈ హత్యాప్రయత్నం..."

"డబ్బుదాహం తీర్చుకోవడానికి ఇద్దరు కలిసి అన్యాయంగా సంపాదించిన డబ్బును తాను ఒక్కడే తీసుకోవాలని అతడి దురుద్దేశం. మా మామగారు నిస్సహాయులను మోసం చేస్తుంటే మాధవరావు వీళ్లనే మోసం చేశాడు. ఆయన నాలుగు ఆకులు ఎక్కువే చదివాడు. మనిషిలో ఉండే ధనలోభం, కామం మనిషిచేత ఎటువంటి పనులైనా చేయిస్తాయి. ఇంకో రహస్యం కూడా ఉంది. ఎవరికీ తెలియదు"

"ఏమిటా రహస్యం...?"

"నరసింహ అని ఒక వ్యక్తి ఉండేవాడు. వాడిని, వాడి భార్యను మావాళ్ళు చాలా మోసంచేశారు. వాడు పగ తీర్చుకోవడంకోసం

వచ్చాడు'' అని అంటూ జరిగిన కథను భారతికి చెప్పింది.

''బాప్‌రే... ఎంత ఘోరమైన పని అతడిచేత చేయించారు. మాధవరావుగారు కూడా యాక్సిడెంట్‌లో మరణించారని పేపర్‌లో వచ్చింది. నిజంగా అది యాక్సిడెంటేనా... లేకపోతే అతడిని మరెవరైనా...''

''ఆయన యాక్సిడెంట్‌లోనే మరణించాడు భారతిగారూ! ఇప్పుడు మావాళ్లలో చాలా మార్పు వచ్చింది. చెట్టంత కొడుకు పోవడంవలన వాళ్ల కళ్ళు తెరుచుకున్నాయి. ఒక చెడు ఒక మంచికి జరుగుతుందంటారు కదూ... ఇప్పుడు శివరావుగారు, మా మామగారు ఎంతో బాధపడుతున్నారు. ఇంకా వాళ్ల గాయాలు మానలేదు''

''లలితగారూ... నేను ఈ ఊరు వదిలి హైదరాబాద్‌కి వెళ్ళిపోతున్నాను''

''ఏం? ఎందుకు?''

భారతి జరిగిన సంగతంతా చెప్పింది. ''ఇప్పుడు దేశదిమ్మరులకు నేను, విఠల్ బద్ధశత్రువులమయ్యాము. నేను క్లాసులు తీసుకునేటప్పుడు రెండుమూడుసార్లు బెదిరించారు. వాళ్లకి నేను చెడు చేస్తున్నానన్న అభిప్రాయం ఏర్పడింది''

''మీరు వాళ్లకి ఎంతో మేలు చేశారు. వీళ్ళు అమాయకులు''

''అమాయకులు కనుకనే వాళ్లని చూస్తుంటే చాలా బాధగా అనిపిస్తుంది. విఠల్ అపోజిషన్‌పార్టీవాళ్ళదగ్గర లక్షరూపాయలు తీసుకుని ఎలక్షన్లలో నిల్చోవడం మానేశాడని వాళ్లని నమ్మించారు. దీనివెనక నేను ఉన్నానని వాళ్ళు అనుకుంటున్నారు''

''వాళ్ళు చాలా పొరపాటు పడ్డారు... ప్చ్...''

''వాళ్లకి అసలు నిజం ఎట్లా చెప్పాలో అర్థంకావడంలేదు. వాళ్ల జాతిలో చదువుకోవడం నేరం. అయినా ఎన్నో ప్రయత్నాలు చేసి కొంతమందిని ఒప్పించి వాళ్లచేత పలక, బలపం పట్టించాను''

''భారతిగారూ... నిజానికి మీలాంటివాళ్ళు నూటికో కోటికో ఒకళ్ళు ఉంటారు''

''వాళ్ల జీవితాలను బాగు చేయలేకపోయానే అని నేను చాలా బాధపడుతున్నాను''

భారతి కళ్లల్లో నీళ్ళు తిరిగాయి.

''మీలో ఎంతో త్యాగబుద్ధి ఉంది. కాని జగన్నాథరావు, శివరావు, మాధవరావులాంటి దుష్టులున్నంతవరకు ఒక ఆడది ఈ సమాజంతో ఎంతని పోరాడగలుగుతుంది? అయినా భారతిగారూ! మీరు ధైర్యం పోగొట్టుకోకండి. ఇక్కడే ఉండండి. ఈ సముద్రంలోనే ఉండి మొసళ్ళతో పోరాడుదాం. నాకు కొంత ధైర్యం వచ్చింది మీతో నేను చేయి కలుపుతాను. మీ అడుగులతో నా అడుగులు కలుపుతాను'' లలిత కారుని తన ఇంటిదగ్గర ఆపింది. ఇద్దరు కారు దిగి లోపలికి వెళ్ళారు.

భారతిని చూడంగానే జగన్నాథరావు ఆమెను ఆహ్వానించాడు. ''రామ్మా! రా... భారతీ... సుమలత ఏది?''

''మీ అజయ్ మృత్యువు గురించి విని చాలా బాధపడ్డాను'' అన్నది భారతి.

''ఇట్లా జరగాల్సి ఉందమ్మా... జరిగిపోయింది. అసలు వాడిని మేమే పొట్టన పెట్టుకున్నాం...'' బాధపడుతూ అన్నాడు శివరావుపాటిల్.

''మేంచేసిన పాపాలే మమ్మల్ని మింగేశాయి. అమ్మా భారతీ... మా కళ్ళు తెరుచుకున్నాయి. తల్లీ! చెట్టంత కొడుకుని పోగొట్టుకున్నాను. ఊరి పెద్దలంటూ తరతరాలనుండి మేం చేస్తున్న అన్యాయాలమీద న్యాయం కొరడాదెబ్బలు కొట్టింది తల్లీ...'' అన్నాడు జగన్నాథరావు బాధగా.

''కాలం మాకు గుణపాఠం నేర్పిందమ్మా... న్యాయదేవత మా కళ్ళు తెరిపించిందమ్మా... ఇక ఇటువంటి అన్యాయాలు చెయ్యం తల్లీ... అజయ్ మమ్మల్ని వదిలి వెళ్ళిపోయాడు. కొండప్ప, రామప్పలు రక్షించకపోతే మేము కూడా భూమిమీద ఉండేవాళ్లం కాదు. ఆ దేవుడు నన్ను తీసుకుపోయి నా మనవడికి బతుకు ఇస్తే ఎంత బాగుండేది తల్లీ...'' శివరావు కళ్లల్లోంచి నీళ్ళు వచ్చాయి.

''నువ్వు మాకన్నా ఎంతో చిన్నదానివైనా నీకు ఎంతో మంచి బుద్ధి ఉంది. మంచి గుణాలు ఉన్నాయి తల్లీ!''

"మామయ్యగారూ! భారతి ఊరువదిలి వెళ్ళిపోతోందిట"

"ఏం... ఎందుకు?"

"మీరు పెట్టిన నిప్పు రాజుకుని రాజుకుని చాలా పెద్దదయింది. విఠల్ డబ్బు తీసుకుని ఎలక్షన్లలో నిల్చోవడం మానేశాడని మీరు ప్రచారం చేశారుకదా... మేం ఇద్దరం కలిసి వాళ్లని మోసం చేశామన్న అనుమానం వాళ్ళకి కలిగింది. నేను వాళ్ళ జాతివాళ్లకు చదువుకోమని చెబుతున్నాను కాబట్టి వాళ్ళకులంవాళ్ళకి నేను ద్రోహం చేస్తున్నానని వాళ్ల అభిప్రాయం. ఇక్కడ ఉండటానికి వీల్లేదని వాళ్ళు నన్ను బెదిరిస్తున్నారు"

"భారతీ... నన్ను క్షమించండి... పదండి నేనూ మీతో వస్తాను. దేశదిమ్మరులకు అసలు సంగతి వివరించి చెబుతాను"

"భారతీ... మేము దేశదిమ్మరులకు చాలా అన్యాయం చేశాం. ఈ సత్యం ఈ ముసలితనంలో తెలుసుకున్నాను. ముందే తెలుసుకుని ఉంటే ఎంతో బాగుండేది"

"చదువుకుని జ్ఞానం ఉన్న నేను కూడా వాళ్లని చిన్నచూపు చూశాను. చాలా తప్పుచేశానమ్మా" అన్నాడు దత్తాత్రేయ దేశ్‌ముఖ్.

అందరు కలిసి కారులో బయలుదేరారు. కారులోంచి దిగుతున్న వీళ్లను చూడంగానే దేశదిమ్మరులందరు గుమిగూడారు.

"ఓ మాస్టరమ్మా... మళ్ళీ మా బస్తీలోకి ఎందుకు అడుగు పెట్టావు? ఇక్కడనుండి వెళ్ళిపో..." అని కొండప్ప పెద్దగా అరిచాడు.

రామప్ప, లక్ష్మప్ప, ఎల్లవ్వ కర్రలు తీసుకుని బయటికి వచ్చారు. ఎవరి ఇష్టం వచ్చినట్టు వాళ్ళు పెద్దగా అరవడం మొదలుపెట్టారు.

విఠల్ ఇంట్లోనుండి బయటకు వచ్చాడు. వీళ్ళందరిని చూసి అతడు ఆశ్చర్యపోయాడు.

జగన్నాథరావు వాళ్ళకి సంగతంతా వివరించి చెప్పాడు. విఠల్ డబ్బు తీసుకోలేదనీ, ఇదంతా పార్టీవాళ్ళు ఆడిన నాటకం అని చెప్పాడు. ఈ నాటకంలో తమ పాత్ర కూడా ఉందని చెప్పాడు. అనవసరంగా భారతిమీద అనుమాన పడ్డారని ఆమె చాలా మంచిదని చెప్పాడు. ఇకనుండి దళితుల బాగోగులకోసం తాము కూడా కావల్సినంత సహాయం చేస్తామని వాళ్లందరు చదువుకుంటే బాగుపడతారని ప్రభుత్వం వీలయినంత ఆర్థిక సహాయం చేస్తుందని చెప్పాడు.

"మిమ్మల్ని మావాళ్ళు తరతరాలనుండి పీడిస్తున్నారు. మా తప్పు తెలుసుకున్నాం" అన్నాడు శివరావుపాటిల్.

ఈ మాటలన్నీ విన్నాక దేశదిమ్మరులలో జ్ఞానోదయం అయింది.

"నేను ఈ ఊరు వదిలి వెళ్ళిపోతున్నాను. మీరు కళ్ళు తెరవండి. చదువుకోండి. మంచిగా బతకడానికి ప్రయత్నించండి. అదే నేను కోరుకునేది" అన్నది భారతి.

"మాస్టరమ్మా... మమ్మల్ని క్షమించు, నువ్వెళ్ళొద్దు. ఇక్కడే ఉండు" అన్నాడు రామప్ప.

"మేం చదువుకుంటాం... దొంగతనాలు చేయడం మానేస్తాం"

"మా పిల్లలని చదివిస్తాం... దొంగతనాలు చేయడం మానేస్తాం..." అన్నాడు కొండప్ప.

"విఠలియా... మాకేమైనా పనులిప్పించు. మేం దొంగతనాలు మానేస్తాం" అన్నది ఎల్లవ్వ.

"మీ అందరిలో ఇటువంటి చైతన్యం రావాలనే చీకటి బతుకుల నుండి మీకు విముక్తి కలగాలనే నేను ఎన్నో కలలుకన్నాను" భారతి కళ్ల వెంట ఆనంద భాష్పాలు రాలాయి.

"మీకు బ్యాంకుల నుండి ఋణాలిప్పిస్తాను. మీరు ఏదో ఒక చిన్న వ్యాపారం పెట్టుకుని బతకండి" అన్నాడు శివరావు పాటిల్.

దేశదిమ్మరులు గుంపులు గుంపులుగా చేరారు.

"గవర్నమెంటు నుండి వీలయినంత సహాయం మీకు అందేటట్లు చూస్తాను" అన్నాడు జగన్నాథరావు.

ఇంతలో వృద్ధుడైన కులకర్ణి మాస్టారు, వినాయకరావు అక్కడికి వచ్చారు.

"మాస్టారూ!" అంటూ విఠల్ ఆయన కాళ్లకు దండం పెట్టాడు.

"విఠల్ జరిగిందంతా విన్నాను. నీ ఆరోగ్యం ఎట్లా ఉంది?" అడిగాడు మాస్టారు.

"మాస్టారూ! మీరు నాకు చిన్నప్పటినుండి





మంచిగా బతకమని, చదువుకోమని చెప్పేవారు. నిజానికి మీ ఆశీర్వాదం వల్లనే నేను మాజాతి వాళ్లలా దొంగను కాలేదు. మా నాన్న కూడా నన్ను ఆరోజుల్లో స్కూల్‌కి పంపించాడు. కాస్తోకూస్తో చదువుకున్నాను. ఇప్పుడు భారతి గారి వలన మా దేశదిమ్మరులలో కొంత మార్పు వచ్చింది'' అన్నాడు విఠల్ సంతోషంగా.

''అమ్మా భారతీ! నీ గురించి విన్నాను. విఠల్ అప్పుడప్పుడు నా దగ్గరికి వచ్చినప్పుడు నీ గురించి చెప్పేవాడు. నిజానికి దేశదిమ్మరుల జీవితాలు అతినికృష్టమైన జీవితాలు. దీనికి కారణం సమాజంలోని ధనవంతులు అగ్రవర్ణాలవాళ్ళు వాళ్ళని ఆర్థికంగా సాంఘికంగా అణగదొక్కటమే. మన సమాజం ఒక ఇనప చట్రంలో బిగింపబడ్డది. ఈ చట్రం ఇప్పుడిప్పుడే కొంత సడలుతోంది ఈ చట్రం ఎప్పుడో ఒకప్పుడు పూర్తిగా విరగకమానదు. అమ్మా భారతీ! నీవు చేపట్టిన ఈ దళిత జాగృతి ఉద్యమం ఏ ఆటంకం లేకుండా కొనసాగాలని ఆశిస్తున్నాను. ఇకముందు ముందు దేశదిమ్మరుల జీవితాలు బాగుపడతాయి. దళితుల బ్రతుకులలో వెలుగు తప్పకుండా వస్తుంది'' అన్నాడు కులకర్ణి మాస్టారు.

శివరావు పాటిల్, జగన్నాథరావు, దత్తాత్రేయ దేశ్‌ముఖ్‌లు మాస్టారిగారికి నమస్కారం చేశారు. కులకర్ణి మాస్టారు ప్రతి నమస్కారం చేశాడు.

''మీరు మొదటినుండి ఈ దళిత జాతివారిని హింసించవద్దని చెబుతూనే ఉన్నారు. ఈనాటికి ఆ భగవంతుడు మా కళ్లు తెరిపించాడు కులకర్ణిగారూ!'' అన్నాడు శివరావు పాటిల్.

దేశ దిమ్మరులు గుంపులు గుంపులుగా అక్కడికి చేరారు.

''విఠల్‌లో మంచి సంస్కారం ఉందని తెలిసి ఈ మొలకకి మంచి నీరు, మంచి ఎరువు మంచి గాలి కావాలని మీరు అనేవారు. నిజమే విఠల్ తెలివి కలవాడు. సంస్కారవంతుడు. దళితుల చేతులు పట్టుకుని ముందుకి నడిపించేటంతటి గొప్ప వాడయ్యాడు'' అన్నాడు దేశ్‌ముఖ్.

''మా తప్పు మేం తెలుసుకున్నాం మాస్టారు. ఇకవీళ్లకు నేను చేయూతనిస్తాను'' అన్నాడు జగన్నాథరావు.

వామనప్ప, తులసీబాయి నారియాల ఆనందానికి అంతులేదు.

''అన్నా...నేను చదువుకుని నౌకరీచేస్తాను'' అన్నాడు నారియా.

ఎల్లవ్వ తను పెంచిన పిల్లవాడిని తీసుకువచ్చింది. ''మాస్టరమ్మా! వీడికి చదువు నేర్పిస్తాం... వీడిని దొంగని చెయ్యం...''

''విఠలియా! వీడి చేతికి మేము బ్లేడు ఇవ్వము. పలకబలపం ఇస్తాము'' అన్నాడు రామప్ప.

''వీడు రేపటి భరత్.. వీడిని చదివించి మంచి సంస్కారవంతుడిని చేయండి... ఇక మీ జాతిలోని ముందు తరాలు బాగుపడుతాయి. జగన్నాథరావుగారూ... వీళ్ల మీద పోలీసులు అత్యాచారాలు జరపకుండా చూడండి'' అంది భారతి పిల్లవాడిని చేతిలోకి తీసుకుంటూ.

''ఈ ఊరిగాలి మారింది. ఈనాడు ఓ కొత్తగాలి వీచింది. వసంతం వచ్చింది. ఈ విధంగానే మన దేశంలోని ప్రతి ఊరికి, ప్రతీ వాడకి ఈ గాలి వీయాలి'' అన్నాడు కులకర్ణి మాస్టారు ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అవుతూ.

దళితుల జీవనవనంలో ప్రవేశించిన ఈ వసంతాన్ని ఏ సుడిగాలులు, ఏ తుఫానులు, ఏవీ మరేవీ ఇక ఆపలేవు... అని మనస్సులో అనుకుంది భారతి.

విఠల్ కళ్ల ఎదురుగుండా ఓ దృశ్యం కదలాడసాగింది. దళిత సైన్యంగా మారిన చీటీచీమలు వేగంగా అతివేగంగా ముందుకు సాగిపోతున్నాయి. పావురాలు శక్తిని తెచ్చుకున్నాయి. డేగ గద్దలు రాబందుల ఎదురుగుండా అని ధీమాగా నిల్చున్నాయి.

భారతికి ఆ క్షణంలో కలిగిన ఆనందానికి అవధులులేవు. తను దళితుల విముక్తికోసం ప్రయత్నం చేసింది. కొంత సఫలీకృతురాలు కాగలిగింది అన్న ఆలోచన భారతికి తృప్తిని కలిగించింది. ఆమె పెదవులు కదలాడసాగాయి. అల్లదుగో నవోదయం... అల్లదుగో శుభోదయం... అల్లదుగో శ్రీశ్రీ కలలుగన్న మరో ప్రపంచం... అల్లదుగో అంబేదకర్ ఆశించిన నరికొత్త రాజ్యం.



# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 2. | Periodicity of its Publication | : Monthly |
| 3. | Printer's Name<br>Whether citizen of India<br>If foreigner, state the country of origin | : **RAMOJI RAO**<br>Yes<br>– |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 4. | Publisher's Name<br>Whether citizen of India<br>If foreigner, state the country of origin | : **RAMOJI RAO**<br>Yes<br>– |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 5. | Editor's Name<br>Whether citizen of India<br>If foreigner, state the country of origin | : **RAMOJI RAO**<br>Yes<br>– |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |
| 6. | Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one per cent of the total capital. | : **VASUNDHARA PUBLICATIONS**<br>6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482 |

**I, RAMOJI RAO,** hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS.**
**Sd/- RAMOJI RAO**
Publisher

Date: March 1, 1992



# "ప్రేమపందెం"పై చతుర సమీక్షలు

జనవరి 'చతుర'లో ప్రచురితమైన కె.ఎమ్.కోకిల నవల 'ప్రేమపందెం'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## 'సరదా నవల'

*(ప్రథమ బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

ఏదైనా ఒక కథ కానీ నవల కానీ చదివినప్పుడు కథ, పాత్రలు మనల్ని వీధిలో కలిసి వీధిలోనే విడిపోయే స్నేహితుల మాదిరి మిగిలిపోకుండా మనతోపాటు మన ఇంటికి వచ్చి, మనతో నాలుగు రోజులు కలసి జీవించినట్లు వుండాలి, అన్నాడో రచయిత. 'ప్రేమ పందెం' ఆ నిర్వచనానికి నిలబడిందనే చెప్పవచ్చు. చదివేటప్పుడే కాకుండా గుర్తు వచ్చినప్పుడల్లా నవ్వుకొంటున్నామనేదే అందుకు గీటురాయి. సామాజిక స్పృహ పరంగా చూస్తే ఈ రచన నిలబడక పోవచ్చు. కానీ అనుక్షణం మానసిక వత్తిడులతో నలిగిపోతున్న మధ్యతరగతి ప్రజానీకానికి జీవితంలోనే కాకుండా రచనల్లో కూడా మళ్ళీ సమస్యలనే చూడాలంటే విసుగనిపించవచ్చు. అలాంటిజనానికి, టీజింగ్ నేచర్ అంతో ఇంతో వుండే ఈనాటి కుర్రకారుకు ఈ నవల నచ్చుతుందనడంలో సందేహం లేదు. రచయిత్రిగారు అక్కడక్కడ ఈనాటి స్నేహం, ప్రేమల గురించి నవ్వు తెప్పిస్తూ వ్యంగ్యంగా వ్రాసిన తీరు బాగుంది. ముఖ్యంగా సామాజిక, రాజకీయ ఆర్థిక సమస్యల్ని ప్రతిబింబించే రచనల్ని మాకందిస్తున్న 'చతుర' ఈసారి... సరదాగా అందర్నీ నవ్వించే రచనతో మా ముందుకు రావడం ముదావహం... పాత్రలను చూస్తే యే పాత్రకా పాత్రగా న్యాయం చేకూర్చారనే చెప్పొచ్చు. సమస్యల్ని పక్కకు నెట్టించి మనల్ని హాయిగా నవ్వించిన సుబ్బారావు మరియు గౌతమ్‌లకు వారిని సృష్టించిన కోకిల గారికి వెరసి ప్రచురించిన 'చతుర'కు మా కృతజ్ఞతలు.

-పి.వి.పి.గీత,
కొడిగెనహళ్ళి.

## 'ప్రమీలార్జునీయం'

*(ద్వితీయ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)*

ప్రారంభించాక చివరి వరకూ చదివించేదే మంచి నవల. చివరిదాకా చక్కని ఉత్కంఠ తతో.. చతురోక్తులతో నవ్విస్తూ నడుస్తుందీ 'ప్రేమ పందెం'. హాస్యరసాన్ని నింపుకున్న ప్రేమ కథ కావటంవల్ల బాగా ఆకట్టుకుంది. ఇందులోని కథ ప్రమీలార్జునీయం, సుభద్రా పరిణయం, లాంటిది. సుబ్బారావు, గౌతమ్‌లు కృష్ణార్జునులను గుర్తుకు తెస్తారు.

గౌతమ్‌కి వున్న 'నోటి దురద' కారణంగా ఉత్పన్నమైన సమస్యలూ, తద్వారా అనూహ్యా గౌతమ్‌కి మరింత దూరం కావటం, చీవాట్లు పెట్టటం, జాలి కలిగిస్తాయి. 'ప్రేమపందెం'తో గౌతమ్ మౌనపోరాటం సాగించిన తీరు, బావుంది. తన కళ్ల ముందే ప్రాణమిత్రుణ్ణి తేలుకుడుతున్నా, నోరు మెదపలేని గౌతమ్ మూగవ్యధ అటు .బాధని , ఇటునవ్వునిపుట్టి స్తుంది. ఇలాంటి సన్నివేశాలు చాలావున్నాయి.

పందెం గడువు చివరిదశలో అనూహ్యాను గురించి నీచంగా మాట్లాడుతున్న వాళ్ళపైకి, లంఘించటం మౌనం మాట మరువటం, అనూహ్యాపై అతనికి గల ప్రగాఢ ప్రేమను తెలియజేస్తుంది. ఆ పరీక్ష పెట్టింది అనూహ్యా కనుక నిజానికి కథ అక్కడితోనే ముగిసిపో వాలి. గౌతమ్ మెళ్ళో స్వయంవరమాల పడా ల్సింది. కాని సాగదీయటం జరిగింది. అనూ హ్యా యింకా మనసు విప్పకపోవటం, గౌతమ్ ఊరువిడిచి పోవటం, చివరికి ఎవరూ ఊహించని విధంగా తన మనసునూ, పథకా న్నీ పావనితో చెప్పటం జరిగింది. నిజానికి ఆ క్రెడిట్ సుబ్బారావుకో, అతని భార్యకో దక్కా ల్సింది.

నవలలో గౌతమ్, అనూహ్యా, సుబ్బారావుల పాత్రలు జీవం పోసుకున్నాయి. 'డుంబూ' కూడా కళ్ళ ముందు కనిపించాడు.

"ఏమిటో! నోరు లేని వెధవలు కూడా చాడీలు చెప్పటమే! ఛీ! దునియా గలీజైపో యింది" లాంటి మనసులోని మాటలు పాఠకు ల్ని నవ్విస్తాయి.

అయితే త్రిలోక్‌ని గౌతమ్ అంత ఓవర్‌గా బాదటం అసహజంగా వుంది. మొత్తం మీద నవల రిలీఫ్‌గా... ఆహ్లాదంగావుంది.

-కె.జె.ఎస్.రామారెడ్డి.
తణుకు.

## 'అసమగ్ర శిల్పం'

*(మూడవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

"ప్రేమ" జీవితానికి ఒక దివ్యమైన వరం. అది ఒక ఉదాత్తమైన భావం. కానీ నేడు ప్రతి యువతీయువకుల నోట ఆ మాట నలిగినలిగి దాని విలువ తగ్గిపోతోంది. దానికున్న పవిత్రత లోపిస్తోంది. కె.యం. కోకిలగారు ప్రేమను ఇతి వృత్తంగా గ్రహించి 'ప్రేమపందెం' నవలతో మమ్మల్ని ఆనందింపజేశారు. అయితే 'గౌ తమ్' పాత్ర నవల మొత్తంమీద చాలా పేల వంగా, అనుదాత్తంగా ఉంది. కథానాయకుడికి ఉండవలసిన వ్యక్తిత్వం, సంయమనం, నిండుదనం గౌతమ్‌లో లోపించాయి. ఒక దు డుకు స్వభావం కలవానిగా, సంస్కారహీను డిగా గౌతమ్ కన్పిస్తాడు. ఆ పాత్రని కొంత శ్రద్ధ తీసుకొని మలిస్తే బాగుండేది.

కేవలం అందాన్ని చూసి మాత్రమే అనూ హ్యాని అతడు ప్రేమించాడని ప్రతి పాఠకుడికి తెలుస్తుంది. అందమైన వస్తువు తనకి కావా లనే చిన్నపిల్లవాడికీ, గౌతమ్‌కీ మనస్తత్వంలో తేడా లేదు. 'నిక్‌నేమ్స్' పెట్టడం, పరిచయస్తు ల్ని కూడా ఏడిపించడం, జీవితాన్ని సీరి యస్‌గా తీసుకోడని తెలియజేస్తున్నాయి. నోరు లేని పసివాడిని కూడా వేళాకోళం పేరుతో హింసించడం గౌతమ్ సంస్కారహీనతని చాటుతోంది. అతడి అపరిపక్వ హృదయాన్ని తేటతెల్లం చేస్తోంది. అతడి స్వభావంలోనున్న ఈ లోపాన్ని తల్లిదండ్రులు, స్నేహితుడు సు




బ్బారావు సవరింపలేకపోవడం కొంత అస మంజసంగా ఉంది. అనూహ్యకి కష్టం కలిగించాననే తప్పు, పసివాడిని హింసించడం తప్పు అనే గ్రహింపు అతడికి తర్వాతయినా రాకపోవడం కొంత ఇబ్బందిగా ఉంది.

ఇక అనూహ్యకోసం ఉద్యోగం మానుకోవడం, మౌనపోరాటం జరపడం మొదలైనవన్నీ నగటు ప్రేమికుడు చేసే పనులే. అయితే అనూహ్య కూడా చవకబారు ఎత్తుతో అతడు ఓడిపోయేలాగా చేయటం బాగుండలేదు. ఒక పందానికి సిద్ధపడినప్పుడు నిజాయితీ అయిన మార్గంలోనే దానిని ఎదుర్కోవాలి. ఎటువంటి హీనుడైనా తను ప్రేమించిన యువతి గురించి తన ఎదుటే ఎవరైనా తిడితే విని సహించలేరు. గౌతమ్ స్పందించడంలో న్యాయం ఉంది.

ప్రేమతో ఎటువంటి పనినైనా సాధించవచ్చు. గౌతమ్‌లాంటి వారిలో ప్రేమ ద్వారా మార్పు తేవటం సులభం. గౌతమ్‌లోని పట్టుదలని, త్రికరణశుద్ధిని చిత్రీకరించటంలో రచయిత్రి విజయం సాధించారు. సుబ్బారావు గౌతమ్‌కోసం పడిన ఆరాటం అతడిలోని నిజమైన స్నేహితుడిని చూపిస్తోంది.

'ప్రేమ ఎంత మధురం ప్రియురాలు అంత కఠినం' అన్న సినీరచయిత పాటలాగా కఠినశిల అయిన అనూహ్య మనస్సుని గౌతమ్ గెలుచుకొని ఆమెని వివాహం చేసుకోవడం ముదావహం. రచయిత్రి గౌతమ్ పాత్ర ద్వారా హాస్యం పండించి నవ్వుల జల్లులు కురిపించారు. రచయిత్రికి అభినందనలు.

-టి. శ్రీరామ దివాకర్,
పార్వతీపురం.

## వెకిలితనం లేని హాస్యం

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**ఆ**రోగ్యకరమైన హాస్యాన్ని అందివ్వాలన్న 'చతుర' ఆశయం నెరవేరేలా 'ప్రేమ పందెం' నవల ఆద్యంతం హాస్యాన్ని చిందించినా కథ మరీ 'చతుర'లోనే ప్రచురించిన పాత నవలకొ కదానికి చాలావరకు అనుకరణ కావడం పెద్ద లోపం. ఆ నవలలోని కొన్ని పాత్రలు, సన్నివేశాలు పెద్ద తేడా లేకుండా ఈ నవలలోనూ అగుపడతాయి.

ఈ లోపాలున్నప్పటికీ బూతులనే హాస్యంగా పరిగణిస్తున్న ఈ రోజుల్లో రచయిత ఎక్కడా అసభ్యపదజాలం కాని, వెకిలిహాస్యం కాని చొప్పించకపోవడం మెచ్చుకోదగ్గ విషయం. అంతేగాకుండా గౌతమ్‌లోని ఆకతాయితనాన్ని పందెం తర్వాత అతనిలోని అంతర్మథనాన్ని రచయిత చక్కగా విశ్లేషించారని చెప్పొచ్చు. అలాగే నేటి ఆధునిక యువతికి ఉండవలసిన అన్ని లక్షణాలను పుణికిపుచ్చుకున్న అనూహ్య పాత్ర బాగుంది. ఎటొచ్చీ పిల్లలచేత గుమ్మడికాయలంత డైలాగులు వల్లెవేయించటం, ఆరిందాలా ఆలోచింపజేయటం లేకుంటే కథ సహజత్వానికి మరింత దగ్గరగా వచ్చి ఇంకా బాగుండేది.

'ప్రేమపందెం' చదువుతున్నంతసేపూ ఒక మంచి హాస్యనవలను చదువుతున్నామన్న తృప్తి మిగులుతుందని మాత్రం నిస్సందేహంగా చెప్పవచ్చు.

-గుంటి మురళీకృష్ణ,
అనంతపురం.

## 'మరో ప్రేమకథ'

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**ప్రే**మకథలు కోకొల్లలుగా వస్తున్న తరుణంలో ఒక ప్రేమికుడు మౌనపోరాటం సాగించి అమ్మాయి ప్రేమను పొందవచ్చు అనే ఊహకు ప్రతిరూపంగా ఈ నవలను సృష్టించి పాఠకు

లను ఆసక్తిగా చదివింపచేయడంలో రచయిత్రి విజయం సాధించారు. సంవత్సరంపాటు మౌనంగా ఉండటం అన్నదానిని తప్పిస్తే మిగిలినవన్నీ వాస్తవిక పరిస్థితులకు అద్దంపట్టేవిగానే ఉన్నాయి. గౌతమ్‌కు ఒక సామాన్యునిలాగే కొన్ని బలహీనతల్ని ఆపాదించారు. మొదటిచూపులోనే అనూహ్య అందానికి ఆకర్షితుడై ఆమె గుణగణాలు, తన పరిమితులు ఏవీ తెలుసుకోకుండానే గుడ్డిగా ప్రేమలోపడి, పట్టుదలతో విజయాన్ని అందుకోవడమన్నది వాస్తవజీవితంలో సాధ్యమేనా అని వేలెత్తి చూపకుండా చేసుకున్నారు రచయిత్రి. మిత్రుడు సుబ్బారావు పాత్రధారిని మలచిన తీరు ప్రశంశాత్మకంగా ఉంది. గౌతమ్ ప్రవర్తన, ముఖ్యంగా మౌనవ్రతంలో ఉన్నప్పుడు, డుంబూ మీదకు అంబోతు పరుగెత్తుకు వచ్చినప్పుడు, మిత్రుడిని తేలు కుట్టబోతున్నప్పుడు దయనీయంగా ఉంది. మిత్రుడిని, డుంబూను పక్కకు లాగితే సరిపోయేదానికి అతను చేసే హడావుడితీరు ఇతనేనా సంవత్సరంపాటు మౌనపోరాటంచేసి అనూహ్యను సొంతంచేసుకొన్నది అని ఆశ్చర్యం వేస్తుంది. వేడి అన్నం, గంజి చేతులమీద పడ్డప్పుడు కూడా అరవకుండా ఉండటం అనితరసాధ్యమే అని ఒప్పుకొంటూనే తమ హీరోచేత రచయిత్రి ఆ పని చేసి చూపించారు. అనూహ్య వ్యక్తిత్వాన్ని కాపాడడానికో లేక చివరిలో మరో మలుపు ఉంటే ఇంకా ఆసక్తికరంగా ఉంటుందనోగానీ రచయిత్రి అనూహ్యచేత చివరి డ్రామా ఆడించినట్లనిపిస్తుంది. ఒకవేళ ఈ డ్రామాలో అనూహ్య ఓడిపోయిఉంటే ప్రేమను శంకిస్తూ నిరాశామయమైన జీవితాన్ని గడపాల్సి వచ్చేదేమో.

హాస్యాన్ని పండించడంలో రచయిత్రి మేటి రచయిత్రులతో పోటీపడ్డారుగానీ ఈ రచన ద్వారా సాధించిందేమైనా ఉందా, అంటే అది ఓ టీనేజ్ అమ్మాయికి లేక ఓ ఇల్లాలికి మంచి కాలక్షేపాన్నివ్వడమే.

-ఎస్.నాగేంద్రనాయుడు,
రేవేంద్రపాడు.

## 'నవ్వుల జల్లు'

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

నగటు ప్రేమికుడి లక్ష్యసాధనలో సహజమైన ఆవేదన, ఆరాటం, పోరాటాలకు 'ప్రేమ పందెం' అద్దంపట్టింది. భిన్నమైన శైలితో, హాస్యయుత సంభాషణలు, సంఘటనలతో నవల ఆద్యంతం ఆసక్తికరంగా సాగుతూ, పాఠకులపై నవ్వుల జల్లులు కురిపించింది.

నిక్‌నేమ్‌లు తగిలించి, పలువిధాలుగా పరులను ఏదోవిధంగా ఏడ్పించి తద్వారా తానేదో సాధించినట్లుగా ఫీలౌతూ తెగ సంతోషించే మనస్తత్వంగల 'గౌతమ్' చర్యలను కొన్నిసందర్భాల్లో ఆకతాయితనంగా, చిలిపితనంగా రచయిత్రి సమర్థించ ప్రయత్నించటం సమంజసంగా లేదు. మూగ-పసివాడినిసైతం తన సహజధోరణిలో బాధించి, సంతోషించిన శాడిస్ట్ గౌతమ్ హీరోగా ఉండే అర్హతను కోల్పోయాడనిపిస్తుంది. కథానాయకి అనూహ్య మొదట్లో చాలా ఆదర్శవాదిగా, సొంతభావాలుగల స్త్రీగా గోచరిస్తుంది. చివరికిమాత్రం గౌతమ్ తండ్రి ఆదేశాలమీరకు ఉద్యోగానికి ఎగనామంపెట్టి, భర్తతో పల్లెలో స్థిరపడి సంసారం సాగించటానికి ఒప్పేసుకోవటం అసహజంగా ఉంది.

ఆఫీసులో తొలిచూపులోనే అనూహ్య అందానికి అత్యంత ప్రాముఖ్యతనిస్తూ హీరోగారు హఠాత్తుగా ప్రేమించేసెయ్యడం, అంత అందమైన ఆమె గుణగణాలు ఖచ్చితంగా ఉన్నతమైనవే అయివుంటాయని అభిప్రాయపడటం... సహజత్వానికి దూరంగా ఉన్నా సంఘటనలను మలచటంలో రచయిత్రి దిట్ట అనిపించుకున్నారు. నవలలో సుబ్బారావ్‌ను రథసారథిగా సృష్టించిన వైనం బాగుంది.

-యం.రమేష్‌యాదవ్,
కరంజి.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977.



# చను పాలిచ్చే తల్లీ! మీరు 'తినాలండీ' ఇద్దరి కోసం!

## పోషకాహారాలు మీకు చాలా అవసరం మరి ఇదిగో

క్రొత్త (కాంప్లాన్®)

# విటామిల్క్(T)

తన పోషకాహారాల కోసం బిడ్డ మీ మీద మాత్రమే ఆధారపడతాడు, వానికి కావలసిన పాలను మీ నుండే పొందాలి.




చనుపాలనుండి బిడ్డకు లభించే పోషకాహారాలు కాంప్లాన్ - విటామిల్క్‌లో ఉన్నాయి, మరి అంతే కాకుండా కాంప్లాన్‌లోఉండే గుణవంతములన్నింటినీ కూడా అది కలిగియున్నది. **పాలలోని మాంసకృతులు (22.2గ్రా), ఫోలిక్ ఏసిడ్, ఎ, బి, మరియు సి విటమిన్‌లు, ఐరన్, ఆయోడిన్ కాల్షియం, జింక్ మరియు మెగ్నీషియం** మొదలైనవన్నీ అవసరమైన పరిమాణంలో దానిలో ఇమిడి ఉన్నాయి.

3 కప్పులు ప్రతిరోజు

రెగ్యులర్* చాకొలేట్

గ్లాక్సో నుంచి వస్తుంది మంచి ఆరోగ్యం.

GL/V/N/91/TEL

